TEL.1156

# శ్రీ మదాంధ్ర మహాభారతము

కవిత్రయ ప్రణీతము

## విరాటోద్యోగ పర్వములు

**DWARAKANATH & CO.,**
9, Gopalakrishna Road, Madras—17

మహా భారతము నశేషజనసాధ్య తమ మూల్యం
బునం బ్రకటించి భగవత్సేవ నొనర్పుటయే
ప్రకాశకుల లక్ష్యము. తత్కథా సూత్రధారి
యగు శ్రీ కృష్ణున కియ్యది సమర్పణము.

ద్వారకానాద్ అండ్ కంపెని.

SRI
MADANDHRA
MAHA BHARATAMU

# విషయసూచిక





విరాటపర్వము-ద్వితీయాశ్వాసము.



విరాటపర్వము-తృతీయాశ్వాసము.

## విరాటపర్వము - చతుర్థాశ్వాసము.



## విరాటపర్వము-పంచమాశ్వాసము.

## విషయసూచిక

# విషయసూచిక

## ఉద్యోగపర్వము-ప్రథమాశ్వాసము.



## ఉద్యోగపర్వము-ద్వితీయాశ్వాసము.



## ఉద్యోగపర్వము-తృతీయాశ్వాసము.

## ఉద్యోగపర్వము-చతుర్థాశ్వాసము.

శ్రీ

హ రి హ ర నా థా య న మః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## విరాటపర్వము, ప్రథమాశ్వాసము.



యన గౌరి నాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి విష్ణురూ
పాయ నమశ్శివాయ యని పల్కెడుభక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చ మెచ్చుపరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

### కృ తి ని ర్మా ణ ప్ర స్తా వ న.

వ. అని సకలబ్రహ్మప్రార్థనంబు సేసి తత్ప్రసాదాసాదితకవిత్వతత్త్వనిరతిశయాను
భావానందభరితాంతఃకరణుండ నగు చుండి యొక్కనాఁ డిట్లని వితర్కించితి. 2

శా. విద్వత్సంస్తవనీయభవ్యకవితావేశుండు విజ్ఞానసం
పద్విఖ్యాతుఁడు సంయమిప్రకరసంభావ్యానుభావుండు కృ
ష్ణద్వైపాయనుఁ డర్థిలోకహితనిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్య మగు లేఖ్యం బైన యామ్నాయమున్. 3

క. వేదములకు నఖిలస్మృతి, వాదములకు బహుపురాణవర్గంబులకున్
వా దైనచోటులను దా, మూదల ధర్మార్థకామమోక్షస్థితికిన్. 4

వ. అదియును. 5

ఉ. ఆదరణీయసారవివిధార్థగతిస్ఫురణంబు గల్గి య
ష్టాదశపర్వనిర్వహణసంభృత మై పెను పొంది యుండ నం
దాదిఁ దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండు వి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్. 6

మ. హృదయాహ్లాది చతుర్థ మూర్జితకథాశోభితంబు నానారసా
భ్యుదయోల్లాసి విరాటపర్వ మట యుద్యోగాదులుం గూడఁగాఁ
బదియేనింటిఁ దెనుంగుబాస జనసంప్రార్థ్యంబు లై పెంపునం
దుది ముట్టన్ రచియించు టొప్పు బుధసంతోషంబు నిండారఁగన్. 7

క. అని రచనాకౌతుకమున, మన మలరఁగ నిప్ప్రబంధమండలి కధినా
థునిగాఁ జేసి పురుషునిఁ బే, ర్కొనువాఁడనొ యనుతలంపుఁ గూరినమదితోన్. 8
వ. ఇంచుక నిద్రించుసమయంబున. 9
సీ. మజ్జనకుండు సమ్మాన్యగౌతమగోత్ర, మహితుండు భాస్కరమంత్రితనయుఁ
డన్నమాంబాపతి యనఘుండు కేతన, మల్లన సిద్ధనామాత్యవరుల
కూరిమితమ్ముండు గుంటూరివిభుఁడు కొ, మ్మనదండనాథుండు మధురకీర్తి
విస్తరస్ఫారుఁ డాపస్తంబసూత్రప, విత్రశీలుఁడు సాంగవేదవేది
తే. యరిఁగల వచ్చి వాత్సల్య మతిశయిల్ల, నస్మదీయప్రణామంబు నాదరించి
తుష్టిఁ దీవించి కరుణార్ద్రదృష్టిఁ జూచి, యెలమి నిట్లని యానతి యిచ్చె నాకు.
వ. "కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా, పరిష్క్రియాయాం బహుమన్యసే త్వమ్.
కిం కాలకూటః కిము వా యశోదా, స్తన్యం తవ స్వాదు వద ప్రభో మే॥" యని
నీవు వొల్లి రచియించినపద్యంబు గాఢాదరంబున నవధరించి భక్తవత్సలుం
డగుహరిహరనాథుండు నీదెస దయాళుండై యునికిం జేసి నిన్నుం గృతార్థునిం
జేయం గాంక్షి యయి నాకలోకనివాసి యయిననాకుం దనదివ్యచిత్తంబునం
గలయక్కారుణ్యంబు తెఱం గెఱుంగునట్టిశక్తిం బ్రసాదించి నన్ను నాకర్షించి
తొలిపించికొని వీఁడె విజయంచేయుచున్నవాఁ డనుచుం జూపుటయు సవిశేషసం
భ్రమసంభరితహృదయుండ నయి యవ్వేల్పునుం గనుంగొనునప్పుడు. 11
సీ. కరుణారసము పొంగి తొరఁగెడుచాడ్పున, శశిరేఖ యమృతంబు జాలువాఱ
హరినీలపాత్రిక సురభిచందన మున్న, గతి నాభి ధవళపంకజము మెఱయ
గుఱియైనచెలువున నెఱసినలోకర, క్షణ మన గరళంబుచాయ దోఁపఁ
బ్రథమాద్రిఁ దోఁతెంచుభానుబింబము నా ను,రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప
తే. సురనదియును గాళిందియుఁ బెరసినట్లు, కాంతిపూరంబు శోభిల్లఁ గాంతమూర్తి
నామనంబు నానందమగ్నముఁగఁ జేయ, నెలమి సన్నిధి సేసె సర్వేశ్వరుండు. 12
వ. ఏనును భక్తిమయం బగుసాష్టాంగదండప్రణామం బాచరించి కొండొకతొలంగి
వినయావనతుండనై లలాటపరిభాగంబున నంజలిపుటంబు ఘటించి నయనం
బులు నవయవంబులును బ్రమదబాష్పసలిలవిలులితంబులును బులకపటలపరి
కలితంబులునుం గా నంతంత నిలిచిన నద్దేవుండు. 13
క. అనుకంపాతిశయంబునఁ, దనదక్షిణనేత్రమున సుధాలోచియఁ గా
నను వింత లేక చూచి వ, దనమున దరహాసరసము దళుకొత్తంగన్. 14
ఉ. వైదికమార్గనిష్ఠ మగువర్తనముం దగ నిర్వహించుచు
న్భేదము లేనిభక్తి మది నిర్మలవృత్తిఁ గఁ జేయుచుండ మ
త్పాదనిరంతరస్మరణతత్పరభావముకల్మి నాత్మ స
మ్మోదముఁ బొందఁ గావ్యరసముం గొనియాడుచు నుండు దెప్పుడున్. 15

వ. అందును. 16

క. పారాశర్యుని కృతి యయి, భారతి మను పేరఁ బరఁగు । పంచమ వేదం
బారాధ్యము జనులకుఁ ద, ద్గౌరవ మూహించి నీ వ । ఖండిత భక్తిన్ 17

తే. తెనుఁగు బాస వినిర్మింపఁ । దివురు టరయ, భవ్యపురుషార్థతరుపక్వ । ఫలము గాదె
దీని కెడ సేయ్యకొని వేడ్కఁ । నూని కృతిప, తిక్క మర్థించి వచ్చితిఁ । దిక్కశర్మ.

వ. అనిన నద్దివ్యవచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొనినఁ బునఃపునఃప్రణామంబు లాచరించి యప్రమేయప్రభావభావనాతీతుం డయ్యును నప్పరమేశ్వరుం డాశ్రితులకు నత్యంతసులభుం డని బుధులవలన వినియునికిం జేసి నను బోఁటిబాలస్వభావునకు నిట్టిమహనీయమహిమ దొరకొనుటయుం గలుగుఁ గాక యని తలంచుచు నవ్విభునకు విన్నపంబు సేయువాఁడ నయి కొమ్మనామాత్యాననం బాలోకించి తదనుమతి వడసి యిట్లంటి. 19

క. భూరిభవత్కారుణ్యా, క్షీరాంబుధి నామతుచ్ఛ । చిత్తంబున వి
స్తార మహితముగ నునిచితి, వారయ నచ్చెరువు గాదె । యఖిలాండపతీ. 20

ఉ. ఇంతకు నేర్చునీకు నొక । యింతటిలోన మదీయవాణి న
త్యంతవిభూతిఁ బెం పెసఁగు । నట్టినిముం గొనియాడఁ జేత దా
నెంతటిపెద్ద నీకరుణ । నిట్లు పదస్థుఁడ నైతి నింక జ
న్మాంతరదుఃఖముల్ దొలఁగు । నట్లుగఁ జేసి సుఖాత్ముఁ జేయవే. 21

వ. అని యుపలాలితుం డగుడింభకుండు దనకోలంది యెఱుంగక మహాపదార్థంబు వేఁడువిధంబున బ్రహ్మానందస్థితిం గోరి సర్వాంగాలింగితమహీతలం బగునమస్కారంబు సేసిన నజ్జగన్నాథుండు. 22

తే. జననమరణాదు లైనసం । సారదురిత, ములకు నగపడ కుండంగఁ । బోలఁగు తెరువు
గనువెలుంగు నీకిచ్చితి । ననిన లేచి, నిలిచి సంతోష మొద నిండ । నలవుకొనఁగ.

వ. మేలుకాంచి. 24

క. ఎలమియు నచ్చెరువును సరి, కలసి పొదలుమానసమున । నెంతయుఁ బ్రొద్దే
గలలోనఁ గన్నచందము, దలఁచుచు నుండితి ని భక్తి । తాత్పర్యమునన్. 25

వ. తదనంతరంబ. 26

ఉ. ఇష్టపదంబు గాంచి పర । మేశ్వరునిం గృతినాథుఁ జేసి యే
పట్టునఁ బూజ్యమూర్తి యగు । భారతసంహితఁ జెప్పఁ గంటి నా
పుట్టుఁ గృతార్థతం బొరసెఁ । బుణ్యచరిత్రుఁడ నైతి నవ్విభుం
గట్టిదఁ బట్ట మప్రతిమ । కారుణికత్వమహావిభూతికిన్. 27

ఉ. కూర్చుట నూత్నరత్నముల । కుం గనకంబునకుం దగుం జనా
భ్యర్చిత మైనభారత మ । పారకృపాపరతంత్రవృత్తిమైఁ
జేర్చినదేవదేవునకుఁ । బ్రీతిగ నిచ్చుట సర్వసిద్ధి నా

నేర్చినభంగిఁ జెప్పి వరణీయుఁడ నయ్యెద భక్తకోటికిన్. 28

వ. ఇది యనన్యసామాన్యాకారం బగుపరమధర్మప్రకారంబు. 29

ఉ. కావున భారతామృతము । కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాం
ధ్రావలి మోదమున్ బొరయునట్లుగ సాత్యవతేయసంస్మృతి
శ్రీవిభవాస్పదం బయిన । చిత్తముతోడ మహాకవిత్వదీ
క్షావిధి నొంది పద్యములు । గద్యములున్ రచియించెదం గృతుల్. 30

వ. అని పూని యాద్యకృతంబు లగుపుణ్యప్రబంధంబులు దేవసన్నిధిం బ్రకటించు
టయు నొక్కయారాధనవిశేషం బగుటం జేసి. 31

షష్ఠ్యంతములు.

క. ఓంకారవాచ్యునకు నన, హాంకారనిరూఢభావనారాధ్యునకున్
హ్రీంకారమయమనోజ్ఞా, లంకారోల్లాసనిత్యలాలిత్యునకున్. 32

క. త్రిభువనసుకర్మదపంజర, విభవమహితునకు సమస్తవిష్టపవిశ్వో
క్తభుజంగపతి కలశజ, నభిన్నరూపునకు భావనాతీతునకున్. 33

క. శ్రుతిసీమంతమణికి నా, శ్రితవాంఛాపూర్తికరణచింతామణి కా
నతమునితతిమోద్యమణికిఁ, గ్రతుభూషణమణికి లోకరక్షామణికిన్. 34

క. పరమశమనిరతసంయమి, వరమానసకుముదహాసవర్ధనచంచ
చ్ఛరణనఖచంద్రికావి, స్ఫురణాద్భుతప్రకారశోభాఢ్యునకున్. 35

క. హరిహరనాథునకు మరు, త్సరిదాకల్పితమనోజ్ఞచరణశిరస్సుం
దరమూర్తికి భావనత, త్పరచేతోయుక్తభక్తపరతంత్రునకున్. 36

కథాప్రారంభము.

వ. ఏను విన్నపంబు సేయు తెఱంగుగా నంతస్సన్నిధిం గలిగించుకొని యమ్మహా
కావ్యంబునర్థంబు సంగతంబు సేసెద 37

క. శరణాగతసంశ్రితభయ, హరణా సురనికరశేఖరానర్ఘ్యమణి
స్ఫురణాపరిచయరంజిత, చరణా వనమాలికాభుజంగాభరణా. 38

క. అజగవశార్ఙ్గాలంకృత, భుజగర్వనిరస్తదైత్య భూమస్తుత్యా
త్రిజగద్ధారణనిత్యా, భుజగసమాచరితశయన భూషణకృత్యా. 39

క. జలనిధిహిమవద్భూధర, కలితజనన కేళికౌతుకవ్యక్తావ్య
క్తలలితసౌందర్యస్ఫుర, దలఘుతనుశ్రీసనాథ హరిహరనాథా. 40

వ. దేవా దివ్యచిత్తంబున నవధరింపుము.

ఆ. కథ జగత్ప్రసిద్ధ । గావునఁ బూర్వాప, రార్థయుక్తి సేయఁబట్టనెడల 41
యత్న మించుకంత । యయినను వలవదు, వలసినట్లు సెప్ప । వచ్చి యుండు.

వ. మహాభారతంబు సమస్తదురితాపహంబును నభిమతసుఖావహంబునుం గావున
నొక్కముహూర్తఫలంబుఁగోరి జనమేజయుండు కృష్ణద్వైపాయనమహామునికారుణ్యం

బు వడసి తదీయప్రియశిష్యుం డయిన వైశంపాయనువలన వినినకథ యగుటం జేసి తత్ప్రకారంబు నడపెద నది యెట్లనినం బరమపవిత్రు లగుపాండుపుత్రులచరిత్రం బుపాఖ్యానసహితంబుగా వ్యాఖ్యానంబు సేయుచుండ వారలవనవాససమ్యగనుష్ఠానంబు సవిస్తరంబుగా విని జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె. 43

చ. మహితసముజ్జ్వలాకృతులు మానధనుల్ జనమాన్యు లంగనా
సహితము గాఁగ నేమిగతి సమ్యగుపాయనిరూఢవృత్తిమై
నహితుల కప్రధృష్యముగ నాపదమూఁ డగునేఁడు మత్స్యరా
ణ్మహితులు చరించి రంతయుఁ గ్రమంబున నా కెఱుఁగంగఁ జెప్పుమా. 44

క. అని యడిగిన వైశంపా, యనుఁ డన్నరేంద్రచంద్రు నధికౌత్సుక్యం
బునకలిమికిఁ బ్రసన్నాస్యుం, బున గాఢాదరము ధరితము గని యిట్లనియెన్. 45

వ. పాండవులు వనవాసంబు సముచితంబుగాఁ జలిపి పండ్రెం డగునేఁటికడపటఁ దమకు ధర్మదేవతాసమాగమం బయినం దత్ప్రసాదంబున నజ్ఞాతవాసంబునకు భంగంబు గాకుండ వరంబు వడసి యంతకు మున్న తమవెనుక నడవులం దిరుగుచు నగ్నిహోత్రంబులఁ గొనిన గోని వత్తిల్లుభూసురోత్తములు దమ్ముం బరివేష్టించి యుండఁ దా రనుసరింపం బూనినపని వారల కెఱింగింపం దలంచి కరంబులు మొగిచి సవినయంబుగా నిట్లనిరి. 46

సీ. తెల్లంబు గాదె మీ కెల్ల సుయోధను, చేసినకుటిలవిచేష్టితంబు
లకట మాతో మీరు నడవుల వినయములఁ, బొందితి రొకభంగిఁ బోయెఁ గాల
మిది పదుమూఁ డగునేఁడు మా కజ్ఞాత, వాసంబు సలుపంగ వలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతతనయసౌబలులును, దెలుపన వేతురు చిన్నసన్న

ఆ. నెఱిఁగి రేనిఁ జాల నెగ్గు వాటిల్లు న, ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై విరక్తవిఘ్నుల రై వని, యుండుఁ డని యనుగ్రహింపవలయు. 47

వ. అని చెప్పి రట్టియవసరంబున ధర్మనందనుండు విషణ్ణహృదయుం డై. 48

క. ఒకనాఁ డేమును నాఁటక, లకు విమరఁ గాంచి విప్రులం బట్టలఁ బె
ట్టుకొనిసుఖ ముండఁ బడయుదు, మొకో యిప్పాటిందుఁ గలదె యొరు లెవ్వారికిన్.

వ. అని దగ్గుత్తిక వెట్టి దుఃఖపరవశుం డగుటయు నమ్మహీసురవరులుం దమ్ములు నతని నాశ్వాసించుచుండఁ దత్పార్శ్వంబున నున్నధౌమ్యుండు తదీయవిషాదాపనోదంబు సేయం దలంచి యిట్లనియె. 50

ధౌమ్యుఁడు పాండవుల నూరార్చుట.

ధర్మనిరూపకస్థ్యమున ధైర్యమునన్ మహనీయవృత్తి స
త్కర్మవిశిష్టతం జెలువరారఁగ రామహిమన్ విశుద్ధబుద్ధి నెవ్వరున్
ధర్మజుపాటి గా రనఁగ ధాత్రిఁ బ్రసిద్ధుఁడ వైనయట్టినీ
పేర్మికి నిట్టి మార్దవము లెల్లనకుఁ దురపిల్లు టారయన్. 51

వ. అట్లుం గాక. 52
క. దేవతలకైన నోర్వం, గా వలయున కాదె శత్రుసూదనవిధికా
లావాప్తికి మును దమస, ద్భావంబు లడంచి యొదుఁగఁబడి యుండంగన్. 53
సీ. నిషధాద్రియందు దనిమిషపతి ప్రచ్ఛన్న, సంచరణమున వర్తించుటయును
నదితిగర్భంబున నవతారమై హరి, యాకారమున హరి యడఁగుటయును
జననియూరుప్రదేశంబున నతినిగూ, ఢంబుగా నౌర్వుండు డాఁగుటయును
ధేనుశరీరవిలీనుఁడై యజ్ఞాత, చర్య మార్తాండుండు సలుపుటయును
ఆ. వినమె యిట్లు వడినవీరలు వదవడి, తమకు నగ్గమైనతతి జయింప
రెట్లు ప్రబలి రిపుల నీవును నాపద, కోర్చి భంగపాటు దీర్చికొనుము. 54
క. అనవుడు నప్పలుకులు విని, తనచిత్తముకలఁక దేఱి ధర్మతనూజుం
డనుజన్ములదెసఁ జూచిన, ననిలసుతుం డిట్లు లనియె నాతనితోడన్ 55
మ. భవదాజ్ఞాదృఢబంధసంయమితశుంభద్వేగమై కాక నాఁ
డవలీలన్ మనయజ్ఞసద్విపము క్రోధావేశదుర్దాంతద
ర్పవిలాసోద్భటభంగి నేపడరి కౌరవ్యాంబుజశ్రేణిఁ జి
క్కువడం జేయదె యొక్కపెట్టిడిన నీకున్ వేడ్క సంధిల్లఁగన్. 56
వ. అనిన విని ధర్మనందనుండు దెలివొందినమొగంబుతోడ శిరఃకంపంబు సేసె
నట్టిసమయంబున నవ్విప్రు లందఱు నొక్కమొగిన మీతలంపునకు దైవం బను
కూలంబు గావుత మని పాండుపుత్రుల దీవించి పునర్దర్శనం బయ్యెడు మనుచు
వీడ్కొని నిజస్థానంబులకుం జనిరి తదనంతరంబ బాహ్యపరివారం బెల్లను సము
చితప్రకారంబున వీడుకోలు వడసి తమతమపొందుపట్లకుం బోయిన. 57
ఉ. తమ్ములు ధౌమ్యుఁడున్ సతియుఁ దారసదంబులతోడఁ గ్రోశమా
త్రమ్మొకచోటి కల్లఁ జని ధర్మతనూభవుఁ డందు నాఁటిరే
యిమ్ములఁ జల్పి వేగుటయు నీప్సితకార్యము సేయఁగా విచా
రమ్మున నున్నచో నమరరాజతనూభవుఁ జూచి యిట్లనున్. 58
క. మన మొకయేవుర మీయుం, గనయుం దొరుగుదెరఁగా నెవ్వెడఁ బో
యిన నెఱుఁగకుండుదురె యి,ద్దినములు గడపంగ నెద్ది దెఱఁగయ్యెడినో. 59
వ. అనిన నతం డిట్లనియె. 60
తే. ధర్మదేవత నీదుసత్కార్యమునకు, మెచ్చి యొంతయుఁ బ్రీతిమై నిచ్చినట్టి
వరము గలుగంగ మనమేము వర్తనమున, నెవటనున్న మనవారలకు నెఱుఁగనగునె.
వ. కురుజనపదంబుచుట్టుం బాంచాల చేది మత్స్య సాల్వ విదేహ బాహ్లీక దశార్ణ శూ
రసేన కళింగ మగధదేశంబులు సుభిక్షంబులు జనాకీర్ణంబులు నతిస్థిరంబులు నై
నివాసయోగ్యత గలిగి యున్నయవి యని విందుము వానియందు మీకుం
జూడం బోలినయెడఁ దగినచందంబున నిలుచువారము గాక యనినం బియుం

క. అగు నది యట్టిద దైవము, దగ నిర్ధ్వయవర్షంబు దప్పని మనకున్
విగతభయవాససౌఖ్యం, బగు నొక్కెడ నెన్నఁ డిపుడ పోవఁగ వలయున్.

ఆ. నాకుఁ జూడ మత్స్యనరపతి సద్ధర్మ, వర్తి సుజనహితుఁ డవార్యబాహు
బలుఁడు గాన యతనిపాల నుండఁ దగు, నైనపనుల నిలుచు టభిమతంబు. 64

పాంచాలీపాండవులు దమ మెలంగవలయు పనుల నిశ్చయించికొనుట.

క. మనలోన నెవ్వఁ డెమ్మెయి, బని వెంటను విరటు మనము పడయుద మది యె
ల్లను నేర్పరించి యుండఁగ, దన తన మది నున్న తెఱఁగు తథ్యము చెప్పుఁడా. 65

వ. అనిన విని సవ్యసాచి సవితర్కంబును సవిషాదంబును సగౌరవంబునుం గా నతని
నుపలక్షించుచు నిట్లనియె. 66

సీ. మహనీయమూర్తియు మానవైభవమును, సౌకుమార్యంబును సరళతయును
మార్దవంబుఁ బ్రభుత్వమహిమయు నపగత, కల్మశత్వంబును గౌరవంబు
శాంతియు దాంతియుఁ జాగంబు భోగంబుఁ, గారుణ్యమును సత్యసారతయును
ధర్మమయక్రియాతత్పరత్వంబును, గీర్తిధనార్జనక్రీడనంబుఁ

ఆ. గలిగి జనుల నేలఁ గాని యెన్నండును, నొరులఁ గొల్చి తిరుగ నెఱవు లేని
యట్టి నీవు విరటు నెట్టిచందంబున, ననుచరించువాఁడ వధిప చెప్పుము. 67

క. అనినం దమ్ముని నెమ్మన, మునఁ బుట్టిన వగపు భావమున నెఱిఁగియు నీ
టునఁ బుచ్చుచుఁ బ్రస్తుతికా, ర్యనిరూపణకరణి యెఱయ నతఁ డిట్లనియెన్.

క. సన్న్యాసివేషమున రా, జన్యునిఁ గని యెపుడుఁ గొలిచి సభ్యత్వమునన్
మాన్యుఁడ నై పుణ్యకథా, విన్యాస మొనర్తు నతని వేడుకకుఁ దగన్. 69

క. శ్రౌతస్మార్తనిమిత్త, జ్యోతిర్విద్యలు వహించి యోగ్యసమయసం
జాతప్రాగల్భ్యుఁడ నై, చాతుర్యము మెఱసి మానసం బలరింతున్. 70

క. అతనితో నొక్కొక మఱి, కౌతూహలవృత్తికిం దగం దొడఁగి మృదు
ద్యూతంబునఁ గ్రీడింతుం, జేతోముద మొదవ నక్షశిల్పప్రౌఢిన్. 71

తే. మణిమయమ్ములుఁ గలధౌతమయములునను, వర్ణమయములు నాదిగా వలయునట్టి
యక్షసారులు గలవు నా కభిమతముగ, వానిఁ గొనిపోయి చూపుదు వరుసతోడ.

వ. మఱియు నవసరోచితంబు లగు వినోదంబులం బ్రమోదంబు పుట్టించుచుఁ
బ్రసాదంబునకుం బాత్రుండనై కంకుం డను నామధేయంబు ధరియించి చరియిం
తు నయ్యుర్వీశ్వరుండు మత్పూర్వవర్తనం బడిగెనేనియు ధర్మపుత్త్రుతోడి మైత్రిం
దగిలి యతనిపాల వసియింతు ననం గలవాఁడ నని చెప్పి యనిలతనయు నిరీక్షించి
తత్కాలజనితం బయిన ఖేదంబునం దొరఁగ సమకట్టు బాష్పజలంబులు మగుడ
నింకించుచు నిట్టూర్పు లడంచి ధైర్యం బవలంబించి యి ట్లనియె. 73

సీ. కడిమిమై సౌగంధికమున యక్షులమద, మడఁచి కృష్ణకుఁ బువ్వు లెల్లఁ దెచ్చెఁ

గిమ్మీరదానవు నిష్ఠురు నిర్జించి, విగతకంటకముఁ గావించె వనము
బకదైత్యుఁ దొడరి యాభంగి రూపఱఁ జేసి, రక్షించె నేకచక్రాపురంబు
నప్పాటఁ బ్రబలు జటాసురు నడరి దండితుఁ జేసి మనలఁ బెట్టించుకొనియె
తే. నితఁడు పుట్టినకోలెను నెసక మెసఁగు, దర్పమున వర్తిల్లు నుదగ్రప్రాభవముఁ
దకట యొరుచిత్తమున కెక్కునట్లుగాఁగ, మెలఁగి యేమివిధంబునఁ గొలుచువాఁడు, 75
వ. అనిన విని భీమసేనుం డిట్లనియె.
తే. ఏను వంటలవాఁడనై యానరేంద్రుఁ, గొలిచి కరకరగాఁ గూడుఁ గూర చిత్త
మునకు వచ్చినచందంబునన యొనర్చి, నేర్చి మెలఁగుదుఁ గరము విశ్వసితి మెఱసి.
ఉ. ఆఱురసంబులం జవులయందలి క్రొత్తలు పుట్ట నిచ్చలున్
వేఱొకభంగిఁ బాకములు విన్నను వొప్పఁగఁ జేసి చేసి న
స్సేఱఁగ బానసీని నొకనిం బురిఁ గాననియట్లు గాఁగ మే
గాఱియ వెట్టినైన నొడికంబుగ వండుదు నెల్లకూరలున్. 77
తే. పఱియవాపంగఁ దునియఁ గావిఱువవలయు, నెడలఁ గాళ్లలఁ జేతులఁ దొడలఁ బట్టి
కడఁగి యనువుగఁ జేసి ప్రొయ్యుదుఁ గాని, కత్తి గొడ్డలి యడుగనే కట్టియలకు.
క. సూపాధ్యక్షుఁడు గలిగిన, నాపురుషునితోడ సఖ్య మగునట్లుగ నే
నేపాట నైన నడవఁగ, నోపుదుఁ దత్తద్విధప్రయోగములమెయిన్. 79
వ. అట్లుం గాక 80
తే. జెట్టితండంబుతోడఁ జేపట్టి పోరంత, కారి విఱిచినయట్లు నగ్గలిక విఱుతు
లాఁగు వేగంబు మెఱసి బలంబు నెఱపి, మల్లతనమున మెప్పింతు మనుజవిభుని.
క. పెక్కండ్ర నొక్కపోరను, నుక్కఱ భంజింతుఁ జంపు టుడుగుదు రాజుం
దక్కటిచూపఱు లెంతయు, వెక్కసపడఁ జిత్రగతుల విహరింతుఁ దగన్. 82
చ. అదియును గాక కోలుపులి నైనను గారెనుపోతు నైన ను
న్మదకరి నైన నుగ్రమృగనాథుని నైనను గిట్టి ముట్టి బె
ట్టిదముగఁ గాలఁ గేలను గడించిదిమగంటిని యుల్లసిల్లఁ బ
ట్టుము నడఁగంగ మాత్స్యుఁడు గడున్ వెఱఁ గందుచుఁ బిచ్చలింపఁగన్. 83
వ. ఇట్లు నానాప్రకారంబుల నతనిమనంబు వడయుదు వలలుం డనుసమాఖ్య
వహింతు నమ్మహీపతి నీ వెవ్వరివాఁడ వని యడిగెనేని, పాండవాగ్రజునకు
బానసంబు సేయుదు ననం గలవాఁడ ననిన విని ధర్మజుం డమ్మెయికి సమ్మతించి
బీభత్సు వీక్షించి ఘూర్ణమానమానసుం డగుచు ని ట్లనియె. 84
ఉ. ఖాండవ మేర్చి దేవతలుఁ గాననియార్వురఁ గాంచె దోర్బలో
ద్దండమహాసురప్రతతిదర్ప మడంచి ప్రియం బొనర్చి యా
ఖండలుఁ డున్నగద్దియసగంబున నుండె మహానుభావుఁ డీ
తం డొకమర్త్యుఁ జేరి యనుదాత్తత నెమ్మెయిఁ గొల్చువాఁడొకో 85

క. అనుమాటలు విని సంక్రందననందనుఁ డిట్టు లనియె । దైవంబుకతం
బున నాకు నొక్కచందం, బను వై యున్నయది దీని । నొంగా దనుఁడా. 86

వ. అమరనగరంబున కరిగినయెడ నూర్వశి నన్ను నపుంసకుంగా శపియించిన నాకు
నాకేశుం డను గ్రహించి యీ శాపఫలంబు భవదజ్ఞాతవాసవత్సరంబున ననుభవించి
తదనంతరంబ శాపమోక్షంబు వడయు మని దీవించెం గావునఁ బేడితనంబు దాల్చి
బాహులకర్కశత్వంబునకు గుణకిణంబులకుఁ గంచుకంబును శంఖవలయంబులును
మాటు సేసికొని విరాటుకడకుం జని. 87

క. ఉత్తమకన్యాజనులకు, నృత్తము గఱపంగ నాకు । నేర్పు గలదు త
ద్వృత్తమునకు నన్నేలుము, చిత్తమునకు నెక్కుఁ బనులు । సేసెద నందున్.

క. అని కొలిచి యే బృహన్నల, యనునామముతోడఁ గన్య । కాంతఃపుర వ
ర్తన మొనరించుచు లాసిక, లనమున నిపుణుండ నై య । తని మెచ్చింతున్. 89

క. మానవపతి నన్నక్కడి, దానవు నీ వనియె నేని । ద్రౌపదికడ స
న్మానంబు వడసి మెలఁగుదు, నానఖిల నృత్యగురువ । ననఁ గలరాఁడన్. 90

తే. అనిన నది పోలు నని యియ్యకొని యజాత, వైరి యల్లన నకులుని । వలను సూచి
నెమ్మనంబున నుమ్మలి । కమ్ము గదుర, నెలుఁగుచందంబు వేఱుగా । నిట్టు లనియె. 91

ఉ. ఒప్పైదుమేనుఁ బెంపు గల । యుల్లము నాగరికంపుఁజందముం
జెప్పక చూప కీలనివి । శేషముఁ దెల్పెడుఁ గొల్చు టింతయుం
జెప్పరి మేమి సేయుదుఁ గ । డిందివిచారము పుట్టె నిట్లితం
డప్పురి సంచరించునొకొ । యన్యు లెఱుంగక యుండునట్లుగన్. 92

వ. అనిన నప్పలుకులకు నకులుం డిట్లనియె. 93

ఆ. అశ్వశిక్షకుండ । నై మత్స్యభూవిభుఁ, గొలుచువాఁడ గుఱ్ఱ । ములకు వలయు
తెఱఁగు లెల్లఁ జాల । నెఱుఁగుదు నాపుగా, నరయ నేర్తు వాని ననుదినంబు. 94

సీ. గోడిగజాతిలోఁ । గొదమపెంటుల నేర్చి, మావుల హత్తించు । మార్గవంబుఁ
ద్రాళ్లఁ బట్టింపంగఁ । దఱి యైనకొదమల, సంచంబు లెత్తఁగ । శిక్షించునేర్పుఁ
గళ్యాలఁ బదిలంబు । గానిగుఱ్ఱంబులఁ, గ్రొత్తముట్టున కియ్య । కొలుపునేర్పుఁ
బెనఁగుశూకలములఁ । బిరుదుతనంబులఁ, జలము డింపక తీర్పఁ । జాలుటయును

తే. నలవరించినవాఁడ లోకము నన్న, యపుడు పోడ కించుకయు లేని । యట్లుగాఁగ
మాటిమాటికిఁ బరికించి । మందడీల, కెల్లనాటల యగుచు వర్తిల్ల నేర్తు. 95

క. దామగ్రంథి యనంగ నొక, నామము పెట్టుకొనువాఁడ । నాలోఁటివిధం
బామను జేశ్వరుఁ డడిగిన, నే మీకడవాఁడ నందు । నిది తెఱఁగు గదా. 96

క. అనినఁ గడులెస్స యని త, మ్మనమున నూఱడి విభుం డ । మానుష తేజో
ధనుఁ డగుసహదేవుఁ గనుం, గొని యిట్లను వగలు మిగిలి । కొందలపడుచున్.

చ. అకుటిలుఁ డార్యసమ్మతుఁ డహంకృతిదూరుఁడు నీతినిష్ఠలా

త్తకుఁ డనవద్యశీలుఁడు సద్ధర్ముఁడు దాంతుఁడు గొంతి ముద్దుఁజే
యుకొడుకు మేను లేఁత దన యుల్లము మెత్తన యిట్టియాతఁ డి
ట్లొకొ యొరు నాశ్రయించు విధి రూపడదె యెవ్వరి కెట్లు సేయఁగన్ 98

క. అనుచు నతఁడు దనచిత్తం, బునఁ దోఁచినవిధము ధర్మపుత్రునితో ని
ట్లని చెప్పె నాతనికిఁ బుట్టినయుత్తలపాటు గొంత డిందుపడంగన్. 99

క. కీలారితనమునకు నేఁ, జాలుదు నని కొలిచి మత్స్యజనపాలుకడన్
మే లగునడవడిఁ దంత్రీ, పాలుం డను పేరితోడఁ బరఁగుదు నధిపా. 100

సీ. వంజల నైనను వల నేర్పడఁగ నొక్క, భంగిఁ జేపఁగఁ జేసి పాఁడి గొనఁగ
బడుగుల నైనను బాటించి పరికించి, గోమున మైఁ గండ్లక్రొవ్వ దేఱఁ
దెవులుగొంటుల నైనఁ దేర్చునంకటమున, కోపి ముందటియట్లు చూపుసేయ
నట్టల నైనను నలుకైనవెరవున, నుమ్మెట్ట యుంటఁగఁ బట్టి కట్టి విడువఁ
ఆ. బిదుకఁ గదుపు సేర్పఁ బెదరు వాపఁగ నీను, మేపు గలుగునెడలఁ జెలఁగ నెలువ
మృగము నరయ స్రుచ్చు లేవగలునుగొట్ట, నేర్తుఁ బసికిఁ జాలఁ గూర్తు నేను.

వ. నన్ను విరాటుండు మున్ను నీ వెం దుండుదు వని విచారించెనేని యుధిష్ఠిరుగోష్ఠం
బుల కధిష్ఠాతనై యుండుదు ననియెద నని పలికినఁ గౌంతేయాగ్రజుం డిదియుక్తం
బగునని యనుమతి సేసి పాంచాలి నాలోకించి ఖిన్నాంతఃకరణుం డగుచు ని ట్లనియె.

చ. ఇది గడుముద్దరాలు పను లేమియుఁ జేయఁగ నేర దెంతయుం
మృదు వొకకీడుపాటునకు మేకొనఁ జాల దుదాత్తచిత్త యొం
టి దిరుగుదాని కొర్వ దొకటిం దను దా నవరించుచొ ప్పెఱుం
గదు తగ నొండులం గొలువఁ గా వెర వెమ్మెయిఁ గల్గు నక్కటా. 103

క. అనిన నతనిచిత్తంబున, వెనుఁబా టంతయును బాయ వెరవు కలిమి యె
ల్లను దెలియునట్లుగా ని, ట్లనియెం బాంచాలి యుచిత మగు చందమునన్.

క. సైరంధ్రివేషంబునఁ, జేరుదు నంతఃపురంబు చెంతకు నన్నా
భూరమణు దేవి యెంతయు, గారవమునఁ బిలువ నంపఁ గా వినయమునన్

క. కని కొలువు సేసికొని మా, లిని నాఁ జని సాధ్వి యిది మలిమనవృత్తం
బున పొంతఁ బోవ దెన్నఁడు, నను శ్రేఁకదనంబు దోఁచునట్లు చరింతున్. 106

సీ. కలపంబు లభినవగంధంబులుగఁ గూర్చి, తనువున నలఁదుదు ననువు గాఁగ
మృగమదపంకంబు మృదువుగా సారించి, తిలకంబు వెట్టుదుఁ జెలువు మిగులఁ
బువ్వులు బహువిధంబులఁ గట్టి ముడి కొక్కభంగిగా నెత్తులు వట్టి యిత్తు
హారముల్ మెఱయ నొకయ్యారంబుగా గ్రుచ్చి, యందంబు వింతగా నలవరింతు
ఆ. వివిధశిల్పములఁ బ్రవీణ నై మఱియును, వలయుపనుల వెంట మెలఁగ నేర్తు
మత్స్యరాజమహిషిమనమున మక్కువ, నెలకొనంగ నిట్లు గొలువ నేర్తు. 107

క. మును నీ వెచ్చె నిలుతే, పనిమొయి వరిల్లు దనినఁ బాంచాలికి నె

వనుచారిణి నై తగఁ బం, చనగరువపుఁబనులు సేర్చి చేయుదు నందున్. 108
వ. అనవుఁడు ధర్మనందనుండు ద్రుపదనందన కిట్లనియె. 109
క. మనవంశంబునవృత్తం, బును బెంపును గానఁ జాలుకపుణ్యసతివి దు
ర్జను లగుతులువలతలఁపులు, గనుఁగొని యేమఱక మెలఁగఁగా వలయుఁజమీా.
వ. అనిన విని యాజ్ఞసేని యనాదరమందస్మితసుందరవదనారవింద యయి యతని
కిట్లనియె. 111
క. ఆరయ నెందును గౌరవ, భారం బెడలంగ నీక పాతివ్రత్యా
చారమునై వర్తింతును, సైరంధ్రీజాతివారు సౌజన్యమునన్, 112
క. కావున నుచితము లగు నా, కావెంటం గొలిచి తిరుగునప్పుడు మితభా
షావిరచనమును వ్రతసం, భావనమును గౌరవంబుఁ బాపభయంబున్. 113
క. అని చెప్పిన విని యుగుఁ బో, మ్మని కైకొని ధర్మతనయుఁ డందఱమును ని
ట్లనపాయత వర్తిల్లుద, మని తమ్ములతోడ నిశ్చయంబుగఁ బలికెన్. 114
వ. ఇవ్విధంబునఁ గార్యంబు నిర్ణయించి మనయగ్నిహోత్రంబుల నెల్ల ధౌమ్యులు
రక్షించువారు వంటలవారును మహానసాధ్యక్షులును పాంచాలీపరిచారికలును
ద్రుపదుపురంబున నిలుచువారు రథంబులు గొని యింద్రసేనాదు లైనసారథులు
ద్వారకానగరంబున కరుగువారు వీరెల్లను దమ్మెవ్వరైనను మనవార్తలడిగిరేని
ద్వైతవనంబున మమ్ము విడిచి పోయి రట యెఱుంగ మనం గలవా రని చెప్పి
యిట్టెఱుంగున నర్థ్యంతరపరివారంబు నెల్ల నియోగించి వీడుకొలిపి నయ్యవసరం
బున ధౌమ్యుండు పాండుకుమారుల కిట్లనియె. 115

ధౌమ్యుఁడు పాండవులకు సేవాధర్మంబు తెలిఁగించుట.

క. ఎఱిఁగెడువారికి నైనను, గఱపక తక్క రుచితప్రకారము శుభముం
గొఱలు హితు లట్లగుట నం, దఱకును జెప్పంగ వలయుఁ దగియెడుబుద్ధుల్.
వ. అదియునుం గాక. 117
తే. కౌరవాన్వయజాతులై గారవమునఁ, బెరిఁగినట్టిమీా రొండొకనరునిఁ గొలిచి
మసలి వర్తిల్లి మానావమానములకు, నోర్చి యుదఁకువతోడనయునికి యరిది.
క. వాలి వివిధాస్త్రశస్త్ర, జ్వాలల వెలుఁ గొందుపాండవజ్వాలనం బా
భీలత మండం దొడరినఁ, గాలవిరోధంబు మఱచి కార్యముఁ దప్పన్. 119
వ. కావున మీాకు నప్రమాదార్థంబుగా నానేర్చినవిధంబున నుపదేశం బవశ్య
కర్తవ్యంబు రాజులం గొలిచి యెమ్మెయి నయినను బ్రదుకుజనంబులు గీడునుం
బొరయ కుండునట్టిసాధారణనీతి సంక్షేపరూపంబున నెఱింగించెద సావధానుల
రయి వినుండు. 120
క. తగఁ జొచ్చి తనకు నర్హం, బగునెడఁ గూర్చుండి రూపమవికృతవేషం

లుగ సమయ మెఱిఁగి కొలిచిన, జగతీవల్లభున కతఁడు సమ్మాన్యుఁ డగున్. 121

క. నరనాథుఁ గొలిచి యలవడఁ, దిరిగితి నా కేమి యనుచుఁ దేఁకువ లేర్మిన్
మరియాద దప్ప మెలఁగినఁ, బురుషార్థంబునకు హాని పుట్టక యున్నే. 122

ఉ. రాజగృహంబుకంటె నధిరామముగా నిలు గట్టఁ గూడ దే
యోజ నృపాలుఁ డాకృతికి నొప్పగు వేషము లాచరించు నే
యోజ విహారముల్ సలుప నుల్లమునం గడు వేడ్క సేయు నే
యోజ విదగ్ధుఁడై పలుకు నొద్దులకుం దగ దట్లు సేయఁగన్. 123

క. పుత్రులు పౌత్రులు భ్రాతలు, మిత్రు లనరు రాజు లాజ్ఞ మిఁగిలినచోటన్
శత్రులకాఁ దమయులుకకుఁ, బాత్రము సేయుదురు నిజప్రభుస్థితిపొంటెన్. 124

క. తనువానిచేయుకార్యం, బున కడ్డము సొచ్చి నేర్పున మెలఁగుచుఁ దా
ననుబయిఁ బూసికొనుటఁ దన,మును మెలఁగిన మెలఁకువకును ముప్పగుఁ బిదపన్.

ఆ. రాజనొద్దఁ బలువు రరసి సంకటము గాఁగఁ, దిరుగుపనుల కింత తేప మయిన
వాని బుద్ధిగలుగు వారొల్ల రది మీఱఁ, గీడు దెచ్చు టెల్ల సిద్ధ మగుట.

క. ఊరక యుండక పలువుర, తో రవ మొసఁగంగఁ బలుకఁ దొడఁగుట కఱం
జేరువ గలనాగరికులుఁ, దారుఁ గలసి పలుక వలయు ధరణీశుకడన్. 127

క. వే జోక తెఱఁగున నొరులకు, మాటాడక యునికి లెస్స మనుజేంద్రకడం
దీఱమి గలచోటులఁ దా, మీఱి కడఁగి వచ్చి పంపు మెయికొన వలయున్

చ. ధరణిపుచక్కఁ గట్టెదురఁ దక్కఁ బిఱుందును గాని యుల్లుగా
నిరుగెలనం దగం గొలిచి యే మనునో యెటు సూచునో యొకొ
వ్వారిదెస నెప్పు డేతలఁపు నచ్చునొ యూరకని కంచుఁ జూడ్కి సు
స్థిరముగఁ దన్ముఖంబునన చేర్చుచు నుండుట నీతి కొల్వునన్. 129

క. నగళులలోపలిమాటలు, దగునే వెలి నుగ్గడింపఁ దన కేర్పడ నొం
డుగడం బుట్టినఁ బతి విన, నగుపని చెప్పెడిది గాక యాతనితోడన్.

క. అంతిపురముచుట్టఱికం, బెంతయుఁ గీ డంతకంటె నెగ్గు తదీయో
పాంతచరకుబ్జవామన, కాంతాములతోడిపొందు కలిమి ఘటనకున్.

ఆ. ఉత్తమాసనములు నుత్కృష్టవాహనం, బులును గరుగఁ దనకు ఘ[illegible]
.డీక తార యెక్కు నింతటిమన్నన, గలుగు వారి కైనఁ గార్య[illegible]

క. మన్నన కుబ్బక యవమతి, దన్నొందిన స్రుక్కఁబడక ధరణీశుకడన్
మున్నున్నయట్ల మెలఁగిన, యన్నరునకు శుభము లొదవు నారద

క. జనపతి యెవ్వరి నైనను, మనుపఁ జెఱుపఁ బూని యునికి మదిఁ దెలియఁ
గనయేనిఁ దాను వెలిపుచ్చని మునుము స్నాత్రిపాలుండుట ధ్యానిన్. 1[illegible]

ఎండకు వాన కోర్చి తనకిల్లు ప్రవాసపుఁజోటు నాక యా
కొండు నలంగుదుర్గ నిదురకుం దఱి దప్పెడు దప్పి పుట్టి నో
క్కండన యెట్లొకో యనక కార్యము ముట్టినచోట నేలినా
తం డొకచాయ చూపినను దత్పరతం బని సేయుటొప్పగున్ 135

తా నెంతయాప్తుఁ డైన మ, హీనాయకుహర్మ్యము హర్మ్యములుగా లో
నూనినభయమునఁ బొరయక, మానినఁ గాకేల కలుగు మానము బ్రదుకున్.

ఆవులింత తుమ్ము హాసంబు నిష్ఠీవనంబు గుప్తవర్తనములు గాఁగఁ
జలుపవలయు నృపతికొలువున్నయెడల బాహిరములైనఁ గెలనికెగ్గు లగుట.

వైరులమాటలు నెరవగు, వారు నిరాకృతులుఁ బాపవర్తులుఁ దమకుం
జేరువగా వర్తించుట, నేరమి తుదిఁ బోయి చేటు నిందయు వచ్చున్. 139

వసుమతీశుపాల వర్తించునేనుంగు, తోడనైన దోమతోడనైన
వైర మగుతెఱంగు వలవదు తా నెంత, పూజ్యుఁ డైన జనులపొందు లెస్స.

కలిమికి భోగములు కదా, ఫల మని తను మెఱసి బయలుపడఁ బెల్లుగ వి
చ్చలవిడి భోగింపక వే, డ్కలు సలుపఁగ వలయు భటుఁ డడంకువతోడన్. 140

అని యిట్లు పురోహితుండు సేవాధర్మం బెఱింగించిన ధర్మజభీమార్జుననకులసహ
దేవులు ప్రసన్నచిత్తులై యిట్లనిరి. 141

తల్లియుఁ దండ్రియు దైవము, నెల్లను బ్రాజ్ఞుఁడవు మీర యిట్లు గొలిచి వ
ర్తిల్లెడుతెఱంగు లెంతయుఁ, దెల్లము సేసితిరి బ్రదికితిమి మీకరుణన్. 142

అనిన ధౌమ్యుఁ డిట్టు లనియె సంవత్సర, మొకఁడు నెట్టు లయిన నుడిగి మడిఁగి
సంకటముల కోర్చి చరియించి యాపద, నిస్తరించి పిదప నెగడ వలయు. 143

అనవుడు నట్టుల చేసెద, మని వారలు భక్తియుక్తి నతనికి నభివం
దన మొనరించినఁ బగుదీ, వన లిచ్చె నతండు గాఢవాత్సల్యమునన్. 144

భూదేవోత్తమునాశీ, ర్వాదంబులఁ బ్రీతిఁ బొంది వారలు ప్రస్థా
నాదరపరు లగుటయు స, మ్మోదావహపుణ్యకర్మముల కుద్యతులై. 145

అతఁడు నియతితోడ నగ్ని సముజ్జ్వలం, బుగ నొనర్చి కామ్యపూజ దీర్చి
యానసమయమంగళార్థంబు లగుమంత్ర, సంచయములు దగ జపించుచుండె.

పాండవులు పాంచాలితోడ విరాటనగరంబునకు బయలుదేఱుట.

తదనంతరంబ కౌరవపాలునకుం బురోహితునకుం బ్రదక్షిణంబు చేసి యమ్మహీసుర వరేణ్యానుమతి వడసి పాండవులు పాంచాలిం బురస్కరించుకొని యాతండును తోడన యరుగుదేరం గదలి శుభనిమిత్తంబులు గైకొనుచుం జని దశార్ణదేశంబున కుత్తరంబునఁ బాంచాలజనపదయామ్యదిగ్భాగంబున సాళ్వశూరసేనవిషయంబులలోనం గాళిందీదక్షిణతీరం బొరసికొని పశ్చిమాభిముఖప్రయాణంబుల నెడనెడ వన్యాహారంబుల శరీరయాత్రలు నడుపుచు నానామృగవివిధవధవిహారం

బులనుమనోహరకుసుమకదంబగంధమకరందబిందుసందోహసుందరతరుచ్ఛాయా
సేవనంబులను గమలపరాగపరంపరాధూసరితభ్రమరజలాశయసముపగాహనంబు
లను సరిత్సంగమస్నానాద్యనుష్ఠానంబులను బహుప్రకారపాదపగుల్మలతావలోక
నంబులను బక్షికులప్రకరానేకభంగివిరుతాకర్ణనంబులను వినోదించుచుఁ గానన
మార్గంబుల నరిగి మత్స్యమండలంబుగడచి సేరి ధౌమ్యుని వీడుకొని రవ్విప్రవరుండు
ను నొక్కపుణ్యాశ్రమంబున వసియించె వారు మఱియు నూర్లు సొరక యడవి
తెరువుల నడచి విరాటునగరంబున కనతిదూరం బగుకాంతారంబునం దఱిమి
పోవుసమయంబునఁ బథిశ్రమంబు నూని యాజ్ఞసేని యి ట్లనియె. 147

ఉ. దప్పి జనించె వ్రేళులపుటంబులు పొక్కఁ దొడంగె గోళ్లలోఁ
జిప్పిలఁ జొచ్చె నెత్తురులు చిత్తము నాకుఁ గలంగె నశెంబు గా
దప్పర మిచ్చ టచ్చటను దాసల వచ్చితి నెంతదవ్వొకో
యిప్పటిభంగి నొక్కఁడుగు నేఁగెదు దానికి నోర్వ నెమ్మెయిన్. 148

వ. అనవుడు. 149

క. తనమదిఁ గరుణయు ఖేదం, బును బెరిగొను చుండ ధర్మపుత్రుఁడు నకులుం
గనుఁగొని ద్రుపదనృపతినం, దన దెస యాతనికిఁ జూపి తగ ని ట్లనియెన్. 150

ఆ. అకట మనము వచ్చినది గనుదవ్వు నేఁ, డప్పురంబు సొత్తమని తలంచి
తఱిమి నడచితిమి లతాతన్వి యిది వడ, గొనియె మోచి తెమ్ము కొంతదవ్వు.

క. అనిన విని పూని గ్రక్కునఁ, జనుదేరమి నతఁడు దస్సెఁ జాలం డని నా
త్మనమున నెఱింగి యాతని, యనుజన్మునిఁ బనిచె నతఁడు నలసుం డయినన్.

వ. సవ్యసాచిం జూచి. 153

ఉ. ఇమ్మదిరాక్షి దస్సె మన కీనడుమన్ విడియంగ నొండుచో
టిమ్మును గాదు నిక్కమున కేమును దస్సితి మట్లు గాన నీ
వెమ్మెయి నైన దీని భరియించి పురంబుసమీపభూమికిం
దె మ్మని చెప్ప నాతఁడును దెచ్చెఁ బ్రియంబునఁ బువ్వుఁబోఁడిన్.

క. మోచికొని వాసవాత్మజుఁ, డాచెలువం దేర నిట్టు లరిగి పురము దృ
గ్గోచర మగుటయుఁ దమ్ములఁ, జూచుచు వారలకు ధర్మసుతుఁ డి ట్లనియెన్.

క. చక్కనిచిక్కనిమేనులు, నిక్కుదండములు నైన నెఱుఁగరె మన నీ
చక్కటి నిలుత మె శస్త్రము, లొక్కెడ దాఁచుటకు వేషయోజనములకున్.

వ. అనిన నది కార్యం బని మధ్యమపాండవుం డాసుమధ్య నొక్కశీతలసికతాతలం
బున డించెఁ దక్కినవారలు నట్ల చేయుద మని నిలిచి రట్టియెడం బాండవాగ్ర
జుండు గాండీవిచేతివి ల్లుపలక్షించి యతని కి ట్లనియె. 157

క. మనశస్త్రాస్త్రంబులు ద, క్కనయవి యొకభంగి వీటికిని గాండివముం
గొనిపోయితి మేని సురయో, ధనునకు నగపాటు నిశ్చితం బూహింపన్. 158

వ. అనవుడు. 159

చ. ఇది పెనుఁబాముచందమున నెంతయు భీషణమై జనంబులన్
బెదరఁగఁ జేయు నట్లగుటఁ బెట్టి చనన్ వలయుం దలంచి నా
హృదయము దీనిఁ బాయుటకు నియ్యకొనం జొర దెట్లు సెప్పినం
దుది నొకచోట నైచుటయు దోఁచినకార్యము నయ్యెడుం గదా. 160

వ. అని వితర్కించుచుం గిరీటి యుత్తరుఁడుచిత్తంబున త్తలం బుడిపికొని నిశ్చయించి యాయుధంబులు నిక్షేపించుటయు కర్జంబుగాఁ బలికి యోగ్యస్థలనిరూపణంబునకు నలుదిక్కులుం బరికించి ప్రేతభూమిపరిసరారణ్యంబునందు. 161

సీ. నిగనిగనై లేచి నింగి యంటెంటెను, నవ్వులఁ ద్రోవఁగఁ దనరారుదానిఁ
జాఁగినశాఖలాశాచక్రములకొలం, దులు వారవెట్టంగఁ బొలుచుదానిఁ
గవట లొండొంటితోఁ గదియుచు నెడములు, మ్రింగి ప్రబ్బఁగ సొంపు మిగులుదాని
లోనికొంపము పవలును జెనుఁ జీకటి, నొదవించి పొదలంగ నొప్పుదానిఁ
తే. గనియెఁ బవమానవివిధ వనత్రసకళానువర్తిఁ గాకఘూకారవస్ఫూర్తి జాత
భీతిపరిసరవర్తి నానాభీలభుజగ,చండమూర్తి శమీమహీరుహచక్రవర్తి. 162

వ. కని యమ్మహామహీరుహంబు ధర్మనందనునకుం జూపి యి ట్లనియె. 163

శా. పక్షివ్యాకులముం బరేతనిలయోపాంతోత్థముం జాకినీ
రక్షోభూతపిశాచసంచరము దుర్గస్థంబునై చూడఁ జి
త్తక్షోభం బొనరించు నట్లగుటఁ జెంతం జేర రా దీశమీ
వృక్షం బెవ్వరికిం దుఁ బెట్టుదమె పృథ్వీనాథ శస్త్రాస్త్రముల్ 164

క. పెనుఁబొదవుఁ బఱపు సొంపు,మ్మును గలయది దీన నెల్లపురుషులకుఁ బ్రయో
జన మొకఁడు లేదు సేరం, జనఁ జూడఁగ నరయ నెక్క సమకట్టంగన్. 165

ఉ. కావున దీనియం దిడుట కార్యము గైదువు లెల్లఁ గేశవ
చ్ఛావృతిసంచయంబుగ శవాకృతిగా నొనరించి కట్టినం
బోవరు దీనిది క్కొరులు భూవర నెమ్మది నూఱడిల్లు మె
చ్చో వసియించిన బిదపఁ జెప్పదుఁ గ్రమ్మఱ వచ్చి కైకొనన్. 166

పాండవులు దమయాయుధంబుల శమీవృక్షమునఁ బెట్టుట.

వ. అనిచెప్పిననందఱున త్తైఱంగునకియ్యకొనుటయునతండు గాండివంబు నవలోకించి.

చ. అనిమిషదానవాంబరచరాదికజాతుల నెల్లఁ బోర నీ
ధనువునఁ గాదె గెల్తు నమదగ్రవిరోధిభయావహంబు దీ
నిని నొక మూలిఁ గట్టి చనునిశ్చయముం దగఁ జేసె దైవ మే
మనఁ గలదట్ల కాక యని యాత్మ నలందురి మందచేష్టుఁడై. 168

వ. ఎక్కుడించినఁ బాండవాగ్రజుండు. 169

క. దనుజకులత్రాసకరంబును రిపుభంజనము రత్నభూషితరూపం

బనిచి ధర్మతనయుండు దానిచర్మం బొలిపించి శీతాతపవర్షపరిహారంబుగా నాయుధంబులం బొదివించి మఱియును దత్సమీపంబున నొక్క శుష్కశవంబు నవలోకించి యిది యుంఛవృత్తి యైనమానవుకళేబరంబు గావలయు ననుచు నదియునం గై దువులకట్టపయిం బెట్టి కట్టించె నివ్విధంబున నత్యంతగుప్తి యాచరించి దీనిదుర్గంధంబున వనచారు లెవ్వరుం జేర రని నవ్వుచు వార లచ్చోటు వాసి విరాటపురాభిముఖు లై చనుచుండి యజ్ఞాతవాసకాలంబునం దమరవాస్యవ్యవహారంబునకు ననువుగా నేవుర పేళ్లను గ్రమంబున జయుండును జయంతుండును విజయుండును జయత్సేనుండును జయద్బలుండు నని సంకేతించుకొని యాజ్ఞసేనీపురస్సరంబుగాఁ బుణ్యనదీతీర్థావతరణంబు సేసి తదీయస్నానంబునం బథిశ్రమం బపనయించి దేవపితృతర్పణమంగళజపహోమధ్యానాద్యనుష్ఠానంబు లొనర్చిరి తదనంతరంబ యక్కౌంతేయాగ్రజుండు ప్రాఙ్ముఖుండయి నిర్మలచిత్తంబున ధర్మదేవతం దలంచి యిట్లనియె 180

ఆ. తండ్రి నీవు నాకుఁ దయతోడ నిచ్చిన, వరము చిత్తగించి వలయు తెఱఁగు
సమయసముచితముగ సమకట్టు మయ్య యీ, రాకునూరు లవిధిఁ బోక యుండ.

క. అనుచు ననుజులదెసకుఁ దూర వగచి డగ్గుత్తిక వెట్టె మఱియును. 182

ఉ. అంబరవర్తి వైనఁ గని యక్షునిచే నగపడ్డవీరిప్రా
ణంబులు మున్ను నిన్నడిగి నల్వురకుం దయవిక్రమప్రభా
వంబులు వేఁడికొన్న నతివత్సలభావముఁ బొంది యాదరా
ర్ద్రిం బగుచూడ్కితోఁ బ్రియహితస్థిరభాషల నూఱడింపవే. 183

వ. అని తాను భూసురవరువరణి దేర నరిగిన నాఁడు సరోవరతీరంబునం దనకు ధర్ముండు సేసినమన్నన దోఁప నతనికి విన్నవించినవాఁ డై కరకమలంబులు మొగిచి ఫాలభాగంబునం గదియించి సంప్రార్థనంబుగా వినయవినమితమస్తకుం డగుటయుఁ నదనుగ్రహంబునఁ బాండవాగ్రజుం డున్నయునికిన సన్న్యాసిరూపం బలవడి ధాతుపటదండకమండలుకలితమూర్తి యయ్యె నయ్యవసరంబున వా రందఱు మహోద్భుతం బంద వారివారికి నయ్యైవేషంబుల కనుగుణంబు లగునంబరాభరణమాల్యాద్యుపకరణంబులు సన్నిహితంబు లయినం జూచి సంతసిల్లి యెల్లవారిం గలయం గనుంగొని క్రమంబున నొంటిమైఁ జనుదెం డని నియోగించి యతండు నానావిధంబు లగునక్షంబులముడి కక్షంబున నిడికొని చని, దైవయోగంబున విరాటుండు వెడలి వచ్చి బయలికొలు విచ్చుటం జేసి తదాస్థానంబు సేరం బోవునప్పుడు. 184

ధర్మరాజు సన్న్యాసివేషమున విరటుఁ గొల్వ వచ్చుట.

సీ. దవ్వులఁ జూచి మత్స్యవసుధాపతి యీచను దెంచు చున్నవాఁ

డెవ్వఁడొ నాదుచూడ్కులకు నెంతయు వ్రేఁగయి తోఁచె నిట్లితం
డివ్విధిఁ బొందెనో జగము నెల్లను నేలఁగఁ జాలు తేజ మా
ముప్పిరి తోడిజోడి యగుమూర్తి యతీంద్రుని యొప్పు గంటిరే. 185

సీ. కరచరణాద్యంగకంబు లేలొకో రత్న,భూషణప్రకరంబుఁ బొందు దొఱఁగె
నుభయపార్శ్వంబుల నిభఘటా లేలొకో, చను దేవు సమదాళిసమితి మొరయఁ
ఛాయ తొలంగు మం చాయతపత్రపం,క్తులమొత్త మేలొకో తోడ రాదు
ధవళాతపత్రముల్ దఱచుగా నేలొకో, పట్టరు మౌక్తికప్రభలు వెలుఁగ
తే. నితఁడు రాజగు రాజును నింతమాత్ర, గాదు మూర్ధాభిషిక్తవర్గంబుఁ దనదు
చరణయుగ్మంబు గొలిపింపఁ జాలుసార్వ,భౌముపదవికిఁ దగియెడు భంగివాఁడు.

క. మనకడకు నేమిటికి వ,చ్చెనొకో యే నిమ్మహాత్ముఁ జెప్పిన పను లె
ల్లను జేయువాఁడఁ గోరిన, కనకాంబరమణులు దలఁపు గడవఁగ నిత్తున్. 187

ఆ. మత్స్యవిషయరాజ్యమహిమకు యుక్తుండు, గాఁ దలంచెనేని గారవమున
నట్లచేసి భక్తి ననుచరింతు నమాత్య,సుతసుహృద్భృత్యయుతము గాఁగ.

వ. అని సమస్తజనంబులుం దనకభిముఖు లయి భక్తియుక్తిం బ్రత్యుత్థానంబు సేయం
దానును గద్దియ డిగ్గి యెదురు చని నమస్కరించి యతని యాశీర్వాదంబులు
గైకొని సగౌరవంబుగాఁ దోడ్కొని చనుదెంచి సముచితసమున్నతాసనంబున
నునిచి వినయావనతుం డయి. 189

ఉ. ఎయ్యది జన్మభూమి కుల మెయ్యది యెయ్యది యున్నచోటు పే
రెయ్యది మీర లిందులకు నిప్పుడు వచ్చినదానికిం గతం
బెయ్యది నాకు నంతయును నేర్పడఁగా నెఱిఁగింపుఁ డున్నరూ
పయ్యది నావుడుం బరమహర్షముతో యతిముఖ్యుఁ డిట్లనున్. 190

ఆ. ఉన్నరూప పలుకుమన్నఁ బెక్కండ్రు, గలుగ తోఁచినట్లు పలుకుపలుక
నైనచంద మయ్యె నంతియ యాకంత, పట్టిచూడఁ గలరె యట్టివారు. 191

వ. అని మందహాసంబు సేయుచు మఱియును. 192

క. నానావిధభూతమయము, మే నతిచంచలము మనము మొదలుకొని నిక్కం
బే నరునకుఁ జెప్పింపం, గా నగు సత్యంబు నడపుక్రమ మట్లుండెన్. 193

వ. అనుచు మత్స్యమహీవల్లభు నవలోకించి. 194

క. ద్విజుఁడఁ గుశవిషయజాతుఁడ, సుజనప్రియుఁ డైనధర్మసుతుసఖుఁడఁ బరి
వ్రజనాశ్రమకలితుండ మ,నుజవల్లభ యోగ్యబహువినోదకరుండన్. 195

క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుం గపటమున నొవ్వ నిజధనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరి,భూతి యొనర్చిన విరక్తి పుట్టి వెడలితిన్. 196

చ. నృపనయవిద్యకుం దగిననేర్పలవడ్డది గొంత కొంత ధ
ర్మపథులసంగతిం దగిలి మచ్చిక నుండుదుఁ బేరు కంకుఁ డే

వపుఁగోలు సైన నాకు నిలుకవ మది గొల్వదు గాన నన్ను భూ
మిపతులలోన సాధుజన మిత్రుఁడు నా విని కొల్వ వచ్చితిన్. 197
వత్సరంబునఁ గడచనుక వ్రతము నాకు, దాని నీపాలఁ జల్పి యుకత్సాహవృత్తి
మెఱయ నాకుఁ గృతఘ్నత కె నెఱపి తొల్లి, యెగ్గు సేసినవారి జకయింపఁ బోదు.
అనిన విని సంప్రీతచేతస్కుం డై విరాటుం డతని కిట్లనియె. 199
అట్ల చేయుఁడు రుచిరోన్నతాసనములు
వాహనములు భోజనములు వస్త్రములును
వలయుభోగములును నెల్లవర్తనములు
నాకు నెట్లవ్విధమ మీకు నడపువాఁడ. 200
నాయనుచరులం దెవ్వఁడు, మీయెడ భయభక్తి లేక మిగిలి మెలఁగ నే
నాయధముని దండింతుఁగాఁ, జేయుదు పలఁ డెంతయుం బ్రసిద్ధుం డయినన్.
అట్లుం గాక. 202
వెలయఁగ మత్స్యరాజ్యపద పీపరిపాలన సేయఁగా మదిం
దలఁచుట యెంతయుం బ్రియము దమ్ములుఁ బుత్రులు బంధులుం బ్రధా
నులును బలంబు నేను సుమనోవిభులుల్యాఁడ వైననిమ్ము మి
కిలి యనుభక్తిఁ గొల్చి కృతకృత్యతఁ బొందుదు మట్ల చేయవే. 203
అనిన విని దరహసితవదనుం డగుచుఁ బాండవాగ్రజుం డతని కిట్లనియె. 204
ఏను హావిష్యమ కుడుతును, భూనాయక నాకు శయ్య భూమియ యిమ్మెఁ
బూని వ్రతంబులు సలిపెదు, వానికి నిన్నియును నిట్లు వలయును చెప్పుమా.
అనిన విరటుఁ డిట్లనియె నిత్తెఱఁగున, నడవ నీష్ట మట్ల నడచి మీకు
మనసు వచ్చినన్నిదినములు సలుపుఁ డీ. చ్చోట నదియ మాకు శోభనంబు.
దుర్యాత్ములబెసఁ గొండొక, ప్రీతియుఁ గల దట్లుఁ గాక పెద్దల రగువిూ
రీతెఱఁగున విహరించినఁ, జేతోమోదంబు దగ వహింపుఁడు నెమ్మిన్. 207
అని పలికి కొంతేయాగ్రజ సత్యంతసంతుష్టాంతరంగుం జేసి. 208
పొరిఁ బొరిఁ బ్రీతి రెట్టిగ సపూర్వవిలోకన మాచరించుఁ ద
త్పర మగుసద్వివేకమున భావనిరూపణ సేయుఁ గౌతుక
స్ఫురణఁ గరంబు దత్కరముఁ బొంద నయంబునఁ జేర్చి వాక్యవి
స్తరచతురత్వ మేర్పడఁగ సల్లపనం బొనరించు నర్థితోన్. 209
ఇట్లు మత్స్యమహీవల్లభుం డతనిం గలిసికొని పరివారంబును దానును దదీయ
సంభావనాతత్పరుఁ డై యుండె నంత. 210

భీముఁడు వంటలవాఁ డై విరటుఁ గొల్వ వచ్చుట.

చట్టువం బొకచేతఁ బట్టి ఖడ్గము సంకఁ, దగిలించి సురియతో బిగియ ద్రిండు
గట్టినమునుఁజేలక కప్పెంతియును జెన్ను, సేయంగ దాపలిచేతియందు

బెడిదంపుఁగోలలు | బెడఁ గొంద బహువర్ణ,చిత్రితాజినము పై | చీర గాఁగ
జూప తెల్లను దవ|రూపంబు చూడ్కికి, వేఁగైన నత్యంత|విస్మయంబుఁ
తే. బొందు చుండ సమీరణ|పుత్త్రుఁ డగ్ర,జుండు వోయిన దెసఁ దప్ప | నొందువలన
సమదవారణపతిగమ|నమున మత్స్య,ధరణివల్లభుసభ చేర | నరుగుటయును.
వ. అంతంతఁ గనుంగొని. 212
క. ఉలుకును వెక్కసపాటును, దలకొను నెమ్మనముతోడ | ధాత్త్రీరమణుం
[1]డలఘుభుజవిపులవక్షః, స్థలరేఖాకాంతిఁ బరవ|శత్వముఁ బొందెన్. 213
వ. ఇట్లతనిరూపాతి|శయంబున కోటువడి చూచుచు నిజాంతర్గతంబున. 214
క. విహరింప మానవాకృతి, సహితంబుగ మహికి నర్థిఁ | జనుదెంచినప
ద్మహితుఁడో హిమకరుఁడో శచీ,గృహమేధియొ కాక యితఁడు | కేవలనరుఁడే.
క. ఏమికులంబువాఁడొకో, నామం బెద్ది యగునొక్కొ | నాభృత్యులలో
నీమనుజోత్తముఁ దొల్లియు, నే మెఱుఁగుదు మనఁగ నిచట | నెవ్వరు గలరో.
క. అను చుండ నపతిదూరం,బున కల్లన వచ్చి పవన|పుత్త్రుఁడు మనుజేం
ద్రునకు జయశబ్దయుతముగ, వినయంబున మ్రొక్కి విన్న|వించె నిభృతుఁడై.
శా. దేవా నాలవజాతివాఁడ నిను న|ర్థిం గొల్వఁగా వచ్చితిన్
సేవాదక్షత యొందుమై నెఱుఁగ నీ|చిత్తంబునన్ మెచ్చున
ట్లే వండం గడు నేర్తు బానసమునం | దిచ్చోటనే కాదు న
న్నేపీటన్ మిగులంగ నెవ్వఁడును లేఁ|డెబ్భంగులం జూచినన్. 218
క. పేరు వలలుండు గూడుం, జీరయు నిడి సాకతంబు | సేసినఁ జాలుం
గోరిన తంటకములు నా, నేరిమిఁ దగ నెఱపి కొలుతు | నిశ్చలభక్తిన్. 219
చ. అనవుడు మత్స్యభూరమణుఁ | డాతని కిట్లను నెట్లు శూద్రుఁ గా
నినుఁ దలఁపంగ వచ్చు ధర|ణీభరణక్షమమూర్తి వీవు నీ
కనుగుణమైనయానమును | నాసనముం రుచిరాతపత్త్రముం
జనవరికొల్వు నిచ్చెద గ|జవ్రజముం బరికింపు పంపుతోన్. 220
క. అనుటయు మోఁడకుచందం,బున మో మడ్డము గదల్చి | భూవిభుఁడు సభా
జనులు విన ననిలసుతుఁ డి,ట్లనియెం బ్రస్ఫుటనిరర్గ|ళాలాపములన్. 221
ఉ. నా కవి యెల్ల నేల నర|నాథులకుం బ్రియ మొందునట్లుగాఁ
బాకము సేయ నేర్తు జన|పాలక ధర్మసుతుండు పెద్దయుం
జేకొని యుండు బానసము | సేయువిధంబున కిచ్చ మెచ్చి పు
ణ్యాకరమూర్తి వైననిను | నాతనిఁ గొల్చినయట్ల కొల్చెదన్. 223
చ. వలసిన నేలు మేను బల|వంతుఁడఁ గాఱెనుపోతు దంతి బె
బ్బులి మృగనాథునిం దొడరి | పోరుదు శూరత యుల్లసిల్లఁగా
దలమున లావు విద్య మెయి|దర్పముఁ జేర్చి పెనంగుజెట్టిపా

ట్టుల విఱుతుర్ వడిఁ గడియలోనన చూచ్చికి వేడ్క సేయుదున్. 223
గొలువు గాన నొల్ల కుండుట, గలిగినఁ బొమ్మనుట యంతకం టెను మే లే
వలసినకడ కేఁగెద నీ, తలఁ పెయ్యది యాన తిమ్ము ధరణీనాథా. 224
అనిన విని భూనాథుండు సానునయంబుగా ని ట్లనియె. 225
ఇమ్మహనీయరూపమున యే త్తెఱఁ గన్గొని వేడ్క నీకు యో
గ్య మ్మగుభంగిఁ జెప్పితిమి గాని నరోత్తమ యొందు గాదు నీ
వెమ్మెయి నైనఁ నిల్చుటయ యిష్టము వంటలమేర వాఁడ వై
యిమ్ముల నుండు సూపజన మెల్లను నీ దగుపంపు సేయఁగన్. 226
అని హర్షోత్కర్షంబున, మన మలరఁగఁ బల్కె మత్స్యమనుజాధీశుం
డసలసుతు నేల నాతఁడుఁ, దనమనమున నూఱడిల్లెఁ దదవసరమునన్. 227

అర్జునుఁడు పేడిరూపమున విరటుఁ గొల్వ వచ్చుట.

కాళ్లయొప్పిద మాఁడు కట్టనుజ్జ్వలము నె,యంగ సంకులబాహుల లంద మెడలఁ
గంచుక మంగంబు కాంతికి మాటుగా, మెడ హేమపట్టిక మెఱయ కుండ
వదనంబుకొమరు ఫాలవనఁ జేసి వేఱుగా, నుదుటిపెం పలకలఁ బొదువఁబడఁగఁ
బవడంపుజొత్తులఁ జెవులు రూపడఁగంగఁ, జాపటఁ దలకట్టుభంగి గప్ప
మంచు మఱుఁగువడినమార్తాండుఁడునుబోలె, నీఱు గవిసి యున్ననిప్పుఁబోలె
వేషధారి యైనవిష్ణుండుఁబోలె న, వ్విరటుకొలువు సేర నరుఁడు వచ్చె. 228
చనుదెంచి పేడితనమును, వనితారూపంబు నమర వాసవసుతుఁ డా
మనుజాధీశునకు సభా, జనులకుఁ దనుఁ జూపి మందసంచారమునన్. 229
మెలంగినం గనుంగొని మత్స్యజనవిభుండు తనయొద్దివారలతో ని ట్లనియె. 230
వనితావేషము గల్గి యున్నయది చెల్వం బాఁడుచందంబు గా
దు నిరూపింప మహానుభావతయు నిర్దోషత్వముర్ రాజసం
బును శోభిల్లెడు నెవ్వఁ డే నొకజగత్పూజ్యుండు గ్రీడార్థ మి
ట్లొనరం దాల్చినరూపు గావలయు మీ రూహింపుఁడా యట్లగున్. 231
అనినఁ బరిజనంబులు విస్మయంబు గదుర, నిశ్చయము సేసి పలుకంగ నేర్పు లేక
చూచు చుండఁగ నాసవ్యసాచి సేరఁ, జని విరాటనృపాలుతో సవినయముగ
నిన్నుఁ గొలువంగ వచ్చితిఁ, గన్నియలకు నాట గఱపఁ గా నోపుదు వి
ద్వన్నుత మన్నామంబు బృహన్నల యేఁ బేడి ననుచు నతఁ డి ట్లనియెన్.
ఆయతబాహులుర్ వెడఁద యైనసమున్నతవక్షముర్ సరో
జాయతలోచనంబులుఁ బ్రసన్నముఖంబు నుదాత్తరేఖయుం
గాయజుఁ గ్రేణిసేయు ననఁ గౌశికు మీఱు ననంగ విభ్రమ
శ్రీయును బెంపునుం గలుగఁ జేసి విధాతృఁడు పేడిఁ జెసెనే. 232

మొగము మొగంబునం గదియ • మోవుఁ గరాంగుళులం గపోల మిం
పుగఁ బుడుకుం దొరిం దొరి సపూర్వవిలోకన మాచరించుఁ గ
వ్వగుమ్మృదుమాలి ముజ్జ్వలనఖాంకురచేష్ట యొనర్చు వర్తిలిన్. 247

వ. ఇవ్విధంబునం దవగాఢలీలఁ గూఁతు నుపలాలించి బృహన్నలదెసం గనుంగొని సాదర దరహసితరుచిరాననుండై యిమ్ముగువ నీకు నాట గఱపం దగుపాత్రం బగునే యని యడిగి తత్ప్రతివచనంబులయందలి నాగరికత్వంబునకుఁ జిత్తంబు రంజిల్ల మధుర సల్లాపంబు సేసి కర్పూరసహితం బగు తాంబూలంబు వెట్టి చిత్రంబు లగు చీనాంబరంబు లిచ్చి మణిమయంబు లగు నాభరణంబు లొసంగి సంభావించి యవ్విభుండు.

ఆ. నీవు చతురమతివి • నీకు నిక్కన్నియ, నప్పగింప నేల • యైన నాదు
హృదయమతులు దీనియెడఁ గడు నార్ద్రమై, యుండుఁ గాన చెప్పకుండరాదు.

క. నెచ్చెలులతోడ నెంతయు, నచ్చిగఁ దనయిచ్చ నాడ • మరగినయది యై
విచ్చలవిడి నింతకు ము, న్నిచ్చేడియ మెలఁగుశిక్ష • యెఱుఁగదు సుమ్మీ. 250

ఆ. బాల కేళిమీఁది • భరము గ్రమంబున, విడువఁ గళలయందు • వేడ్క వొనిపి
నయముతోడ నర్తనంబుల శిక్షింపు, నెలఁత కేడుగడయు • నీవ కాదె. 251

చ. అని యుచితంబుగాఁ బలికి • యంగనహస్తముఁ బట్టి తత్కరం
బునఁ గదియించి నీగురువుఁ • బాత్రి తగం గొనియాడు మెట్లు సె
ప్పి నటుల భక్తిమై నడవు • పెంపెస లారఁగఁ గూడుగూర చం
దనకుసుమాదులున్ నడపి • తెప్పక యారసి గారవింపుమీ. 252

ఆ. ఎల్లచుట్టములును • దల్లియుఁ దోడును, జెలియుఁ బరిజనంబుఁ • జెలువ నీకు
గురువ యింక నొక్కకొఱఁతయు లే దిందుఁ, జేరి బ్రదుకు బుద్ధిగౌరవమున.

క. మనయింట నిచ్చ టచ్చో, టన కెచ్చట నైన నీబృహన్నల మెలఁగం
జనియెదుమానిసి తనమన, మున కిమ్ముగునట్టిచరిత్రమున వర్తించున్. 254

నకులుఁ డశ్వపాలకుఁడై విరటుఁ గొల్వ వచ్చుట.

వ. అని యుత్తరం గునయ్యిరువుర నొండొరులకు నప్పగించి పుచ్చినయనంతరంబ నకులుండు. 255

ఉ. అంబుజముల్ సముద్యదరుణాంశునిఁ గన్నవిధంబునన్ వికా
సంబున నుల్లసిల్లి జనచారువిలోచనముల్ నిజోజ్జ్వలాం
గంబున కర్థిమై నభిముఖంబులు గాఁ జనుదెంచి దైవయో
గంబున భూవిభుండు దురగంబులఁ జేరఁగఁ బంచి చూడఁగన్ 256

వ. ఆస్థానంబు సేర వచ్చి ఘోటకంబుల నుపలక్షించుచున్న నన్నరేంద్రుండు గనుంగొని పరిజనంబుల కతనిం జూపి. 257

క. ఇతఁ డెవ్వఁడొక్కొ రూపు ని,రతిశయ మై మనకునుఁ బ్రియం బొసఁగెడుఁ జూ
చితిరే చిత్తంబునఁ దా, త్రత గానఁగ నయ్యెడున్ వదనమునభంగిన్. 258

క. తురగంబులఁ జూచువిధం, బరయఁగ నితఁ డశ్వవిద్య।యందు నిపుణతా
స్ఫురణము గలవాఁ డగు బం. ధురమూర్తిపరాక్రమాన్వి।తుఁడు గానోవున్.

క. మీ రెఱిఁగినఁ జెప్పుఁ డీతని, పే రెఱుఁగనియట్టులైనఁ। బెం పారంగాఁ
జేరం జని యల్లన యొకఁ, డారసి యెఱుఁగంగ వలయు। వనుసమయమునన్

క. చేరఁ జనుదెంచి పాండవ,వీరుఁడు మత్స్యాధిపునకు। వినతుం డై దే
వా రాజవాహనము లగు, వారువముల వరయు నేర్పు। వల నేర్పడఁగన్. 261

వ. దామగ్రంథి యనువాఁడ నాకు నశ్వవిషయం బయినవిచక్షణత్వం బెల్లనుం గల
దవధరింపు మని యిట్లనియె. 263

సీ. అవయవలక్షణం। బాయుఃప్రమాణంబు, గర్భంబు లింగితా।కారములును
మాత్రాంతరము వయో।మానంబు దేశకా, లోచితాహారప్ర।యోగభంగి
జాత్యనురూపశి।క్షావిధిక్రమగతి, వ్యాయామసాత్మ్యప్ర।వర్తనంబు
ప్రమదవిషాదాది।బహువిధచిత్తధ,ర్మము పోషణప్రకా।రము చికిత్స

ఆ. పరిచితములు ధరణి।పాల నీముందట, రూపురేఖ మెఱయఁ। జూప నేర్తు
బవర మైన నాకుఁ। బని యేమి యనఁ జేతి, బలిమికలిమి నెఱపఁ।దలఁపు గలదు.

వ. అనిన విరాటుం డతని కిట్లనియె. 264

క. నీకుఁ దగుపదవి యిచ్చెద, నాకలిమికి నెల్ల రక్ష।ణం బొనరింపం
గాక హాయశిక్షకుఁడ వను, నాకోలఁ దియె యిట్లు పలుకు।టనుచిత మరయన్.

ఆ. అనుడు నకులుఁ డిట్లు। లను దేవ తమతమ, నేర్పుపనులవెంట। నెగడి బ్రదుక
వలయుఁ గాక నగర।దలము దప్పినమెలం,కువల కలుపు లియ్య।కొనుట దగునె.

ఉ. ధర్మసుతుండు వెంచె ననుఁ। దాన తురంగమశాస్త్రశిక్షకుం
గర్తుఁ జేసి యాత్తుర।గంబుల కెల్లను నన్న యుక్తుఁ గా
వర్తిలి నిల్పి యీగియుఁ బ్రి।యంబును నామెడ నాఁడునాఁటికిం
బేర్చి వహించుచుండ వడ।పెం దనతమ్ములలోనివానిఁగాన్. 267

క. అవిభుఁడు రాజ్యసుఖలీ, లావిముఖత వెడలి బంధు।లం దోఁగి యజ్ఞా
ష్టావాసత బ్రుంగుడువడి, పోవుట నెచ్చోటఁ గడుపుఁ। బ్రోచునొ యమునన్.

క. తిరిగి తిరిగి లోకోత్తర,చరితుఁడు నుడినుండు మత్స్య।జనవిభుఁడు యుధి
ష్ఠిరునట్ల యనఁగ విని నినుఁ, గర మనురాగమునఁ గొలువఁ।గా నిశ్చయుని

క. చనుదెంచి కాంచి నానే, ర్పిన తెఱఁగున విన్నపంబు। సేసితి వస్తుం
బనిగొనఁ దలఁచిన నేటిది, దనుమానము గలిగెనేని। నరిగెద నధిప

వ. అనవుడు.

ఉ. ఆనరనాథుఁ డిట్లనియె। నశ్వములం బరికించి యున్కి యిం
పేనిఁ దురంగశాలలకు। నెల్లను ముఖ్యుఁడ వై తదీయనా

నానియతప్రకారకళలంబులఁ ద్రిమ్మరుచున్నవారి ము
న్నే నెటు లెల్ల నీ వరసి యిచ్చ మెయిం బని గొమ్ము నెమ్మితోన్. 272

క. అని చెప్పి యధికసమ్మా, నసపూర్వము గాఁగ మత్స్యనరపతి మూర్తి
తనయుఁ దగ నిల్పె నాతఁడు, దనమదిఁ బ్రియ మందె వతనికతమ్ముం డంతన్.

సహదేవుఁడు గోపవేషంబున విరటుఁ గొల్వ వచ్చుట.

క. పావనశాంతత్వము నిజ, భావంబున సూక్ష్మలతయుఁ బ్రకటంబులుగా
నావిధుఁడు మనుజవేషుం, డై వచ్చెనొ శిఖి శరీరి యయ్యెనొ యనఁగన్. 274

క. తలుగులపాది రొకదెసఁ బె, య్యలదామెన యొక్కవలన నను వై యుండన్
మొల వోపి పెక్కుచుట్లన్, బలుద్రాటం జుట్టి గోపభావం బమరన్. 275

చ. నునుసెలగోల చేకొని మనోహరమూతనమేను రాజుచూ
పును బ్రజచూడ్కులుం దిగుచఁ బుష్కరపత్త్రనిభంబులైనలో
చనముల మూర్తి దెల్పఁగ ససంభ్రమతం జనుదెంచె నల్లన
ల్లన వెడభీతి దోఁప జనులెల్ల వెగ డయ్యెడుదృష్టిఁ జూచుచున్. 276

వ. ఇట్లు వచ్చి మత్స్యమహీవల్లభు నంతంతం జేరి వినయావనతుం డగుచు నిట్లనియె.

క. నీపసులఁ గావఁ బెట్టుము, భూపాలక నన్ను నేను బూని యరసినన్
గోపంక్తులు రుజ వడ వొరు, చేనడ వెన్నఁడును దప్పఁ జేద్పడ వెచటన్. 278

తే. తోఁడుగువో ఖండ మెకములు గలవ కుండఁ
బాఁడి దఱుఁగక యుండ వాకపాటిగొల్ల
లిచ్చ మెచ్చ నీదృష్టికి నెక్కఁ గధుప
నరయ నేర్తు న న్నేలుము ధరణినాథ. 279

వ. అనిన విరాటుండు పాండవావరజున కిట్లనియె. 280

ఉ. ఎక్కడిమాట గొల్లతన మించుకయేనియు లేదు. నీదెసం
జక్కనిమేను నీగఱువచందముఁ గాంతియుఁ జూడ వచ్చినన్
నిక్కువ మీవు సూర్యశశిని కులవంశజులైనరాజులం
దొక్కమహానుభావులనయుండవు గావలయున్ నరోత్తమా 281

ఆ. వలయుపదవియందు నిలిచి నారాజ్య మం, తయును జక్కఁ బెట్టి నయము విక్ర
మంబు నడవునంతమానిసి వై యుండి, కుచ్చితంపుఁ బ్రదుకు గోరఁదగునె. 282

వ. ఉత్తమవాహనంబులు మహనీయాయుధంబులు నిచ్చెద మత్స్యదేశంబున భవదభిమతస్థలం బొసంగెద మదీయమండలసేనాపరిపాలనంబు సేసి వర్తిల్లుము. 283

క. అనవుడుఁ బాండునృపాలక, తనయుఁడు మ్రొక్కుచు విరాటధరణీశున కి
ట్లను హీనకులుఁడ బాలుఁడ, మును నాగరికంపుఁగార్యములవెర వెఱుఁగన్.

ఆ. పసులఁ గాచి కాని బ్రదుకఁ గారవుల ప్రాఁ, తలము మున్ను నేను ధర్మపుత్త్రు

పసుగణంబు నెల్లఁ బాలింతు నమ్మహీ వరుని చిత్తమునకు వచ్చువాఁడ. 285

వ. తంత్రీపాలుం డనం బరఁగినవాఁడ నాచేతం గ్రేపులు పురాణించుటం జేసి కొండొక కాలంబునఁ గదుపులం బెనుతు నే నగునని కైకొనినయయ్యాఁబోతుపంచితంబు మూర్కొనినను బై గాలి వీచినను గొడ్డునకైనం జూలు నిలుచు నుంగిడి యదురుఁ ద్రిక్క యనువానికి నాపేరు సెప్పినం జాలు మఱియును బసికి వలయు తెఱంగు లెల్ల నెఱుంగుదు వేయొక్కపనికిం గాను గాని యే నీవెంట నీమనసు వచ్చియుం జాలుదు నావలనం బ్రయోజనంబు గొనవలయు నేని నొండుమాటలు దక్కి పసులం బరికింప నియోగింపుము. 286

చ. అనుటయు నట్టకేలకు ధరాధిపుఁ డట్టుల కాక యంచు నా
తనివదనంబు సూచి యుచితంబగు నేని బ్రియంబ యేని ని
ట్లును గురుకార్యవర్తనములం రుచియుంపక యుండు నేని గో
ధనముల కెల్ల రక్షణము దత్పరతం దగఁ జేయు ముఖ్యతన్. 287

క. మున్ను గలగోపవర్గము, నిన్నుం గని కొలిచి భక్తి నీపని సేయన్
మన్ననమూనిసి వై నీ, వున్నం గడు మేలు కాక యొప్పమి గలదే. 288

ద్రౌపది సైరంధ్రీవేషమున సుదేష్ణఁ గొలువ వచ్చుట.

వ. అని పలికి యతనియభిమతంబు సలిపి నిలిపె నట్లయ్యేవురును విరటుం గొల్చి రదనంతరంబ. 289

క. గారవమున నిజదేశా, చారము మై నల్లి యున్నజడ యగుకబరీ
భారంబు విచ్చి శిరమున, సైరంధ్రీజాతివేషసముచితభంగిన్. 290

క. వలపలిదిక్కున కించుక, మలఁగంగాఁ దుఱు మిడి తుఱుము మాపునుఁ బుట్టం
బలవడఁ గట్టి జరఠవల్కలమున నెవ్వాఁగుఁ జన్నుఁగవ గప్పి తగన్. 291

క. పరిచారికాత్వరేఖా, పరిణతి దనమేన నచ్చుపడు భావనకుం
దిర మై తలకొనునంతకు, కరణముతోఁ బురము ద్రుపదకన్యక సొచ్చెన్. 292

వ. ఇట్లు సొచ్చిన. 293

సీ. పఱమొయిల్ గప్పినఁ బాడఱినునుఁగాంతి, గదలినయమృతాంశుకళయుఁ బోలెఁ
బెనుమంచు మీఁదఁ బర్విన వికాసము దప్పి, చెలువు గుందినసరోజనివిధమున
ధూమంబు వొదివినఁ దుఱఁగలిమెఱుఁగులు, వలఁగి మాసినదీపకలికపగిది
ధూళి పైఁ బొరసినఁ దొంగలించుట మాని, లావణ్య మెడలినలతికభంగి

తే. గంధకారికావేషంబుకతన మూర్తి, యుజ్జ్వలత్వంబు మఱుపడియుండఁ బాండు
తనయమహిషి యంచితగతిఁ దనరి రాజ, వీథిఁ బౌరజనంబు లవ్వాలఁదిఁ జూడ

ఉ. రోహిణి యొండె నొండెను నరుంధతి గాక మనుష్యజాతి యే
యీహరిణాక్షి చెల్వమున కయ్యె త్తెఱ మాద్కుల నాఁడికోల కా
దా హితగౌరవం బగు శుభాంగముఁ దేజముఁ జూడ బుద్ధి సం

దేహముఁ బొందుచున్నది స§తీజన మిట్టిదె యొజ్జగంబులన్. 295

వ. అనుచు నంతంతం జేరి. 296

క. నీ పెద్ద లేమిపనికై, సేవలనికిఁ బోవు చునికి § యిది నావుడు న
ద్దేవియు సౌముఖ్యము సం, భావనముం దోఁప నుచిత§థంగిం జెప్పెన్. 297

ఆ. ఏను గట్టువాలు§దాన నా కెవ్వరు, గడుపుకూడు వెట్టి § కట్టఁ జీర
యిచ్చి సాకతమున § నేలుదు రట్టివా,రలకుఁ బనులు సేసి § మెలఁగుబుద్ధి 298

క. వచ్చితి నవ్వుడు విని జను, లచ్చెరువును సందియంబు § నడరెడుమదితో
నిచ్చెలువ కడుపుకూటికి, నిచ్చటనే నిలుచునట్టె § యిది పలు కగునే. 299

వ. అనుచుం గనుంగొనుచు నుసరికొని చను చుండం బాంచాలరాజనందన రాజ
మందిరంబుచక్కటికి నరుగునవసరంబున. 300

క. ముద మొదవ రమ్యహర్మ్యము,తుదినిలువునఁ బ్రణయసఖుల§తోడ విహారా
స్పద మగునెలవున మెలఁగెడు, సుదేష్ణ తజ్జాలకములఁ § జూచెం బ్రీతిన్. 301

వ. ఇత్తెఱంగున మత్స్యరాజమహిషి ద్రౌపదీదేవి నాలోకించి కుతూహలంబున. 302

ఉ. ఎక్కడనుండి యెక్కడకు § నేఁగెడినో యిది యొక్కకాంత రూ
పెక్కుడుపెంపుసొంపు మన § కేర్పడు చున్నది దా వినీత యై
స్రుక్కుచు నీచభామినుల§చొప్పునఁ బల్కెడుఁ బౌరులుం గడుఁ
వెక్కస మంది చూచెదరు § వేగమ తోడ్కొని రండు నెమ్మితోన్. 303

క. అని పలికి పనుపఁ బ్రౌఢాం, గన లిమ్ముగఁ బోయి ద్రుపద§కన్యకతో ని
ట్లనిరి విరాటుమహిషి నినుఁ, దనపాలికిఁ బిలువఁ బంపె § దయ పెంపెసఁగన్.

వ. అనవుడు. 305

క. తనతలచీర యరసి య, వ్వనితారత్నంబు వినయ§వైభవము సతీ
తను వొందినచందంబునఁ, జనియెం గేకయసుతాను§చారికలబడిన్. 306

వ. ఇవ్విధంబునం జని సౌధంబునుపరిభాగం బెక్కి 307

సీ. పదతలంబులకెంపు § పరఁగినతలము కుం, కుమలిప్తమైనచం§దము వహింప
నంగంబునునుఁగాంతి § యడరినగోడలు, వేదులు మణిమయ§విధము నొందఁ
గనుఁగవమెఱుఁగులు § గదిరినముంగలఁ, బుష్పోపహారంబు§పొలుపు దాల్ప
వేనలికప్పు పర్యంకమీఁదు నీలదు,కూలంబుమేల్కట్టు§కొమరు నెఱయఁ

తే. దాను వొచ్చినకతన మ§త్స్యక్షితీశు, నింట నిమ్మెయిఁ గ్రొత్తయొ§ప్పెసక మెసఁగ
నమ్మహాదేవి యున్నెడ § కల్లనల్లఁ, బాండురాజతనూభవ§పత్ని యరిగె. 308

వ. కేకయరాజనందనయును. 309

చ. కనుఁగొని గారవంబును మొ§గంబును గేలుఁ బుర§ప్రసారముం
దనువును నమ్రభావమును § దంతమరీచులు సామినిర్గమం
బును దనలోఁ గడల్కొనఁగ § భూరితరాదరరేఖ నిండు ర

మ్మనవుడు నంత నంత ద్రుపదాత్మజ సేరి వినీతి నిల్చినన్. 310

క. అపాదమస్తకము త, దూపము వీక్షించుచుం గుతూహల మడర
భూపాలమహిషి యిట్లను, నాపొలఁతుకతోడ నుచిత మయ్యెడుభంగిన్. 311

ఆ. ఏది కులము నామ మెయ్యది యెవ్వరి, దాన వేమిపనికిఁ బూని యిప్పు
డెచటు బుద్ధిఁ దలఁచి యేఁగెద వింతయు, నెఱుఁగఁ జెప్పు మాకు మెఱుఁగుఁబోఁడి.

వ. అనిన విని యాజ్ఞసేని యిట్లను నేను సైరంధ్రీజాతిసంభూత నభిధానంబు మాలిని
పురుషపంచకసనాథ నై యుండుదు నొక్కకారణంబున నుద్ధతు లగువిరోధుల
చేతం బతులసన్నిధిం దలవట్టి యీడ్వంబడి వనంబునకరిగి వ్రతంబుమై నల్లభాగహి
తంబుగా నన్యాహారంబులం గాలంబు గడపుచు బ్రహ్మచర్యంబు నడపితి నిట
మీఁద నియమాచరణంబునకు నొక్కసంవత్సరంబు గొఱంత గలదు నీవు ధర్మ
వర్తిని వని వినుటంజేసి నా నేర్చుపనులవెంట నీకడ నిలువం దలంచి యిందు
వచ్చితి ననవుడు సుదేష్ణ యిట్లనియె. 313

క. సురగరుడఖచరవిద్యా, ధరకిన్నరయక్షసిద్ధతరుణులలో నీ
వరయఁగ నొక్కతె వగుదిప్పరికిం జనుదేరఁ గతము బొంకక చెప్పుమా. 314

క. అనుటయు దరహసితము మో, మునకుఁ దొడవుగాఁగ బలుకు ముగ్ధయ యేఁ గృ
ష్ణుని దేవి సత్యభామకుఁ, బని సేయుదుఁ దొల్లి నిదపఁ బాంచాలికడన్. 315

తే. తగవుమైఁ బరిచారికాధర్మములకు, నెల్లఁ జాలి వర్తించితిఁ దల్లి వినుము
నాకుఁ బ్రాణంబు ప్రాణమై నన్నుఁ దన్న, కాఁగ భావించి యా దేవి గారవించు.

వ. నీవును. 317

క. నీచము లయ్యెడుపనులకు, నాచాలమి మెఱిఁగి మన్ననకుఁ బాత్రముగా
నీచిత్తంబునఁ గైకొని, యాచారము దప్పకుండ నరయుము నన్నున్. 318

వ. అని యిట్లు దేవజాతి యనుసందియంబు వాయం బలికి మఱియును. 319

(క) కలపములు గూర్ప బహువిధ, తిలకంబులు వెట్ట వింత తెరువునఁ బలు పు
వ్వులు గట్టి కట్టి మోడ్వఁగఁ, దల ముడువఁగ నరులు గ్రువ్వఁ దద్దయు నేర్తున్.

మ. అనినం గేకయరాజనందన ప్రభాలాశ్చర్య యై యిట్లనుఁ
విను నీరూపము సూచి మాన్నృపతి యుత్విష్టారు నే నెమ్మెయిం
బనిగొందుం దగ నింతులుం దగిలి నీపైఁ జూడ్కి నెక్కొల్పి నె
మ్మనముల్ విస్మయ మందఁ జూచెదరు భామా పల్కు లిం కేటికిన్. 321

క. దుర్భర వగునిమఁ గర్కటి, గర్భము ధరియించునట్లు గైకొని నాకై
నిర్భరవిధ్వంసదశా, విర్భావము దెచ్చికొనుట వెర నై యున్నే. 322

ఆ. అనిన నీతలంచినట్ల కా దేర్పడ, వినుము నాదుపతులు వెరవు లావు
నలఘువిక్రమంబుఁ గలుగుగంధర్వు లే, మఱు నన్ను నొక్కమాత్ర మైన.

. నీచమతి నన్ను నెవ్వఁడు, జూచిన నారాత్రిలోన • జూతురు వెగఁ డా
రాచపలు హరిహరాదులు, గాచిన బలవిక్రమములఖర్వము లైనన్. 324

. బంధురతంబులు శౌర్యము, బాంధవము లై శక్తిసంపదాభీలతమై
సింధురసదృశత నున్నను, గంధులసంధు లెడలించి • చంపుదు రతనిన్. 325

. కావునఁ బురుషులు నాకడం దేఱి చూడను వెఱతు రదియునుం గాక. 326

. నాచిత్తము తాదృశులకు, గోచరమే యస్మదీయకులజన సంశీ
లాచారమహిమ యట్టిది, యే చెప్పకు తద్విధాతిహీనవచనముల్. 327

సీ. మనమున నూఱడిల్లు మనుమానము మానుము నన్ను నేలు మీ
పనులు నుదాత్తనాగరికభంగుల నీమది కెక్కునట్లు నే
ర్పున భయభక్తులుల్ మెఱయ • రూపుగఁ జేసెదఁ దజ్జ్ఞ లైనస
జ్జనులు నుతింప వర్తనము • సాధులు వృద్ధులు మెచ్చఁ జల్పెదన్. 328

ఆ. ననుఁ గుచ్చితంపుఁబనులకుఁ, బనుపక యెంగిలికి లోనుపఱుపక తగుమ
న్ననతోడ నరయువారల, కనురాగము నెఱపి నడతు • రస్మత్పతులున్. 329

ఆ. అనిన సంతసిల్లి • యద్దేవి సైరంధ్రి, నూఱడిల్లఁ బలికి • యునిచికొనియె
నంతిపురము చరిత • కలవడ మెలఁగుచు, నుండె నవ్వధూటి • యును ముదమున.

క. ఇవ్విధమున నయ్యేవురు, నవ్వేలఁదియు సకలజనుల • కజ్ఞాతముగా
నవ్విరటుపోలిఁ బ్రమదము, నివ్వటిల వసించి రుచితనిభృతత్వమునన్. 331

వ. అనిన విని వారలవర్తనం బటమీఁదఁ జెల్లిన తెఱం గెఱింగింపు మని యడిగిన.

ఉ. బాంధవశాత్రవాకలితభావభవా భవపాశబంధసం
బంధవిరామరామ పరిపక్వవివేకనిరూఢభక్తహృ
ద్గ్రంథివిభేదనా పరమకారుణికా పరిమాణదూర దుః
ఖేంధనపావకాయితసమీరణ చైత్తమహాద్భుతప్రభా. 333

క. ఛిన్నమయత్వాదివిరా, మోన్నతివాఙ్మనసదూర • యోగిస్మేరా
భిన్నాభిన్నాకార, చ్ఛన్నాత్మీయప్రకార • జగదాధారా. 334

మాలిని. కమలభవకిరీటగ్రామపద్మావలీసం
గమశుభగపదాబ్జా • గాఢభక్తిప్రకార
ప్రముదితమునివిద్వద్భావనాగమ్యరమ్యా
క్రమపరిణతమూర్తీ • శ్రౌతశాఖాగ్రవర్తీ. 335

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము. 336

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## విరాటపర్వము, ద్వితీయాశ్వాసము.

---



మదపాంగాలోకన
ధామసకృత్సంగరూఢధాతాదృశవిభవో
ద్దామాశ్రితలోకాలో
కామ్యనిర్వారణనిపుణ హరిహరనాథా.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్టియెడ ధర్మతనూజుండు సభా
జనంబులయుల్లంబులు రంజిల్ల రాజునకు వినోదంబులు వివిధోదాత్తప్రకారంబులఁ
జలుపుచు నొక్కొక్కమాటు మధురప్రసంగంబుగా నాడినద్యూతంబున గెలిచిన
విత్తంబులు దమ్ములకొసంగుచుండు వాయునందనుండు వంటకు మిగిలినమాంసం
బు లమ్మునెపంబున నిచ్చలు సహోదరులకు నిచ్చుచుండు విజయుండు సంగీత
ప్రసంగంబున మెచ్చువడసినకనకాంబరాదులు సోదరులకుం జెప్పుచుండు నకు
లుండు దురంగంబులగ్రాసంబులం గనినధనంబులు తోడంబుట్టువులకుఁ బెట్టు
చుండు సహదేవుండు గోవులం జూచి భూవల్లభుండు సంతసిల్లినసమయంబున
సముపార్జితంబు లగుపదార్థంబు లన్నియు నన్నలవశంబు సేయుచు వారలకు
గోరసంబులం దుష్టి సలుపుచుండు ద్రౌపది దన్నరసికొని తిరుగుచున్నవీరులం
గన్నులారం జూచుచు సుచితంబునడవడి మెలంగుచుండు. 2

తే. ఇట్లు దమతమవర్తిల్లునెడల సకల
జనములకు హృదయానురంజన మొనర్చి
తాల్మి పుయిలోట యడఁకువ తగవు మెలపు
నెఱిదెలంగును బాటింప నేర్పు గలిగి. 3

ఉన్నతతఁ బెవిధదేశో, త్పన్నులు నద్భుతవిధాయిబలవిక్రమసం
పన్నులు నగుమల్లులు విభ, వోన్నతుఁ డగువిరటుపాల నుద్భటవృత్తిన్. 4

క. తమలోన మాటలాడెడు, సమయంబున నొక్కరుఁడు విశాలోరస్కుం
డమితబలుఁడు పంచానన, సమమూర్తిస్ఫూర్తి యధికసంరంభమునన్. 5

బోవనిచ్చు మగుడ నేచి పోరఁ జేరు, నెడల సరిసేయ నగుతడ వీక హత్తు.

వ. మఱియు ననేకగతులయోజలు మెఱయుచుఁ గొండొకసేపు విరాటునకు వినోదంబు సలిపి. 16

ఆ. కచ్చ యమరఁ బట్టి కాళ్లను చేతులు, వ్రేల మత్తగజము లీల మెఱయ
ముష్టిబలువు నెఱయ ముక్కున వాతను, నెత్తు రొలుక మల్లు నెత్తి వైచె.

వ. ఇవ్విధంబున విసరి నేలతో వ్రేసి వీఁపున మండి వెట్టిన. 18

క. పెలుకుఱి తాళం బీ మదిఁ, దలఁచి యనువు గాక ధరణితలముఁ గరతలం
బుల నప్పళించె వాఁడ, క్కొలు వార్వఁగ విడిచి మెఱసెఁ గుంతీసుతుఁడున్.

వ. ఇవ్విధంబున మహాబలుపట్టి యాజెట్టి నెట్టన గెల్చిన మత్స్యపతి మెచ్చి తన కిచ్చినధనంబు లచ్చటిజనంబుల కిచ్చి నిజనివాసంబునకుం జనియె మఱియు నిత్తఱంగున నతనికి వేడ్క సలుపుచుండుఁ జిక్కనిమల్లులు లేనితఱి నంతిపురంబు నింతులు సూడ నయ్యవనీకాంతుండు పోరింప శార్దూలశుండాలాదులతోడ నీడంబోక పెనంగి భంగంబునకుం దెచ్చి మెచ్చించుచుండు. 20

క. పెఱవారలు దమమెలఁగెడు, తెఱఁగులు దొరఁకొన్న వింత తెరువుల నేర్పుల్
మెఱయుచుఁ బఱచి త్తము కొన, నొలుపు గలిగి మాన్యవృత్తి నుండుదురు దగన్.

వ. ఇట్లు పాండవులు పాంచాలీసహితంబుగా విరాటునగరంబున వర్తించుచుఁ గతిపయదినంబులు గొఱంతగా నేఁడు కాలంబు గడపినసమయంబున మత్స్యపతి మఱందియు దండనాథుండును గీచకాగ్రజుండును రూపాభిమానియు నానాభరణధరణశీలుండును దుర్విదగ్ధుండును బలగర్వితుండును నగుసింహబలుండు తనయప్ప సుదేష్ణకు మ్రొక్కం జనువాఁడు దేవి కనతిదూరంబున నున్నద్రుపదరాజనందనం గనుంగొని. 22

ఉ. అక్కడ మైనచెల్వమున నాత్మకు వ్రేఁగయి పొల్చుపాల్తిపై
నెక్కొనుచూడ్కిఁ గ్రమ్మఱుపనేరక యూరక నిల్చెఁ గాముచేఁ
జిక్కిన నెమ్మనంబుఁ గడుఁ జేడ్పడు మానముఁ జేష్టితంబులం
దక్కినయంగముం దలఁకు ధైర్యము నై యతఁ డప్పు డయ్యెడన్. 23

తే. ద్రౌపదీరూపమనునురిఁ దగిలి తనదు, హృదయ మనుమృగ మత్తఱి నుదిలకొనుచు
గాముఁ డనుబల్లిదపువేఁటకాని బారిఁ, బడుట కెంతయు నాసింహబలుఁడు దలరి.

వ. నిజాంతర్గతంబున. 25

ఉ. ఎందును నిట్టిరూపు నరు లెవ్వరుఁ గాంచిరె నాక కాదు సం
క్రందనసూతికిం దగిలి కన్గొనఁ జాలదె దీన నిందిరా
నందను నాజ్ఞ మెచ్చి భువనంబులఁ బ్రబ్బదె యిత్తెలోదరిం
జెందఁగఁ గాన్పు గాదె ఫలసిద్ధి పురాతనపుణ్యవృద్ధికిన్. 26

సీ. ఇయ్యింతివ్రాపున నయ్యనంగుఁడు పార్వతీశు నైనను దక్క నేల కున్నె

యిన్నాతిచెలువంబు గన్నశచీప్రియుం, డైనను గనుకలి నవయకున్నె
యిత్తన్వి కెనలేమి కెదిరి పన్నిదము భా, షావిభుతో నైనఁ జలుప రాదె
యిత్తలోదరిజెవిఁ జేతేశున కిందిరా, పతి నైన మెచ్చక పలుకఁ జనదె
కుసుమబాణునిబాణముల్ గూడ నైదు, గరఁగి నేరిమి వాటించి కరువు గట్టి
పోసి చేసి చైతన్యసంపుటము దగ ఘ,టించిరో కాక యిట్టిచేడియలు గలరె.
ఈనెలఁతఁ గన్నమన్మథుఁ, డైనఁ జిగురుగొడుగుఁ బువ్వుటమ్ములపొదులున్
లోనుగ సెజ్జలు సేయం, దా నియమింపండె విరహతాపముపేర్మిన్. 28
అని వెండియు. 29

దీనిజన్మంబునఁ దేజంబు నొందిన, యింతియుఁ బతియును నెవ్వరొక్కొ
దీనినామాకృతిగా నోఁచి పడసిన, యింపగువర్ణంబు లెవ్వియొక్కొ
దీనివల్లభుఁ డనఁగా నిల సొబగుసొం, పెసఁగ వర్తిల్లువాఁ డెవ్వఁడొక్కొ
దీనివసించుటఁ దా నొప్పు పెంపున, నేపారుమందిరం బెద్దియొక్కొ
దీనిఁ బొందఁ గాంచు తెఱఁగు నా కెయ్యది, యొక్కొ యిట్టిపనికి నూఱడిల్లి
తోడుకొనఁగ నిచట నెడగుచుట్టంబుఁ, దడవి యెట్లులొక్కొ వడయువాఁడ.

అని యని యుగ్గడించు ధృతి యుల్లల నాడినఁ దల్లడించుఁ డై
కొనుతలఁ బోరసించు మదిఁ గోర్కులు పేర్చిన నప్పళించు నె
ట్టన తెగ నగ్గలించు నచటన్ జనులం బరికించు బుద్ధి దూ
లిన వెస నెంతయుం గళవళించు మనోజవికారమగ్నుఁ డై. 31

మాసినచందముఁ దనుఁ గని, రోసినడెందంబుఁ గలతెఱుఁగు నెఱుఁగఁడ బి
ట్టసినమదనునిచే ధృతి, వాసిన బెగ డొందు సింహబలుఁ డట్టియెడన్. 32

వెఱవక ననుఁ జూచి పీఁడని యెదఁ గలు, షించిన నొండొండ చెమట వొడమ
ననుచితకృత్యంబు లాచరించువిధాత్రి, బలిమికి నవ్వేళఁ బాటు దోఁప
నిచ్చట దిక్కు లే రెవ్వరు నా కను, భయమున మేనఁ గంపంబు పుట్టఁ
జేయంగ నేమియుపాయంబు లేమి నా, ననమున వెల్లఁదనంబు గదుర
తే. నున్నపాంచాలిఁ గనుఁగొని యన్నరాధ
ముఁడు వివేకవిహీనుఁ డై ముదితుఁ డగుచు
మదనవికృతియ కాఁ దనమదిఁ దలంచి
రాగసాగరపూరనిర్మగ్నుఁ డయ్యె. 33

అయ్యవసరంబున. 34

పొలఁతుక కాంతి యింత వొలి వోవఁగ సీ కెసలారుతార వి
శ్చలతఁ గడంగి క్రోలికొనఁ జాలుటఁ గీచకముఖ్యలోచనం
బులు నయనంప్రధాన మను పూర్వవచస్స్థితి దప్పకుండఁగా
నెలమి సహించెఁ దక్కఁ గలయింద్రియవర్గము ధిక్కరించుచున్. 35

క. అప్పుడుఁ బరిజనములుఁ దనుఁ, దప్పక కనుఁగొనుచు నుండఁ దగ వేఁదికరం
బొప్పనితమకము చిత్తముఁ, గప్పికొనుట నుత్తలంబు గదురఁగ నచ్చోన్. 36

సీ. తన్వంగిమవ్వంపుఁ దనులత నెసఁగెడు, నునుఁగాంతివెల్లువ మునుఁగఁ బాఱఁ
గిసలయహస్తకెంగేల నేపారుక్రొ, మ్మించను లేయెండ మిగులఁ బర్వఁ
గమలాస్యముద్దుమొగంబు లేమెఱుఁగుల, మొత్తంబుపరి చుట్టు ముట్టికొనఁగ
ధవళాక్షితొంగలితఱచుఱెప్పలచెన్ను, కప్పనుచీఁకటి గవియుదేర

తే. బెగ్గలం బంత కంతకు నగ్గలింప, నొదవుచెమటతోఁ జిత్తంబు సెదరి యెందు
మెలఁగఁ దలఁపేది యాసింహబలుఁడనంగు, పట్టియాడెడుజంత్రంబుపగిదినుండె.

కీచకుఁడు సుదేష్ణవలన ద్రౌపదితెఱం గెఱుంగఁ గోరుట.

వ. ఇట్లు కందర్పదర్పగోచరుండై నకీచకుండు నిజసహోదరివలన [illegible] రూపు దెలియం దలంచి దానిదెసం దగిలినదృష్టి యెట్టకేలకుం దిగిచికొని చని యద్దేవికిం బ్రణమిల్లిన. 38

క. కాంచనపీఠము వెట్టఁగఁ, బంచి ప్రియము సూపి ముసుఁగు వడఁ దను సంభా
వించునెడ నాతఁ డప్పుడు, పాంచాలిం జూపి వేగపడి యిట్లనియెన్. 39

ఉ. ఇయ్యరవిందగంధికుల మేమి చరిత్రము చంద మెట్లు పే
రెయ్యది నాథుఁ డెవ్వఁ డిది యెచ్చట నెప్పుడు నుండు నిప్డు దా
నియ్యెడ కేఁగుదేపలయు చేపని సేయఁగఁ బూని దీనిపై
నెయ్యముకల్మి యేకొలఁది నీమది కింతయు నాకుఁ జెప్పుమా. 40

క. అనవుడు నయ్యంగన యితఁ, డనంగశరదళితహృదయుఁ డయ్యె నకట యీ
తనిచిత్తవృత్తి మరలుప, ననురూపం బగునుపాయ మది యెయ్యదియో. 41

వ. అని తలంచుచుఁ గీచకునిమాటలు కీటునం బుచ్చి యొండుపలుకులు జరపిన నతండును సత్త్వహీనుండు గావున సత్వరుండై క్రమ్మఱ ద్రౌపది యున్నయెడకుం జని యాసమీపంబున నిట్టాడుచు నమ్మానవతితో ని ట్లనియె. 42

క. ఇవ్వసుమతి నేపొలఁతుల, కివ్విధమునఁ జెలువు గలదె యెన్నండును నీ
వెవ్వరితనయవు నీపతి, యెవ్వఁడు పే రేమి సెప్పు మిందునిభాస్యా. 43

వ. అనిన నప్పలుకులు వినియు విననిభావించి యప్పాంచాలి నిర్వికారయై యూరకున్న నచ్చపలుండు వెండియు ని ట్లనియె. 44

సీ. తెలిగన్నుఁగవకాంతి పాలు పారనించుక, కను విచ్చి చూచినఁ గాదె యబల
చెలువంపునెమ్మోము వెలమినొం పినుమడి, గా నల్లనవ్వినఁ గాదె యింతి
దంతమౌక్తికరుచి దలకొన మఱుమాట, పలికినఁ గాదె యుత్పలదళాక్షి
యుల్లంబు సరసత దెల్లంబుగా లీలఁ, గైకొన్నఁ గాదె పంకరుహవదన

ఆ. యనుచుఁ జూచుఁ జేరు నమ్ముగ్ధపలుకులు, వినఁగఁ గోరుఁ గేలు దనదు కేలఁ
గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁ డని, జాతురక్తి దెలుప నప్పళించు. 45

వ. ఇట్లు దాన తమకంబున వడిగొనుచు నప్పు డయ్యంగనయింగితం బూహింప
నెరవు మాలి మఱియును. 46

సీ. సుదతి నీమైఁ జక్కఁ జూచుట కోడెదఁ, గనుఁబాటు వొరయునో యని తలంచి
మది నిగిర్చినమాట మగువ నీపెంపునఁ, గుదిసి నానాలుకతుదికి రాదు
పడఁతి నీకరములు పట్టంగఁ దివిరి శం, కించి వడంకెడుఁ గేలు సూడు
నెఱి నిట్టి దని యింతి నీనెమ్మనం బెన్ని, భంగుల నరసినఁ బట్టువడదు
తే. చెలువ యింక నొక్కించుక నీవు నీవ
నాదరంబున నెప్పటియట్ల యున్న
మన్మథుఁడు సమయించిన మగుడ వచ్చుఁ
బడయ వచ్చునె యెన్నియుపాయములను. 47

వ. అని తనయభిలాషంబు తేటపడం బలికిన నప్పోటి కలుషించియు దుర్వారం బైన
పరిభవవికారంబు గోఁప కుండఁ దన్నుం దాన యుపశమించుకొని వీఁడు దురభి
మాని యై యున్నవాఁడు వేగిరపాటు వలను గాదు నెరవుతోడన తప్పించు
కొన వలయు నని తలంచి యతని కిట్లనియె. 48

క. నాయున్న బాము దలఁపవ, యీయొడ లీపేర యిట్టియేవపుఁ జందం
బోయన్న మదనవికృతిం, జేయు ననుట యెంతయును నిషిద్ధము గాదే. 49
తే. చనునె యిమ్మాట లాడ సజ్జనుల కాఁడుఁ,బుట్టువులతోడ నీవును బుట్టినాఁడ
వట్లుఁ గాకయు హీనవంశాభిజాత, నైనపతివత్ని నగు నన్ను నడుగఁ దగునె.
క. అని వీడఁగఁ బల్కిన న, మ్మనుజాధముఁ డంతఁ బోక మదనోన్మాదం
బునఁ దన్ను నెదిరి నెఱుఁగక, వనితకు ని ట్లనియె గారవంపుఁబలుకులన్. 51
సీ. నెత్తమ్మిరేకుల మెత్తఁదనము దెచ్చి, యచ్చునఁ బెట్టిన ట్లుంద మొంది
చక్రవాకంబుల చందంబు గొనివచ్చి, కుప్పలు సేసిన ట్లొప్పు మెఱసి
చందురునునుఁగాంతి కందేర్చి కూర్చి భాగునకుఁ దెచ్చినయట్లు గొమరుమిగిలి
యళికులంబుల కప్పు గలయంతయును బుచ్చి, నాఱు వోసినభంగి నవక మెక్కి
తే. యంఘ్రితలములుఁ గుచములు నాననంబుఁ
గచభరంబును ని ట్లున్నరుచిరమూర్తి
యనుపమానభోగములకు నాస్పదంబు
కాదె యీ త్రిప్ప లేటికిఁ గమలవదన. 52
తే. నీవు దుర్గతి గామికి నీవ సాక్షి, పరసతీసంగమున వచ్చుపాపమునకు
నోరుతును గాని సైరింప నోపఁ బచ్చవిలుతుతూపులతాఁకున కలరుఁబోఁడి.
క. అనునప్పలుకుల కయ్యం,గన కోపము గదిరి నీచు గావున సంకిం
చినఁ గాని మెత్తఁబడి పోఁ, డని మనమునఁ దలఁచి యిట్టు లనియెం బెలుచన్.

ద్రౌపది కీచకునితోఁ బరుషవాక్యంబులు పలుకుట.

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా. 55

తే. అనుడు నతఁ డిట్టు లనియె నాయతులబాహు
బలము చెనయంగ భవదీయపతులు గారు
మూఁడులోకంబులందు నాకెవ్వాఁడు లేఁడు
నిక్కువం బింత నమ్ముము నీరజాక్షి 56

వ. అనిన విని సైరంధ్రి సైరణ దక్కి ధిక్కరించి యి ట్లనియె. 57

క. చనుఁ జన దని చూడక యంగనఁ బ్రాఁకులపంక్తుల గోయఁగ దలఁచుట హితమే
మును చెడిన రావణాదుల, విని యెఱుఁగవె యెన్నఁడును వివేకవిహీనా. 58

తే. ఇవ్విధంబునఁ బలికిన యింతిపలుకు, గాన నేరక తమయప్పకడకు మగుడ
నరిగె నవ్వగ మనమునఁ బెరిగొనంగఁ, జిన్నఁబోయిన మొగముతో సింహబలుఁడు.

క. చని మదనాగ్నిజ్వాలలు, దనుకఁగ నిట్టూర్పుగాడ్పు దండడఁ బొగులం
దను నూరార్పఁగ సఖి వారఁ, గొనమికి వెనుఁబడుచుఁ గీచకుం డాసతితోన్. 60

వ. ఏ నప్పుడు నీకుం జూపి యన్వయనామధేయంబు లడిగిన యప్పొలఁతివలనం
జిక్కి చిత్తం బుత్తలపడుచున్నయది యిట మీఁద నీవ యెఱుంగు దయ్యింతి
యింతసేపు నీచేరువ నుండి యిప్పు డెట మొలఁగె నని యడిగిన విని యతని వేగిర
పాటు చూచి శిరఃకంపంబు సేయుచు సుదేష్ణ నిజాంతర్గతంబున. 61

తే. రాగరసమగ్నుఁ డయ్యె సైరంధ్రిఁ జూచి, యకట దీన నింకేమియుపాయ మగునొ
వలదు తగ దన్న నుడిగెడువాఁడె వీఁడు, మాయదైవమ యే నేమి సేయుదాన.

వ. అయిన నా నేర్చుకొలందిఁ దగిన తెఱంగున వారించి చూచెదం గాక యని యూ
హించి యి ట్లనియె. 63

సీ. లలితంబు లగుమట్టియలచప్పుడింపార, నంచకైవడి నడ నల్లవచ్చి
యెడ మేని నెత్తావి యసుడియంగఁ బయ్యెద, సగము దూలించి పైకొమగుడఁ దగచి
సోలెడు నెలదీఁగె లీలఁ గ్రాలుచు వింత, చెలువంబు దలకొనఁ జేరి నిలిచి
తెలిగన్నుఁగవ నెఱచ్చెలి యైన లేఁతన, వ్వొలయంగ సరసంపుఁబలుకు వలికి

తే. మెఱయు చెయ్యుల రాగంబు మెయికొనంగ
నెడఁద సొగయించుమాటల నెలమి మిగుల
నిన్ను ననురక్తిఁ గొలుచు నన్నెలఁత లుండ
నీరసాకార సైరంధ్రిఁ గోరఁదగునె. 64

వ. అనిన నప్పలుకుల దెస ననాదరంబు సేయుచు నచ్చేడియం జూచి కీచకుం డిట్లనియె.

క. నాకొలువువారకాంత, న్నాకేశుం గొలుచునంగనలలో సైరం

లేకునికి నాకుఁ దెల్లం, బా కొమ్మకు నీడు వోల్ప నయ్యెడు నుదతుల్. 66

సీ. కందుమీలకుఁ బుట్టి కాము బాణములతోఁ, గలసి యాడెడునట్టి కన్నుఁగవయు
బిసకాండములశిక్షఁ బెరిఁగి తీఁగల, మెచ్చక యున్నట్టి మృదుకరములుఁ
జిగురులతోఁ సంధి సేసి యంబుజముల, పై నెత్తి చనునట్టి పదతలములుఁ
గలకంఠములచేతఁ గఱచినవిద్య వీణల కిచ్చునట్టి తియ్యనియెలుంగు

తే. నత్తెఱంగున రేఖయు నవ్విధంబు, గఱువచందంబు నెమ్మెయికలికితనము
నట్టిచెన్నును సైరంధ్రి యంద కాక, కలవె యొరులకు నెఱుఁగక పలికితబల.

వ. కావున నాయెలనాఁగ నేమియుపాయంబుననైన నన్నుం జేర్పవె తేని గందర్ప దర్పంబున నలందురి వందెదు ననిన నవ్వెలంది వెండియు ని ట్లనియె. 68

తే. ఆయురైశ్వర్యకీర్తుల నపహరించు
పరసతీసంగమము ధర్మపథమునందుఁ
బరఁగువారలు పరిహరింపంగఁ గనియు
వినియుఁ దెలియవె యిది దుర్వివేక మగుట. 69

సీ. పతి యెఱింగినఁ దన ప్రాణంబుపై వచ్చు, ననుభయంబున నుల్ల మదరు చుండ
జనులు గాంచినమానుష ముదూలుఁదనకను, పుయిలోటమున మోము పుల్లగిలఁగ
బోటికిఁ దోఁచినఁ బొలియుఁ దేఁకువ యను, వెగడునఁ జెయ్వులు వీడువడఁగ
బంధుల కగపడ్డఁ బాయు నన్వయ మను, కలఁక మైఁ జెమటలు గ్రమ్ము దేరఁ

తే. గ్రీడ సెసఁ గౌతుకం బురియాడ రతుల, చవులు గొనియాడ నేరని జారపొందు
హృదయమున కింపు సేయమి నెఱుక గలుగు, వారు దీనిసుఖంబుగాఁ గోరరెందు.

వ. అదియునుం గాక. 71

క. బలవిక్రమసంపన్నులు, గల రేవురు దానిపతులు గంధర్వులు వా
రలఁ దలఁచిన నాచిత్తము, దలఁకెడు వది యేల నీకుఁ దమ్ముఁడ చెపుమా. 72

తే. కాని తెరువునఁ బోయినఁ గలుగునయ్య, బ్రదుకు చవి యెంతయైన నపథ్యములను
వేడ్క సేయుదురయ్య వివేకు లెవ్వి, ధమున నాబుద్ధి వినవయ్య తమక ముడిగి.

క. అనవుడు నమ్మాటలు దన, మనమునకు సహింప రామి మల్లడిగొనుచున్
మనసిజపరతంత్రత ని, ట్లని పల్కు సుదేష్ణతోడ నతఁడు దుడుకుఁడై. 74

మ. వనితా యే నొకపల్కు పల్కెదఁ జతుర్వారాశిమధ్యంబునన్
ఘనబాహాబల మొప్ప నన్ను నెదురం గా నొక్కఁడున్ లేమి యె
వ్వనికిం దెల్లము గాదె దానిమగలన్ వజ్రాహతిం గూలుశై
లనికాయం బన మద్భుజాసమునలి యిలన్ గీటడంగించెదన్. 75

ఉ. బుద్ధులు సెప్పు టెల్ల నటు పో విడు మెమ్మెయి నైన సౌఖ్యసం
సిద్ధి యొనర్పు నాకు నెడ సేసినఁ బాపము రూపుమాపు నా
వృద్ధియ కోరుదేని నవివేకివి నీ వని నన్ను ని ట్లనం

బద్ధము లైనవాక్యములు పల్కక వే పిలిపింపు కోమలిన్. 76

తే. అనుచు దైన్యంబు నొందెడు నాననంబు, తోడ దిగ్గన లేచి యత్తోయజాక్షి
చరణపీఠంబుకడఁ జక్కఁ జాఁగి మ్రొక్కి, యున్న నద్దేవి గనుఁగొని చిన్నఁబోయి.

ఉ. అవల వచ్చునాపదల కన్నిటి కోర్చి లతాంగిఁ గూర్చి కా
కీనెడమాటలన్ మరలఁ నెన్నివిధంబులఁ జూపి చెప్పినం
గావల మైనవీఁడు దగు కార్యము వట్టునె వీని కిమ్మెయిం
జావు నిజంబు మన్మథునిశాతశరంబుల నైన నక్కటా. 78

క. అని మనమునఁ దలపోయుచుఁ, దనతమ్ముని వల్ల నెత్తి దండడిఁ దోరఁగం
జనుదెంచునశ్రుపూరము, కనుఁగవలో మ్రింగికొనుచుఁ గామిని పలికెన్. 79

ఆ. ఇంత దలర నేల యెమ్మెయి నైనను, గొమ్మ పలవరించి కూర్చు టరుదె
యుమ్మలంబు దక్కి యూఱటతోడ నీ, వేఁగు మసలవలవ దింక నిచట. 80

క. అసవమున కని సీధుని, వాసమునకు దివములో నవశ్యంబును నే
నాసుదతిం బుత్తెంతు ని, జాసక్తి ఫలింపఁ గోఱలు నభిమత కేళిన్. 81

కీచకుండు ద్రౌపదియందలి మోహంబునఁ బరితపించుట.

వ. అనిన విని కీచకుండు ముదితహృదయుం డయి నిజసదనంబునకుం జని వివిధ మధురసంబు లొనరించి సముచితఖాద్యంబులు సమకట్టి తత్ప్రదేశంబు విజనంబు గావించి యొక్కరమ్యస్థలంబున నుండి పాంచాలివలని తగులు చిత్తంబు నుత్తలపఱుపం దలరి నెవ్వగల కగపడి తలపోఁతలకుం జొచ్చి దుర్విదగ్ధుండు గావున సముగ్ధకుం దనసన్నిధిఁ గామవికారంబు వుట్టుట గలుగ భావించుచు. 82

సీ. కేలిమై నొక్కట లీలఁ గ్రొల్లుఱికెడు, వాలుగుసోగల నేలు దొంచి
కరువలిసుడియమిఁ గదలక చెన్నొందు, నెఱవిరితమ్ముల నుఱక తెగడి
బెడఁ గొందఁ దుడిచిమైఁ దొడసినవలరాజు, వాలికతూపులఁ దూలఁ దోలి
పొలపంబు మెఱసి దిక్కులఁ గాంతిపూరించు, క్రొక్కారుమెఱుఁగుల నుక్కడంచి

తే. తనవిలోచనములు నాదుమనము వాఁచి
కొనఁగ నయ్యింతి ననుఁ గనుఁగొనియె నాత్తఁ
గైకొనియె రాగరసమునఁ గడల్కొనియె
మదనవికృతి బయల్పడ నుదిలకొనియె. 83

ఉ. చిత్తము మెచ్చి నావలనఁ జిక్కఁగ వెండియు నాలతాంగి య
చ్చొత్తినయట్లు నాకుఁ దనయుల్లము దెల్లము సేయ కున్కి దా
నత్తఱిఁ గ్రొత్తకా న్పగుట నడ్డము సొచ్చిన సిగ్గుపెంపు న
న్నొత్తల మందఁ జేయుటకునో తలపోసి యెఱుంగ నయ్యెడున్. 84

తే. అనుచుఁ గొందలపడుకోర్కి లగ్గలించి
చిత్తమూర్ఛాడు చుండ నచ్చెలువ చెలువు

దగిలి తనయిచ్చఁ బొలుచిన తత్తరబుద్ధి
నరిగి యిట్లను నక్కీచకాధముండు. 85

సీ. లీల నాముందట నాతేమ వొలసినఁ, జూడ్కికిఁ జబ్బనకచూలి గాదె
తను విచ్చి నన్ను నాతనుమధ్య చూచినఁ, దనువున కమృతసేచనము గాదె
చిఱునవ్వు తెరయ నచ్చెలువ నాతోడఁ బల్కినఁ, జెవులకు రసాయనము గాదె
మెలమి నమ్మెలఁత నన్నలయింపఁ దివిరిన, నెడఁద కానందంబు నిక్క గాదె
తే. యానితంబిని మక్కువ నసఁగి పెనఁగి, యింపు పొంపిరివోవ నన్నేలికొనఁగఁ
దలఁచి పొందిన నది జన్మఫలము గాదె, యనుచు వలరాజుబారికి నగ్గమయ్యె.

వ. మఱియు ననేకభంగుల ననంగవిభ్రమంబుల ననురూపంబులైన బహువిధప్రలాపంబులం బొద్దు గడపుచు నమ్మదిరాక్షి రాక కెదురుచూచుచుండె నక్కడఁ బాంచాలి రావించి సుదేష్ణ కృష్ణ భావించుచు నిట్లనియె. 87

క. ఒదవెడు తృష పెల్లిదమున, వదనము వఱువట్లు వట్టె వాసితరాజ
న్మదిరారస మానఁగ నా, హృదయంబున వేడ్క యెసక మెసఁగెడుఁ దరుణీ. 88

క. కీచకునియింట నెప్పుడు, వాచవి యగు బహువిధంపువారుణి గలుగున్
వే చని యిచటికిఁ గొని రమ్మా చూతము గాని నీగమనవేగంబున్. 89

వ. అనవుడు. 90

ఉ. ఉల్లము దల్లడిల్లఁ దను వుద్గతఘర్మజలంబు దాల్చుచున్
డిల్లపడంగ నాకిది గడిందివిచారము పుట్టె నందుఁ బో
నొల్ల ననంగ రాదచటి కూరక పోవను రాదు నెవ్వ సం
ధిల్లఁగ దీనిఁ బాపికొనుతెప్పస మెట్టిదియొక్కొ దైవమా. 91

వ. అని తలంచుచు డోలాంకోళితమానస యగుచు నమ్మానిని సుదేష్ణ కిట్లనియె.

ఉ. ఉత్పలగంధి నన్నుడుగు మొడ్లను బింపుము కల్లు దేర నే
సత్పథవృత్తి నీకడన సంతతముం బహుమానపాత్రనై
తత్పరతం జరించి యుచితంపుఁ బనుల్ దగఁ జేయఁగాక దు
ష్టత్పరివారయోగ్యపరిచారములైఁ బనుపట్టి దాన నే. 93

క. అతివ తగునమ్మ నీగృహ, మతినిర్మలచరితభరిత మని యీయెడ మ
త్పతులయసన్నిధి నైనను, మతి నూఱడి యున్నచోట మన్నన దప్పన్. 94

ఉ. సాధులు చేరి [1] నెమ్మిగ నిజస్థిరవృత్తము దుష్టకోటిచే
బాధలఁ బొందకుండఁ దమపాల వసించినఁ బెద్దవారు ది
క్కై ధరియించి వారి కొకయాపద పుట్టక యుండఁ గాచుటో
పైపై ధరఁ గీర్తి కెక్కెడి యపాయము సేసిన నింద పుట్టదే. 95

ఆ. ఎవ్వరేనియింటి కెద్దియే నొకటికి, నన్నుఁ బంపఁ దగునె నిన్న నాఁడ
కొలుచునెడ నన్నుఁ గొనవె నీచము లగు, పనుల కేను జాల కునికి సెప్పి.

క. అనిన విని యనుచితంబున, కనయము శంకించియును లతాంగి మదిం ద
న్మునివలవంత దలఁచి యి, ట్లనియెం బాంచాలితోడ సాదరవృత్తిన్. 97
ఉ. అక్కట యేను వేడ్కపడి యానెడునాసవ మర్థిఁ దేరఁగా
నొక్కనిఁ గృష్ణఁ బంచుటకు నోపక చెప్పిన దీని నీవు గో
సెక్కఁగఁ జేసి నిన్ను నతిహీనవిధాననియుక్తఁ జేత గా
నిక్కమ యుమ్మలించి తిది నెయ్యముతియ్యముకల్మియే సఖీ. 98
క. అది లాఁతియిల్లె నినుఁ దమ, హృదయంబుల నెవ్వరేని నెఱుఁగరె యేఁ జె
ప్పుదు నీదుపెంపు నినుఁ గ, న్నది మొదలుగ నెల్లవారి కమ్యైభంగిన్. 99
క. అని మఱియుఁ బెక్కుభంగులఁ, దనుఁ బ్రార్థింపంగ ద్రుపదతనయకుఁ జిత్తం
బున నింకఁ బెద్ద పెనఁగం, జన దీయమతోడ ననువిచారము పుట్టెన్. 100
వ. ఇట్లు దోఁచినతలంపునం జేసి. 101

ద్రౌపది కీచకునింటికిఁ గల్లు దేరం బోవుట.

చ. మన మురియాడు చుండ ననుమానముతోన సుదేష్ణఁ జూచి నీ
వనయముఁ గోరినట్టిపని యర్థిమెయిం జని చేయుదానఁ గా
కనుతనమాట కప్పొలఁతి హర్షముఁ బొందుచు నంది యిచ్చె కాం
చనచషకంబు పుచ్చికొని చారువిలోచన యార్తమూర్తియై. 102
వ. చనుచుండి నీచహృదయుం డగుకీచకుండు దనయెదుర నప్పు డాడినకర్ణశూలంబు
లగుమాటలమీఁదం బిడుగు పడినదానిఁ గొఱవిం జూఁడిన తెఱంగున సుదేష్ణ ద
న్ననుచితవ్యాపారంబునకు నియోగించుటకు నిర్వేదనంబుం బొంది. 103
చ. అలమటఁ బొందు మాయవిధియా యని దైవము దూఱు నిత్తఱిం
గలరొకొ నాకు దిక్కను మొగంబున నశ్రులు వెల్లిగొల్పుఁ దొ
ట్రిలఁబడు జల్లనం జెదరు డెందము గూడఁగఁ దెచ్చి నమ్ముఁ గే
వలమున ముట్ట నెవ్వరికి వచ్చు ననుం గలఁగుచు వెనుంబడున్. 104
వ. అట్టియెడ. 105
సీ. దైన్యంబుతెలపోఁత దలకొన్నఁ జెలువ కా, ననమున వెల్లఁదనంబు గదిరె
భయరసవేగంబు పైకొని ముట్టినఁ, గాంతకుఁ దనులతఁ గంప మడరె
బెగడంత కంతకు మిగిలిన సంతికిఁ, బదముల నటదొట్రుపాటు బెరసెఁ
దల్లడం బొందినఁ దన్వికి నవయవం, బుల నెల్ల ఘర్మాంబుకళిక దెసఁగెఁ
ఆ. దలఁకు పుట్టెఁ గొంకు గోలఁదికి మీఱె వె, న్నాటు దోఁచె ముట్టుపాటు దొడరె
వెఱఁగుపాటు దనికె నెఱ నాడె నొవ్వనె, వ్వగలు వగల నీనె దిగులు వొదివె.
వ. ఇవ్విధంబున ద్రుపదపుత్త్రి దురవస్థం బొందుచు మహాపదలకుం బరిహారణంబు
హరిస్మరణంబ యని తనహృదయపుండరీకంబునం బుండరీకాక్షు నిక్షేపించుకొని
సుదేష్ణమందిరంబు వెలువడి దినకరుం గనుంగొని వినయవినమితోత్తమాంగ

మై నిజాంతర్గతంబున. 107

తే. పాండుపుత్త్రుల కీడు దప్పనిమనంబు, గలుగుదానన యేని నో కమలమిత్త్ర
కీచకుని దెస న వ్వొక కీడు నెఱుపు, వారయి యుండఁగ రక్షింపు కరుణతోడ.

వ. అనుచుఁ గేలు మొగిచిన. 109

క. తరణియు దుఃఖిత యగున, త్తరుణిం గాచుటకు నత్యుదగ్రభుజావి
స్ఫురణాఢ్యు నొక్కరక్కసుఁ, గరుణార్ద్రమనస్కుఁ డగుచు గ్రక్కునఁ బనిచెన్.

వ. వాఁడునుం బని పూని యంబరంబున నదృశ్యాకారుం డై వచ్చి నిలిచె. 111

తే. ఇట్లు ప్రార్థించి పాంచాలి యెట్టకేని, సింహబలుమందిరం బల్లఁ జేర నరిగి
యుల్లఁబోవుచు బెబ్బులి యున్నపొదరు, సొచ్చు లేడిచందంబునఁ జొచ్చుటయును.

ఉ. అంబుజహాక్షి వచ్చుతెరు వారయఁ గీచకముఖ్యుఁ డప్పు డె
ల్లంబుగఁ జూచి యుల్లము కలంకయు వారక మేన వెమ్ము తా
పంబును డిగ్గఁ ద్రావి గసుపాటుచు నుత్కటసంభ్రమంబు హా
ర్దంబుఁ బెనంగొనంగ నతిచంచలభావపరీతమూర్తి యై. 113

క. బిడిముడిపడుచు నెదురుసనఁ, గడఁగుచు హారములు చక్కఁగాఁ ద్రోచుచు మ
ల్లడిగొనుచు దుర్విలాసం, బొడలికిఁ నొడఁగూర్చుచుండ నుగ్మలి యంతన్.

వ. తత్ప్రదేశంబునకుం జని. 115

తే. దేవి తృష పుట్టి వారుణిఁ దేరఁ బనుప, నరుగుదెంచితిఁ బోయింపుఁ డనిన నింతి
నెమ్మొగంబున దృష్టులు నిలిపి తమక, మడర ని ట్లను నాకీచకాధముండు.

క. దేవితృష దీర్పఁ బూనితి, వావెలఁది సహోదరుండ నగునా తృష లీ
లావతి నీమనసునసం, భావన మెయిఁ దీర్ప కునికి పాడియె చెప్పుమా. 117

సీ. కాంతి దళ్కొత్తునీ కడకంటిచూడ్కితోఁ, బొందఁ గానని మేను పొంగుటయును
దీపారు నీపల్కు తెల్లంబుగా వినఁ, గానని వీనులు గంతుటయును
నిం పగు నీ చెయ్వు తెలియమైఁ గొనియాడఁ, గాననికోర్కులు గనలుటయును
సొగయించు నీ కేళిఁ దగిలి యానందంబుఁ, జెందఁ గానని మది గుందుటయును

తే. బాయ నా దగుజన్మంబు ఫలము నొంద, భావజన్ముని పూనికి పార మొంద
నన్ను బంటుగా నేలుము నలినవదన, యింక నీసిగ్గుదెర యోలమేల నీకు. 118

వ. అనవుడు. 119

తే. చెలువ యప్పలుకులు పెడచెవులఁ బెట్టి
ధీర గావున విగతవికార యగుచు
మదిర వోయింపుఁ డద్దేవి యెదురు చూచు
నలుగుఁ దడ వైన మగుడఁ బోవలయు ననిన. 120

చ. మదిర సుదేష్ణ పాలి కొకమాత్రన పుచ్చెద నొడ్లచేత నిం
పొదవెడునట్టిదీనిచవి యుల్లము సొక్కఁగ నాను మీవు నీ

వదనసరోజసౌరభ మనివారణ నన్నును గ్రోల నిమ్ము మె
ట్టిమెయిఁ దగు కామతాపులఁ దొఱఁగింపఁబడ కుండఁగఁ గావు మిత్తఱిన్ 121

క. కరితురగరథసమితిఁ జొం, పిరివోయెడు నాదులక్ష్మి పెంపున కెల్లన్
సరసిరుహవదన నీవ కు, దురుగా నొసరించెదం గుతూహల మెసఁగన్. 122

క. రుచిరమణిభూషణంబులు, నుచితవిహారప్రకారయోగ్యాగార
ప్రచయము సుందరగణికా, నిచయము నొప్పించువాఁడ నీకుం దరుణీ. 123

క. నాకులకాంతల నెల్లను, నీకుం బని సేయఁ బనిచి నెయ్యంబున నే
నీకనుసన్నన మెలఁగెద, నేకార్యం బైన నడపు నీవ తగంగన్. 124

వ. అనుచు సింహబలుండు దనయంతరంగంబున నంత కంత కగ్గలించుతమకంబునఁ దన్నుఁ దా నెఱుంగక పయిం బడి పట్టికొనిన. 125

క. తనుఁ గాచి వెనుక వచ్చిన, దనుజమహాబలము తనమదిఁ దలఁపు వొందిన నా
తనిచే విదిల్చి రభసం, బునఁ దన్మందిరము ద్రుపదపుత్త్రిక వెడలెన్. 126

వ. ఇట్లు ద్రోచి పోయినం గీచకుండు వెనువెంటం దగిలిన నమ్మగువయు మరలిచూచి భయభ్రాంత యై యెవ్వలనికిం బోదునో యని తలంచి దైవయోగంబున విరాటుం డప్పుడు గొలువునికిం జేసి తత్సభాభాగంబుదెసకు వెసం బాఱినం గామాయత్త చిత్తుండును గర్వోన్మత్తుండును గావున జనసమూహంబు సరకు సేయక రహస్య ప్రకాశవిభేదవిచారంబు దక్కి. 127

కీచకుఁడు ద్రౌపదిం బట్టుకొనుటకు వెంటఁ దగులుట.

సీ. సమదవారణము జంగమలత వెనుకొని, సరభసంబునఁ బట్టఁ జనువిధమునఁ
గ్రూరదానవుఁడు భూచారినిర్జరకాంతఁ, బొదువ రయమ్మునఁ బోవుభంగి
ఘోరగృధ్రము సుకుమారనాగాంగనఁ, బటుగతి నొడియంగఁ బాఱుకరణిఁ
బ్రబలబిడాలంబు బాలశారికమీఁద, నడరి సత్వరముగ నరుగుమాడ్కి

తే. సింహబలుఁ డత్యుదగ్రుఁ డై చిగురుఁబోఁడి
వజ్జ గడువడిఁ దగిలి కోపంబు గదుర
నొడిచి తల పట్టి తిగిచి మహోగ్రవృత్తిఁ
గొంకు గొనరించుకయు లేక కూలఁ దాఁచె. 128

వ. అట్టియెడఁ బాంచాలీరక్షకుం డైనరాక్షసుం డతని డొల్ల ద్రోసిన. 129

కీచకుఁడు త్రెళ్ళువడి తన, నీచపుదెస యొరు లెఱుంగ నేరక యుండన్
లేచి వెనుకఁ జని విస్మయ, గోచరుఁ డై యసురకతనఁ గుంఠితుఁ డగుచున్.

వ. ఒదుపు దప్పినమహానాగంబునుం బోలె నిట్టూర్పు నిగుడ నిట్టలం బగుకోపంబు పెల్లున మల్లడిగొను చుండె నయ్యవసరంబున. 131

క. తానును నన్నయు నయ్యా, స్థానమ్మున నుండి పవనతనయుఁ డనవ్యాం

బై సమనోవల్లభయువ, మానము నాసింహబలుని | మదజృంభణమున్ 132

కనుఁగొని కోపవేగమునఁ | గన్నుల నిప్పులు రాల నంగము
ల్దనరఁగ సాంద్రఘర్మసలి | లంబులు గ్రమ్మ నితాంతదంతపీ
డనరటదాస్యరంగవిక | టభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనా ప్రకారభయ | దస్ఫురణాపరిణద్ధమూర్తి యై. 133

నేలయు నింగియుఁ | దాళముల్ గాఁ జేసి, రోఁపున రేఁగి వా | యించి యాడఁ
గులపర్వతంబులు | గూల్చి యొండొంటితోఁ, దాఁకంగ వీఁకమైఁ | దన్ని యాడ
నేదుసాగరములు | నిక్క డక్కడఁ బెట్టి, పలుచనిదొంపి మై | నలఁదికొనఁగ
దిక్కులు నాలుగు | నొక్కచోటికిఁ దెచ్చి, పిసికి పిండలి సేసి | పిడుచగొనఁగ

తే. మిగిలి బ్రహ్మాండభాండంబు | పగుల వ్రేయ
నప్పళించుచుఁ బ్రళయకా | లానలమున
గండరించినరూపంబు | కరణి భీముఁ
డతిభయంకరాకారత | నతిశయిల్లె. 134

వ. ఇట్లు పేర్చినకోపాటోపంబున నవిచారితసమయవర్తనుం డయి వృకోదరుండు కీచకుని గిటడంగింపం జూచి తత్సంబంధబద్ధుండును నాజ్ఞాపరిపాలకుండును గావున మత్స్యపతిఁ దనయలుకలోనివానినకాఁ దలంచుచు వచ్చేరువ నున్నయున్నత వృక్షంబు నిరీక్షించి యావనంబు పల్లటిల్ల ధర్మతనయుం గనుంగొనిన నతండు దననయనాకారంబున వారించి యి ట్లనియె. 135

మ. వలలుం డెక్కడఁ జూచె నొండెడ నసే | వ్యత్వాత్మజముల్ పుట్టవే
ఫలితం బై వరశాఖ లొప్పఁగ ననల్ప | ప్రీతి సంధించుచున్
విలసచ్ఛాయ నుపాశ్రితప్రతతికిన్ | విశ్రాంతి గావింపఁగాఁ
గలయీభూజము వంటకట్టియలకై | ఖండింపఁగా నేటికిన్. 136

తే. అని నిగూఢభాషణముల | నయ్యజాతశత్రుఁ డనిలజుకోపర | సంబుపేర్మి
•చెఱిచె నయ్యన్నదమ్ముల | చేష్టితములు, దెల్లముగ నప్పు సూచుచు | నల్ల లేచి.

సీ. ఎలదీఁగఁ గప్పిన | లలితపరాగంబు, క్రియ మేన మేదినీ | రేణు వొప్పఁ
జంపకంబున నవ | సౌరభం బెసగెడు, కరణి నాసిక వేఁడి | గాడ్పు నిగుడఁ
దోయజదళముల | తుది. మంచు దొరఁగెడు, గతిఁ గన్నుఁగవ న | శ్రుకణము లురుల
నిందుబింబముమీఁది | కందుచందంబునఁ, గురులు నెమ్మొగమున | నెరసి యుండ

తే. సర్వజనవంద్య యైనపాం | చాలి సింహ, బలునిచే నివ్విధంబున | భంగపాటు
దనకు వచ్చిన నెంతయు | దైన్య మొంది, యవ్విరాటునిసభఁ జేర | నరిగి నిలిచి.

ద్రౌపది తనభంగపాటు విరాటునితోఁ జెప్పుట.

ఉ. పంబినకోపముల్ సమయ | భంగభయంబును నగ్గలించి యు

యెప్పుడుఁ దాను బల్కు నెలుఁ గేర్పడ ద్రౌపదితోడ నిట్లనున్. 147

జననాయకుండు నీ సభవారు నీ దగు తెఱఁ గెల్ల నెఱిఁగిరి తెలివ యింక
మానక యీపలు మాటలాడఁగ నేల, చనుము నీవు సుదేష్ణ సదనమునకు
నీపరాభవమునఁ గోపింప నేరరే, గంధర్వులకుఁ దఱి గాదు గాక
మయ మెయ్యదియేనిఁ దమకును నీకును, మును గల్గినట్లైనఁ గినియ రిచట

తే. గాననాథుల దూఱంగఁ గాదు వినుము, సతికిఁ దా నెంత వడియును సభలలోనఁ
దడవుగా నిల్చి యిట్టు లుదగ్రవృత్తి, శంక సెడి ధిక్కరింపంగఁ జనునె చెపుమ.

వ. అని యిట్లు సెప్పిన ధర్మతనయుని పలుకులు విని వెంచియు సైరంధ్రి యచ్చోటు గదలక నిలిచి యెద్దియేనియుం బలుకం దలంచినం జూచి యతండు మఱియు నిట్లనియె. 149

క. పలువోకలఁ బోవుచు విచ్చలవిడి నాట్యంబు సూపు చాద్పున నిచటం
గులసతులకు నవచందము, దొలఁగఁగ నిట్లునికి దగునె తోయజవదనా. 150

వ. అనిన విని పాంచాలి సాభిప్రాయంబుగా నతని కిట్లనియె. 151

ఆ. నాదువల్లభుండు నటుఁ డింత నిక్కంబు, పెద్దవారియట్ల పిన్నవారుఁ
గానఁ బతులవిధము కాక యే శైలూషిఁ, గా ననంగ రాదు కంకభట్ట. 152

వ. అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబు మత్పతి శైలూషుండు గాఁడు కితవుండునుం గావున జూదరియాలికి గలుగునతనం బెక్కుడియది యనుచు నచ్చోటు వాసి తనచిత్తంబున. 153

ఉ. నన్నిటు లాడు రాజ్యసదనంబునకుం జను మన్న జంతకీ
బన్నము లన్నియుం దెలిపి పైఁ బ్రియుడనే యని పోయె నార్తయై
కన్నుల బాష్పపూరములు గ్రమ్మఁగ మోమున దైన్య మొందఁగా
నన్నలినాక్షి తొట్రిలుచు నంగము దూల సుదేష్ణపాలికిన్. 154

తే. చనిన నయ్యేలనాఁగయు సంభ్రమంబు
దెచ్చికొని తా నెఱుంగని తెఱఁగు దాల్చి
శాఠ్యమున నుమ్మలించి పాంచాలితోడ
నెలుఁగు వేఱొక భంగిగా నిట్టు లనియె. 155

సీ. ధరణీపరాగంబు దొరసి ధూసరితమై, చేడియ నీమేను చెన్నుఁ దఱిఁగెఁ
జిత్తంబు తలపోఁత చే వాడుపోవనిన, చెలువ నీనెమ్మోము చిన్నఁబోయెఁ
బ్రస్వేదమునఁ దోఁగి ఫాలంబులో నంటి, యుగ్మలి నీకురు లొప్పు గందెఁ
గన్నీరు వెల్లోడ్డి కాంతి యొంతయుఁ గొన్న, వెలఁది నీకనుఁగవ విన్ననయ్యె

ఆ. నేది కారణముగ నెవ్వ రెచ్చోట నీ, కేమి కీడొనర్చి రెట్టిపాటి
సాహసికులో వారిఁ జంపుదు నొంపుదు, భంగపఱుతు నిదుమ పఱుతుఁ జెఱుతు.

వ. ఇత్తెఱంగు నాకుం జెప్పు మనిన నీ వెఱంగియు నెఱుంగమి భావించిన నింక నె

మని పలుకం గలదాన నైనను విను మని సైరంధ్రి యి ట్లనియె. 157

మ. నను నీ వప్పుడు సూతుమందిరమునకు న్మద్యంబుఁ దెమ్మన్నఁ బో
యిన నాతం డవినీతి సేసినను నే నా యీ కేను మత్స్యావనీ
శునియాస్థానముదిక్కు వే చనిన నచ్చోఁ దీవ్రకోపంబున
న్ననుఁ గూడఁగ ముట్టి పట్టికొని తన్నెం బల్కు లిం కేటికిన్. 158

వ. అని యేర్పడం బలికిన. 159

ఉ. ఖేదము దక్కు మీతఁ గమ కీచకు దండితుఁ జేసి నీకు నా
హ్లాద మొనర్తు నే నని నయంబునఁ గేకయరాజపుత్రి య
త్యాదరవృత్తితో ననునయం బొనరించిన నయ్యసత్యసం
వాదినిఁ బూన్కి పాండుసుతవల్లభ యాలము సేసి యి ట్లనున్. 160

క. నీ వింత యలుగ నేటికి, నావంతయుఁ బౌరజనములకు ఖేదము నా
క్కావంత దిక్కు కుండఁగ, లావంతులు మత్పతులు గలరు పగ దీర్పన్. 161

క. అనిన సుదేష్ణయుఁ దత్పురి, జనములు వెఱఁ బొంది యెన్నిసాంత్వనములు సె
ప్పినఁ దేఱద మజ్జనభో, జనములకుం జొరద ద్రుపదసంభవ యెట్లున్. 162

వ. అట్టియెడ సుదేష్ణ సేయునది లేక నివ్వెఱఁ గంది యుండెఁ దక్కటియంగనలును కీచకునినీచత్వంబు దలంచి వానిచేతన కొడంబడిరి పరిభవానలసంతప్త యైన పాంచాలి నిజశయనస్థానంబునకుం జని తల్పంబుపై మేను వైచి యుపాంగంబులఁ దొరఁగుకన్నీరు చెవులకోలంకులు నిండ నెవ్వగలు నివ్వటిల్లం దలపోయుచుండె.

క. ప్రబలుం డారయ నాసిం, హబలుం డాతని జయింపఁ బవనతనయు బా
హాబలంబ చూడఁ దగు దై, వబలంబును నాతనికి నవశ్యముఁ గలుగన్. 164

ద్రౌపది భీమసేనుతోఁ దనభంగపాటు చెప్పి పరితపించుట.

వ. ఇట్లూహించి రాత్రిసమయం బగుటయు సమస్తజనంబులుఁ గ్రమంబున నిద్రింపం దొడంగినం దాను శయ్యాతలంబు విడిచి మేనిధూళి గడిగి ధౌతపరిధానపరీత యై మహానసగృహంబున సుప్తుం డైనవృకోదరుకడకుం జని. 165

ఉ. నన్నుఁ బరాభవించి సదనంబునకుం జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్ర సేయ నీ
కన్ను మొగుడ్చునాఁటకుఁ గారణ మెయ్యది భీమసేన మీ
యన్న పరాక్రమంబు వలనం దన్నాకో దయ మాలి తక్కటా. 166

వ. అనుచు మందమందసంభాషణంబుల సంబోధించుపాంచాలిపాణిస్పర్శంబున మేలుకని యిది యెవ్వ రనవుడు నే ననునమ్మానిని యెలుం గెఱింగి భీమసేనుండు

యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుఁ బ్రకటించి వాని నిర్జింప నియోగించునది యై యరుగుదెంచెం గావలయు నత్తెఱం గిత్తెఱవ దాన చెప్ప విందు నని తలంచి. ఇంతప్రొద్దుల యిచ్చోటి కేఁగుదేరఁ, గారణం బేమి యెవ్వరుఁ గానకుండ నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి. యనిన నయ్యింతి యిట్లను నతనితోడ.

ఎఱిఁగి యెఱింగ నన్నడుగ నేమిటి కివ్వ డెఱింగి యింతకు
న్నఱచుట గల్గనే నది విశనం బని లే దటు గాక యున్నరూ
పెఱిఁగియు నేన చెప్ప విన నిష్టము గల్గుట చాల లెస్స య
త్తెఱఁ గెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటనుండియున్. 169

అధిపుమఱంది సింహబలుఁ డప్పుడు మొక్కఁగ వచ్చి నన్ను న
త్యధికమనోజరాగమతి యై కనుఁగొంచుఁ గడంగి యెన్నియన్
విధములఁ బల్కి నాకుఁ దన విన్నను వెల్లను జూపి చెప్పి మా
నధనవిహీనతం జెనకినం గడు నేవము పుట్టె యయ్యెడన్. 170

విడియం బలుకఁగ వెండియు, నుడుగక కీచకుఁడు మన్మథోన్మాదము ద
న్నడరిన నన్నడుగుటకుం, దొడరినఁ గోపించి వానితో నిట్లంటిన్. 171

దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసన్ గిట్టి కం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా. 172

అనిన విని వాఁడు గొన్ని ప్రల్లదంబులు వలికిన నేనును దత్కాలోచితవచనంబులం బ్రోచి పుచ్చినం బోయెఁ బదంపడి పాపాత్మ యైన సుదేష్ణ దనకు మదిరారసంబు దేరం గీచకనివాసంబునకు నన్నుం బనిచినం బోవుట కొడంబడక యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి నిర్బంధించినం బెద్ద పెనంగ నోల్లక నామనంబున నన్నివ్వరికి నేమి సేయ వచ్చు నని మీలావు నచ్చి సూతునింటికి సురకుం బోయిన.

గొన్ని వెడమాట లాడుచు, నన్ను నతఁడు చెట్టవట్టినం ద్రోచి వెసం
జన్నె వెనుకొనుటయును మీ, యున్నెడ కే నవుడు సంభ్రమోపేతగతిన్.

పాఱుతెంచిన నక్కులపాంసనుండు, గోప మడరంగ వెనుకన కూడ ముట్టి
సట మెఱుంగుదు నీవు మీయన్న పెద్దతనముఁ జూచితి నేమందు ననిలతనయ.

మీసుభటత్వముల్ బలము మిన్నక పోవఁగ దుస్ససేనుఁ డ
ల్లాసభలోన నన్ బఱిచె నంతియ కాక జయద్రథుండు సం
త్రాసభరంబు లేక యనుచితం బొనరించినఁ జెల్లి పోయె నేఁ
డీసభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్ వగ నాకు వింతయే. 176

అకట యాఁడుకూయు నాలకూయును లాఁతి, వారికైన నరయ వలయు ననిన

ధరుఁడుకరుణోత్తరుఁడుమహీసురసమృద్ధికరుఁడునిజవంశకరుఁడుపకారపరుఁడు.

క. కలిమికి నొప్పగునీగియు, బలిమికిఁ దోడైనయట్టిబలఁగము నై లో
కులచిత్తములకు వ్రేఁగగు, కొలఁదిమనక గొంతిపెద్దకొడుకున కమరున్. 190

సీ. ఎవ్వనివాకిట నిభమదపంకంబు, రాజభూషణరజోరాజి నడఁగు
ఎవ్వనిచారిత్ర మెల్లలోకములకు, నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడుచూడ్కి, మానితసంపద లీను చుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల, కడపటికొండపైఁ గలయఁ బ్రాఁకు
తే. నతఁడు భూరిప్రతాపమహాప్రదీప, దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి, యతఁడు కేవలమర్త్యుఁడే ధర్మసుతుఁడు. 191

ఉ. అట్టిమహాత్ముఁ డొక్కనికి నాశ్రితుఁడై వెడగూడుఁ జీరయుం
బెట్టఁగ నిల్చి వాని మది బ్రీతికి నీడగువృత్తిఁ బేరునుం
బట్టును మాలి యిప్పు డిటు బ్రుంగుడుపాటునఁ బొందఁ జూచి నా
కెట్టు మనంబు పట్టు ధృతి యెమ్మెయిఁ దూలక నిల్వఁ జెప్పుమా. 192

ఉ. నీవలమూఁపులావు మును నేల వహించిననాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల కారయ నూఱటపట్టు గాదె సం
భావన భూజనంబులకుఁ బంధువు గాదె మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకుఁ గాలముచేరువ గాదె పావనీ. 193

తే. బకహిడింబకిమ్మీరుల బాహుబలము, నాజరాసంధునుగ్రదర్పాతిశయము
లోకభీకరములు విజయాకరములు, నైన నీకరములకు లోనయ్యెఁ గాదె. 194

ఆ. అట్టినీవు వంటకట్టియలకు లావు, సూపుచుండ నెవ్వఁడు జూచి చూచి
వగతు నదియుఁ గాక తగ వేది యమ్మత్స్య, మేదినీశ్వరుఁడు వినోదమునకు.

మ. మహిషవ్యాఘ్రగజాదిసత్త్వచయముల్ మల్లవ్రజంబుం గృపా
రహితుండై యెదు రొడ్డుముల్ వరుసం బోరం జూచు నిన్నప్పుడున్
మహనీయం బగునీశరీరము జగన్మాన్యంబు నీచక్రియా
విహితం బైనకుజీవనంబు విధి గావించెం గటా దీనికిన్. 196

వ. అని మఱియు నిట్లనియె వివేకహీనుం డగువిరాటుండు నిన్నుం బోరించునప్పుడు నిజాంతఃపురకాంతలకు వినోదంబు సేయ వారల రావించిన నేనును సుదేష్ణతో నరుగుదెంచి చూచుచుండుదు నయ్యవసరంబున. 197

క. భరమున నీసోలెదునెడఁ, బరమవిషాదంబు నీవు బలిమి నెఱసి యు
ద్ధరవృత్తి జయము గొనినం, బరితోషముఁ బొందు నన్ను భావించి మదిన్. 198

వ. ఊహించి సుదేష్ణయుఁ దత్పరిజనంబులుం దమలోన. 199

క. వలలుని దెస మాలినిచూ, డ్కులు తెఱఁగెడఁ బొందుఁ దెలిపెడుం గంటిరె వీ
రలు వచ్చినసమయంబునఁ, దలఁపఁగ నొక్కటియ యివ్విధం బెట్లొకొ. 200

వ. అనుచుం గలదు లే దని పెక్కువిధంబులం దలపోసి గుజగుజలు వోవు చుండుదు
రట్టియెడ. 201

తే. మఱఁగి నీమంత్రిపైఁ గన్న | మనముఁ దగిలి, యుండ నేమఱియుండియు | క్రొక్కొత్త మాట
దలఁచికొని వారి దెసమది | నిలుపునప్పు, డెఱుఁగ నగువాఁడనా తెఱఁ | గెఱుఁగు లెల్ల.

వ. కావున మదీయపరిభవాతిరేకంబునకు నీవు ద్రేకించినజనంబులు మనల భేదింతురు
నీకుం బోలినభంగి రహస్యభంగంబు గాకుండ వరిభంగంబు సేయు మని వెండియు.

సీ. తోడరినవారు నైన | దోర్బలంబునఁ దన్ను, మిగులంగ నీఁ డను | మేటిమాట
యమరేంద్రునర్ధాస | నమునకు నైన న, ర్హుం డెంతయును నను | రూఢిమాట
జమునిల్లు సొచ్చిన | జంతువు నైనను, గాచు నెమ్మెయి నను | రాచమాట
దనుఁ గోరి యూర్వశి | దాన వచ్చిన నైన, లోలుండు గాఁ డను | మేలిమాట

తే. శౌర్యవైభవప్రాభవ | శౌచములకు, నొరుల కైనఁ గైవార మై | యుల్లసిల్లు
నొక్కరుని కివి యెల్లను | నిక్క మట్టి, యెందుఁ గలుగునె యర్జును | నీడువాఁడు.

క. ఆపార్థుఁడు భరతాన్వయ, దీపకుఁ డమరేంద్రసుతుఁడు | తేజోనిధి వి
ద్యాపారగుండు వినుత, వ్యాపారుం డాపదలకు | నగ్గం బయ్యెన్. 205

చ. అరయ నతండు మానధనుఁ | డక్కట రంగమునందు విల్చి సుం
దరులకు నాట సూపెడువి | ధం బతిదీనము దానిఁ జూచి యేఁ
బురపురఁ బొక్కుదుం గడుపుఁ | బోచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం
జొర నగువాఁడె దేవపతి | సూనుఁడు దైవముచేఁత నూచితే. 206

చ. మగలకు మేటి యైనబల | మర్దననందనుఁ బేడిఁ జేయఁ గాఁ
దగునె విధాత నీకు నని | దైవము దూఱుదు నోర్వ రానినె
వ్వగ దలకొన్న నెంతయును | వందుదు విద్ధురవస్థ యెన్నఁడో
తెగు టని వంతతంబును మ | దిం దలపోయుదు నేమి సేయుదున్. 207

సీ. తనయొప్పిదురఁ గన్న | దగిలి యెవ్వరికైన, మలఁగి క్రమ్మఱఁ జూడ | వలయువాఁడు
తనవర్తనము విన్న | మునిజనంబుల కైన, నలవరించికొనంగ | వలయువాఁడు
తనబంటుతన మాజిఁ | గనిన మార్తుర కైనఁ, బలుమాఱు నగ్గింప | వలయువాఁడు
తనవితరణకేళి | వినినఁ గల్పకతరు, వుల కైనఁ దల యూఁప | వలయువాఁడు

తే. నకులుఁ డొరులకు నశ్వశి | క్షకుఁడుగాఁగ, నగునె యాతనిదుస్స్థితి | యనుదినంబు
గాంచి కన్నీరు డించుచుఁ | గడవ రాని, దైవఘటనకు నొత్తుఁ జి | త్తంబులోన.

శా. ఆరూపం బవికార మాభుజబలం | బత్యంతనిర్గర్వ మా
శూరత్వంబు దయారసానుగత మా | శుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం | బాయీగి సమ్మానవి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్. 209

క. సుకుమారుఁ డతఁడు గోపా, లకవృత్తి వహించి యడవులం గ్రుమ్మరు చు
న్నికి నాక కాదు పగవా, రికి నైనను నకట మన ముకరియుదే వగలన్. 210

ఉ. ఏనును మీరుఁ గానలకు నేఁగు నెడన్ ననుఁ జేరి యెంతయున్
దీనత నొంది కుంతి సహదేవుని నిల్లడ వెట్టి నాకు న
మ్మా నిను నమ్మి చాల విషమం బగువిపినవాస మీతఁడుం
బూనఁగ నియ్యకొంటి నని బోరన నశ్రులు గ్రమ్ము చుండఁగన్ 211

వ. మఱియును. 212

చ. కడుఁబసిబిడ్డ వీఁ డొకటి గా దవు నా కెఱుఁగండు ముందర
య్యెడ నొకపాటుఁ గాంచఁ డెద యెంతయుఁ గోమల మెప్పు డైన నేఁ
గుడువఁగఁ బిల్వఁ గాని తనకుం గలయాఁకటిప్రొద్దెఱుంగఁ డీ
కొడు కిటు వోకకున్ మనము గుందెడు వీర గని యూఱడిల్లెదున్. 213

తే. ఎప్పు డెవ్వెడ నేమిట నెట్టు లరయ, వలసె నమ్మెయి నారయు మలసి డస్సి
నొచ్చి యైనను నేమఱ కిచ్చఁ దలఁచి, తడమి నాచేత దీవన వడయు మమ్మ.

వ. అని యప్పగించె నేనును వనవాసకాలంబున నానేర్చువిధంబున మీకు నెల్లను
గారా మైనతమ్ముని నమ్మెయిం బరికించికొని వచ్చితి నిపు డజ్ఞాతవాసాయాసితుం
డగునతని నాకు ననుసరింప నెరవు గామిం జేసి చేయునది లేక చింతిల్లు చున్న
దాన నా తెఱంగు వినుము. 215

సీ. ద్రుపదభూవిభుఁడు పుత్రులకంటె నెంతయుఁ, బెంపు సేయుచు గారవింపఁ బెరిఁగి
కుంతీమహాదేవి కోడండ్రలోపల, నగ్గలంబునఁ గొనియాడఁ బరఁగి
ప్రాణంబులకు నెల్లఁ బ్రాణంబుగా మీరు, నెయ్యంబు తియ్యంబు నెఱప నడచి
[illegible]దండ్రులమాఱుగాఁ గొని జను, లనిశంబు భక్తి సేయంగ నెగడి
[illegible]ంబుల రూఢి కెక్క, నట్టికొడుకులఁ గని భరతాన్వయంబు
[illegible] యిల్లుగా నతిశయిల్లి, తగవు మై బాంధవులచేతఁ బొగడువడసి.
[illegible] రాజసూయమునఁ బృథ్వీదేవతాకోటి కె
[illegible] యొనర్చి వారిదయఁ గల్యాణాత్మ నై పుణ్యవ
[illegible]తులకోడ లనఁగా రాజన్యమాన్యప్రియాం
గనల [illegible] గంటి నతిలోకకం బైనమీమన్ననన్. 217

ఉ. ఏను మ[illegible] యిప్పుడు నీచతరప్రచారముం
బూని నికృష్ట[illegible]నై తగ వేది యెంతయున్
దీనతఁ బొంది యిమ్మెయి సుదేష్ణపనుల్ గనుసన్నఁ జేయుచున్
హీనత నున్కి మీకు వగ పేమియుఁ జేయుద యేమి సేయుదున్. 218

క. పని పంపఁ గాని యొకతకుఁ, బని సేయ నెఱుంగ నన్నుఁ బనిగొను నెడఁ బొం
దుసియ గ్రమహింపి గొంకుచుఁ, బని గఱపెడుచందమునన పనుచు నెఱుఁగవే

ఉ. ఒల్లరు రాజదేవులును । నొద్దులు రాచినచందనంబు మే
నెల్లఁ జెమర్పఁగా వలయు । కేను శ్రమంపడి నిల్చి నిల్చి య
ల్లల్లన మార్దవం బొనరు । నట్లుగ నెట్టకునేని రాచి మీ
తల్లికి భక్తిఁ బెట్టెదువి । ధంబునఁ బెట్టుదు బ్రహ్మఁ దిట్టుదున్. 220

ఉ. నున్నఁదనంబుగా నలుఁగు । నూఱియుఁ జందన మట్లు రాచియుం
బన్నుగఁ గ్రొత్తలైనకల । పంబులు గూర్చియు నాసుదేష్ణకుం
గన్నులసన్నలం బనులు । గైకొని వారక చేయుచుండుట
మ్మున్నటు లున్నపాణితల । ముల్ బలుగాయలు గాచెఁ జూచితే. 221

క. అనుచుం దొరఁగెడునశ్రుల, మునిఁగినమో మతనివక్ష । మునఁ జేర్చిన న
వ్వనితయవస్థయ తాల్పదు, ననిలసుతుం డడలె డెంద । మలమటఁ బొందన్.

తే. అట్టియెడఁ దన్నుఁ దాన యూ । రార్చికొనుచు
నంబుజానన నెమ్మొగ । మల్లఁ దుడిచి
యనునయించి తత్కరములు । దనమొగంబుఁ
గదియఁ జేర్చుచు నిట్టూర్పు । గాడ్పు నిగుడ. 223

వ. చింతాక్రాంతుం డైనకౌంతేయునకు నయ్యింతి యి ట్లనియె. 224

తే. ఇందఱకు నిన్నిభంగుల । నిడుమ గుడువ, వలసె ధర్మతనూభవు । వలనఁ జేసి
దాయ లొడ్డినమాయజూ । దంపుటురులఁ, బడి కులంబున కాఁడి । ప్పాటు దెచ్చె

ఉ. అక్కట మోసపోయి యడి । యాసలఁ జావక యున్నదాన ము
న్నొక్కెడ నే దురంతదురి । తోత్కటబాధలఁ బెట్టి యున్న నా
కెక్కడి దుఃఖశాంతి గడ । యెద్దుట యెమ్మెయిఁ గల్ల నేర్చు మీ
ముక్కున నూర్పు గల్ల నొక । మూర్ఖునిచేఁ బడితిన్ సభాస్థలిన్. 226

క. మీ రేమి సేయుదురు పై, వారంభము గాక శుభము । నశుభంబును సం
సారులఁ దనతనతఱి నని, వారఁగఁ బొందంగ నూన్ప । వచ్చునె వాసన్ 227

ఉ. కావున మీర లభ్యుదయ । గౌరవ మొందుట యాత్మఁ గోరి యే
నేవిధ మైన నాపదల । కెల్లను నోర్చెద దాని కేమి యీ
కావర మైనకీచకుఁడు । కామపిపాసితుఁ డై యలంతులం
బోవక యేచి పట్టుకొన । బోయినఁ దాలెదఁ గాక యెమ్మెయిన్. 228

తే. వానిఁ దెగఁజూడ వైతేని । వాయుపుత్ర, నీవు గనుఁగొన నురి నైన । నీర నైన
నగ్ని నైన విషంబున । నైన నేను, మేను దొఱఁగుదు నిట్టి నీ । దాన నుమ్ము.

వ. అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు ని ట్లనియె. 230

చ. జలజదళాక్షి కీచకునిఁ । జంపుట కిమ్మెయి ముట్టఁ బల్కఁగా
వలయునె యేను జూడ నని । వారణ నిన్నుఁ బరాభవించి వాఁ
డిల మన నింక నాంధ్రకును । నెవ్వరు భంగము సేఁగఁ జాలువా

రలఘుమదీయబాహుబల | మప్పుడ చూపనితప్పు సాలదే. 231

తే. ఎల్లి యెల్లవిధంబుల | నెందుఁ జొచ్చె, నేని నాధర్మతనయుండు | తాన వచ్చి
యడ్డపడెనేని నీవ పెం | పారు కరుణఁ, గాచి తేని నాచేఁ బడుఁ | గీచకుండు. 232

వ. వానిదెసం జింత యావంత వలవ దమ్మాటలు విడువు మని యూఱడిల్లం బలికి దుర్దశల నలందురు నవ్వాలందికుం దు వాపం దలంచి యిట్లనియె. 233

సీ. చ్యవనునివాంఛకు | సంయాతినందన, యిడుమలఁ గుడువదె | యడవిలోన
రాఘవుతోడ న | రణ్యవాసము సేసి, సంతాప మందదె | జనకతనయ
కుంభసంభవునకై | ఘోరదుర్గములలో, సాముద్ర యలజడి | పాలు గాదె
నలుని బాసి యుండఁ గా | నల కేఁగి దమయంతి, మనుజులు వడనియు | మ్మలిక వడదె

తే. వారు సైరణ సేసి దు | ర్వారమైన, నిరతిశయదుఃఖభారంబు | నిస్తరించి
సౌఖ్య మొందరె నీవు నా | చందమునను, నాపదల గోర్చి సంపద | లనుభవింపు.

వ. దుర్యోధనదుశ్శాసనకర్ణశకునిసైంధవప్రముఖం బగుదుష్టలోకంబు నధోలోకంబున కనుచునంతకు మదీయాంతరంగంబు చింతాభరభగ్నంబును నవమానపంకమగ్నంబును గోపోద్విగ్నంబును నై వేగిరపడుచున్నయది ధార్తరాష్ట్రులకుం గాలావసానం బైనయట్లు సమయకాలావసానం బయ్యె నజ్ఞాతవాసంబునకుం జొచ్చి పదునొకొండు నెలలు సని పండ్రెండవ నెల వర్తిల్లుచున్నది దీనికొ అంత దీఱిన నీదువంతయుం దీఱు నూఱడిల్లియుండుము సింహబలుండు నిన్నుఁ బరిభవించి మైమైతోన యునికిం జేసి యెల్లియుం జెనక వచ్చు నీవుం గ్రమంబున నొడంబడుట భావించికొని వానికి నర్తనశాల సంకేతప్రదేశంబుగాఁ జెప్పి యొంటిమెయిం జనుదేర నియమింపుము వాఁడు వచ్చిన నా సాబగు నిం దెగఁ జూచి నీకుం జూపి నీచిత్తంబు వడసెద నిత్తెఱంగు దప్ప నొండువిధంబు గర్జంబు గాదిదియ నిశ్చయం బట్ల చేయువార మిమ్మాటలవలనం దప్పవు గాని వేగుచున్నయది జనులు మేలుకాంచి మనలం గాంచిరేని వంచన బయలువడినం గార్యంబు దప్పుఁ గీచకవధంబునకుం జూపిననామనోరథంబు దుదిముట్ట వలయు నిజశయనస్థానంబునకుం బొమ్మని శయ్యాతలంబు విడిచి యత్తన్విం దతిమి కొన్నియడుగు లనిచి మరలి మారుతాత్మజుండు కలుషితాత్ముం డగుచు సెజ్జకు వచ్చె నచ్చెలువయుం దననిద్రించు నెడకుం బోయి పర్యంకభాగంబునం దనువు వైచి యంకిలి దేలని డెందంబునఁ గొంతలంబుతోడినిశ్చయంబున నిద్రం బొరయనికనుదోయి మొగిడ్చి యుండె నంత.

ప్రభాతకాలవర్ణనము.

తే. ద్రుపదనందన పరిభవ | దుఃఖమునకు, నుల్లమున దురపిల్లుచు | నున్న నరసి
వేఁడినిట్టూరుపో యన | వెడలెఁ గ్రొత్త, తావి మాతులు విచ్చు నె | త్తమ్మివిరుల.

క. విచ్చెం దిమిరము గాఁపులు, వచ్చె మధుపకులము లబ్జ | వనముల కురులం
జొచ్చె విరులు తరులతికల, నిచ్చె రథాంగములు వంత | యెల్లఁ దొలఁగకున్.

సీ. నీరజాకరములు నిష్ఠమైఁ జేసిన, భవ్యతపంబునఫల మనంగ
దివసముఖాభినందితచక్రయుగ్మకం, బులయనురాగంపుఁబోవి వనంగ
హరిహరబ్రహ్మమహానుభావంబు లో, కోటి గాఁగఁ గరఁగినగుటిక యనఁగ
నతులవేదత్రయలలితకాచయము పెను, పొందఁ బుట్టెడుమూలకంద మనఁగ
తే. నఖిలజగముల కన్నైది యగుచు జనస, మాజకరపుటహృదయసరోజములకు
ముకుళనంబును జృంభణంబును నొనర్చి, భానుబింబంబు పూర్వాద్రిపై వెలింగె.
వ. ఇట్లు సూర్యోదయ మగుటయు సమయసముచితకరణీయంబులు వేగిరంబ నడపి
వేగిరపాటుతో సింగారంబు సేసికొని సింహబలుండు. 242

క. తనమదిఁ గదిరినతమకం, బునఁ జిడిముడి పడుచు ద్రుపదపుత్త్రికపై నగా
నినవేడ్క దిగువ నొకటియుఁ, గనుఁగొన విన లేక మదనకంపితుఁ డగుచున్.
వ. అతిత్వరితంబ సూదేష్ణమందిరంబున కరుగుచు నంతరంగంబున. 244
ఉ. చయ్యన నేఁగి యంబుజవిశాలవిలోచనఁ గాంచి ప్రీతిమై
నయ్యెడ నేకతంబ హృదయం బలరం దగఁ బల్కి యొక్కమై
నియ్యకొనంగఁ జేసి మెలయించెద నిక్కముఁ దార్చి నేర్పునన్
శయ్యకుఁ దెచ్చెదం గుసుమసాయకుపూనికి నేఁడ తీర్చెదన్. 245
క. అని యువ్విళూరుచు వెసఁ, జని కేకయరాజపుత్త్రిసదనంబున న
య్యనిమిషచారువిలోచన, యనురూపవిధాననిరత యై యుండంగన్. 246
చ. కనుఁగొని యప్డు గ్రొత్త యగుకౌతుకవృత్తి మునింగి పల్లటి
ల్లినధృతితోఁ గ్రమం బరయ లేనిమనంబు చలింప నచ్చటన్
జను తెడ యాట గాంచు నెఱి సాలక గ్రక్కున నింతిఁ జేరఁగాఁ
జనిమె విధాతృలుబ్ధకవశంబునఁ బోవుమృగంబుచాడ్పునన్. 247
క. చనుటయు ద్రౌపది యతనిం, గనియుం గానివిధంబు గైకొని చిత్తం
బున బెదరక తనముందటి, పని వెరవున నుండె భీముపలుకులయూఁతన్. 248
వ. అట్టియెడ. 249
సీ. ఎవ్వరితో నైన నెలుఁగెత్తి యొక్కింత, పని లేనివెంగలిపలుకు వలుకు
మట్టియ లొండొంటి బిట్టు దాఁకఁగ నేల, నందంద మునిగాళ్ల నప్పళించుఁ
గడు వికారంబుగా నోడ తెల్ల విఱుచుచు, మలఁగి రిత్తకురిత్త సెలఁగి నవ్వుఁ
దాళంబుగాఁ గరతలమునఁ బెలుచఁ గం, బంబు వ్రేయుచు వెడపాట వాడు.
తే. మలయు నంతంతఁ జేరువఁ బొలయు నింతి, దన్నుఁ జూడమి కెంతయుఁ దల్లడిల్లు
నిక్కడక్కడఁ బడుఁ దగు లినుమడింపఁ, జూచు నత్తన్విఁ బోరిఁబోరిఁ గీచకుండు.
వ. ఇట్లు బహుప్రకారంబు లగుదుర్విలాసంబులు సేయుచు నద్దురాత్ముండు ద్రుపద
నందన దాయం బోయి. 251
ఉ. భాగ్యము గాదె నీచరణపద్మము లెప్పుడుఁ జేరి కొల్వఁగా

యోగ్యత గల్గెనేని నను § నొక్కని నొల్లవొ కామసౌఖ్యవై
రాగ్యము నీమనంబునఁ దిరంబొ నిజం బెఱుఁగంగఁ జెప్పు సౌ
భాగ్యము గుందునే మగలపై నొకయించుక చూడ్కి నిల్పినన్. 252

ఉ. అలము నేసి నాతగుల § మాటడిఁ బుచ్చుఁగ నేల బేల న
న్నేలి యనంతభోగముల § నిచ్చ మెయిన్ విహరింపు నిత్యల
క్ష్మీలలితాలవాల మగుజీవన మంతయు నీమొగంబ కాఁ
బాలన సేయు మిప్పరముభామిను లెల్లను నిన్నుఁ గొల్వఁగన్. 253

ఉ. రాజుల నెల్ల నుగ్రసమరంబుల వ్రేల్మిడి నోర్చి పేర్చి యీ
భూజనకోటి నా దగువిభుత్వసమగ్రత నాదరించి వి
భ్రాజితరాజ్యతంత్రములు § పాలనసేయుదు నేన నీటికిన్
రా జనఁగా నెపం బిడి విరాటునకుం దగఁ గూడు వెట్టుదున్ 254

వ. కావున. 255

క. నీ వొకత వేల యిలఁ బడి, వేవుర నే వలచి పట్ట § వెదకిన నడ్డం
బై వచ్చి వలదు నా నిం, దే వాఁడు మగండు దీని § నెఱుఁగవ కంటే. 256

చ. విరటుఁడు సూచు చుండ నిను § వేవురముందట నట్లు ద్రోవ నొ
క్కరుఁడును గాదు గూడ దనఁగల్గెనె పోటరు లైనభర్త లే
వురు గల రంటి వారియలవుం జలముం గడగంటి నింక నె
వ్వరు గల రెట్లు దప్పె దనివారణఁ బట్టెద నెందుఁ జొచ్చినన్. 257

వ. అనిన నవ్వెలంది వీఁడు దమకించి యున్నవాఁడు నాయంత్రించుమాటలకు మున్న
కదియంబడినఁ గర్జంబు దప్పు నని విచారించి. 258

తే. బహువిధంబుల నమ్మెయిఁ § బలుకునతని
వలుకు లేర్పడ విని మెత్తఁబడినయట్లు
సుభగ మెయివడిచూపుగాఁ § జూచి తనదు
హృదయ మెఱిఁగించు తెఱఁగున § నిట్టు లనియె. 259

చ. వల దని యెంత సెప్పినను § వావిరి నై కడువేగపాటుమైఁ
బలుమఱు నెల్లెడం దొడరఁ § బాటెదు నీహృదయంబునట్ల కాఁ
దలఁవు మనోజతూపులకుఁ § దక్కటిచిత్తములుం గడంగి వి
చ్చలవిడి సేఁత గర్జమె విచారము గోర్కికిఁ గానివావియే. 260

క. మగ లడఁకువ నుండక తమ, తగులము పాటింతు రట్టితగులం బైనన్
మగువల మెడలన యడఁగుం, దగవు విడిచి యడిచిపడరు § ధైర్యము పేర్మిన్.

ఆ. ఇట్టు లగుట యెఱిఁగి § యెల్లభంగుల రహస్యంబు గోలుపోనియట్లు గాఁగ
నడరునీదుకోర్కి § కనురూప మెట్టిది, యట్టిభోగభంగి § ననుభవింపు. 262

చ. అనవుడుఁ గీచకుండు హృదయంబునఁ బొంగి లతాంగితోడ ని

ట్లను ధృతిఁ గోలుపుచ్చెఁ గుసు।మాయుధుఁ డేటివిచార మిట్టు లేఁ
ప నగు నదైన నీ దలఁపు న।పం పెదఁ గైకొని చేయువాఁడ నే
యనువున నెప్పు డెయ్యెడ ని।జాభిమతం బొడఁగూర్తు చెప్పుమా. 263

క. అని పలికినఁ బాంచాలియుఁ, దనయురులం గీచకుండు । దగులుట భావం
బున నిశ్చయించి యిట్లను, ననురాగాయత్తచిత్తు । డైనదివోలెన్. 264

ఉ. ఉత్తర లోనుగాఁ గలప।యోజముఖుల్ పగ లెల్లఁ బ్రీతితో
నృత్తముఁ జేసి పోవ మహ।నీయరహస్యవిధిజ్ఞ నిశీథినీ
వృత్తము గోరువారలకు । వేడ్కకుఁ బట్టగు చుండు నాగృహం
బుత్తమ మిత్తెఱంగునకు । నొంటిమెయిం దగ నీవు వచ్చినన్. 265

క. అనిన నతఁడు వికసిల్లుచు, నను నమ్మెయి నేలికొనిన । నలినానన నీ
యనుమతి సేయనె యొక్కఁడఁ, జనుదెంచెద నేఁటిరాత్రి । సమ్మదలీలన్. 266

తే. ఇదియ నిశ్చయ మిమ్మాట । వదలనుండు, మనిన నీవొక్కరుండవ।యరుగుదేర
వలయు లేకున్న నయ్యెడ । నిలుచుదానఁ, గానుజూ నిక్కవం బని । పూనిపలికి.

క. మన మియ్యెడఁ । బెద్దయుఁ బ్రొ, ద్దనుమానము లేక మాట । లాడుట దగ దీ
వును బో[illegible]మ్మేనును నా దగు, పని సేసెద ననియెఁ గమల। పత్రేక్షణయున్. 268

చ. సమయము నిర్ణయింప విని । చంద్రనిభాననపల్కు లప్డు చి
త్తమునకు నింపు పెంపఁగ ము।దంబునఁ గీచకముఖ్యుఁ డాత్మగే
హమునకుఁ బోయె నమ్ముదిత । యచ్చట వెండియుఁ బ్రస్తుతక్రియా
సముచితవర్తనంబుఁ దగఁ । జల్పి మహానసశాలలోనికిన్. 269

ద్రౌపది భీమునితోఁ గీచకుఁడు నర్తనశాలకు రాఁబోవుటం జెప్పుట.

క. చని వెడ వికసిల్లెదునా, ననపద్మముతోడ ననిల।నందనునకు ని
ట్లనియెఁ జతురోక్తిరీతి య, తనిగూఢక్రోధవహ్ని । దరికొల్పంగన్. 270

క. నాకొఱఁత దీర్చి వచ్చితి, నీకొఱఁతయ యింక సూతు।నిం దెగఁ జూడన్
లోకము వంచింపను దగు, చీఁకటిరే యొదవ నేమి । సేసెదొ చెప్పుమా. 271

వ. అనిన విని దరహాసితవదనుం డగుచు వృకోదరుం డి ట్లనియె. 272

క. నన్నడుగ నేల నీవును, నన్నిచుఁడు నేమిమాట । లాడితి రది నా
కున్నట్టు లెఱుఁగఁ జెప్పుము, నిన్నే మెచ్చించువాఁడ । నీరజవదనా. 273

వ. అనినఁ బాంచాలి సుదేష్ణమందిరంబునం దానుచితాచరణంబున నునికియు సింహబలుండు సింగారించుకొని వచ్చుటయు రేయింటిమాటలవలనం దాను బెదరమియు వాఁడు సామదానభేదదండంబులు సూపి పలుకుటయు దానికి మెయికోలు భావించికొని క్రమంబునం దగినసంభాషణంబు సేసి నాట్యమండపంబు సంకేతస్థలంబుగాఁ జెప్పి యొక్కరుండ వచ్చువాఁ[illegible]

నద్దురాత్ముండు ప్రముదితాత్ముం డగుచు రాత్రిసమయంబున నయ్యెడకు నొంటి
మెయిం జనుదెంచువాఁ డై చనుటయుఁ దెలియం జెప్పిన నతండు పరమా
హ్లాదంబునం బొందె. 274

శా. క్రోధం బప్రతికార మై హృదయముం గుందింప నత్యంతచిం
తాధూతాత్ముఁడ నైన నాకుఁ బరమోత్సాహంబు సంధిల్ల దు
ష్సాధం బైన విరుద్ధకార్య మిటు లాసన్నంబుగా సంఘటిం
చె ధర్మాత్మజుఁ డాత్మ మెచ్చఁ బగ సాధింపంగఁ గా న్వల్పమే. 275

వ. అని పలికి కొండొక విచారించి. 276

క. వెఱవక సంకేతించిన, తెఱఁగున నయ్యెడకు నరుగుదెంచునొకో కొం
కఱఁ జెప్పునొకో వెసఁ గై, యుఱిమునఁ దలిప్రుప్పునొకొ రహస్యం బెల్లన్.

ఉ. అట్టిద యేలు చేయు నవమానము నయ్యెం బొడఁగానఁ గల్గి ని
న్నిట్టి తెఱంగు సేయు మని యేర్పడఁ జెప్పిన వాని కత్తఱిం
బుట్టినసంతసంబున ననూహ్యం బతికించితి కాదె యింక ని
ట్టట్టనఁ జెట్టు లైన హృదయంబున నెక్కుడిశంక వానికిన్. 278

ఉ. వచ్చు మదాంధవృత్తి ననివారణ నొక్కఁడు నాట్యశాలకుం
జొచ్చు నవశ్యముం దెదకి చూచి ననుం గని యుప్ప సంగరం
బిచ్చు మదీయబాహుబలహీనబలుం డయి నీకుఁ బ్రీతిగాఁ
జచ్చు ననంశయం బిది విచారము లిన్నియు నింక నేటికిన్. 279

వ. అని నిశ్చయించి వృకోదరుండు వెండియు నిట్లనియె. 280

మ. బలియుం డాపాపగుండు భావభవదర్పభ్రాంతుఁ డై వచ్చి ని
శ్చలసర్వాంగత నున్న నన్నరసి యేకచందంబు గా కున్న నా
కులతం బొందెడు నప్పు మండపము సంక్షోభింపఁగా నేతుఁ గ
ట్టలుకం బెబ్బులి గోల వేసినటు లుగ్రాకార మేపారఁగన్. 281

క. ఎఱిఁగి పిలుసనిన వెసఁ బై, కుఱుకుదు సాళువము గాకిఁ గొనఁ డిసినభంగిన్,
వెఱచఱవం బొదువుదుఁ బఱి, పఱిసేయుదు నీదుపూన్కి కెపారం బెయిదన్.

ఆ. నాదుబాహుబలముకెనకు మాఱుకొనఁ జాలు, భుజబలంబు గలిగి కెపోక చిక్కఁ
బెనఁగి నన్నుఁ గొంతకెగినియింప నోపెదు, చంద మైన వినుము కొ సరసిజాక్షి.

మ. అవనీచక్రము సంచలింపఁగ దివం బల్లాడ నాశాచయం
బవఘాతంబుగ గోత్రశైలనికరం బాకంపముం బొంద న
ర్ణవముల్ ఘూర్ణన మొందఁ గ్రోధము కృతార్థత్వంబు నొందించి చి
త్రవధప్రౌఢి వహించి సూతునకు రౌద్రం బేర్పడం జూపెదన్. 284

వ. అనినం బాంచాలి సంచలితస్వాంత యై నిజాంతర్గతంబున నవనితీవ్రక్రోధంబు
గుప్తసాధనంబునకు బాధకం బగు నని బోధింపం దలంచి యిట్లనియె. 285

ఉ. ఎవ్వనివారు నవ్వ మహిమోదధి ధర్మసుతుండు దీనికి౯
నెవ్వగఁ బొంద భూజనులు నింద యొనర్పఁగ నే నొనర్చితి౯
చివ్వకు నిప్పు నల్కమెయిఁ జేసినయాపని గూఢవృత్తికి౯
దవ్వగు నేని యియ్యభిమతం బొడఁగూడియు నిష్ఫలం బగున్. 286

క. కావున వంచనఁ బొంగార, పోవక యుండంగ మనసిజుపుం బరిమార్పం
గా వచ్చునేని నట్టిద, నావల పటు గాక తక్కఁజనను వలదు సుమీ. 287

వ. అనిన విని ద్రుపదనందనకుం బాండునందనుం డిట్లనియె. 288

చ. మదమునఁ గీచకాగ్రజుఁడు మార్కొని నిల్చిన వీఁక నైనయుం
గదిసితిమేని నప్పుడు ప్రకాశరహస్యవిభేదబుద్ధి నా
కొదవును నైన నేఁ దలఁచి యోపినభంగి నిగూఢవృత్తి నైఁ
బదిలము గల్గి తిన్ననియుపాయమునం బెగఁ జూతు నాతనిన్. 289

క. అనవుడు జయలక్ష్మిం జే, కొను మని దీవించి యింతికుం గేకయనం
దన పన్నుఁ దడవుఁ దడయం, జన దియ్యెడ ననిలతాంగి సనియెం బ్రీతిన్.

వ. సూతసుతుండును గృతనిశ్చయుం డై యుండె నట కీచకుండు గందర్ప
దర్పగోచరుం డై పరిజనంబుల వంచించి యేకాంతస్థలంబున. 291

కీచకుఁడు ద్రౌపదియందలి మోహంబునఁ బరితాపంబు నొందుట.

సీ. వామాక్షిరుచిరలావణ్యంబు భావించుఁ, దన్వంగిరూపు చిత్తమున నిలుపుఁ
గంబుకంధర చెన్ను గై వడి దలపోయు, నంగనసౌకుమార్యము దలంచు
భామినిసహజవిభ్రమ మెదఁ గీలించుఁ, బడఁతిచెయ్వులు మదిఁ బట్టుకొలుపు
నాతినిగరువంపుమాటపొం దూహించు, దళితాబ్జముఖితిన్నఁదనము మెచ్చు

తే. నట్టి కోర్కులు చిట్టుముట్టాడ వెడఁగు, వడినయుల్లంబు పట్టునఁ బట్టువడఁ దనకు
వశముగాకున్న నంతయు వంతఁ బొందుఁ, జింతయును గంబు వడిగొనిఁ జిక్కువఱుప.

చ. తలరు నలందురుగ౯ నవయుఁ దాపభరంబున వెచ్చ నూర్చు మే
నలయఁగ నొల్లఁబోవు వెగడందుఁ గలంగుఁ బరిభ్రమించుఁ గొం
దలపడుఁ దల్లడం బడరి ధైర్యము దూలిన వెగ్గడిల్లు వి
చ్చలవిడిఁ బేర్చు నవ్వగల సందడి దంటము గంది చేడ్పడున్. 293

వ. ఇవ్విధంబున మదనకదనదోధూయమానమానసుం డగుచు ని ట్లని వితర్కించు.

సీ. పడఁతి నన్నొల్లఁడ బలికినభంగిన, నిచ్చమై నిక్కు ని వచ్చునొక్కొ
వచ్చి తొల్లిటియట్ల వడిఁ ద్రోచి పోవక, పొలఁతి యింపెసలారఁ బొందునొక్కొ
తలపోఁత గలిగి యక్కోమలిఁ దవ్వచ్చుటకు నొం, డొకవింత పుట్టకయుండునొక్కొ
గంధర్వు లేవురు గల రని చెప్పన, న్నెలఁతుకమాటలు నిక్కమొక్కొ

తే. తెఱవచిడిముడిపాటు సురదేష్ణ యెఱిఁగి

వేడ్కఁ బని వంచు టుడిగి రా విడుచునొక్కొ
మనసుఁ జింతిక నొజ్జ యై మతకములను
సవను నెఱిఁగించి నాకడ కనుచునొక్కొ. 295

ఉ. నిక్కము పొత్తె నప్పు డొక నేరిమియై ననుఁ ద్రోచి పుచ్చఁగా
నక్కమలాక్షి పొందు దగ నాఁడు తొడిన్ నిజ మేది నేఁటిరే
యిక్కువ రాక లెక్కన సహించున నన్ మరుఁ డట్టు లైన నా
కెక్కడిప్రాణ మేటితను వెయ్యది నిల్కడ యేమి సేయుదున్. 296

క. అ ట్లల రాక తమ్ముం, గట్టఁడిమే యాలలోంగి గాపుగ మరు నన్
బెట్టి యచట చూనిక మన, సెట్టు నిలుచుఁ దగవు విడువ నెట్టులు సేర్చున్. 297

ఉ. దానికి నేటినిక్కము వృథా పరితాపము దక్కి బాసయై
పూనికి డగ్గఁద్రావి వెసఁ బోయెద నిప్పుడ పోయి ముట్టి యు
ద్యానముఁ బట్టి తెచ్చి హృదయం బలరంగ ససంగతంత్రవి
ద్యానిపుణత్వ మేర్పడ విచేదం బ్రమదాంబుధి నోలలార్చెదన్. 298

ఆ. అనుచు సంచలించు నడియూసఁ గ్రమ్మఱ, బాసఁ దలఁచి ధృతికిఁ బట్టుపెట్టు
మరుని కోపటించి యుడియాడుఁ దుమ్ముట్టఁ, గాన నిశ్చయించుఁ గలఁగుఁ జేటు.

వ. మఱియు నక్కోమలివలని ప్రేముడిం దగిలి. 300

సీ. పాదనూపిన యైన వడిఁ బట్ట సమకట్టి, పరికించి కానక బమ్మరించు
మెలఁగినయది యైనఁ బలికింపఁ దలఁచి ని, రూపించి లేమి నగ్రస్త్రులు వహించుఁ
గదిసినయది యైనఁ గౌఁగిలింపఁ గడంగి, యారసి బొం కైన నలఁత నొందు
నొడఁబడ్డయది యైన నదరి పైకొనఁ జూచి, చెన్నఁటి యగుట గని చేష్టఁ బొరయు

తే. లలితవివిధవిహారంబులకు లతాంగి, యెలసి పొలసినయది యైన నెలమిఁ గలసి
యభిమతక్రీడ సలుపంగ నప్పళించి, వెదకి రిత్తబయల్ గని విహ్వలించు.

కీచకుఁ డుద్యానవనంబున విహరించుట.

వ. ఇట్లు బహుప్రకారంబు లగుమన్మథవికారంబున కగపడి వెగ డంది యామంద
సంతాపభరితాంతఃకరణుం డగుచు సింహబలుండు పరిచారికాప్రార్థనం జేసి మజ్జన
భోజనంబు లొకభంగి నడిపినవాఁడై తదనంతరంబ మనోవేదనాపనోదనార్థంబు
మందిరారామభూమికిం జని తత్ప్రదేశంబున. 302

చ. కమలవనంబుపొంత నునుగా డ్పొకయించుక యాదరించుఁ జై
త్రమునకు దానఁ దల్లడము దన్కులయుం జని గారవంపుఁ జూ
తముకడ నిల్చి నిల్చి యది తాపముఁ బెంచిన పేఁతలీవజా
పముఁ బొరఁబొఱు నందలఁతఁ పైకొనినన్ వెడలన్ వెనుంబడున్. 303

ఆ. నుడియుగాలిఁ బుప్పొడిఁ బొడిఁ దన్నుఁ గప్పనో, యనుచు వెగ్గలించు నగ్గలముగఁ
గురియు తేనియలకుఁ గొంకు లతాగృహం, తరుసమీపములకు నరిగ యరిగి.

వ. ఇత్తెఱంగున నొక్కయెడ నయినను గాలూఁదక లీలోద్యానంబు గలయం గ్రుమ్మరుచు. 305

సీ. ఇంపైన ప్రియ కాన నిచ్చి విల్చినమధు, వాదట నానుమత్తాలివిభుని
జెట్టుపల్ పచరించి చుట్టుఁ గ్రుమ్మరి మనో, రమ నియ్యకొలుపుమరాళవిభుని
ఫలరసమొండొంటికి కెలమిఁ బంచులనిచ్చు, మెయిన చొక్కెడుశుకమిథునములను
గమిఁ బాసి తలిరుజొంపమునకు మెయి మెయిఁ, దాఁకంగఁ జనుపికదంపతులను

తే. చూచి చూచి యుల్లంబున నేచి కోర్కు
లడరఁ జిడిముడిపడు మాఱినుకపడు వెడంగు
పడు వెనుంబడుఁ దల్లడపడు దురంత
చింతవారికి నగపడు సింహబలుఁడు. 306

వ. ఇట్లివలవంత నిక్కడక్కడ వడిఁ దిరిగి తిరిగి. 307

క. వగ ముట్టికొన్నఁ జిత్తము, వెగడొందఁగ మేను గలయ వెమ్మఁగ ధృతిపోఁ
దగల నొకతీవయింటికిఁ, దగి యుండెడుచంద్రకాంతతల్పము సేరెన్. 308

క. అందొరఁగి కీచకుం డా యిందువరనయన నాత్మ నిడి వేడ్కమెయిన్
డెందము చని విచ్చలవిడిఁ, గందర్పుఁడు వెట్టిఁ జేయఁగా నిట్లనియెన్. 309

సీ. కెంగేలు గేలితోఁ గీలించి నెయ్యంపు, మాటలఁ దగుమఱుమాట లార్తుఁ
గుచము లురంబునఁ గుదియించి క్రమమున, నిఱిసినకౌఁగిట నింపొనర్తు
నంగుళంబుల నల్ల నలకలు గబళించి, కెమ్మోవి యాని యొక్కింతఁ గాయు
మనము మనంబునఁ బెనఁచి కేళికిఁ జొచ్చి, సతిఁ దేల్తు సౌఖ్యరసంపు[illegible]

తే. దనివు మొదలైనఁ జిగురొత్తుతమకమునకుఁ
బ్రాఁకు వెట్టుచు మగుడఁ బైఁ బడుచు నింతి
వింతభంగుల కెలయించి వెకలిఁ జేసి
యభిమతక్రీడనములకు నలవరింతు. 310

వ. అనుచు వెండియు నిగుడుమనోరథంబులను భావరతంబుల శిశిరోపచారంబులఁ
బ్రొద్దు గడపి కడ గానక. 311

క. మాయరవి యేల క్రుంకఁడొకో యను నిట్టల తడసెనో యనుఁ గ్రుంకం
బోయెడుఁ జూ యిప్పుడ యను, దాయ పఱిచె నను మనోజతాపము పెర్గన్.

ఆ. దివము కాని యింక భువనంబునం దిట, వట్టి రాత్రి లేనియట్లు గాఁగఁ
జేసె నొక్కొ విధి విశేషించి నాకకా, నేఁడు దివము సాఁగి నిలిచెనొక్కొ

తే. అనుచుఁ గ్రుంకింప రానిప్రొద్దరసి యరసి, శిశిరపర్యంకమున మేనుఁ జేర్చి చేర్చి
వంతఁ దలపోసి తలపోసి వనరి వనరి, మిగుల వందురి వందురి పొగిలి పొగిలి.

సీ. తనికెడునారటంబున నంత కంతకు, వెమ్ముచు నునికికి విడుమరయును
గొలుమసంగెడుగోర్కులవెను వెంటఁ, బొఱలుచు నునికికి నూఱటయును

వావిరిఁ బొదివెడునగలసందడిఁ బడి, యొరయుచు నునికికి నుడుకువయును
నందంద కదిరెడుకొందలపాటుచేఁ, దలఁకుచు నునికికి నలుకడయును

ఆ. లేమిఁ దాల్మి గొనఁగ లేక యలందురి, తనువు నింద్రియములు మనసముధ్ధృతియుఁ
దనవశంబు గాక తల్లడపడి సింహ, బలుఁడు విషమబాణుబారిఁ బాఱె. 315

క. ఇమ్మెయిని నధికపరితా, పమ్మునఁ బడుసూతుహృదయపద్మం బలరం
దమ్మికొలంకులు మొగుడ వ, నమ్ములు సోలంగ దివసనాథుఁడు గ్రుంకెన్. 316

వ. తదనంతరంబ. 317

సూర్యాస్తమయవర్ణనము.

క. ఇనుఁడు దనకడకు నేతెం, చినరాగముఁ బొందు టది యుచిత మనఁగాఁ గెం
పున మెఱసి పశ్చిమాశాం, గన జనసంభావనముల గౌరవ మందెన్. 318

ఉ. చుక్కలు తోడుతోడఁ దలచూపఁ దొడంగె మనోభవుండు వి
ల్లెక్కిడె చక్రవాకములయిక్కలు రోయఁగఁ జొచ్చె నేల కెం
పెక్కుచు వచ్చె దీవియలయెత్తెఱ పోయఁగమందె సందడుల్
దక్కెఁ బురంబువీథుల మదం బొలసెన్ విటచిత్తవృత్తులన్. 319

వ. పదంపడి జారచోరులమనంబు లలరం జంద్రాస్తమయం బగుటయు. 320

క. పెనుమిత్తిరి పల్లం బిటి, యన కుండఁగ నోలమును బయలు నొక్కటిగాఁ
గనువిచ్చుటయును మోడ్చుట, యును సరిగాఁ దమము పర్వె నుర్విం దోడ్తోన్

వ. అప్పు డాకృశోదరి వృకోదరుకడకుం జని సమయం బయ్యె ననవుడు. 322

తే. అతఁడు పెండ్లికిఁ బిలిచినయట్లు వికచ, హృదయుఁడై తలచీర యాయితము సేసి
ద్రుపదనందనఁ జూచి నాతోన వెనుక, నల్ల నంతంత నరుగుదెమ్మని కడంగి.

చ. గమనము పేక వేఱొకవికారము పుట్టక సంగరోత్సవో
ద్యమరభసాతిరేకము బయల్పడు టించుక లేక రోషసం
భ్రమ మొకయింతయైనఁ బరభావనిరూప్యము గాక ద్రౌపదీ
రమణుఁడు వోయి విక్రమధురంధరతం దగ నాట్యశాలకున్. 324

వ. చని వివేకరహితుహృదయంబునుంబోలెఁ దమోదూషితంబును విదగ్ధవనితా
ప్రేమంబునుంబోలె దుర్నిరూపంబును ఘోరాటవీభాగంబునుబోలె నిర్మను
ష్యంబును గాపురుషలక్ష్మీవిలాసంబునుంబోలె ననుపభోగ్యంబును ననభ్యస్త
శాస్త్రంబునుంబోలె దుర్గమంబును స్వప్నలబ్ధపదార్థంబునుంబోలె నదృష్టిగోచ
రంబును విషమకావ్యంబునుంబోలె నస్పష్టాలంకారంబును బాలిశరాజ్యంబునుం
బోలె జారచోరహృద్యంబును నైనయానర్తనాగారంబుముఖభాగస్థలంబు సేరి.

క. కెలఁకులుఁ బిఱిందిదెసయుం, గలయం బరికించి తనయఖండితబాహా
బలగర్వము యచ్చట ముం, గలిగా మదమత్తభద్రగజసదృశగతిన్. 326

శా. శాంతాకారితకుడ్యకుట్టిమఘనసంభావలీరూపముం

భ్రాంతాది ప్రవిభాగబోధరహితప్రాగ్ద్వారముం గాతర
స్వాంతత్రాసకరంబు నై దురభివేశం బై నయాలోను ని
శ్చింతుం డై సతి కేలు వట్టికొని చొచ్చెన్ భీముఁ డత్యుగ్రతన్. 327

వ. ఇట్లు సొచ్చి తెఱియం జని మధ్యప్రదేశంబున విరాటనందనలీలాపర్యంకం బరసి
కని దాని కనతిదూరంబునం బాంచాలి నోసరిల నునిచి తా నాతల్పంబున నుండె
నంతం గీచకుండు. 328

క. కై సేసి మదవికారో,ల్లాసంబున మేను పొంగ లఘుగతి నుత్కం
ఠాసవపానవిఘూర్ణ,వ్యాసంగతరంగితాంతరంగుం డగుచున్. 329

శా. సింగం బున్నగుహాని కేతముసకున్ శీఘ్రంబునన్ వచ్చుమా
తంగంబుం బురుడించుచుం బవనపుత్రస్వీకృతం బైనయా
రంగాగారము సేర వచ్చి మదిలో రాగంబు ఘూర్ణిల్ల నిం
తిం గాముం డిట తేఁజె యింతె కని యుద్వ్యక్తాంగజోన్మాదుఁ డై 330

ఉ. స్వాంతము బాహుగర్వఘనసంతమసాంధము గాఁగ శంక యొ
క్కంతయు లేక కీచకుఁ డహంకృతి ముంగలి గాఁగ మండపా
భ్యంతరభూమిఁ జొచ్చి తెఱియం జని యారసి సెజ్జ గాంచి య
త్యంతముదావహం బగుడు నందు రయంబునఁ గేలు సాఁచినన్. 331

చ. ఘనతరకోపవేగమునఁ గంపము నొందునిజాంగకంబులం
దనధృతి పెంపుసొంపు చలితంబులఁ జేయ సమీరసూతి నం
దనుఁడు తదీయచేష్టలును దద్వచనంబులఁ జొప్ప నెప్పడం
గనుమతి నూర కుండె నవికారనిగూఢనిజప్రకారుఁ డై. 332

ఆ. కీచకాధముండు కిమ్మీరవైరిపైఁ, గేలు సాఁచి యాలితాలనయన
గాఁ దలంచి మేను గరుపాఱ నిట్లను, మదనఘూర్ణమానహృదయుఁ డగుచు.

చ. వనిత మనోహరంబు లగువస్తువు లెల్లను వేడ్కఁ నేఁడు ని
కని నియమించి తెచ్చితిఁ బ్రియంబునఁ గైకొను మెప్పు నంగనా
జనములు నన్నుఁ జూచి మరుసాయకముల్ దమచిత్తవృత్తు లే
చినఁ గొని వచ్చి యిత్తురు విశిష్టధనంబులు నాకు లంచముల్. 334

సీ. నాదురూపంబు మనసునఁ జిక్కిన, తరుణి దక్కొరు నేల పసరకు సేయు
నాదులావణ్యంబునకు నిచ్చ మెచ్చిన, యెలనాఁగ పైఁబడ కేల నిలుచు
నావిలాసంబులు భావింపఁ బడసిన, యింతి పుష్పాస్త్రుచే నెట్లు బ్రదుకు
నావివేకమున కానందింపఁ గనినయం, గన మెట్లు నిలువునఁ గ్రాఁగ కుండు

తే. మఱియు నాయాడుమాటలు తెఱవ పిండు,నుల్లములకు నింపారెడునరులుగా వె
యిట్లు నీ వొక్కతవె నన్ను నేలుకొంటి,గాక మాట లిం కేటికిఁ గమలవదన.

క. అనవుడు మనమున నిప్పీ, యని యుచితనిగూఢభంగు లగుభాషణముల్

దనప్రియ వినిపించుట కిట్లనియె మృదురీతి భీముఁ । డాతనితోడన్. 336

తే. ఇట్టివాఁడవు గావున । నీవు నన్నుఁ, బొగడికొనఁ దగు నకట నా । పొల్కయాఁడు
దాని వెదకియు నెయ్యెడ । నైన నీకుఁ, బడయ వచ్చునె యెఱుఁగక । పలికి తిట్లు.

క. నాయొడలు సేర్చినప్పుడ, నీయొడ లెట్లగునొ దాని । నీ వెఱిఁగెదు త
న్నేయబలలతోడిది గాఁ, జేయఁ దలంచితివి తప్పు । సేసితి గంటే. 338

క. నను ముట్టి నీవు వెండియు, వనితలసంగతికిఁ బోవు । వాఁడవె యైనం
దను వేఁ బడసినఫలమే, కనియెద విదె చిత్రభవవి । కారము లెల్లన్. 339

మ. అనుచున్ గ్రక్కున లేచి రోషకలితం । బాహాస మాసూతుని
మ్మన ముద్వేగముఁ బొందఁ జేయ బలసా । మగ్రీసముజ్జృంభణం
బున వానిం దల పట్టి వంచుటయు నే । పుం జేవయుం దోఁప వాఁ
డనుమానింపక బెట్టిదల్చికొని కో । పాటోప దీప్తాంగుఁ డై. 340

భీమసేనుఁడు గీచకుని సంహరించుట.

వ. గంధర్వుం డనుతలంపున. 341

చ. పవనతనూజుబాహువులు । పాణియుగంబునఁ బట్టి వీఁకమై
నవనిపయిం బడం దిగిచి । యంగము జానుల నూఁదినం గడున్
జవమున దండతాడితభు । జంగముభంగి సముత్థితాంగుఁ డై
యవయవముల్ ప్రకోపరభ । సాతిశయంబునఁ బొంగ నుద్ధతిన్. 342

మ. మగుడం గీచకుఁ బట్టె వాఁడును బలో । న్మాదంబునన్ బాహుగ
ర్వగరిష్ఠుం డగునాహిడింబరిపుఁ దీ । వ్రక్రోధుఁ డై పట్టి బె
ట్టుగఁ ద్రోపాడఁగ నిద్దఱున్ భుజబలా । టోపంబుమై నొండొరున్
మిగులం జాలక కొంతసేపు వడి మే । [illegible]ఁ బోరి రుగ్రాకృతిన్. 343

వ. అట్టియెడ. 344

క. తనయుగపాటొరు లెఱుఁగుదు, రని సూతుఁడు సముచు థంగ । మగుటకు భీముం
డును గొంకుచుఁ జప్పుడు సే, యనిగూఢవిమర్దసప్ర । హారములఁ దగన్. 345

వ. మల్లయుద్ధనైపుణ్యంబు మెఱయం గడంగి. 346

సీ. తిరిచిన నడుగులు । దెరలక యుండొరుఁ, గ్రమ్మఱఁ దిగుమచుఁ । గడిమి మెఱయఁ
బొడిచిన పెస బీఱు । వోవక యుండొరు, నందంద పొడుచుచు । ననిఁ బెట్టి
యొత్తిన బెగ్గలం । బొందక యుండొరు, బలువిడి నొత్తుచు । నలవు మిగిలి
యడఁగంగఁ బొదివిన । నడిచిపాటించుక, యును లేక పీఁక నొం । డొరుల నడరి.

తే. యడఁగఁ బొదువుచు నలుక యం । తంత కగ్గ
లించి యాయముల్ నొంచి దో । ర్గ్రీల నెఱపి
యుల్లసిల్లిన సుక్కు । కొండొరులు రౌద్ర
[illegible] 34[illegible]

క. కదియుచుఁ బాయుచుఁ బట్టుచు, నుదలుచుచుం బడుచు లేచుచుఁ జుదుగుచు వడిగొం
చొరవెదుకినుకం గదుబె, ట్టిదముగఁ బెనఁగిరి చలంబు డింపక కడిమిన్. 348

ఆ. ఇవ్విధమున నేచి యిరువురుఁ బెద్దయుఁ, బ్రొద్దు పోర వాయుపుత్త్రుబలము
దోడుతోడఁ బెరుఁగఁ దొడఁగె నాకీచకా, ధమునిలావు పిదపఁ దఱుఁగఁ జొచ్చె.

ఉ. దాని నెఱింగి యెంతయు నుదగ్రత నాబకవైరి గ్రక్కునన్
వాని నడంగఁ బట్టి పడ వైచి మహోగ్రత నాక్రమించెఁ బం
చానన మేణముం బొదువునట్లతఁ డూర్జితశక్తి నుద్భటుం
డై నెగసెన్ సమీరసుతుఁ డల్కకుఁ బ్రాఁకిడినట్లు వీఁకతోన్. 350

క. నెగయు నెడ సగ్గమైనను, బిగి యారుచుఁ బిఱుఁదు సనినఁ బిడికిట గొఱసం
ది గదు బెడిదముగఁ బొడిచెం, బగతుఁడు గను మిడిసి నేలఁబడి తన్నికొనన్.

ఆ. పల్లవప్రసూనఫలభరితం బగు, మ్రాను గూలఁ ద్రోచుమత్తగజము
పోల్కి వివిధరత్నభూషణభూషితుం, డైనసూతుఁ గూల్చె ననిలసుతుఁడు. 352

చ. వికృతపుఁజావు సంపదుది వేడుక పుట్టినఁ గిట్టి పట్టి మ
స్తకమును బీనదీర్ఘభుజశాఖలుఁ బొదయుఁగంబు మేనిలో
నికిఁ జొర నుగ్గుగాఁ దుఱిమి నించిన గ్రంతలతిత్తియైనకీ
చకు ధరణీస్థలిం జదిపి చక్కనిముద్దగఁ జేసెఁ దుష్టుఁడై. 353

క. తనకడిమికలిమి నచ్చియు, మనమునఁ దలఁ కడర సూతుమరణంబు గనుం
గొనుటకుఁ దల్లడపడు స్త్రీయ, వనిత కతనిచావు సెప్పి వడిఁ దన్మాత్రన్. 354

చ. అనలము గూఢయత్నమున నయ్యెడకుం గొని వచ్చి దానిఁ జ
య్యన వెలుఁగొందఁ జేయుటయు నచ్చెరువున్ భయమున్ బ్రియంబునుం
బెనఁగొనఁగా గనుంగొనియె భీతమృగేక్షణ భీము డాయఁగాఁ
జని కడుసక్కఁదం బయినచందమునం బడి యున్నవీనుఁగున్. 355

ఉ. చూచుచుఁ జేరి ప్రేల్లిదుచుచుం దల యూఁచి విలక్షచిత్తయై
యా చపలాక్షి ముక్కుపయి నంగుళిసుం గదియించి దీనికై
కీచక యింత సేసితి సుఖత్వముఁ బొందుము గాక యింక న
ట్లుచిన నిట్లు గా కుడుగునే యనుచున్ వెఱఁ గందు చుండఁగన్. 356

క. పూనిక నెఱపితి సతియువ, మానముఁ బరితాపభరము నూన్చితి నిపు డి
ట్లే వని మదిఁ బొంగెదు పవ, మానసుతుం డిట్టు లనియె మానినితోడన్. 357

శా. చింతాశల్యము వాసెనే భుజబలోత్సేకంబు నీ కెక్కెనే
శాంతిం బొందెనె రోషపావకుఁడు దుర్వారిత్తునిం జూచితే
సంతోషించితె యిట్లు గాక బ్రదుకన్ శక్యంబె దుర్వృత్తి నీ
చాంతం జేరినయట్టివీరులకు నాచేతం బయోజాననా. 358

క. అనిన విని సింహబలము, ర్దన నవలోకించి ద్రుపదరాజతనయ యి
ట్లనుఁ దనమనమున నిండా, రినసమ్మోదంబు వెలి విరిసి పెంపెసఁగన్. 359

సీ. కొలువులోపల నిన్నఁ గోప మగ్గలిత్తినఁ, దలఁకక నిలిచిన ధైర్యమహిమ
నేఁ డిందుఁ జనుదెంచి నిర్వికారతఁ బ్రజ, కన్నులు గప్పిన గౌరవంబు
మనవారిలోన నొక్కని నైనఁ బిల్వక, యుత్సాహంబు సేసిన సాహసంబు
లోకదుర్జయుఁ డగు కీచకునిని వ్రే, ల్మిడి రూపు మాపిన కడిమిసొంపు

తే. సూడఁ దలపోయ మెచ్చ సంస్తుతి యొనర్ప, నాదలంచె నీయుత్తమ నాయకత్వ
మెఱిఁగి నినుఁ గొనియాడ నే నెంతదాన, సుహిత విస్మయానందనిర్మగ్న నైతి.

క. అనుపలుకులు కర్ణరసా, యనము లగుడు నయ్యుధిష్ఠిరానుజుఁడు ముదం
బునఁ దేలి యింకఁ దడయం, జన దని ద్రౌపదికిఁ జెప్పి చయ్యన నేఁగెన్.

క. అనిన విని కీచకుఁడు స, చ్చినపిమ్మటఁ బుట్టినవిశేషము లెల్లన్
విను వేడుక మన మలరెడు, ననఘా యొప్పడఁగఁ జెప్పు మనుటయుఁ బ్రీతిన్.

వ. పరమకృపావిధేయ నిరుపాధికచిన్మయకాయ గాధవి
స్తరనిగమైకవేద్య గుణతత్త్వవికారనియత్యభేద్య సం
స్మరణనిరస్తతాప ఘనసంసృతిసంతమసప్రదీప ని
ష్ఠురభుజసారదానవనిషూదన భక్తజనప్రమోదనా. 363

క. చతురానందమయా దు, ర్గతిరోగోద్గమచికిత్సకా భువనభవ
స్థితిసంహారకరా ని, ర్వ్యతిపణ్యాపణపదారవిందవికాసా 364

మాలిని. సురపరివృఢమూడాశోభిరత్నాంశుపిచి
స్ఫురణసుభగపాదాంభోజసంచారకేళీ
పరిచయకలనాలబ్ధవ్యయాతీతసౌఖ్యో
త్తరమునిజనహృన్మాద్యన్మరాళప్రతానా 365

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు
ద్వితీయాశ్వాసము. 366

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## విరాటపర్వము, తృతీయాశ్వాసము.



---

క. తత్త్వశివాత్త్వాలంబన
తత్త్వాశ్లేషాత్తశబలతాసంగతక
ర్తృత్వాదికలీలాత్తమ
హత్త్వాహంకారభావ! హరిహరనాథా. 1

### ఉపకీచకులు ద్రౌపదిం దమయన్నశవంబుతోఁ గట్టి దహింపం గొని పోవుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియెఁ బవనతనయుం డట్లు చని
మహానసమందిరంబుపరిసరంబున శరీరప్రక్షాళనంబు సేసికొని యనులేపనంబున
వస్త్రగంధం బుడిపికొని కృతకృత్యుం డై శయ్యాతలంబునం గూర్చుండె నిట
యాజ్ఞసేనియు భీమసేనుం డింతకు నంటయింటికిం బోయి నిశ్చింతంబున నుండు
నని నిశ్చయించి నర్తనశాల వెలువడి కావలివారలం బిలిచి. 2

క. నా పతు లగుగంధర్వుల, చేపడి మృతిఁ బొందె వీఁడె సింహబలుం డీ
పాపాత్మునిఁ జూడుఁడు మీ, రా వ్యాపారఫలంబు గాంచె ననిపలుకుటయున్. 3

ఆ. వారు సంభ్రమించి వడిఁ గోలదివియలు, గొనుచు నులివు మిగులఁ గూడఁ బాఱి
నృత్తశాలఁ జొచ్చి రత్తఱి నాకల, కల మెఱిఁగి కీచకప్రజంబు. 4

చ. కడు వెస వచ్చి రూపఱినకాయము నున్న తెఱంగుఁ జూచి వి
ట్టిడిలు మనంబులం గదిరి హా యనువారును జోద్య మంది మూ
ర్ఛిడియెడువారు నగ్రజునిపైఁ బడి మూర్ఛలఁ బొందువారు న
య్యెడ కరుగంగ నోర్వక మహిం బెఱచోఁ బలవించువారు నై. 5

వ. ఉన్నంత బంధుజనంబులు గూడం బాఱి కీచకశవంబుఁ గనుంగొని. 6

ఉ. మానవకోటి పట్టివినుమానవుఁ బీనుఁగు లైనవారి నెం
దైనను గంటిమే యకట యాఱడి నమ్మయి పోయె దుర్జయుం
డైనబలంబు గాని తెఱఁ గైన తెనకిత్తఱిఁ దోఁడు గాద యు
క్తి విమనంబు గీడు పరికించున కొక్కెడఁ జేటు దప్పునే. 7

ఉ. ఆనతవైరి యోజయ మహాద్భుతవిక్రమ యోజయంత దు
ర్మానవిఘూర్ణమానరిపుమర్దన యోవిజయాభిధాన తే
జోనిహతాహితప్రకటశౌర్యగుణప్రతిభాన యోజయ
త్సేన విరోధిబాహుబలజృంభణభంజన యోజయద్బలా. 20

సీ. కోడఁగినపని చలంబు వెడపక యతిదుష్కరం బైనఁ గడతేర్చు ప్రభువులార
పెనఁగిన వైవస్వతుని నైనఁ గడిమిమైఁ, బ్రేల్చి బరిమార్చువీరులార
శరణార్థి యగుదుష్టశాత్రవు నైనను, గరుణ రక్షించుసత్పురుషులార
యర్థికిఁ బ్రాణంబు లైనను డాఁపక, తమకించి యిచ్చునుదారులార

తే. నాథులార గంధర్వరత్నంబులార, నన్ను నుపకీచకులు దమయన్నశవము
నందు బంధించికొని వెసఁ జనుచున్న, వారు రక్షింప వేగ రావలయు మీరు.

భీముఁ డుపకీచకులం జంపి ద్రౌపదిని విడిపించుట.

చ. అని పలవించునయ్యెలుఁగు నాపవమానతనూజుఁ డేర్పడన్
విని మది నాదువల్లభకు వీండ్రను గ్రమ్మఱ నింత సేసిరే
యనుచు సరోషసంభ్రమితుఁ డాయిత మై వెసఁ బ్రాఁకి వప్రలం
ఘన మొనరించె గుప్తముగఁ గ్రక్కన ముట్టెడుదానికిం దగన్. 22

తే. ఇట్లు లంఘించిపోయి పరేతభూమి, యొద్ద సబుదక్కులును జూచి యొక్కయున్న
తానవనిజంబు వెఱికి కొమ్మ ద్రాఁచి గక, మడవ భుజశిఖరంబున నిడి యమర్చి. 23

మ. వికటభ్రూకుటిఘోరఫాలకలితస్వేదోద్భటుండుం జల
ద్వక్త్రోష్ఠద్వయుఁడుం బ్రమన్నదశౌర్యగర్వసంభావితాం
గకుఁడుం జిత్తవిదాహదోహలసమగ్రక్రోధవేగుండు నై
బకవిధ్వంసకుఁ డయ్యెడన్ నిలిచె శుంభద్భస్మాగ్నివిస్ఫూర్తితోన్. 24

వ. తదనంతరంబ. 25

ఆ. సూతుశవముతోడ నేతెంచు నరవులు, దవ్వుదవ్వులన యుదగ్రరూప
కలితుఁ డైనభీముఁ గనుఁగొని నడపక, నిలిచి రంతనంతఁ గలఁగిపాఱి 26

మ. ఇదె గంధర్వులు వచ్చి ముట్టికొని రింక నెక్కిల్కొ యంచున్ భయం
బొదవం బల్లములందు డాఁగియు సమీరోర్వీజముల్ ప్రాఁకియుం
జెదరం బాఱియు నీరు సొచ్చియును నిశ్చేష్టం బదద్వంద్వముల్
గుదివడ్డం బెగ డొందియున్ భరితసంకోచభ్రాంతు లై రత్తఱిన్. 27

ఉ. సూతులు భీతు లై ద్రుపదసూతిసమేతము గాఁగ నగ్రజ
ప్రేతము వైచి వీటిదెసఁ బెల్లుగఁ బాఱఁ దొడంగినన్ నడిన్
వాతసుతుండు ముట్టికొని వారి బడల్పడ వ్రేసి యందఱం
జేతులఁ దీఁట వో నుఱుముగాఁ జేసె విశృంఖలవిక్రమంబునన్. 28

వ. ఇవ్విధంబున నూటయేవు రుపకీచకులను సమయించి శమితక్రోధుం డై వచ్చి

కనుఁగొనక ద్రుపదనృపనందన యి ట్లను నిజకృతార్థతం దెలుపుటకున్ 38

తే. కీచకులచేసఁ బుట్టిన కిల్బిషంబు, పాచి నన్ను రక్షించిన పరమధర్మ
రతికి గంధర్వపతికి నిరంతరంబు, భక్తియుక్తిమైఁ బ్రణమిల్లి బ్రదుకుదాన.

వ. అనిన విని యనిలనందనుండు నిగూఢవచనచాతుర్యధుర్యుం డై యి ట్లనియె. 40

చ. అతివ యుపాయముం బొరయు నప్పుడు గావక తక్కెనేని యా
పతి పతియే తలంప మగవాడియె లోకముపాడియే భవ
త్పతు లిటు లాచరించుట గదా భవదీయమనోనువర్తన
స్థితి కుచితంబు వారల నుతింపఁగ నేల నిసర్గవృత్తులన్. 41

ద్రౌపది యర్జునునితో సల్లాపంబు సేయుట.

తే. ఇట్లు దమ్ము నిరూపింప నితరజనములకు నశక్యంబు గాఁగ సల్లాపరసము
ననుభవించుచు నల్లనల్లన లతాంగి, యరిగె నర్తనమండపోపాంతమునకు. 42

వ. చని విరాటకన్యకలయాటఁ జూచుచందంబున నందుఁ బురందరనందనుం గనుం
గొనునప్పాంచాలి నాలోకించి యతండును దారును దదభిముఖంబుగా వచ్చి
యక్కన్నియ లి ట్లనిరి. 43

ఉ. కీచకకోటిచేత నొక కీడును బొందక వచ్చితమ్మ ని
న్నేచినదుర్మదుండు జమునిం గొలువం జనెనమ్మ యంతఁ బో
కేచినసూతు లీయెడలి కింతయుపాయ మొనర్తురమ్మ వే
కాచి విరోధులం దునుమఁగా నిటు ముట్టుదురమ్మ నీపతుల్. 44

వ. అని తాను మున్ను విన్నకీచకవృత్తాంతంబున కనుగుణంబుగా నుపచారంబులు
వలుకుచుండ నాబృహన్నల సైరంధ్రి కి ట్లనియె. 45

క. ఆపాపాత్ములనిచవ్యాపారక్రమము వారి యందఱు మృత్యు
ప్రాపితు లైన తెఱంగును, నీపలుకుల నెఱుఁగ వలయు నెలఁతుక చెప్పుమా. 46

వ. అనిన విని సైరంధ్రి సాభిప్రాయంబుగా బృహన్నల కి ట్లనియె. 47

తే. కన్నియల యాట గఱపుచు నున్ననీకు, నకట సైరంధ్రి యిప్పు డేమయ్యె నేని
ఖేద మొదవించుకయు లేమిఁ గాదె స్వస్తి, తానవంబులో నున్నిటు లడుగుటెల్ల.

వ. అనిన బృహన్నల యి ట్లనియె. 49

క. నీ వలుగులపడుటకు దుఃఖావేశము పొందనే నిరర్థక మగుని
ర్వ్యేవపుఁబుట్టువు వుట్టిన, నావగ పెవ్వరికి దక్కు నలినదళాక్షీ. 50

క. నీతోడిపరిచయము లే, దే తలపోయఁగ ననింద్య యెందును నీ వి
ట్లాతుర వగుటకు నామది, నేతాపము లేదు నైజ మెఱుఁగవు గంటే. 51

వ. అని తాను నిజసహోదరులయట్లపోలె వేషాంతరంబు దాల్చినయంతియ కాక
యూర్వశి యిచ్చిన శాపం బనుభవించుటకు శరీరాంతరపరిగ్రహంబు సేయుటం జేసి
రిపుమర్దనంబు తనకు వెరవు గాకునికి గుప్తసాభిజ్ఞానంబుగాఁ దెలిపిన బలసూదన

సూనుపలుకులు విని పాంచాలి యంత స్మితకమనీయకపోల యగుచు ని ట్లనియె.

ఆ. అట్లు కాక యింత యన నేల నీమది, దెలియఁగ గొంత మేను నెలుఁగ కున్న
దానఁ గాను నగరఁ దగవుమై నీవు వ, ర్తించుటయ కరంబు ప్రియము నాకు.

వ. అనుచుం గన్యకాపరివృత యై యరిగి యంతఃపురంబు సొచ్చి సహోదరమరణ
శోకాతుర యగుచున్న కేకయికడకుం జనునప్పుడు. 54

సీ. ముదమున నెలమి సొంపొదవి నెమ్మొగమునఁ, దోఁపంగ వచ్చినఁ ద్రోచి త్రోచి
లలి నుల్లసిల్లుచు లలితలోచనదీప్తు, లడర నుంకించిన నాఁగి యాఁగి
సంతసంబున బాలికేము లగు చెయ్వులు, దొడరఁ జూచినఁ జేయ కుడిగి యుడిగి
మనమున నుబ్బుమై మాట నాలుకకు రాఁ, గడఁగిన నాడక కడపి కడపి

తే. ధీర యై యిట్లు సమ్మదపూరమునకు, గలువతన మనుబలితంపుఁగట్ట వెట్టి
వెలఁది యెఱుఁగనియది వోలె వికృతి లేక, యల్ల నెప్పటియట్టుల యరుగుటయును.

క. భయశోకంబులు దనదుహృ, దయమునఁ బిరిగొన విరాటధరణీనాథ
ప్రియ సంభావన సేసె వి, నయపూర్వము గాఁగ ద్రుపదనందనకుఁ దగన్. 56

వ. ఇట్లు సంభావించియుత్తరుణిందనపరిసరంబుననునిచికొనితదీయవదనంబవలోకించి.

తే. నీవు చక్కనిదానవు నెలఁత ధైర్య
రహితచిత్తులు మగవారు రాజు దీనిఁ
దలఁచి భయ మంది నిన్ను నీవలమునెడకు
నరుగునట్లుగఁ బ్రార్థించి యనుపు మనియె. 58

వ. అని తనమనంబునం గదిరినయనుజవియోగతాపం బుత్కటం బగుటయు వెండి
యు ని ట్లనియె. 59

క. బిరుదు గలమగలు గల రని, తర మిడి చంపింపఁ జూచెదవు జనములు నీ
పొరువునఁ బో వెఱతురు మా, పురమును రాష్ట్రంబు వెడలి పొమ్మం డైనన్ 60

వ. అనిన విని విరాటవల్లభకు సైరంధ్రి యి ట్లనియె. 61

ఉ. ముందటియట్ల యింకఁ బదుమూఁడుదినంబులమాత్రకు భవ
న్మందిరవాస మియ్యకొనినం గడతేఱు మదీయవాంఛ యం
తం దగఁ దోఁచి మత్పతు లుదాత్తమతిం భవదీయవాంఛితం
బుం దలకొల్పఁ జాలుదు రపూర్వమనఃప్రమదంబు సేకుఱున్. 62

క. కృత మెఱుఁగుదు రుపకార, వ్రతమున వర్తింతు రెపుడు వదలరు కరుణా
న్వితు లీనరపతికి శుభ, ప్రతిపాదకు లగుదు రేమిభంగుల నైనన్. 63

వ. కావున. 64

క. సైరంధ్రి యిట్టు లనుటకుఁ, గారణము దలంప నేమి గానోపునొ యం
చారసి బహుప్రకారవి, చారములకుఁ జొచ్చె టుడుగు సరసిజవదనా. 65

[illegible]

మదిఁ జెఱుపక ప్రార్థన సే, యుదుఁ గాకని నిశ్చయించు । టుచితము నీకున్. 66

చ. అనిన సుదేష్ణ యిట్లనియె । నంతయు నంతయు మత్స్యనాయకుం
డనికికి సమ్మతించితి నిజోచితవృత్తిఁ జరింపు నాఁడునం
గనుల మదీయవల్లభు నుదాత్తమతిం బరికించికొమ్ము నీ
మనమున నెట్టు లట్టు లట సమస్తము నట్టుల చేసెదం దగన్. 67

క. అని యూఱడిల్లఁ బలికిన, విని తొల్లిటియట్ల యుచిత । వృత్తి గ్రహించం
దన యుండె నట్టియెడ ని, ట్లని మ్రోసిరి జనులు పురము । నందును బయటన్. 68

చ. విరటుమఱంది కీచకుఁడు । విక్రమదుర్దముఁ డన్యసైన్యభీ
కరమహనీయమూర్తి బల । గర్వసముద్ధతచిత్తుఁ డిందు నె
వ్వరు సరిలేరు వీని కన । వాలినదండిమగండు నేఁడు న
చ్చెరు వగుచావు సచ్చె నటు । సేసినవారి కెట్టివీరులో 69

తే. సింహబలుఁడు గంధర్వుల । చేత నొక్క, రాతిరిఁ గాసి నిల్చు ఘోరంపు । జావు సచ్చె
నకట రిత్తకు రిత్త మ । త్యాస్యవనిత, లావు గోల్పోయె సూతకు । లంబు వొలిసె.

వ. ఇవ్విధంబునం బ్రవర్తిల్లుజనవాదంబు క్రమక్రమంబున సమస్తదేశంబుల నెరపి
చెల్లుచుండె నట్టియెడ. 71

దుర్యోధనుని వేగులవారు పాండవుల వెదకి కానక వచ్చుట.

ఉ. పాతకిమై సుయోధనుఁడు । పాండుతనూజులు నల్పు చున్నయ
జ్ఞాతవిధివ్రతంబు గలు । షంబుగఁ జేయఁ దలంచి పంచినన్
భూతల మెల్లఁ జూచి మును । వోయెడునప్పుడు సెప్పికొన్నసం
కేతపుఁజోటఁ గూడఁబడి । ఖేదముఁ బొందుచుఁ జారు లందఱున్. 72

వ. మగిడి వచ్చి హస్తిపురంబు సొత్తెంచి. 73

సీ. వరుస నేనుంగులు । గురిసినదానధా, రావలి దగుకల । యంపి గాఁగ
రాజులసందడి । రాసినతొడవులు, మురిసి రాలినపొడి । ముగ్గు గాఁగ
గాంతలసంకుల । గతిఁ ద్రెస్సి తొరఁగిన, హారముల్ పుష్పోప । హారములు గ
నేమేమ యని యోలి । నెత్తినపరదేశి, దొరలపావడములు । తోరణము గ

తే. సహజమైనయలంకార । మహిమ నతిశ, యిల్లి మహనీయవైభవ । మెసఁగ మెసఁగ
వఱలునరపతిమందిర । ద్వారభూమి, చేర నరిగి యా వేగుల । వారు ప్రీతి. 74

వ. సముచితంబుగాఁ బ్రవేశించి. 75

తే. ద్రోణగాంగేయభానుమ । త్స్వామకృపను, శర్దదుశ్శాసనులు సర్వ । సైన్యపతులు
నార్యజనములుఁ గొలువమ । హార్హకాంచ, నోన్నతాసనమునఁ గొలు । వున్నవాని.

స్రగ్ధర. మాళిస్రక్సంగరంగ । న్మణికరపటలీమాననాక్రాంతదివ్యా
శాలిస్ఫారాబ్జరేఖాం । బలిపుటఘటనా । చారుఫాలస్థలస్థా
పాలశ్రేణీవిశాలాం । బకకుముదవనీ । బాంధవాయత్తచంద్ర
శ్రీలీలాగాఢకాంతి । స్థితివదనరుచి । స్ఫీతు నాగేంద్రకేతున్. 77

వ. కని జయజయశబ్దపూర్వకంబుగా సాష్టాంగదండప్రణామంబు సేసి. 78

క. మొగిచిన చేతులు ముందల, నిగిడించి నితాంతవినయనిరతిం జారుల్
దగ విన్నవించి రిట్లని, జగతీశ్వరునకు నిజప్రచారం బెల్లన్. 79

క. దేవర యానతిఁ బాండవు, లేవురు ద్రౌపదియు నున్నయెడ మే మరయం
గా వెదకి వారు సనినమ, హావిపినంబులకుఁ దొలుత నరిగితిమి వెసన్. 80

వ. అందు. 81

ఆ. పరఁగుపొదరు పొదరుపల్లంబు పల్లంబు, మ్రాను మ్రాను దుర్గమంపుఁజోటు
దుర్గమంపుఁజోటు దొన దొన గుహ గుహ, యాది గాఁగ నెందు నరసి యరసి.

వ. ఒక్కయెడ నరదంబు లరిగినచొప్పు గాంచి దానివెంబడిం జని చని. 83

క. కేవలసూతులతోడన, పోవుట గని వారిఁ జేరఁ బోవక యది యిం
కేవంకఁ బోవునో కో, యను, భావనఁ బోయితిమి దానిపజ్జన యేమున్ 84

వ. అదియును ద్వారకానగరంబున కరిగిన. 85

క. అందుల నుండుదు రనునా,నం దెల్లము గాఁగఁ బెక్కుచందంబుల ము
ట్టం దిరిగి తడవి కుంతీ,నందనులం గాన లేక నానాభంగిన్. 86

వ. విచ్చి పోయి సమస్తదేశంబులుం గలయం గ్రుమ్మరి కొండొకయు నుపేక్ష లేక పరువడితోడిదకాఁ బరికించుచు బయలను నాలస్యంబు దక్కి యోలంబునట్ల శోధించుచుఁ గీడయిన నుదాసీనత యుడిగి మేలుచందంబున భావించుచు వివిధప్రకారంబు లయినబహుప్రదేశంబులు రోసి కౌంతేయులం గానక సంకేతస్థలంబునం గూడికొని మావర్తించిన తెఱంగు దేవరకు నెఱింగించి యట దివ్యచిత్తంబున నవధరించినభంగి సేయువార మై చనుదెంచితిమి మాకుం జూడఁ బాండవులు పొడవడంగి లేకపోయిరి గాని యీలోకంబున నునికి గలిగిన నగపడకుండ నేర రిది యుక్కార్యంబునున్నరూపు మఱి యొక్కవిశేషంబునం బ్రియం బంది వచ్చితిమి చిత్తగింపుము. 87

సీ. మత్స్యదేశాధీశుమఱఁది కీచకుఁడు బు, ద్ధ్యోజ్జ్వలాకృతి యగునొక్కవనిత
కతమున నడురేయి గంధర్వు లతిరహ, స్యప్రకారంబునఁ జంపి రదియు
నక్కజం బాయుధవ్యవహార మేమియు, లేదు శిరంబు గాళ్లు గేలు డొక్క
లోనికిఁ జొరఁద్రోచి పిసుంగుముద్దగాఁ, జేసి వైచిరి దుష్టచిత్తు లైన

తే. యతనితమ్ముల నూర్వురు నైనఁ దప్పి, పోవ నిక యొరాత్రియ పొదివి చిత్ర
విహతిఁ జెగఁ జూచి యనిరూపణీయదుర్ని,వారవృత్తిమై నరిగిరి కౌరవేంద్ర.

వ. విరాటునకు పగతుండు గావునఁ దదీయవ్యసనం బెఱింగింప వలయు నని విన్నవించితి మది యట్లుండఁ బాండవుల నన్వేషించుపని యిట మీఁదం జిత్తగించు తెఱం గాన తిచ్చునది యనిన విధ యట్ల చేయుదము గాక యని వారలఁ బోవం

బనిచి కౌరవసేన చింతాక్రాంతుం డై యమ్మహీకాంతుండు మంత్రులం జూచి యి ట్లనియె. 89

సమయసముచితకృత్యంబు చక్కఁ జేసి
పాండవులు రాజ్యమున కాస పడక మున్న
యరసి యెఱిఁగి యరణ్యంబునందుఁ దొంటి
యట్ల యిడుములఁ గుడువఁ బోఁ బనుపవలయు. 90

ఎఱుఁగుట దుర్ఘట మెవ్విధి, నెఱుఁగంగా వచ్చు మీర లెల్లను మాయా
యెఱిఁగినచందంబున నా, కెఱిఁగింపుఁడు వారి వెదకి యెఱుఁగు తెఱంగుల్.

అనిన రాధేయుం డి ట్లనియె. 92

వివిధదుర్నిరూపవేషముల్ గైకొని, నిఖలదిశలయందు నిపుణవృత్తి
నెఱుఁగునట్లుగా నరనేకులఁ బుచ్చిన, నెల్లి నేఁటిలోన నెఱుఁగఁబడరె. 93

అనుపలుకులు విని దుశ్శాసనుఁ డేమియు సరకుగొనక సమదవిలాసా
ననుఁ డై నిజాగ్రజన్ముని, గనుఁగొని యి ట్లనియె గాఢగర్వస్ఫూర్తిన్. 94

వలవదు రోయఁ బాండవుల నారొక యూఱట లేని త్రిమ్మటల్
బల మఱి వస్యసత్త్వములు పాల్పడి చచ్చినచోటఁ బూరియు
న్మొలవదె యింత కిం కిట మనోముద మస్ఖలితంబు గాఁగ వి
చ్చలవిడి రాజ్యలక్ష్మిఁ దగునందమునం గొనియాడు మున్నతిన్. 95

అనిన విని దరహాసితవదనుం డగుచుఁ గుంభసంభవుం డి ట్లనియె. 96

శాస్త్రసమగ్రులార్యనుతగౌరవదీప్తులు వర్ణనీయసా
భాగ్యు లుదాత్తదైవబలభవ్యులు దివ్యసమాను లాపృథా
పుత్త్రులు వారి నాపదలు పొందునె యోపిన నింక నైన నీ
ధాత్త్రిఁ గడంగి యారయువిరోధంబులు సెప్పఁడు నేర్పు లేర్పడన్. 97

భీష్ముఁడు దుర్యోధనునితో ధర్మరాజుసుగుణంబులఁ జెప్పుట.

అనిన నాతనిమాట లాదరించి భీష్ముం డి ట్లనియె. 98

నల్లవొ నిక్క మాడె నృపనందనుముందట ద్రోణుఁ డొక్కఁడుం
దెల్లము వారు బాహుబలధీబలదైవబలంబు లొప్ప వ
ర్తిల్లుదు రమ్మహాత్ముల కరిష్టము లేమిట నెందు నేలపా
టిల్లెడు వారిఁ గొన్నను గరఁడిఁ దదీయమహానుభావతన్ 99

వారలును వీరలును నా, కారయఁగా నొక్కరూప యైనను గార్యం
బీ రెఱిఁగింప వలయు నని, కౌరవపతి నన్ను నడిగెఁ గాన నితనికిన్. 100

కలరూ పెఱిఁగింపంగా, వలయుం జెప్పెద మదీయవచనములు హితం
బులు గాఁగ నిశ్చయస్థితిఁ, దలఁచి యనుష్ఠింప బుద్ధి దలకొనుసుమీ. 101

బ్రాహ్మణభక్తియుఁ జిరహితశక్తియు, నిర్మలమతియును స్థిరతియు

సత్యభాషణమును సాధుపోషణమును, జిరవితరణమును సేవ్యగుణము
సన్మార్గరతియు సుస్నత్త్వశీలతయు, నంచితోదయము కృపాతిశయము
బంధుసంప్రీతియు భవ్యవిభూతియు, శాస్త్రోపగమము నస్ఖలితదమము
తే. సజ్జనస్తవనీయసౌజన్యములును, ధర్మసంచితబహుధనధాన్యములును
గలుగు నక్షీణపుణ్యోదయాలుఁడు ధర్మసూనుఁ డున్న దేశంబున మానవులకు.

క. మఱియును నొక్కవిశేషం, బెఱిఁగించెద నతఁడుయున్న యెడ గోధనముల్
మెఱుఁగెక్కి పాఁడి నేమిం, గొఱఁతపడక యుండఁ జేపి కురియుచు నుండున్.

వ. కావున నిట్టిదేశం బిప్పు డెయ్యది యగు నందుఁ గుంతీతనయుల నరయం బనుప
వలయు ననినఁ గృపాచార్యుం డి ట్లనియె. 104

క. అరయఁగ నయ్యేడు తెఱఁగుల, నరయుట కార్యంబు వారి నాలస్యము లే
కరయునది పెక్కుభంగుల, నరసినఁ గోఁచెదరు గాక యది యట్లుండెన్. 105

ఉ. వారలు పూనినట్ల వనవాసము సల్పిరి వీరు వేచి త
మ్మారయఁగా బయల్పడని యట్లుగ నుండెడువత్సరంబునుం
జేరువచేరువల్ గడచెఁ జిత్తములుం గలుషంబు లమ్మహా
వీరుల కీనృపాలు నెడ వీరికి నూరక యున్కి గర్జమే. 106

క. అలుకైనను బగతుని దెసఁ, దలఁపు గలుగ వలయు ననిన దర్పోజ్జ్వలదో
ర్బలు లగుకౌంతేయుల మన, మెలమికలిమి నచ్చి యిట్లు లేమఱ నగునే. 107

చ. మనబల మెంత యంతయు సమగ్రసముద్యమదుర్గమంబుగా
మునుమును గూర్చి తోడుపడు మూఁకలతోఁ దగు మైఁ గ్రమక్రమం
బున నెఱిఁగించి రాఁ బనిచి భూరిసముజ్జ్వలసైన్యజృంభణం
బున నెర వొంది యున్కి కురుభూవిభునక్కిప్పటి కార్య మారయన్. 108

ఆ. పాండురాజసుతులు బాసమై నడవడి, గడచి కయ్యమునకుఁ గాలుద్రవ్వ
కున్నయట్టు లైన నిన్నరనాథుతో, సంధి సేయు టొప్పు సముచితముగ. 109

క. ఏచి చలంబున నొంటికిఁ, జూచిన నప్పటికి మనకుఁ జూడం గార్యం
బేచందంబునఁ దెఱఁ గగు, నాచాలుట కోర్వ వలయు నది యట్లుండెన్. 110

క. వారలు లేరటె పోపెఱ, వారలఁ దగుభంగి మనకు వశ్యులఁ జేయన్
భూరిబలయుతుల మగుటయ, కారణ మను టనుమతంబు గాదె మనకున్. 111

తే. ఇవ్విధంబునఁ దమతమ యెఱుఁగు తెఱఁగు
లందఱును జెప్ప విని కురునందనుండు
దగ విచారించి కార్యంబు తెగువ గాంచి
మెలమి వారలఁ గనుఁగొని యిట్టు లనియె. 112

ఆ. సింహబలుఁడు భీమసేనుండు శల్యుండు, హలధరుఁడు సమానబలము వార
లొండొరులను గెలుచు నుత్సాహమును గల, రుద్ధతులును బాహుయుద్ధపరులు.

ఈనలువురభుజశక్తుల, తో నెనయఁగఁ జాలునట్టిదోర్బల మెందుం
గానము గావున వీరల, లోనన యొండొరుల కని గెలుపు సమకూరున్. 114

తక్కినవార లాతనికి దవ్వులచోటులవారు వాయుజుం
డొక్కఁడ యింక సింహబలునుద్ధతి మాన్చిన మాన్చువాఁ డతం
డక్కడ నిల్చెఁ గావలయు నాసతి ద్రౌపది గాఁగ నోపు వే
ఱొక్కరుఁ డాజఁ గీచకుల నోర్వఁగఁ జాలమి మీ రెఱుంగరే. 115

గంధర్వు లను వేషంబున, సంధితమసగూఢవృత్తి ననిలసుతుఁడు గ
ర్వాంధమతి యైనసూతు న, బాంధవముగఁ జంపెఁ గాక పరులకు వశమే. 116

పితామహుం డుపదేశించినలక్షణంబు లద్దేశంబునం గలిగి యుండు నని యిందుము
పాండవులు ప్రచ్ఛన్నవేషంబున విరటుప్రోల వసియించినవారు గావలయు నతండు
ను బ్రతిభటుం డయి భంగించు చుండుం గావున నతనిపయి నెత్తి పోయి తదీయ
గోధనంబుల గ్రహించిన ధర్మతనయుండును దమ్ములు నడ్డపడం బఱతెంతు
రయ్యవసరంబున మనము సమయభంగంబు సెప్పి వారలం గ్రమ్మఱం బండ్రెండు
వత్సరంబులు వనవాసంబు సలుపం బుత్తమట్లైన సప్రతిహతంబుగాఁ జతురంత
భూచక్రం బాక్రమించి కీర్తనీయులమైన త్రిల్లుదుము కుంతీనందనులందు లేకతక్కి
న మత్స్యపతిసమస్తవస్తువులును జూఱకొంద మదియును లాభంబ యెల్లభంగుల
నిప్పటి కిదియె కార్యంబు మీకు నందఱకుం జూడఁబోలు నేని దీని కనురూపం
బగునుద్యోగంబు సేయుం డనినఁ ద్రిగర్తాధీశ్వరుం డగు సుశర్మ వాలుతఁ గర్ణ
దుశ్శాసనులతోఁ గొండొక ప్రసంగించి వారలయనుమతి నవనీపతితో నిట్లనియె.

కేకయ సాల్వులు తోడుగ, నాకీచకుఁ డాజి నన్ను నపజితుఁ జేసెం
జా కుండ మున్న యొకపరి, నా కాతనితోడ భండనము లే దయ్యెన్. 118

భంగముతోడ నున్ననను బంపు విరాటునిమీఁద భూమికిం
జెంగట నుండు నా దయినజీతపుటాళ్లు సంతతంబు వా
నిం గడు గాసిసేయు నతనిం జెఱుపం దఱి యయ్యె ముట్టి స
ప్తాంగముఁ జూఱదెచ్చెద నహంకృతి యెల్ల నడంచి వచ్చెదన్. 119

తే. ఉద్ధవీడిన పసుల నూఁచముట్టుగఁ దెత్తు, నతఁడు వెనుక వచ్చి యడ్డపడిన
చోటఁ బాండురాజసూనుల నరయుదు, నెల్లభంగి దీని కేన తగుదు. 120

వ. అనవుడు. 121

క. బరవసమునైఁ ద్రిగర్తే, శ్వరుఁ డిట్లను టుచిత మింక జననాయకుఁ డె
ప్పరుసున నానతి యిచ్చెను, దార లే మని రట్ల చేయఁ దుదఁ గార్య మగున్.

వ. అనుచినసూనుమాట విని యందఱుఁ గన్గొని పెద్ద లెల్ల ని
న్ననుమతి సేయ సైన్యముల నన్నిటఁ బన్నఁగఁ బంపు రెండవే

కారచక్రంబును బద్ధపరికరకూబరాక్షయుగాద్యవయవంబును బ్రతికల్పితతురం
గంబును సన్నివేశితవివిధాయుధంబును సన్నద్ధసారథికంబును నై నరథం బెక్కి
గోగణహరణప్రదేశంబు పశుపాలకులం దెలియ నడుగుచు వెడలునప్పు డమ్మ
త్స్యపతియనుజన్ముండు. 144

శా. లోకస్తుత్యవిభూతి నన్యపృతనాశీలుండుదగ్రాహవ
శ్రీకల్కిం రథదంతిఘోటకభటశ్రేణీసముత్క్రాంతసే
నాకల్పధ్వజవిభ్రమంబున సుహృత్సర్వప్రోద్యముం డై శతా
నీకుం డుద్ధతి నేఁగుదెంచె సఖిలారాతికంబు నుబ్బొంగఁగన్. 145

ఉ. ఆతనితమ్ముఁ డై నమదిరాక్షుఁడు కర్ణసుఖేంద్రఘోషము
ద్ధూతబలోత్థరేణుపరిధూసరితాంబర మైన వారణ
వ్రాతము గొల్వ రాఁ గడఁగి వచ్చె సముజ్జ్వలహేమవర్ణని
ర్యాతరుచిచ్ఛటాపటలరంజితహేతిమహోగ్రసైన్యుఁ డై. 146

తే. అతనియనుజుండు సూర్యదత్తాహ్వయుండు, సమదసైనికనానాస్త్రశస్త్రబహుళ
దీప్తిజాలకప్రతిహతదినకరాంశు, రాజి గను చనుదెంచె సంరంభ మెసఁగ.

ఉ. తెల్లనిజోడు వెట్టుకొని తీవ్రగతిం జనుదెంచె మత్స్యభూ
వల్లభునగ్రనందనుఁడు వైరిమదాపహవిక్రమప్రతా
పోల్లసితుండు వన్యబల ముద్ధతిఁ గొల్వఁగ మౌర్విరేఖ యు
ల్లసిల్లుచు నుండ శంఖుఁడు విభీషణశంఖనినాద మొప్పఁగన్. 148

వ. మఱియు ననేకయోధవీరులు వివిధవాహనారూఢు లై గాఢసన్నాహంబు లగు
నిజవ్యూహంబులతో సేవించుచుండిరి విరాటుండు బలంబులం గూర్చికొని
తలంపునం బురబహిరంగణంబునం గొండొకసేపు నిలిచె నట్టిసమయంబున ధర్మ
తనయుం డనిలతనయమాద్రీతనయుల నంతంతం బొడసూపి నిలువుం డని నిపు
ణంబుగా నియోగించి తానును మత్స్యమహీవల్లభు నల్లన చేరి యి ట్లనియె.

చ. ఒకఋషిచేత నాయుధసముత్కర మెల్లను సప్రయోగమం
త్రకముగ నభ్యసించి సమరంబునకుం గొఱ యైనవాఁడ గో
ప్రకరములం మరల్చుటకు బంధులు నీవును బోవ నాకు నిం
టికడన యున్కి పాడియె ఘటించఁగఁ బంపు రథంబు చయ్యనన్. 150

క. అనిన విని యయ్యెకొనున, మనుజాధీశ్వరుననితోడ మఱియు నతం డి
ట్లనుఁ బవనతనయుఁ గవలం, గొని సమరంబునకుఁ బోవఁ గోరెదు మదితోన్.

సీ. మనవలలుండు లావున బంటుతెనమున, జను లెఱుంగఁగ నడిసిన్నవాఁడు
మంచిపుగంధు దామగ్రంథి యసమసం, గ్రామకేళీగాఢకౌతుకుండు
వినుము తంత్రీపాలుఁడను దుర్ధమారాతి, మర్దనచాతుర్యమహితభుజుఁడు
మున్ను నీకలు ముప్పురకడఁకల, కొలఁదు లే వెలుఁగుదుఁ గొంతకొంత

తే. యెక్కుడగునట్టియరదంబు లిచ్చి వీరి, ననికిఁ బోకొని పోక కార్యంబు నాకుఁ
జూడ ననవుడు మేదినీశుండు హర్ష,నిర్భరాత్ముఁడై శతానీకుఁ జూచి. 152

వ. కంకవలలదామగ్రంథితంత్రీపాలురం జూపి యిట్లనియె. 153

మ. రథముల్ మంచివి గాఁగ నాలు గతిశీఘ్రవ్యాప్తిసత్త్వాంబులం
బ్రథితం బైనతురంగమోత్కరము సంగ్రామార్హచాపంబు ల
శ్లథవర్మంబులు వీరి కిమ్ము రణలీలాదక్షతల్ మన్ననో
రథముం దీర్పఁగ వీర లోపుదురు దోర్గర్వం బఖర్వంబుగన్. 154

వ. అనిన నతం డట్లు చేయుదు నని వారలం దోడ్కొని చని సమస్తంబును సన్నద్ధంబు గావించి యంగరాగమాల్యాభరణంబుల నలంకృతులం జేసినం గైకొని తమతమయంతవట్టునుం గూడుకొని సూతకృత్యంబులకుం దార చాలి రథంబులు దోలికొని చనుదెంచిరి తదనంతరంబ. 155

సీ. గంధదంతావళకర్ణమారుతహతిఁ, గాంతారములు చాఁపకట్టు వడఁగ
రథఘోషమునఁ బ్రతిరవ మిచ్చునద్రులు, భయమున వాపోవుభంగి నుండఁ
దురగఖురోద్ధూతధూళి ద స్బైరసిన, వననిధి పిండలివండు గాఁగ
బహుళపదాతిదుర్భరభార మడరిన, నురగకూర్మంబు లొండొంటిఁ బొంద

తే. సైన్యముల నడపించె నుత్సాహలీల, యతిశయిల్లంగ సంరంభ మగ్గలింప
బరవసము మిక్కుటంబుగఁ బనులు సన్న,జాడ గైకొని మత్స్యజనవిభుండు.

వ. ఇట్లు చని కూడ ముట్టిన. 157

క. విరటుబలంబు ద్రిగర్తు, శ్వగుబలముం జెలఁగ నార్చి వడిఁ దాఁకె భయం
కరనాదమేదురము లగు, శరనిధు లొండొంటిఁ దాఁకుచందం బమరన్. 158

మ. గుణరావంబుఁ గృపాణఘట్టనరవక్షోభంబునుం గింకిణీ
క్వణనవ్యావృతహేషితస్వనములున్ ఘంటానినాదాత్తపో
షణవానాపటుబృంహితధ్వనియు శశ్వద్గాఢమై పేర్చినన్
రణనం బించుక దోఁప దెద బహుతూర్యశ్రేణి నాసేనలన్. 159

విరాటసుశర్మలసైన్యంబులు సంకులంబుగాఁ బోరుట.

వ. అట్టిసమయంబున. 160

సీ. ఒండొంటితోఁ దాఁకి మండెడునవియును, జిందముల్ పొడిపొడి సేయునవియు
గట్టిమైమఱువులు దట్టముల్ గావించు, నవియును నెఱను నోనాడునవియు
నెట్టుపైఁ బడి మేని నెగయించునవియును, దల నేల డొల్లంగఁ దాఁకునవియు
నిరుమెయిఁ దొలిచి బెరట్టిలఁ దూఱునవియును, నలువుర నేవుర నాటునవియు

తే. నైనశరములు గనుఁగొనిరి యాడి యాడి, నారదుఁడు పిచ్చలింపంగ వీరకేళి
సలిపె నుద్ధతిమై ధనుశ్శాలు లడరి, లావు వెరవును నెఱయఁ జలంబు మెఱయ.

వ. ఇట్లిరువాఁగును నరవాయి గొనక పెనంగు చుండ. 170

ఉ. భీకరబాణవర్షముల వెల్లిన వైరులు వెల్లగిల్ల మా
ర్వీకృతగర్జితంబు పృథివీవియదంతర మెల్ల నిండ ను
గ్రాకృతిఁ గల్పసంక్షయమహాభ్రము చందము నొందుచున్ శతా
నీకుఁడు దాఁకెఁ గంకటమణిద్యుతివిద్యుదుపాంతకాంతి యై. 171

తే. అతఁడు నానాప్రకారశస్త్రాస్త్రనిహతి, నతులవిక్రమవిభవ మనర్గళముగ
యోధసారథియుగ్యసంయుతము గాఁగ, నూఱురథములు ప్రేల్మిడి నుగ్గుచేసె.

మ. మదిరాశ్వుండు గడంగి యన్నకు బలోన్మాదంబు రెట్టింప స
ప్రదరజ్వాలతికాక్రియాసమబిహారక్రీడనం బప్పుడొ
ప్పిద మై యోగవియోగసంధులు నిరూపింపంగ రాకుండఁ గ
ర్ణదళోపాంతము వింతసేయ నడరెన్ రౌద్రంబు శోభిల్లఁగన్. 173

క. అడరి పడి రథచతుశ్శతి, పొడిసేసి పరాక్రమం బపూర్వం బై యే
ర్పడఁ గరిహయనరనికరము, బడలువడం దఱిమె నలి నభశ్చరు లార్వన్. 174

ఉ. మండలచారి యై రథ మమానుషవిక్రమలీల నొప్ప ను
ద్దండభుజాబలంబు ప్రథితంబుగ సత్తఱిఁ దాఁకె సూర్యద
త్తుం డనివార్యశౌర్యగుణధుర్యుఁడు వీఁడె యనంగఁ బేర్చి వే
దండఘటావిపాటనవిదగ్ధతఁ బొల్చె రణాంగణంబునన్. 175

ఉ. అప్పుడు శంఖుఁ డెంతయుఁ బ్రియంబునఁ బెండ్లికిఁ బోవుసట్లు మో
మొప్పఁగ నస్త్రశస్త్రములయుల్లసనంబున శత్రునేత్రముల్
గప్పఁగఁ జీకటుల్ రణముఖంబు సమస్తముఁ దాన యై రథం
బుప్పరవీథిఁ దోలికొని యుగ్రగతిం బఱతెంచి తాఁకినన్. 176

తే. మందరాచలచటులవిమర్దనమున, ఘూర్ణమాన మై గాఢసంక్షోభ మెసఁగఁ
దలఁకుజలనిధి నాఁ ద్రిగర్తక్షితీశు, బలము దిరుగుడువడియె సంకులముగాఁగ.

వ. అయ్యవసరంబునం దక్కువదొరలును దలపడి యతిభీమంబుగా సంగ్రామంబు
సేయం దొడంగిన. 178

చ. అనుజతనూజమంత్రిసుభటాప్తజనంబులపోరు సూచి నె
మ్మనమునఁ బొంగి యై పెనిచి మత్స్యమహీరమణుండు సారథిం
గనుఁగొని యల్లగట్టిమొనఁ గ్రాలుచు నున్నత్రిగర్తనాథు కే
తనమునచక్కటిన్ మనరథంబు వెసం జన నిమ్ము నావుడున్. 179

క. అగ్గలిక నతఁడు హయముల, పగ్గంబులు సడల విడిచి పటురయమున నా
మొగ్గరము దఱియఁ బఱపిన, మ్రగ్గెను రథపంచశతము మత్స్యాధిపుచేన్.

మ. అవనీనాయకుఁ జూచి పేర్చి నలి వీరావేశదుర్దాంత మై

కవిసెఁ గుంతభుశుండితోమరగదాఖడ్గాదిశస్త్రాస్త్రతీ
వ్రపహారంబు విరోధిదుర్విషహసంరంభంబుగా నొక్కపె
ట్టు వడిం దద్బల మెల్ల నారథుఁడు వేడ్కం గుంచె సారింపఁగన్. 181

వ. ఇవ్విధంబున విరాటుండు దానును సేనయుం క్షేమం గలవారును బరవసంబు సేసి యొక్కుమ్మడి నడరుటయుం దెరలి మరలిననిజసైన్యంబు దైన్యంబు గలయం గనుంగొని కోపాటోపంబునం గెంపు గదురులోచనంబులుం బెంపొలయుభుజశిఖరంబులుం గలిగి సుశర్మ తానుం దమ్ముండు సంగడంబుగాఁ గోల్తలసేసి రథసమూహంబుతో విరాటవ్యూహంబు నెదుర్కొని. 182

క. బలవిక్రమములు మెఱయఁగఁ, దలపడి రథదంతిహయపదాతిచయంబుల్
గలను సుడివడఁగఁ దామరకొల నేనుఁగు సొచ్చినట్లు గుఱుపుగఁ జొచ్చెన్

ఉ. ఏలినవానిఁ గాంచి మొనలెల్లను నెంతయు దర్పమెక్క యా
భీలనిశాతహేతిరుచిభీకరలీల నెదిర్చి మత్స్యభూ
పాలకసైన్యరాజిఁ దలపడ్డ మహోగ్రతఁ జేర్చి యూనము
త్కాళి వియచ్చరప్రతతికిఁ బెఱఁ గందఁగఁ జేసె నెంతయున్. 184

తే. కడిమి మెఱయంగఁ బోరు త్రిగర్తనాథు, రథముఁ గనుఁగొని కడఁగి విరాటవిభుఁడు
వరవునకు వల్లినట్టుల సరకుగొనక, యతులరథపాటి రేకత నతనిఁ దాఁకె. 185

విరాటుఁడు సుశర్మమీఁదఁ దనరథంబు తోలించి పోరుట.

వ. ఇట్లు దలపడి. 186

మ. పటువేగం బగుశాతభల్లచయసంపాతంబులన్ మింట మి
క్కుటమై మంట ధగద్ధగద్ధగ యనం గోపంబు రూపంబులై
చటులక్రీడఁ జరించునట్లిరువురున్ శౌర్యోన్నతిం బోరు దు
ర్ఘటదర్పోద్ధతులై పరస్పరజయాకాంక్షం బ్రచండంబుగన్. 187

క. తదవసరంబున నొక్కటఁ, బదియమ్ములు వాడి త్రిగర్తపతివక్షంబున్
వదనంబు సేసి విరటుఁడు. మదమునఁ దురగముల నేసె మఱియుఁ బదింటన్.

క. ఇంచుకయు నీడఁ బోవక. కాంచనపుంఖప్రకాండకాంతిస్ఫాయ
త్పంచాశద్బాణంబులు, నించె నతఁడు మత్స్యమేదినీపతిమేనన్. 189

తే. దొరలు దలపడ్డ నాహవదోహలమున, నుభయబలములుఁ దమకించి యుర్వి లేక
కలయఁ బెరసి భూరేణువు గతన రాత్రి, గాక మున్న యొండొరువులఁ గానరైరి.

క. కుతములఁ బెల్లు దొరఁగు శో,ణితము రజఃపటల మణఁచి నెఱసిన నరుణ
ద్యుతిఁ దమము వాపువేకువ, గతిఁ దత్సమయం బతిప్రకాశత నొప్పెన్. 191

ఉ. దానికిఁ జిత్తవృత్తులు ముదంబునఁ బొందఁగ మేను లుబ్బఁగా
సేనలు రెండు నుద్భటవిజృంభణతన్ వివిధాస్త్రఘట్టన
ధ్వానము దిక్కులం బరఁగఁ దాఁకి రణం బొనరించె నత్తఱిన్

భానుఁడు పశ్చిమాద్రిఁ గనుపట్టెఁ దలిర్చినమావిమ్రాకనన్. 192

క. సమరంబున భటులు గడు, శ్రమయ మొందిరి తమము గవిసెను గాని సము
ద్యమసంరంభ ముడుగ రిది, సమయం బని తొలఁగినట్లు సవిత్రుఁడు గ్రుంకెన్.

వ. తదనంతరంబ. 194

క. మిఱిమిఱిచీఁకటియప్పుడు, నఱిమిఱి భటులుడుగ కడరి యని సేయంగా
నెఱసి తమ మెల్లయెడఁ గ్రిక్కిఱిసిన మఱి పాసి నిలిచి రింతను నంతన్. 195

వ. ఇట్లుభయసైనికులు సాంద్రసంతమసంబునం జేయునది లేక సంగ్రామంబు దక్కి
తమకం బెక్కనొక్కింతసేపూరకున్నంత. 196

క. తనమనుమలు పాండుతనయులని సేఁతకు వేడ్కసేయు ననఁ గని తమం
బున వారు మెఱయ రని వచ్చినక్రియ శశి పూర్వశైలశిఖరం బెక్కెన్. 197

క. వెలుఁగు గని కడఁగి యుభయబలములుఁ బోరికిఁ జొచ్చె మత్స్యకుంజరుఁడును న
గ్గలమగుమగఁటిమి సొంపునఁ, దలపడియె సుశర్మతోడఁ దదనుజుతోడన్. 198

చ. తలపడి పోర వారియురదంబు లనేకము లొక్కపెట్ట ను
ట్టలపురయంబునం బొదివి తాఁకి గడంగి వడిం ద్రిగర్తనా
థులు విరటు దేరుఁ దద్రథముతోఁ గదియించి తదీయసారథిన్
బలువిడిఁ గూల్చి రశ్వములఁ బ్రాణములుం గొని యుగ్రమూర్తులై. 199

వ. ఇవ్విధంబున విరాటుండు విరథుం డగుటయు. 200

చ. అతిరభసంబుమై నదరి యాతనిఁ బట్టి సుశర్మ వెల్చి నా
ర్చి తనరథంబుపై నిడి యశేషబలంబులు నట్లెసఁగ భయ
ద్రుతగతిఁ బాఱినన్ విజయదుందుభు లొక్కట మ్రోయ విక్రమో
ద్ధతివిభవంబునన్ మది మదం బొలయన్ మరలెన్ మహోద్ధతిన్. 201

వ. అట్టియెడ ధర్మతనయుం డనిలనందను నవలోకించి సత్వరం బగుచిత్తంబుతో
మత్స్యవిభునివలను జూపుచు ని ట్లనియె. 202

తే. ఇతనియాశ్రయమున మన మెల్ల బ్రదికె, యున్నవారము గావున నుగ్రరిపుల
వాలువడకుండ విడిపింపఁ బాడి యితని, నెంబడు మొయిదు మురథరయంబు మొసక మొసఁగ.

చ. అనవుడు మేను వెంచుచు మహాబలనందనుఁ డప్పు డన్న కి
ట్లను విడె వాలవృక్షము రయంబున దీని నరాతిసేన డొ
ల్ల నడచి యామశౌర్యనిబలంబుఁ జలంబును మాన్చి యవ్విరా
టుని విడిపించెదన్ రణమహోత్సవము వైరులు పిచ్చలింపఁగన్. 204

తే. నీవుఁ దమ్ములు నొక్కెడ నిలిచి చూచు
చుండుఁ డని పల్కుటయుఁ బుయికలోటతోడఁ
గీచకారాతిఁ దప్పక చూచి నగుచు
నతని కిట్లని చెప్పె ధర్మాత్మజుండు. 205

క. తరువు వెసఁ బెఱికికొని నీ, వురవడి నైనఁ గవిసితేని నుభయబలము న
చ్చెరు వందుచుఁ జూచి వృకో, దరుఁడ వగుట యెఱుఁగకున్నె తద్విధ మేలా. 206

వ. కవలు నీకుఁ జక్రరక్షకులుగా లోకసామాన్యంబు లైనచాపకృపాణగదాదు లగు నాయుధంబుల విరోధివధం బాపాదించి వేవేగ విరాటు విడిపింపుము. 207

చ. అనుపలు గంకుశంబున క్రియం గుదియించిన నిల్చి భూరుహం
బున దెస వోక మత్తగజపుంగవుచందమునన్ సమీరనం
దనుఁడు శరీరదోశ్శవిధాపరిశోభితవిక్రమోద్యమం
బున విలసిల్లె నిట్టలపు భ్రూకుటి ఫాల మలంకరింపఁగన్. 208

క. మీపనిచినట్లు చేసెద, నేపారినవైరిబలము నెల్లను బాహా
టోపమున నోర్చి మత్స్యమహీపతి విడిపించి తెచ్చి యిచ్చెద మీకున్. 209

వ. అనిన నిని కౌంతేయాగ్రజుండు సంతసిల్లి తమయంతవట్టునుం గూడుకొని. 210

పాండవులు సుశర్మ నోడించి విరాటుని విడిపించుట.

తే. తాను మున్నుగ శాత్రవసేనమీఁద
రథము లొక్కటఁ బఱపిరి పృథివి యద్రువ
నుఱక యేచి త్రిగర్తులు నుద్ధతముగఁ
జెలఁగి మార్కొని పొదివి సంకులము గాఁగ. 211

క. ఏయుచుఁ బొడుచుచు వ్రేయుచు, డాయుచు నుద్వృత్తిఁ దఱుముటయుఁ బొడిసేసెన్
వాయుసుతుఁడు రథముల నిరు, వేయిటి రథిరథ్యసూతవితతంబులు గాన్. 212

తే. ఏడునూఱురథంబుల నేపుమాపె, నకులుఁ డప్పుడు మున్నూటినాము మడఁచె
నతనియనుజుఁడు కుంతీసుతాగ్రజుండు, రథికముఖ్యుల వేవురఁ బృథివిఁ గూల్చె.

వ. అతండు మఱియును. 214

చ. తఱిమి సుశర్మఁ గిట్టి యతిదారుణభంగి రణంబు సేయ వాఁ
డుఱక నిశాతసాయకము లొక్కమొగిం బది మేనియందుఁ గ్రు
క్కఱియఁగఁ జేసి నాలుగిట నేసెఁ దురంగములన్ యుధిష్ఠిరుం
డఱిముఱిఁ జంపె సారథిఁ దదశ్వములన్ వరబాణపాణి యై. 215

వ. అయ్యవసరంబున మత్స్యమహీనాథుండు జనితోత్సాహుం డై. 216

ఆ. ఆసుశర్మ తేరియం దున్నఘనగదా, దండ మెత్తికొని యుదగ్రవృత్తి
జరఠదేహుఁ డయ్యుఁ దరుణవయస్కు న, ట్లనికి నుఱికి పోయి యతని వ్రేసె.

క. అట్టిసమయమ్మునఁ గరువలిపట్టి త్రిగర్తేశురథము పై కుఱికి వెసం
బట్టికొని యతనిఁ బెడగే, ల్గట్టి పెలుచ నార్చెఁ దద్బలము వెల్లగిలన్. 218

వ. ఇట్లు సుశర్మం బరాజితుం జేసినఁ జక్రరక్షకుం డైనకోణాశ్వుండు మొదలుగా నాప్తభృత్యవర్గంబు ననుజుం డైనసువర్మ లోనైనబంధుజనంబులు నాదిగాఁ గలపరి

హారంబు పలాయనపరాయణం బగుటయు వెనుకొని యెయిది గోధనవర్గంబు మరల్చి కరితురగరథంబులం దలమిాఱి పొదివి తెచ్చి యన్నపాలికి వచ్చి తాను మున్ను త్రిగర్తేశురథంబుకడ నిలువ నియోగించి యున్నతమ్ములం గూర్చుకొని తమయంతవట్టును నొక్కట విరాటునకుం జూడసూపిన. 219

క. ఆదరము సంభ్రమంబును, మోదంబును దనమనమున ◆ ముప్పిరిగొన నా భూదయితుండు వివిధప్రియ, వాదంబుల గారవించె ◆ వారల నెల్లన్. 220

వ. ఇట్లు సంభావించి పాండవాగ్రజు నవలోకించి. 221

క. మానముఁ బ్రాణముఁ గాచితి, దీనికి సరి గాఁగ నీమఱదికిఁ బ్రియ మెసఁగం గా నాకుఁ జేయ నయ్యెడు, దాని నెఱుఁగఁ గాన మత్పదము నైకొనవే. 222

తే. ఒడలు సిరియును నాకు నీకయొసఁగినవియ, కాన దగ సమర్పించెదఁ ◆ గరుణ నీవు సమ్మతించి యిమ్మత్స్యదేశశంబుఁ గావు, పంచి పనిగొని నన్ను రక్షించికొనుము.

వ. అనిన విని యజాతశత్రుం డతనికి ట్లనియె. 224

చ. మనుజవరేణ్య నావలనిశమన్నన యట్టిద కాదె శత్రుమ
ర్దన మొనరించి మత్స్యనగరంబున కుత్సవ ముల్లసిల్ల నీ
చనుటయ నాకుఁ దేదమును ◆ సంపదయుఁ గరిమంబుఁ గాక యి
ట్లనఁ దగునయ్య యే నిచట ◆ నైనది తోటిది యింత యేటికిన్. 225

క. అనుపలుకులకును విస్మయ, మును సంతోషమును జిత్తమునఁ బెనఁగొన నా జనపతి ధర్మతనూభవుఁ, గనుఁగొని యిట్లనియె మఱియు ◆ గౌరవ మెసఁగన్.

క. ఉపకారమె బంటుతనమె, కృపయో పెంపో సమగ్రకీర్తిప్రియమో రిపుదుస్సహ మగునీరణ,నిపుణతకుం గారణంబు ◆ నెయ్యమొ యెఱుఁగన్. 227

ఉ. మంటయుఁ బోనిశాత్రవసమాజము నించుక యేని శంక లే
కంటఁగఁ దాఁకి వెండి తెగటార్చి మహాద్భుతశక్తిశాలి యీ
వంటలవానిచేసినయవార్యపరాక్రమ మెందుఁ జోలలం
గంటిమె వింటిమే యిలఁ డ ◆ కాఁడె వెసఁ గెలిపించె నన్నినిన్. 228

క. కంధరములు దెగి తలలు వ,సుంధర నతిపక్వతాలసుఫగఫలాళీ బంధురత రాలు దామ,గ్రంథి పగఱమిాఁదఁ గినిసి ◆ కవిసినయెడలన్. 229

క. ఎక్కడఁ జూచినఁ దానై, యక్కజ మగుకడిమికలిమి ◆ సరిసేనఁ గలం బు కృ్కఱఁ దంత్రీపాలుం, డొక్కఁడ పాలియించె సిరసోత్సాహమునన్ 230

క. ఈనలువురు దక్కఁగ మన, సేనల నొక్కరుని నైనఁ ◆ జేద్వృథవిభటుం గానం జెలి కెడ రైనం, బూని తలఁగునతఁడ చూపె ◆ పురుషుం డెందున్. 231

ఉ. కావున మాకు దంతిహయకాంచనరత్నవిభూషణంబులుఁ
దేవనితంబినీజనసద్భృత్యమృగాక్షులు నాది గాఁగ నా
నావిధవైభవంబులు మకనంబులవాంఛలకుం దగంగ నీ

కేవిధి నీఁగ వాఁడ ఋణ మెయ్యది యేనియు వేఁడుఁ డిచ్చెదన్. 232

క. అనవుడుఁ బాండుతనూభవు లనఘా యిక్లింతయుం బ్రియంబున సంభా
వన సేసితి మా కిది యే. ధనము వడయుదానికంటెఁ దక్కువె చెప్పుమా. 233

ధర్మరాజు సుశర్మను సపరివారంబుగా విడిపించుట.

వ. సుమ్మెరవుగాఁ దలంచి యియ్యెడ నిట్టట్టన వలవదు పురంబున కరిగి యయ్యెడ
నీ కెల్లఁ బ్రియం బట్లు మన్నింపు మని రందుఁ గంకుండు మఱియు నిట్లనియె.

క. తగ నొక్కటి వేఁడెద నిను, జగతీశ్వర యిచ్చు టొప్పు సరథగజాశ్వం
బుగ విడిచి పుచ్చు మిప్పుడ, త్రిగర్తపతి నిదియ నాకుఁ బ్రియ మెబ్భంగిన్.

వ. మననగరంబునకు జంఘాలురం బంపుము పురంబున వారలు పోయి భవద్విజయ
ఘోషం బాచరించి శోభనధ్వజోన్నయనంబును మంగళతూర్యనాదంబులును బర
స్పరగంధసలిలసేచనంబును గీతవాద్యనృత్తంబులును నాదిగాఁ గలవివిధశుభా
చారంబులం బ్రవర్తింప నియోగింపవలయు ననిన విరాటుండును బనిచినం గాలరు
లు వేగునంతకు వీటికిం జని గెలుపు ప్రకటించి పట్టణాలంకరణప్రముఖనిఖిలభద్ర
విధానంబులు సేయించి రిట పాండవులును మత్స్యమహీవల్లభుండును సమస్తసేనా
సమేతులై విభవం బెసఁగ విలసిల్లుచు లజ్జావనతాననుం డగుసుశర్మ సపరిచ్ఛదం
బుగా విడిచి పుచ్చి గుత్తులకొలందికిఁ గ్రొత్తంబు లయి పడి యున్న పాదంబుల
వలనం గెందలిరులసెజ్జలచందంబు లగుచోట్లును దునిసి చిక్కువడి యున్న యూ
రుకాండంబులవలన మదగజంబులు సొచ్చినకదళీవనంబులం బోనియెడలును
బ్రోవులు గొని యున్న ప్రేవులవలన లావు గలయుంచపిందు పేరాఁకలి నతిముఱిం
దేలిన గుఱుకులు గట్టినమృణాళనాళంబుల నొప్పుకమలాకరోద్దేశంబులఁ బ్రేణి
సేయు ప్రదేశంబులును నంగుళీయకరుచు లడర నెఱిం జాఁగి పడి యున్న బాహుదం
డంబులవలన నురగనివాసంబుల ననుకరించుతలంబులును గీలాలజలంబులపయిం
దేలుచు నవ్వినట్లున్న శిరంబులవలన వికచారవిందదీర్ఘికల విడంబించుతావులును
నవయవభేదంబు లడంగునట్లుగాఁ దుత్తునియలై పడియున్నగాత్రంబులవలనం గ్ర
వ్యాంతమహానసశాలలపగిది నొప్పుపట్లును గలపొలికలను గలయం గనుంగొనుచు
వెడలి చంద్రికాసుందరం బగునొక్కసైకతస్థలంబున నారాత్రి పుచ్చిరని చెప్పిన
విని మఱునాఁటివృత్తాంతం బెట్లయ్యెనో యని సాదరంబుగా నవలోకించిన. 236

చ. అపరిమితప్రకార వినిర్గత సమస్త వికార షట్ప్రమా
ణపరమదూర గాఢభజనక్రమగత్యనుభావసార దే
వపితృపథప్రవర్తన వివర్జననిర్మలచిత్తచోర శాం
తిపర మహాత్మ సంసరణశీతల నిరంజన భక్తరంజనా. 237

క. విజ్ఞానానందరసా, భిజ్ఞహృదయకమలహంస భీమదురితమ

రజ్ఞవివిధాభిధానా, యజ్ఞాత్మకరూప నిశ్చలావ్యయదీపా. 238

మాలిని. త్రిజగదవననిత్యక్రీడనోద్యత్ప్రమోదా
రజనిచరవిఘాతారంభలీలావినోదా
భజననిరతసౌఖ్యప్రాప్తిజాగ్రత్ప్రసాదా
నిజతనువిభవతోషోన్మీలనాచ్ఛిన్ననాదా. 239

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ దృతీయాశ్వాసము. 240

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము

## విరాటపర్వము, చతుర్థాశ్వాసము.



మదరేఖ విహారవి
రామాహితగాఢశమధురానిర్భరని
ష్ఠాముద్రితవివిధవికా
రామలచేతోనివాస హరిహరనాథా. 1

భూమింజయుఁడు గోవుల విడిపింపఁ గౌరవులతోఁ బోరుటకుఁ బో నెన్నుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

క. సూర్యోదయావసరమున, దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా,చార్యకృపసుతాదియోధసంఘోద్భట మై. 3

వ. నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటుపశుగణంబులం బొదివె నట్టి
యెడ ముక్కడిమూఁకలు సని యెక్కడెక్కడ నని తలపడినం గృపాశ్వత్థామ
శకుని దుశ్శాసన కర్ణ దుర్ముఖ ప్రముఖరథికజనంబులు గోపాలవర్గంబు నసర్గళ
ప్రసారం బగుశరాసారంబునం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి వెగ్గ
లించి గవాధ్యక్షుండు రథంబు గోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగు
దెంచి రాజమందిరద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబున
నున్నభూమింజయుం గాంచి ససంభ్రమంబుగా ని ట్లనియె. 4

మ. ధరణీచక్రము సంచలింపఁగ సముద్రాంతంబు లై క్రిక్కినం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెం గోవర్గముం వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపుక్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజోత్సాహంబు శోభిల్లఁగన్. 5

ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతను,త్రాణ ముగ్రచాపబాణపూర్ణ
తూణఘనగదాసితోమరచక్రాదు, లనువుగా నొనర్పు మతిరయమున. 6

చ. విరటుఁడు నిన్ను నెన్నఁ బదివేవురముందటఁ జెప్పు బాహువి
స్ఫురితుఁడు శౌర్యశాలి కులభూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు గా
తరపరిరక్షకుం డనుచు దానికి నీవుగఁ జేయు మిత్తఱిన్. 7

క. అని కాంతాజనములలోఁ, దను నగ్గించుటయుఁ బొంగి • దర్పోద్ధతి ని
ట్లను నుత్తరుండు దసమున, మున సంగరకౌతుకంబు • ముడివడు చుండన్. 8

ఉ. ఎత్తినఁ గొందుఁ గౌరవుల • నెల్లను వార్కిని గేని గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ • దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ • నుండెద నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప • నెంతయు నేర్తు, రథం బనం బురిన్. 9

క. తగుసారథి దొరకొనినం, బగతుర భంజింతు నంతెపని కదుపుల ద
వ్వఁగఁ గొని పోదురొక్కో యి, ట్లగునె కలండేని సూతు • నరయుం డెందున్. 10

చ. కురుపతిభీష్మకర్ణకృపకుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టు గిట్టె సం
గరమున నోర్చి యేఁ బసుల • గ్రమ్మఱఁ దేరక యున్న నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరి • వారముఁ జిత్తములందు మెత్తురే. 11

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 12

క. విని ద్రుపదధరణిపతినం, దన సామర్థ్యాపహాస • తరళహృదయ యై
చని తద్వృత్తాంతము మె, త్తనిపలుకులఁ జెప్పె నింద్ర • తనయునితోడన్. 13

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె నీవు పోయి వారలతో ని ట్లనుము మనబృహన్నలకు సారథ్యంబు సేయుసామర్థ్యంబు గలదు తొల్లి ఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథి యై యతని చిత్తంబు వడసె మఱియుఁ బెక్కెడలం దదీయం బగురథంబు గడపెఁ దాన యై యుండు నేను నెఱుంగుదుం దత్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింప వచ్చుటకు సంశయంబు వలన దనుము వా రే మనకేని మఱియుం దగ నాడి నన్నుం బిలిపించునట్టి తెఱంగు గావింపు మన నట్ల చేయుదు నని సైరంధ్రి యుత్తర యున్నయెడకుం బోయి. 14

చ. జనపతినందనుండు దగు • సారథి నారయు చున్నవాఁ డతం
డనపని సెప్పఁగా వలయుఁ • గ్రీడి మనంబున మెచ్చునట్టి నే
ర్పును భుజశక్తియుం గలిగి • రూఢికి నెక్కినసూతవృత్తి మై
నని సడి సన్నయే డ్తెఱ బృ • హన్నలకుం గల దంబుజాననా. 15

తే. అర్జునునకు ఖాండవదహ • నాదు లైన, విక్రమము లాబృహన్నల • నెరవులావు
గాదె జయ మొనరించె లో • కంబు లెఱుఁగ, నుచిత దీని నెఱింగింత • ముత్తరునకు.

క. అని యమ్ముదితయుఁ దానును, జని యతనికి న త్తెఱంగు • సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి, ట్లనియెం బాంచాలితోడ • నల్లన నగుచున్. 17

తే. అకట సైరంధ్రి నన్ను వి • కట్లాలిగొనఁగ, నేల చక్కఁగఁ గను విచ్చి • యేను బేడిఁ
జూడఁ బోయుదు రణమున • సూతకృత్య, భరము దాల్చుట కెమ్మెయిఁ • బనుచువాఁడ.

వ. అదియునుం గాక 19

చ. కురుబల మేఁగుదెంచె నని గోవుల బట్టుఁ బట్ట దానిపైఁ
బరిగొని శౌర్యసంపదయు బాహుబలంబును జూపఁ బూని యే
నరిగెద నట్టి తేరికి బృహన్నల సారథి యైన దీని న
వ్వారె పురిలోన నింతకఱవా రథచోదకు లింత యేటికిన్. 20

వ. అనిన విని సైరంధ్రి యతని కి ట్లనియె. 21

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తి వచ్చినం
దేరు బృహన్నలావశగతిం జరియించిన గెల్వవచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథివీవరనందన మున్నెఱుంగుదుం
గారణజన్మ మైతనువికారము వచ్చినఁ బెంపు దప్పునే. 22

వ. అనవుడు. 23

క. మన మురియాడుచు నుండఁగఁ, దన కొరు లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం, బనుచుట కోడఁబడినపలుకు పలుకుటయుఁ దగన్

వ. సైరంధ్రి దెసఁ గనుంగొని యేను బోయి తోడ్కొని వచ్చెద నని పూని.

సీ. అడుగులనునుఁగాంతి నయ్యెడ పద్మరాగంబుల నెలకట్టు కరణి నొప్పఁ
బాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు నసదుఁగౌఁదీఁగె యల్లాడుచుండఁ
దతివేచి వెనువెంటఁ దగులు కామాంధకారములీలఁ గ్రొవ్వెద గొమరుమిగులఁ
గర్ణభూషణకాంతి కప్రభాడోలన, విూషుణ దీప్తుల నినుమడింప

తే. నందియలమొరపంబున కరుగుదెంచి ప్రోది రాయంచ రయమునఁ బోవునవ్వి
ధంబు దగ నభ్యసించుచందమునఁ దోన, చనఁగ నుత్తర నర్తనశాల కరిగె. 26

ఆ. మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱఁగున నాట్యమం, దిరము సొచ్చి తనదు గురువు కడకు
నరిగి నెమ్మి నిట్టు లను నింతి ప్రార్థనా, వినయసంభ్రమములు పెనఁగొనంగ. 27

క. ఇచ్చట నొకకయ్యంబునఁ, జెచ్చెర మదీయాగ్రజన్ము సారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం, డచ్చపఱుపఁ డయ్యె నీ క్రియకు నొండొకనిన్. 28

వ. అది యెట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన నన్న సన్నద్ధుం
డై వెనుకం దగుల సమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన
నీకందువ సైరంధ్రి సెప్పినం బ్రియం బంది నిన్నుఁ దోడ్తేర నన్నుఁ బనిచిన నేనును
నీపాల నాకుఁ జనవు గలుగుటం జేసి యెల్లవిధంబులం దెత్తునని పూని వచ్చితి నీవును
నాపలుకులు గుఱుచ సేయక నీపెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తరకుమారునకు
రథంబు గడపనియ్యకొని యియ్యాపదఁ దలఁగవలయు నిట్లొడంబడక తక్కుట
నావలనివాత్సల్యంబు గొఱంతపఱుచుట యనిన నమ్ముద్దియపలుకులు ముద్దుసేసి.

క. నగుచు బృహన్నల యి ట్లను, జగతీశ్వరపుత్త్రి నాకు సారథ్యము ని
ర్వ్ప గలదె నీమాటకు నే, మిగులంగా వెఱతుఁ బొదము మీఁద ట్లుండెన్

క. భవదీయప్రార్థనచేఁ, బెదివిరి పరమదుష్కరములు దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార,థ్యవిధం బొకఁ డనఁగ నేల యంబుజవదనా. 31

వ. అనుచు సంగీతనిలయంబు వెలువడి సలీలంబుగా మెత్తమెత్తన నడతెంచుచు మత్త
శుండాలంబునుంబోలె. 32

ఉత్తరుఁడు బృహన్నలను దనకు సారథిఁగాఁ జేసికొనుట.

తే. అరుగుదెంచుబృహన్నల నంత నంతఁ, గని నృపాలసుతుం డను గారవమునఁ
గౌరవులతోడఁ గయ్యంబు గలిగె నాకుఁ, గడఁగి నేఁడు రథ మ్మాఁపు గడపవలయు.

క. నీ రథము మైమఱువుఁ దొడి, తేరొక్కుము దప్పఁ గ్రుంకఁ దీఱదు నీకున్
సైరంధ్రి సెప్పె నీ దగు, పేరమ్మున పెంపు లావు వెరవును మాకున్. 34

చ. అనుటయు నాటపాట గలయప్పటికిన్ ననుఁ గోరి పిల్వఁ బం
చినఁ దగుఁ గాక సంగరముచేతకు సారథిగమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁ డైనయొ
క్కని రథ మేర్పడం గడపఁగా నియమింపుము రాజనందనా. 35

వ. అనిన విని వైరాటి కిరీటి కిట్లనియె. 36

ఉ. ఖాండవ మేర్చునప్పుడు దగంగ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము గల్గ నొనర్చినయట్టిబుద్ధియున్
దండితనంబు నీయెడన తక్కెనె నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాట దక్కుము రణోత్సవసం బొనరింపు గ్రక్కునన్. 37

తే. అనిన నాతనిమాటకు నడ్డమాడ, వెఱచినట్టి తెఱంగు భావించి యల్ల
నియ్యకొనుటయు నమ్మును వేంద్రసుతుఁడు, దృఢతనుత్రాణ మతనికిఁ దేరఁ బనిచె.

క. తెప్పించి తొడుగు మీ వని, యొప్పించిన నిట్టు నట్టు నొఱవలు గా మైఁ
గప్పికొని యాబృహన్నల, యప్పుడు నగుపించె నచటియబలాజనమున్. 39

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ, దత్తనుపున మఱువు దొడిగి తానును హృద్యో
దాత్తం బగుకంటక మిడి, చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడిపడఁగన్. 40

వ. బృహన్నల నవలోకించి. 41

క. హయములఁ బూన్పుము రథమున, రయమున సిడమెత్తు మిపుడ రావలయును గో
చయము గొని యస్మదీయవి, జయ మభినందింపఁ బురము జను లెదురుకొనన్

తే. అనిన నీ వేమి పనిచిన నట్ల చేయ, వలయు నీ వున్నయెడ నుండవలయు నీవు
సన్న సేఁ జనవలయు నాకెన్న క్రిమ్మెఱుఁగి, పంచి పనిగొనిక డిమిమైఁ బగఱ గెలుము.

వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నాధనంజయుండు. 44

క. కాంచనజాలాలంకృత, చంచత్తనులీల మెఱయుజవనాశ్వములం
బూంచి రథంబున మణిమయ, పంచాననకేతు వెత్తె బంధురభంగిన్ 45

వ. ఇట్లు సన్నాహంబు మెఱసినసారథిం జూచి యుత్తరయుం జెలులు నిట్లనిరి. 46

క. కురువీరుల గెలిచి తదం, బరములలోఁ జిత్రవర్ణ । భాసురములు గాఁ
దర మెఱిఁగి లోచనోత్సవ, కరములు గా బొమ్మపొత్తి । కలకుం దెండీ. 47
క. అనుడు బృహన్నల యి ట్లను, జనపాలకనందనుండు । జయలక్ష్మిం జే
కొను నపు చీరలు దెచ్చుట, పనియే యటు సూడఁ డెల్ల । భంగులఁ దెత్తున్. 48
వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాదివివిధసాధనంబులు రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగ లెక్కి పగ్గంబుల స్రుక్కు సక్కం జేయు నుత్తరుండును బసులం బట్టిన దెస గోపాలకు నడిగిన వాఁడు పితృవనంబువల నని చెప్పిన వినుచు రథారోహణంబు సేసి వెడలి పౌరవృద్ధపుణ్యాంగనాభూసురసమూహంబులు బృహన్నలం జూచి తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున నయినమాంగల్యం బెట్టి దట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడు మని దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముం డయినయాఫల్గును నైపుణంబున వల్గదశ్వం బగురథంబురయంబునకు మెచ్చుచుం బరేతనిలయప్రాంతప్రదేశంబు సేరం జని.
సీ. అభినవజలధర । శ్యామంబు లగు నెడ, లాకుజొంపంబుల । ననుకరింప
సాంధ్యరాగోపమ । చ్ఛాయంబు లగుపట్లు, కిసలయోత్కరములఁ । గ్రేణిసేయ
రాజమరాళగౌ । రము లగుచోటులు, దఱచుఁబూఁబొదలచం । దంబు నొంద
హరిద్రరుచిసమా । నాకృతు లగుతావు, లడరెడు పుప్పొడు । లట్లు మెఱయఁ
తే. గలయ నెగసి ధరాధూళి । లలితవనము
దివికి నలిఁ గాఁపు వోయెడు । తెఱఁగుఁ దాల్ప
గోగణము ముంగలిగ నేల । గోడివడఁగ
నడచుకౌరవరాజసై । న్యంబుఁ గనియె. 50

ఉత్తరుఁడు కురుసైన్యంబు గనుంగొని భయభ్రాంతుం డగుట.

క. కని యుత్తరుండు గరుపా, ఱినమేనును దలఁకుమనము । ఱిచ్చవడినచూ
పును నై తొట్రుపడుచు ని, ట్లనియె దిగులు పొచ్చి యాబృ । హన్నలతోడన్. 51
శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరా । భీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరా । కీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలా । త్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది యేఁ । జేరంగ శక్తుండనే. 52
క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా, గుకవిద్యాపారిధిమై ని । రూఢు లయినయా
శకుని జయద్రథ దుర్ముఖ, వికర్ణ కర్ణాది యోధ । వీరుల కెదురే. 53
క. ఇట్టుగు లెఱుఁగక వచ్చితి, మెట్టొకొ మనభంగి వీర । లిందఱును గడుఁగ్
బెట్టిదులు మనకు మార్కొను, నట్టికొలఁది గాదు భీతి । యడరెడుఁ దోడ్తోన్.
ఉ. కౌరవసేనఁ జూచి వడఁ । కం దొడఁగెన్ మదితోన మేను నీ
ప్పారక పోవు చున్కి యిది । యొప్పనె యిప్పటిభంగిఁ జూచిన

న్వీరల నేను మార్కొనమి । నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు । దీపన మున్ విన వే బృహన్నలా. 55
అనిన దరహసితవదనుం డగుచు శతముఖతనయుం డతని కి ట్లనియె. 56
అసదృశలీలఁ బోల్చురథికావలిమీఁదఁ జనంగ వెట్టినే
మసలక యామిషంబు గొని । మార్గము వట్టినతుచ్ఛసైన్యమున్
వెసఁ జని ముట్టి గోధనము । వేగ మరల్తము గాక యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరలఁ । బాడియె నీకు నరేంద్రనందనా. 57
అంతిపురంబులోనఁ గలయంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ । జయ్యనఁ దెచ్చెద నంచుఁ బూని నీ
వెంతయు మేటివై యరద । మెక్కి రయంబున వచ్చి యిచ్చటన్
దంతితురంగసద్భటకదంబముఁ జూచి కలంగు టొప్పునే. 58
క. అనినపలుకులకు బృహన్నలఁ గనుఁగొని, మెలుఁగు వడఁక నాతఁ । డిట్లనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ । బడఁతులసంతోష, మేల నాకు నవికిఁ । జాల నేను.
వ. అనవుడు. 60

చ. తనభుజశక్తియున్ రిపులదర్పము నేర్పడఁ జూచి చూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది । లోకముచక్కటి శూరు లైన దీ
నిని మది మెచ్చ రీబలము । నీదెసఁ దేజియుఁ జూడ దింతకున్
మును భయహేతు వైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 61
సీ. దెసలు బీఁటలు వాఱఁ । దివురు చిందములకో, లాహలంబులకుఁ గలంగఁబడక
యురవడి సేనలు । దెరలఁ బైఁ దోఁతెంచు, ధూళి పెల్లడరినఁ । దూలపోక
చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన, యగ్గలికమునకు । బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథివర్గంగ, తతి నాటుతఱిమునఁ । దల్లడిలక
తే. బహువిధంబులఁ బగతురబరవసమున, నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి । నెగడుఁగాక, దవ్వుదవ్వుల నిల్లైన । నవ్వ రెట్లు. 62
చ. అనుదివిజేంద్రనందనున । కమ్మనుజేశ్వరసూనుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు । విక్రమసంపద సొంపు మీఱ గో
ధనములఁ బట్టినం బతి యుదగ్రత సైన్యము లెన్ని యన్నియుం
గొని యట వోయెఁ గాన మనకుం బురి బాసట లేర యెవ్వరున్. 63
తే. ఒంటి దలపడి కురుసేన । నోర్చువాఁడ, నే ను దేటికి వెడమాట । లిట్లు లాడ
వారు గానక ముందఱఁ । దేను దోలు,కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి.
వ. అనినం బార్థుండు పార్థివనందనున కి ట్లనియె. 65
క. వెగడొంది యిట్లు వలుకఁగ, నగునే పగతురు ప్రమోద । మందఁగఁ బసులన్

దిగ విడిచి పురజనంబులు, దెగడంగా మగిడి పోక । దీనత గాదే 66

వ. అట్లుం గాక. 67

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె దా । నం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితి వీవు బంటుతనమ । ల్లగ్గించి పౌరాలి దీ
వన నిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గో । వర్గంబుఁ గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త వోదునె భయో । త్కంపంబు నీ కేటికిన్. 68

తే. చిత్తవృత్తి యొక్కించుక । చిక్కఁ బట్టు, మిపుడ కౌరవసైనికు । లెల్లఁ జూచి
వెఱఁగుపడ వేగమును లావు । వెరవు మెఱయఁ, గదుపుఁ బెట్టించి పోదము । గ్రమ్మఱంగ.

వ. అనుచు వివ్వచ్చుండు గడంగి తేరు వోవ నిచ్చుటయు నాననంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్లభకుమారుండు. 70

క. దవ్వుల విఱిగినఁ బౌరులు, నవ్వుదురట మేలు మేలు । నను నాఁగకు నీ
క్రొవ్వాఱుగ దేనిఁ దలపడు, మెవ్విధిఁ జని తేని ననుచు । నుత్తరభీతిన్ 71

క. శరములు శరాసనము న, య్యరదముపై డిగ్గ విడిచి । యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం, బురిదెసకును లజ్జ పీటఁ । బోవం బాఱెన్ 72

వ. ఇట్లు వాఱినం దనమనంబునం గుత్సించుచు బీభత్సుండు యుగ్యంబులపగ్గంబులు నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి లంబకేశభారుండును నాందోళితరక్తాంబరయుగళాంచలుండును నగుచు నతనివెనుకం బఱచుసమయంబున నిలిచి కనుంగొనుకౌరవబలంబునందు. 73

ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డప । హాసము సేయుచు గూఢరూపగే
ళాజ్ఞత లేమిఁ దద్వికృత । కాయముమీఁదను దృష్టి నిల్పఁగాఁ
బ్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు । బాహులదీర్ఘతయుం భటత్వత
త్త్వజ్ఞతయున్ గళస్ఫురదు । దాత్తతయుం గని సంశయంబుతోన్. 74

తే. ఆఁడుఁజందంబుఁ బురుషస । త్త్వాకృతియును
గలిగి యున్నవి యొప్పు నా । ష్ఠలతసొంపు
వికృతవేషాకృతంబులై । వెలయ కితఁడు
నివురు గవిసిన మెఱయని । నిప్పుఁ బోలె. 75

ఉ. బాహులచాయయున్ గమన । భంగియు నర్జునుసట్ల దీస సం
దేహము లే దితండు తన । తేజము దాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడి యనఁ । గీడ్పడి యుండెనొ కాక యూరుగు
వ్యూహముతోడి కయ్యమున । గొండొకరుం డిటు లొంటి వచ్చునే. 76

చ. పరటుఁడు దక్షిణాంబునకు । వీరుల సారథులన్ నిజాజ్ఞకై

పురిఁ గలవారి నెల్లఁ గాని పాయిన నొండులు లేమిఁ జేసి యు
త్తరుఁ డిట వచ్చు చుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు సూడఁగన్.

చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టి రనన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁ జొచ్చె ని
ప్పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ డేమియున్. 78

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగు చుండ శుండాలరయలీలాసముల్లేఖం బగు గమనంబునం బురుహూతపుత్త్రుండు పదశతమాత్రప్రదేశపలాయితుం డైన భూమింజయు నెయిది పట్టికొనిన నతండు. 79

సీ. వెలవెలఁ బాఱుచు వెగడొందుఁ బెదవుల. తడి యాఱ నెంతయుఁ దల్లడిల్లి
జల్లన నంగంబు లెల్లనిండఁ జెమర్చఁ, బదములుఁ గరములుఁ గుదియ వడఁకు
హృదయంబు తటతట నదరంగఁ బెలుకుఱు, దీనదృష్టుల మోముఁ దేఱిచూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడుమని, ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప

తే. నిష్కళతశుద్ధహేమంబు నిర్మలోజ్జ్వ
లాష్టనై మార్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూరుఁ బురము సొచ్చి
నపుడ యిచ్చెద నీ కను నార్తుఁ డగుచు. 80

క. నాతోడి ప్రేముడిం గదు, నాతుర నై యెదురుచూచునంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయమఁ బొడ, సూతుం బో నీఁగ దే విశుద్ధచరిత్రా. 81

అర్జునుఁ డుత్తరునిఁ దనకు సారథిగాఁ జేసికొనుట.

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించు చుండం బార్థుండు నగుచు నతనిం దేరు సేరం దెచ్చి. 82

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న
త్తెఱఁ గది యేల నీ కుడుగు తేరికి సారథి గమ్ము నాకుఁ జి
చ్చఱపిడు గట్టు లట్టడరి శూరులమొత్తము నుగ్గు సేసెదం
బఱపెద సేన రాజుధృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్. 83

క. అనుచు నొడఁబాటు లేకు, న్నను నయ్యుత్తరుని నొగల నదుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి, చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలన్. 84

వ. ఇట్లు సవ్యసాచి నిక్షిప్తాయుధం బైన శమీవృక్షసమీపంబున కరుగునవసరంబునం గ్లీబరూపచ్ఛన్నుం డయ్యును బ్రస్ఫురణవిశేషభీషణుం డగు నతనిం గనుంగొని కౌరవసైనికులు గలంగినమనంబులతోడ నివ్వెఱపడి యుండ వారలం గనుంగొని

తోఁచు నుత్పాతంబుల నాలోకించి గురుం డిట్లనియె. 85

క. మాసె నభోమణి నక్కట, గాసెం గలయంగ దెసలఁ గ్రుం బలుసాయల్
సేసెం బఱమొయిళు లడరి; మ్రోసెం దమయంతఁ దూర్యరవము లపధ్వనులై 86

క. ఇగ్గజములు మిన్నకయును, మొగ్గెడు నుత్తమతురంగమములు బాష్పజలం
బగ్గలము విడుచుచున్నవి, దగ్గెడుఁ గారణము లేక తడఁబడి పడఁగన్. 87

క. దగ్ధము లైనట్టులు న, మ్యగ్ధైర్యము లెడలె మండె నాయుధచయముల్
దిగ్ధామం బెసఁగె నసం, దిగ్ధము మన కాజి యగుట దీనికిఁ దగఁగన్. 88

క. మొన లొఱపుగఁ దీర్చికొనుఁడు, దనతనవాహనము లాయుధమ్ము లెల్లజనం
బును ననువుసేసికొనుఁడో, పినయంతయుఁ గాచికొనుఁడు బెదరక పసులన్. 89

వ. అని చెప్పి తా నప్పు డర్జును నెఱింగినవాఁడు గావున నతనికి నజ్ఞాతవాససమయ
భంగం బగునో యనుభయంబున సురనదీసూనువదనంబు వీక్షించి సన్నవాఁ
డి ట్లనియె. 90

చ. పెరవరి గాఁడు వీఁడు కురువీరులకుం బొడసూపువాఁడె య
చ్చెరు వొకమ్రానిపేర నిట సేరఁగ వచ్చుచున్నవాఁ డహం
కరణము గాని యొండొకటి గానఁడు సూత్రవిశేష మారయన్
సురపతియట్ల వీనిమది చొప్పది యెట్లొ యెఱుంగ నయ్యెడున్. 91

క. అనిన విని యెఱిఁగికొని యా, తనిమది సందియము మాన్పఁ దలఁచి నరేంద్రుం
గనుఁగొనుచు నతనితోఁ జెప్పినభంగి నిగూఢవృత్తి భీష్ముఁడు పలికెన్. 92

క. తలఁపఁగ రిపులకు నిమ్మగు, కొలఁదిఁ గడచి వచ్చితిమి యకుంఠితబాహా
బలము నెఱపఁ దఱి యయ్యెను, జలింప వల దింక మనకు శత్రులవలనన్.

వ. అనవుడు నాచార్యుం డయ్యర్థంబు గనుంగొని పార్థునకు సమయభంగంబువలని
సంకటంబు లేకునికికి మనంబున బ్రియం బంది మొగంబునం దోఁపనీక పుయి
లోట దక్కి యిట్లనియె. 94

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరక్ష్మాభిరామాకృతిన్. 95

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగువార లస్మదీ
యాతతసేనలోఁ గలుగు టారయ సంశయ మెల్లభంగి గో
వ్రాతనివర్తనంబు సుకరంబు కిరీటి కితండు రుద్రునిం
బ్రీతునిఁ జేసె నా వినమె పెంపెసలారెడు బాహుసంపదన్ 96

[illegible] కటకటంబడి కుంభసంభవసుతుఁ డిట్లనియె. 97

ఉ. పాండవపక్షపాతమునఁ । బల్కెడు నోరికి వచ్చినట్లు ని
న్నొండన రామిఁ జేసి యిది । యొప్పనె కౌరవసేన కెల్ల నొ
క్కండవ మేటి పిబలము । గర్వముఁ గుందఁగ నిట్లు శత్రుదో
శ్చండిమ కోహటించితి నిశాటుఁ బురుష నరుఁ డింతయుక్కడే. 98

తే. అతఁడు వచ్చెనేని । నస్త్రచిత్రముల, పాతచలితహృదయుఁ । బన్నఁ జేసి
వెగడుపఱిచి యోధ । పేసుల కెల్లను, త్సవ మొనర్తు బాహు । దర్ప మొప్ప. 99

వ. అనిన విని సుయోధనుండు రాధేయున కిట్లనియె 100

ఆ. తప్పఁ బలికి తీవు । సెప్పెద విను మిత్ర, దక్షుఁడుండ యేని । నడవి కేఁగి
ధాత్రియుతము గాఁగఁ । బండ్రెండువత్సరములును నండ నిలువ । వలయు మగుడ.

క. ఒరుఁ డయ్యెనేని మామక, శరాసనక్షిప్తదీప్త । సాయకపంక్తిం
బరిమార్చెద త్రైలిడిన, చ్చెరువుఁ బ్రమోదంబు నొంది । సేనలు వొగడన్.

క. అనుపలుకులకును భీష్ముండును ద్రోణుఁడు ద్రోణసూనుఁ । డును గృపుఁడును మే
లని యియ్యకొనిరి హృదయానురూపము లైన తెలివు । లాస్యముఁ బొందన్.

అర్జునుఁడు శమీవృక్షనిక్షిప్తం బైనగాండీవంబు గొనుట.

వ. అట్టియెడ శమీవృక్షసమీపంబున నరదంబు నిలుపం బంచి పార్థుం డుత్తరున కిట్లనియె. 104

క. ఇన్నగమునందు గాండివ, మున్నది యది గాని మద్భుజోద్రేకవిలా
సోన్నతి కోర్వవు పెద్దయు, నన్నువ లీ విండ్లు గుఱుచ । లలఁతిబలంబుల్. 105

క. ఇవి నీ తెగకోలఁదివి పీ, రవినోదమునప్ప దధిక । శరభసము లగుమ
ద్వివిధాటోపములకుఁ జా, లవు వి ల్లది నూఱువేలకా నరయంగన్. 106

క. వీనిఁ గొని గట్టిమెయు లు, వేనుంగును మఱియు నెట్టి । వేనియుఁ దునియం
గా నేయ నగునె కైదువు, లేని యలవుకలిమి పోర । తెక్కెయున్నె 107

వ. కావున నిమ్మహీరుహంబెక్కి యమ్మహనీయచాపంబు దెచ్చి యిమ్ము ధర్మజ భీమార్జుననకులసహదేవులు దమతమసమస్తాయుధంబులుఁ గూడం గట్టి యిందుఁ బెట్టినవారు కట్ట విడిచి యందు గాండీవంబు పుచ్చికొని తక్కటియవి యెప్పటి యట్ల బంధింపు మని చెప్పి శవాకారంబున నున్న శస్త్రాస్త్రసంచయంబు సూపిన భూమింజయుం డతని కిట్లనియె. 108

క. వీనుఁగు నంటఁగ నగునే. భూనాథతనూజుఁ డనక । పులియోడక న
న్నేనిచపుఁబనిఁ బనుపం, గా నీకుం దగునె పాప । కర్మము గాదే. 109

వ. అనిన విని ధర్మనందనానుజుం డత్యాదరంబున. 110

ఆ. మనుజు లంట నుండ । మఱువడఁ జేసిన, యస్త్రశస్త్రసంచ । యంబు గాని
శవము గాదు మత్స్య । జనపాలపుత్ర యే, నట్టి దైనఁ బనుతు । నయ్య నిన్ను. 111

క. నమ్ముము కైదువు మోవఁగ, నమ్మి వెసం బ్రాఁకి విడిచి । చాపము నొకం
డిమ్మనుజుఁ డేయునది లే, దమ్ముగ్ధుం డమ్మహీజ । మలసత నెక్కన్. 112

వ. ఇట్లుత్తరుండు సమారూఢసమీపవృక్షుం డగుటయు నరదంబుపయి నిలుచుండి పాండవమధ్యముండు వేవేగ విడువు మనవుడు నతండు నాయుధసంచయబంధం బెడలించిన. 113

క. మెఱసి యుదయించు గ్రహముల, తఱచు ప్రభలఁ గ్రేసేసి । దశదిశలం బ్రే
క్కిఱిసి వెడలె నా విండ్లన్, మెఱుఁగులు నృపతనయుదృష్టి । మిఱుమిట్లు గొనన్.

వ. అట్టియెడ నయ్యాయుధంబులు. 115

క. పెనుఁబాములచందంబున, నునికికి భయ మంది వడఁకు । నుర్వీశసుతుం
గని తగుమాటలఁ గుంతీ, తనయుఁడు వెఱ వాపుటయు న । తం డచలితుఁ డై

వ. పొదువు విరియం దట్టి కనుంగొని నిరూపించి సారథి యని సవ్యసాచిం బిలిచి యిట్లనియె. 117

క. ఇది యొకచాపము విస్మయ, మొదవించుచుఁ గొండచిలువ । యొకో నాఁ దగి య
న్నది ఖచితకనకకమలస, ముదయద్యుతిసముపగూహ । నోజ్జ్వల మగుచున్. 118

వ. దీనిం బాండవులయం దెవ్వరు ధరియింతు రని మఱియు బహువిధంబు లగు నాయుధంబు లుపలక్షించి వేఱువేఱ వానిచందంబు లుపన్యసించి యివి యెవ్వ రెవ్వరి వని యడిగిన నర్జునుం డిట్లనియె. 119

తే. తొలుత నీవు న న్నడిగిన । దొడ్డవిల్లు, గాండివము ఫల్గునున కేదు । గడయు నదియ
సమరమున దేవదానవ । సమితి నైన, గెలుచు నశ్రమమున దాని । వలన నతఁడు.

క. ఆద్యపురుషోపలాలిత, ముద్ద్యోతితరోచిరుద్గ । మోగ్రం బరిని
ర్భేద్యము దివ్యజనన మన, వద్యం బది కార్ముకైక । వరము కుమారా. 121

వ. అమ్మహనీయచాపంబు బ్రహ్మ శతసహస్రవర్షంబులు ప్రజాపతి చతుష్షష్టిసహస్రవర్షంబులు నింద్రుండు పంచాశీతిహాయనంబులు సోముండు పంచశతాబ్దంబులు వరుణుండు శతశరత్సమితియుఁ గ్రమంబునం ధరియించిరి వరుణుచేత నగ్నిదేవుఁడు వేడుకపడి పుచ్చికొని పదంపడి యద్భుతకర్మంబునకు మెచ్చి వివ్వచ్చున కిచ్చె నతండును నలువదేనేండ్లు ధరియింపం గలవాఁ డిట్లిది త్రిలోకపూజ్యమహిమ నొప్పుచుండు. 122

సీ. నీలోత్పలచ్ఛాయ । నెరసి సౌవర్ణవృ, షావలి నొప్పు బాణా । సనంబుఁ
దాళప్రమాణసుం । దరము నై భర్మశా, ఖామృగాంచిత మగు । కార్ముకంబుఁ
దీవ్రకుశానల । దీప్తాకృతియుఁ గన, త్కనకమత్స్యంబులుఁ । గలుగుధనువు
మెఱుఁగారి సారంబు । మెఱయఁ గాంచనమయూ, రముల శోభిల్లుచా । పమును వరుసఁ

ఆ. బాండవాగ్రజుండుఁ । బవనపుత్త్రుఁడు నకు, లుండుఁ దదనుసంభ । వుండుఁ బట్టు

నవి కుమార యుగ్గవాజనకోశమ,హాశరంబు పార్థునదియ చూపె. 123

క. ఎద్దెసలం దనరుచులు స,ముద్దీప్తము లగుచు నుండ నుజ్జ్వల మగున
య్యుద్దండగదాదండము, పెద్దయు నెడ మెచ్చి పట్టు భీముఁడు పోరన్. 124

అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱింగించుట.

వ. అని చెప్పి మఱియు బాణకృపాణతనుత్రాణాదు లగువివిధసాధనంబులు వేఱువేఱ నిరూపించి గ్రక్కున నెఱింగించె నప్పుడు మూర్ఛాత్సుం డగునయ్యుత్తరుండు పాండవోత్తము నెఱుంగమి ని ట్లనియె. 125

క. ఈయెడ ని ట్లిమ్మహానీ, యాయుధములు వెట్టి యెచటి కరిగిరి మనకొం
తేయులు బృహన్నలా తగ, నీయెఱిఁగినయంతవట్టు నిక్కము సెప్పుమా. 126

వ అని సస్నేహంబును సగౌరవంబును సవిషాదంబునుం గా మఱియును. 127

క ఏ నమ్మహానుభావుల, మేనల్లుఁడ వార లార్యమిత్రులు శత్రు
ధ్వానాయకగర్వతమో,భానులు బంధుహితకార్యపరతంత్రాత్ముల్. 128

తే. అయ్యుధిష్ఠిరుఁ డెచ్చట నడఁగి యున్న.వాఁడొ భీమునిపార్థుని వర్తనంబు
లెయ్యెడల నేమిచందంబు లయ్యెనక్కటా విధాత్రుండ కవ లెందు డాఁగిరొక్కొ

క. భూపాలవల్లభాజన, దీపిక యనఁ జాలుద్రౌపదికి నెయ్యెడలం
దేపాటులు వాటిల్లెనొ, కాపురుషులవలన నిట్టి కాఱియ పుట్టెన్, 130

క. కపటద్యూత మొనర్చిన, నృపతియు దుర్యోధనాదినీచుల వలఁ బా
ఱి పడియెఁ గదుఁ జిక్కుడుమల, రిపుమర్దనవీర్యభుజగరిష్ఠుం డయ్యున్. 131

క. వినఁబడ రెచ్చోటను దమ, వినుతమహీరాజ్యమహిమ విడిచి చనుట నే
మని వినియెదనో నీచే, ననుడు నతం డిట్టు లనియె నాతనితోడన్. 132

వ. వారలకు వగవ వలవదు విధివశంబున వచ్చినయాపదకు నోర్చి బాస దప్పక తారును బాంచాలియు నొక్కటఁ బన్నెండేండ్లు వనంబున వసియించి పదుమూఁ డగునేఁ డజ్ఞాతవాసంబు సలుపవలయుట నిట వచ్చి మనవీట నవ్యాపన్నులై యున్నవారు వినుము వారి నెఱింగించెద. 133

క. కంకుఁడు ధర్మసుతుఁడు వల, లాంకుఁడు భీముండు కవలు హయశిక్షకగో
కింకరులు సెప్పఁ దొడఁగితి, నింకఁ గొఱఁత వెట్ట నేల యే నర్జునుఁడన్. 134

తే. అధిపనందన మాలిని యనఁగఁ బరఁగు,కాంత ద్రౌపది దానికై కాదె స్ఫీత
బలునిఁ దమ్ముల గంధర్వపతులు సంపి,రనఁగఁ జంపె మహోగ్రత ననిలసుతుఁడు.

వ. అనిన విని భూమింజయుండు సంభ్రమాశ్చర్యసంశయంబులు మనంబున ముప్పిరిగొనం దప్పక చూచి సవ్యసాచికి వెండియు ని ట్లనియె. 136

క. చిరకీర్తి పెంపుఁ డగున,న్నరునకుఁ బది గలవు భవ్యనామములు మనో
హరముగ నవి సెప్పుమా యొం, డరయుక యే నమ్మెదను బృహన్నల నిన్నున్.

వ. అనుడు నతండు సస్మితాననుం డగుచు నర్జునుండు ఫల్గునుండు పార్థుండు కిరీటి

శ్వేతవాహనుండు బీభత్సుండు విజయుండు జిష్ణుండు సవ్యసాచి ధనంజయుండు ననునివి పదియును నాపేళ్లనవుడు నుత్తరుండు పాండవమధ్యమున కిట్లనియె.

క. ఏమేమికతంబున నీ, నామంబులు సంభవిల్లె నరునకు నవి చే
తోమోదంబుగఁ జెప్పుము, నీమదిఁ దత్తద్విధంబు నిశ్చిత మేనిన్. 139

వ. అనుటయు నట్లు చేయుదు నని యతం డి ట్లనియె. 140

క. ధరణి యెల్ల గెలిచి తగ ధనంబులు గొని, యునికి నే ధనంజయుండ నైతి
నెట్టివారి నైన నెదిరినఁ బోర జ, యంబుఁ గొనుట విజయుఁ డండ్రు నన్ను.

తే. తెలుపు లగు వాహనములు నాకు తేర సమర
భూములం దెప్డు నియతిమైఁ బూన్కిఁ జేసి
శ్వేతవాహననామవిఖ్యాతి నాకు
సకలజనసమ్మతంబుగ సంభవించె. 142

వ. రవి యుదయించినట్లు సమరరంబున నాతలమీఁదఁ గాంతిమూ
ర్తి వెలుఁగు నిండ్రుఁ డిచ్చినకిరీట మభేద్యమహోగ్రసుస్థిర
త్వవిభవరూఢిమై జనులు దానవ సన్నుఁ గిరీటినామసం
స్తవనవిశేషపాత్రముగ సమ్మతిఁ జేసిరి మాత్స్యనందనా. 143

తే. వీరులకుఁ జూడ బీభత్సవిధము గలుగు, నట్టికార్యంబు సేతకు నెట్టిసమర
భంగులను దడఁబడక బీభత్స సేయ, నాన బీభత్సుఁ డనునభిధాన మయ్యె.

క. భండనమున నిరుగేలను, గాండీవము దివియ నేర్పు గలిగిన నం దు
ద్దండ మగుసవ్యకరము ప్ర,చండతఁ బరఁగుదు నను సవ్యసాచి యనంగన్. 145

తే. ధరణి దుర్లభ మగునవదాతవర్ణ, మూరిఁ గలుగుట నర్జునుఁ డండ్రు నన్ను
ఫల్గునాహ్వయ ముత్తరఫల్గునీవి, శిష్టకాలసంజననతఁ జేసి కలిగె. 146

క. అనిమొన వారోర్కని ప్రణ మేఁ, గనుఁగొన ధర్మజుని మేనఁ గావింపఁగ న
య్యనిమిషులుఁ జాల రెవ్వరుఁ, జెనకినఁ బరిమార్తుఁ గాన జిష్ణుఁడ నైతిన్.

క. పృథ యనుపేరు మదంబకుఁ, బ్రథితం బై యునికిఁ జేసి పార్థుఁడ నైతిఁ
బృథయుఁగఁ బలుకుదు నే యవి, తథవచనుం డైన ధర్మతనయునను జుఁడన్. 148

వ. ఈపదిపేళ్లును నివి కారణంబులుగాఁ బ్రకాశంబు లయ్యె సకలసురనికరంబు లడ్డపడినం బుండరీకాక్షసహాయుండ నై ఖాండవం బేర్చినప్పుడు మెచ్చి భద్రమూర్తు లైనరుద్రవిరించులు సన్నిధిసేసినం బెన్నిధి గన్నసేదచందంబున సంభ్రమించునాకుం గరుణించి కృష్ణుం డను నేకాదశనామంబును నప్రతిహాత బాణంబులు నొసంగిరి వారలయనుమతి నింద్రాదు లయినవిబుధులును వివిధంబు లగుదివ్యాస్త్రంబు లిచ్చిరి పదంపడి గీర్వాణులకు నోర్వరానియట్టివారి వరదాన గర్వితుల నివాతకవచు లనియెడుదైతేయుల మూఁటలిసారథికం బగునైంద్రస్యంద నం బెక్కి యొకరుండన మూఁడుకోట్ల నిర్జించితి దుర్జయు లగుహిరణ్యపురనివాసులఁ

నలువది వేవుర దేవారాతుల వారాశితీరంబునం బరిమార్చితి నప్పుడు ప్రీతుండై కదా గిరిభేది గిరీటం బొసంగె దేవసంఘంబు శంఖం బిచ్చె నద్ది గతంబుగా నచ్చిందంబు దేవదత్తం బనం బరఁగె మఱియు నెయ్యెడల నెవ్వరు దొడరినం జాలివోనిబలిమికలిమి వెలుంగుదు గాంధారీనందనుండు గంధర్వరాజుచేతం బట్టువడినయప్పుడు పదునాలుగువేల గంధర్వుల జయించి యతని విడిపించితి నీ వోడకు మీఁకూడినకురుబలంబుల గెలిచి కర్ణగాంగేయకృపద్రోణద్రౌణి దుర్యోధనులు గనుంగొను చుండఁ గదుపులం గ్రమ్మఱించెద నని సత్వరంబుగాఁ జెప్పిన విని యుత్తరుండు చిత్తంబున నద్భుతహర్షంబులు వొదువ మ్రాను డిగ్గ నుఱికి సర్వాంగసంగతోర్వీతలం బగుదండప్రణామం బాచరించి చేతులు మొగిచి నిలిచి యిట్లనియె. 149

ఉత్తరుఁడు బృహన్నల నర్జునుఁగా నెఱుంగుట.

ఉ. బాహుసమగ్రశత్రుమదభంజనశౌర్య సమస్తలోకచే
తోహరమూర్తి నీ విటులు దోఁచుట నాకుఁ బ్రసన్నవిస్ఫుర
ద్దేహముతోడ భాగ్యమయదేవత సన్నిధిసేఁత గాదె స
మ్మోహము వాసెఁ జిత్తము ప్రకాశపరసత్వముఁ బొంది పొంగెడున్. 150

క. నిన్నెఱుఁగక యే నేమే, నన్నపలుకు లెల్ల మఱచి యాశ్రితరక్షా
సన్నద్ధభావ మేర్పడ, నన్నుం గృపఁ జూడవే సనాథుఁడ నగుదున్. 151

క. అన వినుచుఁ దేరు డిగ్గి, కుఱ్ఱనిఁ గౌఁగిటఁ జేర్చె విరటుకొడుకును గుంతీ
తనయుఁడు సమ్మదమునఁ దన, కనుఁగవఁ గడు నశ్రువారి గడలుకొనంగన్.

వ. ఇట్లు సమాలింగితుం డై. 153

చ. మనము కలంక దేఱ రిపుమర్దనవిక్రమ మెక్కు డేరు నీ
ఘనభుజశక్తి ప్రాపున నఖండితశౌర్యమహోన్నతుండ నై
యని మొన సారథిత్వము మహత్త్వము వైరులు మెచ్చఁ జూపెదన్
ననుఁ బనిగొమ్ము లెమ్ము కురునాథు నదల్పు మరల్పు గోవులన్. 154

క. మనమునఁ గోరుదు నేన, ర్జునునకు సమరమున రథ్యచోదకభావం
బునఁ బని సేయ వలయు నని, యనిశము విధికరుణ నాకు నది సిద్ధించెన్. 155

వ. అని పలుకు నుత్తరు నత్యాదరంబునం జూచి సవ్యసాచి యతని కిట్లనియె. 156

మ. ప్రియ మత్షీణము నాకు నీ వెస మదిన్ భీతి ప్రదోద్వేగసం
శయముల్ సేరఁగ నీను నీకు ఘనరక్షాకల్పనాబుద్ధిని
శ్చయసంపాదిని నాదుదృష్టి నిను సర్వాశ్రితముం జోఁక గా
లియు రా నీను దృణీకరింపు రిపుదోర్గల్లాసముల్లాసమున్. 157

వ. అనిన విని భూమింజయుండు సవినయంబుగా ని ట్లనియె. 158

క. నిను నర్జునుం డని యెఱింగినయంతన పాసె నెల్లకల్మిషములు నీ

తను వేల షండభావం, బునఁ బొందెనో యెఱుఁగ వలయుఁ బుంస్త్వాభరణా

అనవుడు నాతఁ డిట్లను మదగ్రజపంపున బ్రహ్మచర్యవ
ర్తనకయి పూర్వశాపవిహితం బగురూపముఁ దాల్చి యేకహా
యనపరిపాలనీయ మగునట్టివ్రతంబు సమాప్తిఁ బొందఁ జ
ల్పినజతనంబు లోకులకుఁ బ్రకటితనం బయి తోఁచె నిమ్మెయిన్ 160

అదియును నిట మీఁద లేదనినఁ బ్రమోదమానమానసుం డయి మత్స్యపతి
సూనుండు పాండుసూనున కిట్లనియె. 161

ఇట్లు దెలియఁ జెప్ప నెల్ల నాదెస దయ, పెంపుతోడికూర్మి నేర్పర్తిఁ గాదె
యింక సురలకైన నేఁ శంకింతునే భవ, ద్బాహువప్రగుప్తిఁ బలుపు గలుగ. 162

నాకుం బని యెయ్యది పనుపు మనిన నతండును గాండీవంబును గాంచనపుంఖంబు
లగు బాణంబులతూణీరయుగళంబును మదీయతనుత్రాణకృపాణంబులును బుచ్చి
కొని తక్కినవాని నెప్పటిభంగిన కట్టిపెట్టి రమ్మని నియోగించిన నాతండు నట్ల
చేయుటయు నమ్మహాత్ముండు నియతాత్ముం డయి యధిదేవతలకుం బ్రణమిల్లి
భక్తితోడ దివ్యకోదండాదు లగుసాధనంబులు గైకొని సవిశేషస్ఫూర్తి యగు
మూర్తి నత్యంతదర్శనీయత్వంబు నొంది. 163

బలరిపుఁ డిచ్చినకుండల, ములు నుష్ణీషంబుఁ జిత్రకమున భక్తిమెయిం
దలఁప నవి వచ్చె వెండ్రుక, లలవడఁగాఁ బాచి ముడిచె నమర దృఢముగన్

తలచుట్టు చుట్టెఁ గుండల, ములు పెట్టెను ద్రిండు గాఢముగఁ గట్టెఁ గరం
బుల వలయంబులు గనుఁగొని, యెలనవ్వొలయంగ నెక్కె నేత్రైల రథమున్.

అట్టియెడ వరదానమహానుభావంబునం జేసి. 166

పెట్టక కట్టక మౌళిం, బుట్టిన క్రియ దీధితులు నభోభాగంబుల్
ముట్టి వెలుంగఁగ నింద్రుని, పట్టికిరీటంబు వొలిచెఁ బ్రస్ఫురితం బై 167

ఇవ్విధంబున సన్నద్ధుం డై యతిరథశ్రేష్ఠుండు రథం బెక్కియుం దాయుధంబులు
పదిలంబుగా నిడి తనుత్రాణతలత్రాణంబులు దాల్చి కవదొనలం బూని గాండీ
వంబుఁ బుచ్చికొని యెక్కువెట్టి ముష్టి నలవరించి గుణధ్వని సేసిన. 168

తే. పక్షిమృగజాతు లెల్లను భ్రమసి యుట్టు, నట్టుఁ గలగొనఁ జెదరె వృక్షశాఖియదరెఁ
గురుబలంబును బెదరెనంబరముదిశలు, బూరటిల్లంగఁ దొడఁగెఁ దదారవమున.

తదనంతరంబ యగ్నిదేవుం దలంచిన నతండును దనవరంబున మున్న కలిగి విశ్వ
కర్తనిర్మితంబును మాయామయంబును వానరాకారంబును నగుమహాగ్రకేత
నంబును దదాశ్రితంబు లైనవికృతాభీలనానావిధభూతలంబులనుం బుత్తెంచిన ను
దాత్తచిత్తుం డయి యుత్తరుసింహపతాక శమీవృక్షంబునం బెట్టించి నిజధ్వ
జంబు రథంబునం గట్టించి దివ్యంబు గావున దేవదత్తంబు చిత్తజ్ఞత్వంబున సన్నిధి
సేసిన సవినయంబుగాఁ గైకొనియె నక్కుమారుండును నాయితం బై నొగ లెక్కి

పగ్గంబు లమర్చికొని యగ్గలికతోడం దురంగంబులయుంగంబులు దొడయుచు
వానిజవసత్త్వంబులు వేఱువేఱ వర్ణించిన. 170

అర్జునుఁ డుత్తరసారథికం బైన రథం బెక్కి దేవదత్తంబు పూరించుట.

ఉ. తొడ వగుదంచె జమ్మికిఁ బ్రదక్షిణవృత్తిగఁ దేరు వోవ ని
మ్మెడ గలుగంగఁ బోయెఁ బసు లిప్పుడ కూడుద మన్న నాతఁడున్
వడపఁ దొడంగుడున్ మనమునన్ రణకౌతుక ముల్లసిల్లఁగాఁ
బిడుగులపిండు బిట్టులియు వెల్లునఁ బార్థుఁడు శంఖ మొత్తినన్.

మ. కలఁగెం దోయధిసప్తకంబు గిరివర్గం బెల్ల నూటాడె సం
చలతం బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెం ద్రిదశేంద్రుపట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేళయున్. 172

తే. అపుడు నిశ్చేష్టితంబు లై హయము లవనిఁ, జాఁపకట్టుగఁ బడియె మత్స్యక్షితీశ
నందనుండును నొగలపై మ్రుండినట్లు, మ్రొగ్గతిలఁ జాఁగి బలితంపు మూర్ఛఁ బొందె.

ఉ. కనుఁగొని ఫల్గునుండు దురగంబులవాగెలు వట్టి యెత్తి త
త్తనువులు నూల్కొనన్ నివిరి తత్పరతం దగ మత్స్యభూమిభృ
త్తనయుని నూఁది పట్టి వికృతం బగు రూపము చక్కఁ జేసి నె
మ్మన మొకభంగిఁ దేర్చి గరిమంబుగఁ గౌఁగిటఁ జేర్చి యిట్లనున్. 174

తే. శంఖభేరీరవంబులు సామజముల, బృంహితంబులు వింతలే పృథులసైన్య
పరిచయోదాత్తు లగు నరపాలసుతుల, కెలమిఁ బొందుము దీనికి నింత యేల.

చ. అనవుడు మత్స్యరాజసుతుఁ డాతని కిట్లనుఁ దొల్లి శంఖని
స్వనములు విందు భేరులరవంబులు విందుఁ గరీంద్రబృంహిత
ధ్వనులును విందు నద్భుతవిధంబుగ నిట్లివి యెల్లఁ జిత్తమో
హన మొనరింపఁ జాలు నె మహానినదం బిది యోర్వ వచ్చునే. 176

చ. చెవ్వు లవిసెన్ దిశల్ గిరిగెఁ జిత్తము నీఱయి పోయె నాకు నీ
రవమున నిప్పుడుగ్ర కపిరాజపతాకయుఁ జూడ్కిఁ జీఁకటుల్
గవియఁగఁ గ్రాలెడున్ భవదఖండితతేజము పర్వి యాత్తకున్
వివశతఁ జేయుచున్నయది విహ్వలభావము మాన నేర్చునే. 177

క. అన విని తగుమాటల నా, తని కొంగలపాటు పాండుతనయుండు క్రమం
బున డింపుపఱిచి యరదము, ననఁగా నెక్కించి పట్టె శంఖము మఱియున్.

వ. ఇత్తెఱంగున నయ్యుత్తరకుమారు ధీరుం గావించికొని పాండవవీరుండు రథనేమి
నిస్వనబ్యానాదమేదురం బగుశంఖారవంబు సెలంగ నడచుసమయంబున నాచా
ర్యుండు దుర్యోధనున కిట్లనియె. 179

సీ. శ్రవణపుటంబులు ♦ వ్రయ్యంగఁ దాఁకి సంక్షోభంబు గావించె ♦ గుణముమ్రోఁత
బ్రహ్మాండభాండంబు ♦ పగిలించి భూతని, శ్చైతన్య మొనరించె ♦ శంఖరవము
గగనభాగం బెల్లఁ ♦ గప్పి క్రాలుచు బెగ, డడరించె నుగ్రంపుఁ ♦ బడగపఱపు
మిఱుమిట్లు గొని చూడ్కి ♦ పఱివోవ వెలిఁగి పరిభ్రాంతి సేసెఁ ♦ గిరీటకాంతి
తే. తెల్ల మిది గాండివంబును ♦ దేవదత్త, మును గపిధ్వజమును వాసవునివరమునఁ
గన్నమకుటంబు నగు వేఱొక్కొన్ని యైన, నుజ్జ్వలాద్భుతభంగులై ♦ యున్న యిట్లు.
ఉ. అచ్చెరు వైనవిక్రమము ♦ నగ్గలికన్ సమరంబు గోరి యీ
వచ్చుచు నున్నవాఁడు బల ♦ వద్రిపుభీషణ బాహుఁ డైనవి
వ్వచ్చుఁ డి యింక మిన్నక వి ♦ వాదము సేసినఁ బోవ దియ్యెడం
బొచ్చెము లేనిబల్మిగలఁ ♦ బోరి కమర్చుము దర్ప మేర్పడన్. 181
వ. అని కృపాశ్వత్థామాదియోధముఖ్యుల నవలోకించి. 182
క. మన మొనల దుర్నిమిత్తము, లనేకములు వుట్టెఁ దొడఁగె ♦ నట్లగుట జయం
బనుమానం బొకకార్యము, వినుఁడా మీ రెల్లఁ జూడ ♦ వెర వగు నేనిన్. 183
ఉ. ముందర రాజుఁ బుచ్చి బలముల్ ♦ గలయంబడి గోవ్రజంబులన్
దండడి వెట్ట కుండఁ బిఱుఁ ♦ దన్ నడిపింపఁగఁ బంచి గట్టిపై
నందఱు నింతకున్ వెనుక ♦ నై మొన లేర్చి చనంగ నెప్పు సం
క్రందనసూతి డగ్గఱియెఁ ♦ గయ్యము సేయుట కప్పు డీప్సగున్. 184
వ. అనిన విని సుయోధనుండు భీష్మ కృప కర్ణ వికర్ణుల దెసం గనుంగొని మున్న చెప్పితిన కాదె జూదంబునం బరాజయం బొంది పాండునందనులు పండ్రెండు వత్సరంబులు వనంబున వసియింపను బదుమూఁడగు నేఁడు జనపదంబున నునికి యెఱుంగ కుండఁ జరియింపనుం బూని కాదె భూమి వెలువడిరి యీపదుమూఁడవ యేఁటికొఱంత గలుగం బార్థుండు దన్నెఱింగించికొనియె నేని నెప్పటియట్ల వనవాసంబునకుం జన వలయు నిది మనము మోహంబునం గానమి నొండె వారు లోభంబున వచ్చుట నొండె నగుం గావున నెక్కుడుదక్కుడులు నిరూపించి భీష్ములు దీని నిశ్చయింప నర్హులు రిత్తయుత్తరుండ కాక గాండీవియు నగుట మనకార్యంబు సుశర్మ సక్కడ గోవులం బట్టం బనిచి యిక్కడ మనమును బట్టుట మత్స్యనగరంబునం గౌంతేయు లున్నవా రని శంకించి వారలు గూడి వచ్చినం గనుటకుం గాదె యిట్లు నిశ్చయించి చేసినపనికి నిపుడు విచారం బేల యని పలికి వెండియు నిట్లనియె. 185
ఉ. అర్జునుఁ డైన నేమి సుర ♦ లైనను నే మగు విద్విషచ్చిరో
పార్జిత మైనగోధనముఁ ♦ బట్టితి మెవ్వరు వచ్చి రేని వి
స్ఫూర్జితబాహుసంపదలు ♦ సూపుద మొండొరు మీఱి నిర్మలో
ద్భూర్జితకీర్తికారణర ♦ ణోద్ధతి వెల్వలఁ బాఱ నేటికిన్. 186

మనముల నాలుకొల్పి యనుకమానము లెల్లను బాచి యేచి వా
హనములు నాయుధంబులును ‡ నాయిత మయ్యెడుభంగిఁ జేయుచున్
మొనలకు హెచ్చుగా మనము ‡ మున్ను గడంగినఁ గాక శత్రులం
గనుఁగొని యిట్టు లొండొరుమొగంబులు సూచుచు నున్నఁ బోవునే. 187

దుర్యోధనుఁడు ద్రోణాచార్యుల నధిక్షేపించుట.

హరుల హేషితములు ‡ ననుకూలవాయుసం, చారములును మనకు ‡ జయము గలిమిఁ
దెలుపుచున్నయవి యుధిష్ఠిరానుజుఁ డొక్కఁ, డీబలంబు గెలువ ‡ నెట్లు నేర్చు.
ఎవ్వరు వినినను దీనికి, నవ్వుదు రని యెఱుఁగఁ డొకట ‡ నాయుధు లెదుర్కన్
వివ్వచ్చుఁ జూపి సేనలు, గ్రొవ్వఱఁ బలుపలుకు లిట్లు ‡ ద్రోణుఁడు వలికెన్. 189

కోప మొందెను రాజ్యాభిలాష మొందెఁ, గాక యాతని రాకకుఁ ‡ గారణంబు
వెల యెఱుంగమ యెదిరిని ‡ పెద్దఁ జేసి, పూని వందిపిషణంబునఁ ‡ బొగడ నేల.
ఆచార్యులైనవారలు కార్యంబు దవ్వులం గని యెడునాగుగాన కయ్యంబు తెఱంగు
వారల నడుగ వలవదు బుద్ధిమంతు లిండ్లకడనుండి భోజనావసరంబుల నాయుధ
శ్రమసమయంబుల నీతిశాస్త్రగోష్ఠీకాలంబుల నుచితాలాపంబులు పలుకుదురు
గాని పోట్లాడెడువారు గారు వారం గలసం గలసి నిలువ నీక పిఱిందిదెస నిలిపినను
నాకు వారు విజయంబు గోరుచుండుట తెన్నయునిన విని యశ్వత్థామ యతని కిట్లనియె.

కావలివారిఁ దోలి యొకకంబున గోవులఁ బట్టికొంటి నం
చీవెడవాఁడు లేల ధరణీశ్వర యింతకు మున్న యిట్టికిం
ఖోవపు శస్త్రసే పుడిపి ‡ పోయెడువాఁడవు గాపు నీవు నై
న్యావలి మైనఁ జెప్పడక ‡ యాతల కెద్దుట లేదు నేనియున్. 192

సమరమున గెల్చి యొరురాజ్యము గొనియును సుజనుఁ డిట్టుల్ లాడఁడు సిరి జూ
దమునఁ గొని రజ్జ లేటికి, సమయం బరుదెంచెఁ గొంటి చందము గలదే. 193

పాండవవీరులం గలప ‡ బాహుబలంబున నోర్చియే సుము
ద్దండత నీవు డొల్లి ద్రుపదక్షితిపాత్మజ గొల్వులోనికిం
దెం డని పుచ్చి తద్దెసకుఁ ‡ దెచ్చుటి సౌబలునీతిఁ గాదె యా
తండ మరల్చుఁ గాక సముదగ్రత వచ్చువిరోధి నిప్పుడున్. 194

అబ్బంగి నవమానింపంబడినవాఁడు గావున ధార్తరాష్ట్రకులధూమకేతు వగుకపికే
తుండు దోఁచె నీకు దుర్గదంబున ద్రోణాచార్యుల నధిక్షేపింప వచ్చు నంతియ
కాక దేవదానవుల కయినను దుర్జయుం డగునర్జునునకుం దలసూప వచ్చునే
నయవిక్రమంబుల నతిలోకుం డగునతని నెవ్వరికేనియుం బొగడ వలయు ననిసం
బుత్రసర్వశేషుం డగు నిజప్రియశిష్యుని నగ్గించుట గురునకుం గొఱంత యె యింక
సిగ్గు మాలి రణంబు సేయ నని యిఁ ద్రోణుండ చేయుం గాని యే నిట్టివాని కోర్వ
నదియునుం గాక. 195

క. ప్రళయాంతకుండు బడబా, నలమును మృత్యువును నెదిరినం గొలఁదివడఁ
నిలిపినను నిలుపు మార్కొని, చెలఁగిన నరుశరము లనవశేషము సేయునే. 196

ఆ. కుటిలబుద్ధి యిచటఁ గొనవు నెట్టన ఘన, దోర్బలంబు మెఱసి తొడర వలయు
నతఁడు గాండివమున నడ్డసాళులు వైవఁ, దురుల నంపవానఁ గురియుఁ గాని.

క. విను మట్టులు గాకున్నం, జనగోవుల వెనుక మత్స్యధరణీశుఁడు వ
చ్చిన మార్కొందుము నరుఁ డే, వునఁ ముట్టిన నతనిపొంతఁ బోదుమె యధిపా.

వ. అనిన విని రాధేయుండు సక్రోధుండై యోధవీరలోకంబు నాలోకించి, 199

ఉ. వడిగొని గోగణంబుఁ బొదువం బఱతెంచితి రెల్లవారు ము
న్నాడఁబడి పాండునందనులు యున్నది యిమ్మెయిఁ గాన వేఁడి యి
ప్పుడు నరుఁ గాంచి మీ రతనిపోటు నుతించుచు భీతి నిట్లు వా
పోడిచి యనేకభంగిఁ బృథివీపతి పిఱిఁది సేయు టొప్పునే. 200

చ. వెఱచితి రేని నిల్వుఁ డొకవీరుఁడ కొక్కఁడ చాలుఁ గాక యెం
దఱు వలయుం గపిధ్వజము దవ్వుల ద్రెళ్ళిడఁ ద్రుంచి వైచెదం
బఱపెదఁ దత్పిశాచముల భగ్నము సేసెదఁ దేరు సారథిన్
నఱకులు సేసెదం బొదులు నించెద నర్జునుగాత్రశాలలన్. 201

శా. జ్యాఘోషం బతిభీషణం బయి దిశాచక్రంబు నిండన్ శర
వ్యాఘాతంబున శాత్రవుండు వికలవ్యాపారుండై గా నారద
శ్లాఘాపాత్రము నై యనర్గళభుజాసంరంభతన్ రౌద్రరే
ఖాఘోరాకృతి యైన చూపెద సశంకం జూడుఁడీ యేర్పడన్. 202

క. క్రోధజ్వాలలు నిగుడ వి, రోధిబలేంధనముఁ బొదువు కఱకుఱతనై దు
స్సాధ మగు నర్జునాగ్నిని, సాధించెద నేన పూని శరవర్షమునన్ 203

వ. పాండవమధ్యముండు పదుమూఁడువత్సరంబులు పూఁచి పట్టి కయ్యంబునకు వచ్చె
నతనిలావును బీరంబును లోకంబునకు నెక్కి యున్నయది యేనును గురుసేన
యందు శక్తిశౌర్యంబులు గలవాఁడనని పొగడ వర్తించెదం గావున నే మిరువురము
నొండొరులకు బాహుబలవిలాసంబును విక్రమక్రీడాకౌశలంబును బ్రకటించుట
యుచితంబు గాదె యని వెండియు నిట్లనియె. 204

సీ. అనుదినంబును నంతకంతకుఁ బెరిఁగెడి, యధిపతిమన్ననయప్పు దీర్ప
నర్జును నోర్చెద నని యోగనే నని, యతనితోఁ బలికినప్రతిన సలుపఁ
గర్ణార్జునులయందుఁ ఘనుఁ డెవ్వఁ డగు నొక్కొ, యను జనంబులసందియంబు మాన్ప
జమదగ్నిసుతకృపాశ్రయమునఁ బడసిన, విలువిద్యకలనూపు వెలయఁ జేయఁ

ఆ. గనుట నేఁడు పుణ్యదిన మయ్యె నాకు మీ, రెల్లఁ బోరు సూడ నిష్టమేని
జూడుఁ డట్లు గాక వేడుక లేదేని, సంగరమునఁ బసులకాడఁ బొండు. 205

వ. అనిన నమ్మాటలు విని కృపాచార్యుం డతని కిట్లనియె. 206

ఆ. కయ్యమునక యెప్పుడుఁ గాలు ద్రవ్వెదు కార్య, గతికిఁ బౌరవు నీతియుతులు సమర
హేతు మసాధనముగ నాడుదు రరసి, సిద్ధిఁ బొందు తెఱఁగు సేయు నెడల.

క. అగు దేశకాలబలయుత, ముగఁ జేసినపోరి నర్థములు మోఱకు లై
తెగఁ బాఱి తమ్ము నెదిరిని, వగవక తొడరుటలఁ గీడు వర్తిల్లుఁ దుదిన్. 208

వ. అక్కిరీటి యొక్కరుండ కాఁడె యని తలంతు మేని. 209

సీ. శక్రాదిసురులతో సంగ్రామ మొనరించి, ఖాండవం బేర్చె నొక్కరుఁడ కాఁడె
యాదవబల మెల్ల నాఁగఁ ద్రోచి సుభద్రఁ, గడిమిమైఁ దెచ్చె నొక్కరుఁడ కాఁడె
దిగ్విజయంబునఁ దేజంబు సేసె ని, క్కురువంశమునకు నొక్కరుఁడ కాఁడె
బలముతో గంధర్వపతి నోర్చి విడిపించెఁ, గౌరవేశ్వరుని నొక్కరుఁడ కాఁడె

ఆ. యని నివాతకవచులను దానవుల నాతఁ, డొక్కరుండ కాఁడె యుక్కు మడఁచె
నమరులకు నజేయు లగు కాలకేయుల, నొక్కరుండ కాఁడె యొడిచెఁ గర్ణ.

క. భూవరు లెల్లను నొక్కట, ద్రోవదికై తొడరి యతనితోఁ బెనఁగి కడుం
జేవ సెడి పోవునప్పుడు, నీ వచ్చటఁ గలవొ లేవొ నిక్కము సెప్పుమా. 211

శా. కుంతీనందను లొక్కఁ డొక్కఁడ రిపుక్షోభంబు సంధిల్ల దు
ర్దాంతస్థైర్యపరాక్రమంబులు మహోత్సాహంబునం జేసి ర
త్యంతోదగ్రతఁ బెక్కుదీవిచట బాహాశక్తి యిమ్మేదినీ
కాంతుం డయ్యెఁ గొనంగఁ బూనితి వృథాగర్వంబు నీ కేటికిన్. 212

తే. పచ్చి మున్నీరు సేయీఁత నీఁద నగ్ని, నుఱుక వాసుకికోఱలు వెఱుకఁ గడఁగి
నట్లు గాదె రాధేయ నీ కర్జునునకుఁ, బోర నెక్కటి మార్కొనఁ బూను టరయ.

క. బలుగాలిఁ బెట్టుదావా, నల మొక్కరుఁ డార్పఁ బోయినను దీఱునె నీ
చల ముడుగు సాహసమునం, గలదే మే లెట్లు నధిపుఁ గావఁగ వలదే. 214

తే. కురువిభుండును భీష్ముండు గురుఁడు గురుత, నూభవుండును నీవు నేనును గడంగి
కూడుకొని తాఁకుదము గాక క్రీడితోడ, నొంటిమార్కొన వశమె మున కొక్కరునకైన.

కర్ణుఁడు కృపాచార్యు నధిక్షేపించి పలుకుట.

క. అని పలికిన సంరంభం, బున నినసుతుఁ డిట్టులను రిపులయెడఁ జిత్తం
బున నీవు ప్రియము గలుగుటఁ, గని కని నినుఁ దోడు పిలువఁగాఁ బతి చేశే.

క. పలినవానిధనంబులు, బాలురు బంధువులుఁ దారు బ్రదికినదినముల్
ప్రేలారించి తిం డ్రాతని, మోలమును గని పిదప భీతి నొదుఁగుదు రాజన్. 217

క. జన్నములు సేయునెడఁ బ, క్వాన్నంబులు గుడుచు చుండు మధిపతి నిన్నుం
జన్నియ విడిచె రణముతఱి, మిన్నక కినువడక పొమ్ము మీగృహమునకున్.

తే. వీను విల్లందుకొనిన నిర్జరేంద్రభువన, ములును వడవడ వడఁకు నాయలఘు బాహు
బలముఁ దలఁపక పలికితి పార్థుఁ డనఁగ, నెంతవాఁ డొక్కరథికున కింత యేల.

వ. అనియె ని ట్లెఱుంగున నంతయుఁ బలుకుపలుకు లెల్ల వినుచు గాంగేయుండు గౌర

వేశ్వరు నుద్దేశించి ధర్మార్థసంగతంబును సువిహితంబునుగా నిట్లను ద్రోణాచార్యుం డు నీతిపథంబునం బలికె నాచార్యతనయువచనంబు లుచితంబులు కృపాచార్యుం డాడినచందంబును దెలుంగు వడియున్నయది మన్నన గలమానిసి యగుట నంగ రాజునకు సంగరపాటవంబుమాటలు దగుం గాక మాన్యుల నధఃకరింప నగునె యని వెండియు. 220

ఆ. నెల ప్రొద్దెఱింగి చాలుమానిసి రణో,ద్యమ మొనర్చి కాక తగినవారి
చెవికిఁ జేదు గాఁగ నవమానవాక్యంబు, లుడుగ కిట్లు వలుకు టొప్పు నెట్లు.

క. బీరము లావును మిగులఁగ, వైరులు దఱి యైనఁ దోడర వచ్చినచోటన్
దూరమున వెరవుతోఁ డివి,చారము గలుగు టిది దగదె సద్బుద్ధులకున్. 222

ఆ. అరులగుణము లైన నగ్గింతు రెప్పుడుఁ, గలయ బెరసినపుడు గలితనంబు
మెఱయుదురు మహాత్ము లెఱుఁగఁడు తుదిమొద, లెట్టివారి నిటఁదు బెట్టు పలుకు.

వ. ఆచార్యులైనవారలు పూజావాక్యంబుల కర్హులు గాక గర్హించుటకు విషయంబె యనుచుఁ గృపాశ్వత్థామలకరంబులకు నిజపాణిపుటంబులు సాఁచి యిట్లనుఁ బసి సాలినంత గలదు వివ్వచ్చుండు వచ్చుచున్నవాఁడు విరోధంబునకు సమయంబు గాదు మన మందఱముం గూడికొని కార్యంబు సేయుదము బలవద్వ్యసనంబునందు భేదంబు గలుగు టొప్పదని బుధులు సెప్పుదురు వేదంబు లొక్కవలనను ధనుర్వేదం బొక్కవలనను గలమీయట్టిమహానుభావు లెందునుం గలరె కురుబలంబున కొకటి పుట్టినం బ్రసిద్ధులరు గావున నది మీతలన నిలుచు నట్లగుటం జేసి

క. క్షమియింప వలయు నొకఁ డెఱుఁగమి నేమే నన్న నంతఁ గటకటఁబడి భూ
రమణునికార్యస్థితి చి,త్తములం దెడ సేయునట్టికతరమే మీరల్. 225

వ. అనిన విని వార లిట్లనిరి. 226

క. క్షమియింప నెవ్వరము భూ, రమణునికార్యమున కెవ్వరము ద్రోణులచి
త్తము శాంతి వొందఁ జేయుట, మముఁ దెలుచుట యిట్టులేల మాకొలఁదులకున్.

వ. అనిన విని గాంగేయకర్ణులం గూర్చికొని కురుపతి గురునిం బ్రార్థించి యశ్వత్థామను వేఁడికొని కృపాచార్యులం దేర్చినం బ్రసన్నుం డయి యోధవీరులం గలయఁ గనుంగొని ద్రోణాచార్యుం డిట్లనియె. 228

తే. అలుక భీష్మునిపలుకుల యపుడ పోయె, మీఁదికార్యంబు నడపుదు మీర లింక
మోహసాహసములఁ గురుముఖ్యు దెసకుఁ, గీడు రాకుండఁ దగఁ బరికింపవలయు.

క. వాసవనందనుఁ డెంతయు, గాసిలి యున్నాఁడు మనలఁ గని యించుకయుం
దా సైరణ సేయఁడు గను, మోసము లేకొక్క మొగిన ముసరఁగవలయున్.

వ. అప్పుడు కురుపతి సమయకాలవిషయంబుగా నాడినమాటయుం గలదు దాని నిరూపించి యున్నరూపు గాంగేయుండు సెప్ప నర్హుం డనిన నతండు దుర్యోధనున కిట్లనియె. 231

భీష్ముఁ డర్జునునజ్ఞాతవాసవత్సరవ్యాప్తి విమర్శించుట.

సీ. రెండవయేఁట నొక్కం డధిమాస మి, ట్లైదేండ్లకయిన నెల్లఁ గూర్చి
కొనఁ బదుమూఁడు హాయనములు దప్పక, నిన్నటితోడన నిండె నింత
యెఱిఁగియ తమపూన్కి యెల్లను దీర్చితి, మని పొడసూపె నర్జునుఁడు నేఁడు
పాండుపుత్రులు ధర్మపరులు ధర్మాత్మజుం, డేరికధిష్ఠాత వారు ధర్మ
తే. పథము దప్పుదురే యన్నిపాటు లట్లు, పడనవారలు దఱియంగఁ బాఱ నేర్తు
రెట్లు దమకించి నీతివిహీనవృత్తిఁ, దమకు నొకకీడు వచ్చువిధంబు గాఁగ. 232

ఉ. అట్టిద యైన నాఁడ తఱియంబడి మూర్ఖతనంబు సేయరే
నెట్టన ధర్మపాశముల నిల్చిరి కాలము వేచి యుండి రిం
కెట్టును వారు గొంత తమయేత్తెఱ చూపక మాన నేర్తురే
ముట్టఁగ వచ్చిరేని మనయముం దగ నోర్తము గాక దానికిన్. 233

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నైన నంగినబలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చగుఁ గుందగుం దొడరు నెల్లవిధంబుల గోర్చు టట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగున్. 234

వ. అనిన విని కురుపతి దరహాసితవదనుం డగుచు నిట్లనియె. 235

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు గలుగు నేను రాజ్య
భాగ మీను సమరభంగిక విక్రమ, నిరతిఁ బూనుటిదియ నిశ్చయంబు. 236

వ. అనిన నయ్యుగ్రవచనంబు లాకర్ణించి గురుండిట్లనుఁ గార్యగతియును గయ్యంబు భంగియు భూపతికంటె మిగులం గనియెడువారు లేరయినను నామెఱింగిన యంత నొక్క తెఱంగు సెప్పెద నీబలంబున నాలవపాలు గొని మహీపాలుండు సత్వరంబుగా ముందఱఁ బోవలయు నంతియ సేన తదనంతరంబ కదుపులం బొదివికొని చనవలయుఁ దక్కటిసగంబుతో మనము నిలిచి మోహరించి యల్లనల్ల నరుగవలయుఁ గవ్వడి యెయ్యెడం గవిసె నయ్యెడన తలపడ వలయు నిట్లైన మానవేశ్వరుండు సురక్షితంబుగా సందడిం బడక నడచు గోవులు నిన్నెలం గడచు మనమును ధనంజయునకుం జాలినయప్పుడ యట గోడుపడ నెవ్వరు గలిగినను వారికిం జాలి నిలుత మనిన విని సురనదీసూనుండు దాని కియ్యకొని రాజన్యునకు సైన్యంబుఁ బంచి యిచ్చి పుచ్చి పసులకుం దోడగుభాగంబునుం బంచి యున్నంత పట్టుచతురంగంబుల నియతి సేసికొని యాచార్యుండు నడుమను గృపాచార్యుండు వలపటను నాచార్యపుత్త్రుండు డాపటం గర్ణుండు ముందట వికర్ణదుశ్శాసన శకుని సైంధవ సోమదత్త బాహ్లీక భూరిశ్రవః ప్రభృతియోధవీరు లెల్ల నెడనెడం గలయ నిలుచునట్లుగా మోహరించి మహోత్సాహంబున సన్నాహ

సౌందర్యంబు నొంది తాలధ్వజం బెత్తించి మెఱసి తాను వెనుక యయి నడపించు
చుండె నట్టిసమయంబున. 23

వ. అరుదుగ నిట్లు లోకమునకు నంతబలంబునకుఁ మహోగ్రసం
గర మగు దుర్గమనం బతులకౌతుక మొంది కనుంగొనఁ సురే
శ్వరుఁడు సుదర్శనం బనఁ బ్రశంసకు నెక్కు విమాన మెక్కి యం
బరగతి వచ్చె దేవముని పంక్తులు సిద్ధగణంబుఁ గొల్వఁగాన్. 2

వ. అద్దివ్యయానరత్నంబునందు. 2

తే. స్వర్గమున నున్న రాజులు చక్రవర్తులును యథోచితచ్ఛత్రంబులును నిజా
చామరంబులుఁ జెలువొందఁ జారులీలఁ గొలిచియుండిరి వేడ్కలు గొనలు నిగుఁ

క. పాండుమహీపాలుం డాఖండలుచేరువను పెద్దగద్దియ నమరీ
మండలి వీచోపు లిడఁగ, నుండి కనుంగొనుచు నుండె నుజ్జ్వలభంగిన్. 2

వ. అంత. 2

సీ. దేవదత్తాభీలరావంబు వెసఁ గర్ణములు దీటుకొన లేటి మొగము వడుచు
రథనేమిదళితధరాధూళి యంగంబు, లెల్లఁ గప్పఁగ వెలుఁ వెల్ల నగుచు
బహుళకపిధ్వజప్రభలు లోచనములు, మిఱుమిట్లు గొనఁ బర్వ మెండుకొను
నుద్భటాకారసముద్ధతి మనములు, త్రలపడఁ దోఁపంగఁ దల్లడిలుచు

తే. నడచు కౌరవరాజసైన్యంబుఁ గదిసెఁ, దీఁగ దిగిచినగతిఁ దనతేరు మెఱుఁగు
రయముమైఁ జని ప్రళయభైరవసహస్ర, గర్జనోదగ్రతర్జనుఁ డర్జునుండు.

వ. ఇవ్విధంబునఁ గురుబలంబులఁ గ్రోశమాత్రంబునం గూడ ముట్టి క్రీడి తల యు
చూచి యుత్తరున కిట్లనియె. 2

క. ఇది యొక పెద్దగట్టిమొన యీ మొనముందట గోగణంబుతో
నదె యొకయల్పసైన్య మట యాతల వేఱొకకొంతసేన యు
ల్లదె యిటు షంచి పెట్టఁ జను నంతటిలోన వృథాభిమానదు
ర్మదబహుభాషి యైనకురురా జెచటం జనుచున్నవాఁడొకో. 2

క. అరయుదము గాని యిమ్మొహరమునకును డాపలించి యరదముఁ బో ని
మ్మురవడి నతనిక యుక్తి కెదఁ, నరుదుగ నెబ్బంగి నెవ్వ రడ్డం బైనన్. 2

ఉ. అతఁడు సిక్కనేని బల మంతయు విచ్చు మరల్ప వచ్చు గో
వ్రాతము నట్లయైన సుకరంబుగ నంతట నెల్లఁ దీఱు నీ
యాతతసేనయుం దతని నారసి కానక యున్న వీరి ని
ట్లీతల డించి యాకదువు నెయ్యఁగఁ బోదము గాక వ్రేల్మిడిన్. 2

క. విచ్చి చనకుండఁ బసులం, దెచ్చుట మునుమున్న వలయుఁ దెఱఁ గావనికిం
జొచ్చి యది చక్కఁబెట్టఁగ, నచ్చోటన దాయ మనకు నగపడెడు బళే. 2

క. అనిన విని యుత్తరుం డ, మ్మొనమలఁపఁ బెట్టి యరదమును బోవఁగ ని
చ్చిన సరస కరిగి కవ్వడి, కను విచ్చి బలంబు నెల్లఁ గలయఁగఁ జూచెన్.

వ. ఇట్లు గలయం గనుంగొని మధ్యదక్షిణవామాగ్రపశ్చిమోత్తరభాగంబుల నిట్టిట్టి వారలు నడచుచున్నవా రని సారథితోఁ జెప్పుచుం బలికి వీరలలో నురగకేతనుండు లేఁ డతండు గోవులం గొనిపోవ నోపు విరాటుమీఁదం బైనయీసేనతోడ నని సేయం బని లేదు వీర లెయ్యది యడ్డపడి తడవు సేయకుండునట్లుగా ముట్టికొని పసులం బెట్టించి దొరయును నెల గడవం బోవక యుండఁ బొదువ వలయు నని చెప్పి యతని నడ్డెసకుఁ దేరు వఱుపం బనిచి గురుకృపగాంగేయులకుఁ జరణసమీపస్థలంబులం బడ రెండును గర్ణాభ్యర్ణప్రదేశంబులం జన రెండునుగా నాలు గేసి యమ్ము లేసిన నాసవ్యసాచిం జూచి యాచార్యుండు పరిసరవర్తు లగునాప్తజనంబులతో నల్లన యర్జునునకీడింత యొప్పు యుండునే యని యగ్గించి వెండియు.

ద్రోణాచార్యుఁ డర్జును జూచి ప్రశంసించుట.

మ. విలసద్గాండివచాలనోద్ధతి కనద్విద్యుల్లతాలీల గా
నలఘుజ్యారవకపిధ్వజధ్వని సముద్యద్గర్జ చందంబు గా
వలదా కారత నొందఁ దేరితఁడు పర్జన్యాకృతిం బొల్చె దో
ర్బలతీవ్రారినిదాఘదుర్విషహగర్వస్ఫూర్తి నిర్మూర్తిగాన్. 251

వ. ఇప్పుడు నాకుఁ బ్రణామంబులుగాఁ బాదంబులమొదలం బడ రెండమ్ము లేసి పెద్దకాలం బేనిఁ బాసి యున్నవాఁడు గావునఁ గుశలప్రశ్నంబుగాఁ జెవులు సోఁకియుం జోఁకములుగా రెండమ్ము లేసె నని పలికి వెండియు ని ట్లనియె. 252

క. ఇదుమలఁ బదుమూఁ డేండ్లుం, బడి కడుఁ గోపించి వచ్చెఁ బలువిడి నీక
వ్వడిఁ దఱియ నుఱికి వడి ని,ప్పుడ యిమ్ములఁ బ్రోవు నెల్లఁ బొరిగొనెడు బలే.

తే. విపినవాసంబు నజ్ఞాతవిధమువర్త
నంబు గడపి సవాభ్యుదయంబు నొంది
రాత్రిఁ బుచ్చి తోఁతెంచుమార్తాండుమాడ్కిఁ
జూడ నుజ్జ్వలుం డగుచు నర్జునుఁడు పొలిచె. 254

వ. అనియెఁ గృపాచార్యభీష్ములు పార్థుబాణపాతప్రకారంబులు ప్రణామకుశలప్రశ్నంబులుగా నంతరంగంబులం గనికొని సంతసిల్లిరి ధనంజయుండును దక్కినవారికి దుర్నిరీక్ష్యుం డగుచు సమ్మోహనంబుదెస ననాదరంబు సేసి గోవులపజ్జం బోవుచుండె నతనిం జూచి సురనదీసూనుండు కురువీరులతో ని ట్లనియె. 255

క. చిరకాలమునకుఁ గంటిమి, నరు నక్కట వీఁడు సజ్జనప్రియుఁడు సుహృ
త్పరతంత్రుఁడు బాంధవహితుఁ, డరిభీకరుఁ డిట్టివార లవనిం గలరే. 256

క. మనచూడ్కికి వ్రేఁగయి యీ,తనియతులితమూర్తియత్యుదాత్తతఁ గడు నొ
ప్పినయది గంటిరె జగ మె, ల్లను నేలఁగఁ దగునుముజ్జ్వలతల యూహింపన్.

క. వెనుకదెస వచ్చి కదిసియుఁ, దనరథము దొలంగ నిచ్చి తత్తఱియుఁ బడుట కొ
ల్లనితలఁపు గలిగి క్రేఁగంటను మనలం జూచుచుం గడచి యట నడచెన్. 258

క. వెనుకం గలయం జూచి యూరక, చను టధిపతి నరసి తా నిటఁ గానక యా
తనిపజ్జ నరుగు టెఱుఁగగు, ననుమానము లేదు క్రోధ మగ్గలము మదిన్. 259

చ. మనకును గౌరవేంద్రునకు మధ్యముఁ జొచ్చెనయేని నాతఁ డ
ర్జునునకు నొంటి సాలఁ డని రుద్రుఁడు నెక్కటి మార్కొనంగ లేఁ
డనిన నొరుండు శక్తుఁడె రయంబుమెయిన్ మన మెల్ల నిప్పు డా
తనికడ సేరఁగాఁ జనుట తప్పినఁ గార్యము దప్పు నెంతయున్. 260

ఆ. వాసవాత్మజుండు వసుధేశనందను, ముట్టికొనిన నొకటి పుట్టెనేని
మనప్రయోజనంబు మఱి యేమి పసు లవి, యేటి కొండుధనము లెల్ల నేల.

వ. అని పలికి బలంబుఁ బురికొల్పికొని యతండు రాజరక్షణతత్పరత్వంబున నరదంబు సత్వరంబుసేసిన సేనాపతిం గని సైనికనికాయంబులుం గడఁగి చనం దొడంగె నిప్పాట నమ్మేటిమొనయును వెసం బోవ గోవులకావలిమూఁకయు నానిం దఱిమి కొని యతిరయంబున నరుగం దానును గెలనఁ గ్రోశద్వయమాత్రంబు నడచి పురుహూతపుత్త్రుం డుత్తరున కిట్లనియె. 262

మ. ఇదె గోవర్గము సేర వచ్చితిమి పో నిం కెల సైన్యంబులుం
గదియన్ వే చనుదెంచె రెంటెనడుముం గాఁ జొచ్చి యీవచ్చుపు
న్నదవీరావలికిన్ భుజావిభవవిన్యాసంబు గాన్పించి మా
న్పెద గర్వంబు మరల్చెదం బసుల నాచేఁ జిక్కె రా జెమ్మెయిన్. 263

యుద్ధారంభము.

క. అనుటయు విరాటతనయుఁడు, మొన కడ్డముగాఁగఁ దూర్పుమొగమై రథముం
గొని కట్టెదిరికిఁ బోయినఁ, దనమూఁపులు రెండు నపుడు దలకుం గడవన్.

వ. తేరు సమ్ముఖంబు సేయించి పేరువాఁడి క్రీడి కరతలం బెత్తి నిలునిలుమని యదల్చిన ఘోషంబుతోడన వెడలునిశితశరపరంపరలదట్టంపుఁబఱపున నంబరంబు సాంద్రం బగుటయుఁ దదంధకారంబును భయతిమిరంబునుం గవిసి గుండియ లవిసి కురుబలంబు లెదురు నడువను మరలం బఱవను మఱచి వెఱచఱచి, సూరితనయహస్తలాఘవప్రశస్తి దక్కం దక్కినచేష్టలు తక్కియుండె నతండు గోవులవెనుకం బోవు నల్పబలంబు బెదరి తూర్పుదెసకుం జెదరునట్లుగా నరదంబుఁ బఱపించి తెఱపిసూపి వెలిచీర సారించి దేవదత్తంబు పూరించినం గేతుకపి గర్జిల్లం దదీయభూతంబు లార్వ పూర్వీరవంబును రథనేమినినదంబును బ్రతిపతాకిసితొములంబును గగనంబునం బొగడుసమరులయెలుంగులును నొక్కటఁ జెలంగ సముదితసాంద్రసంరావంబు రోదసీకుహరంబు నిండిన నొండొండ మట్ట లెత్తుకొని నేల మట్టవి

యుచు నద్దువం బసులు వెసం దిరిగి మున్ను విచ్చ్యుండు వచ్చినజాడ గైకొని
దక్షిణాదిశకుఁ గెరలువోడుచుచుం దెరలం జొత్తెన. 265

క. గోవులతోఁ బొదువంబడి, పోవుచు నున్నట్టిగోపపుంజంబు దదీ
యావసరంబున సరభస, మై వానిపిఱుందఁ దిరిగి యమ్మెయిఁ బఱచెన్. 266

ఆ. అప్పు డర్జునుండు దప్పక చూచి యీ, బలము పసుల కడ్డపడక యుండ
నెడ సొరంగవలయు నిట యెబ్బుకొను మని, పనిచె మత్స్యభూమిపాలసుతుని.

క. పనిచిన నాతఁడు నమ్మెయిఁ, జన నిచ్చె రథంబు గోపసంఘముఁ దిర మై
కొనిపొండు పసుల నోడక, యని తా నెలుఁగించి వీటికై నూల్కొలిపెన్. 268

వ. అట్టిసమయంబున. 269

క. కరితురగసమితిఁ గార్కొని, కురువీరులమొనలు మొగులుకొమరునఁ గవియన్
శరవేగంబున నరుఁ డు, ద్ధురమారుతచండభంగి దోఁపఁ దెరల్చెన్. 270

క. కదిసినబలములు విచ్చినఁ, గదుపులఁ జెదరంగ నీక గాండీవి వెసం
బొదివి యట కడపె నవియును, గొదగొని తమపాలము సొచ్చెగోపాలురతోన్

వ. అని చెప్పిన విస్మయంబు నొంది. 272

ఆ. పసులు వట్టువడినపదపడి నరుఁ డెద్ది, యాచరించెఁ గౌరవాధినాథుఁ
డేమి సేసె బలము లెట్లయ్యె భీష్మాది,వీరు లెవ్విధంబువార లైరి. 273

వ. అనవుడు. 274

మ. నవతాదూర పురాణతానుపగతా నానాత్వ సంశోభితా
వివిధత్వాపగమోజ్జ్వలా బహుకళావిర్భావశాలీ సము
ద్భవరాహిత్యనిరూఢ నూత్నేతర సంభాసా మహోస్థూలమూ
ర్తివిశేషా నిరుపాధికా గుణమయాధీవర్తకా నిష్క్రియా. 275

క. అంతఃకరణచతుష్టయ, శాంతిసముద్యద్వివేకసంపద్వేద్యా
చింతాతంతుత్రుటనా, త్యంతవిదగ్ధైకభజనతత్పరహృద్యా. 276

మాలిని. ప్రణమదవనవిద్యాపారిధిసంరూఢకాంతి
ప్రణుతచరణపద్మా పద్మజాదిత్యసత్ప్రే
క్షణచతురదయావిస్ఫారితాలోక లోకా
క్షణనిపుణజనాంచద్భక్తివిక్రీతమూర్తీ. 277

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము. 278

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము.

## విరాటపర్వము, పంచమాశ్వాసము.

---



సంపాదనచాతు
ర్యా సేవ్యపదారవింద ! యాగికవిహృ
ద్భాసితమతిమూర్తిమయా
వ్యాససమాస్యైకరూప ! హరిహరనాథా.

అర్జునుఁ డుత్తరునకుఁ గౌరవవీరుల వేఱువేఱ నిరూపించి చెప్పుట.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నివ్విధంబున విరోధివర్గం బుక్కు దక్కి వెక్కసపడి చూచుచుండ నిరర్గళభుజార్గళసంరంభవిజృంభణంబు శోభిల్లఁ బసులం బెట్టించి యనతిదూరవర్తియగు కౌరవచక్రవర్తిదెసం గనుంగొని ధనంజయుండు భూమింజయు నక్కడఁ దేరు నడుపం బనుప నప్పలించునప్పుడు కురువీరులు గూడుకొని మూఁడువేలరథంబులతోడను గాంగేయకర్ణులొక్కొక్క రుండు వేయింటితోడను దలకడచి రాజున కడ్డపడి కవ్వడిదిక్కు మొగంబుగాఁ దిరిగి రట్టియెడఁ గదుపులు పట్టువడుటకు నిట్టూర్పు నిగిడించుచు మగిడి మనుజపతియు ననుజసహితుండై సహస్రస్యందనంబులతోడ వెన్నుదన్ని నిలిచె నంతఁ దక్కటిబలంబులు నెయిదికొని యమ్మెయిన దళంబుగాఁ గవిసిన. 2

క. కనుఁగొని మొలన వ్వోలయువ, దనమున గరువంపుఁబెన్ను ! దలకొనఁగా న
ర్జునుఁడు విరాటసుతున కి, ట్లనుఁ గేవలవీరరసమయాత్మకుఁ డగుచున్. 3

సీ. కాంచనమయవేదికాకనత్కేతనో, జ్జ్వలవిభ్రమమువాఁడు ! కలశజుండు
సింహలాంగూలభూషితనభోభాగకే, తుపేంఖణమువాఁడు ! ద్రోణసుతుఁడు
గనకగోవృషసాంద్రకాంతి పరిస్ఫుట, ధ్వజసముల్లాసంబువాఁడు కృపుఁడు
లలితకంబుప్రభాకలితపతాకావి, హారంబువాఁడు రాధాత్మజుండు

తే. మణిమయోరగరుచిజాలమహితమైన, పడగవాఁడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘనతాళతరువసుకసిడమువాఁడు, సురనదీసూనుఁ డేర్పడఁ జూచికొనుము

క. గురునకుఁ బ్రదక్షిణంబుగ, నరదము వో నిత్తమిమ్మహాపురుషు నెడం
బరిభవము [illegible] కురుకులనృపతినయుశీక్షి [illegible] స్మనగా.

క. శస్త్రప్రకారనిపుణుం, డస్త్రవిదుఁడు దూరపాతనాభీలుఁడు వ
ర్పస్త్రాసితరిపుఁడు ధను, శ్శాస్త్రపరిజ్ఞానఘనుఁ డసహ్యుఁడు శక్తిన్. 6

ఉ. ఈతనితోడి కయ్యమున కియ్యకొనం దగ దేను దుష్పథ
ద్యూతజయోద్ధతుం డగుసుయోధనునిం బరిమార్పఁ బోవుచో
శాతశరోత్కరం బితఁడు చక్కఁగ నేయునొ నన్ను నేయఁడో
చూతము తాన మున్నికిఁ జొచ్చినఁ జొత్తముగాక పిమ్మటన్. 7

క. గురుపుత్త్రుఁడు తేజోనిధి, సురాసురుల కైనఁ దేఱి చూడ నరిది సం
గరమున నితని నీశ్వర, వరజనితుఁడు మేటి కౌరవవ్యూహమునన్. 8

క. ధైర్యధనుఁ డితఁడు ద్రోణా, చార్యుల కెన వచ్చు దివ్యశరవిదుఁడు కృపా
చార్యుఁడు మత్పితృసఖుఁ డా,చార్యక మొనరించె మాకు శైశవముతఱిన్. 9

తే. వీర లిరువురు మాన్యులు వీరితోడి, కయ్యమున కిష్టమన మంత గాలు ద్రవ్వ
వలవ దెచ్చోట నెదురుగా మెలఁగి రచట, మనరథం బల్లనల్లన చనఁగ నిమ్ము.

శా. యోధాగ్రేసరుఁ డిద్ధతేజుఁడు రణోద్యోగానురక్తుండు దు
స్సాధప్రక్రమబాహువీర్యుఁడు గురుక్ష్మాపాలవాల్లభ్యల
క్ష్మీధామాత్ముఁడు జామదగ్న్యకలితశ్రేష్ఠాస్త్రవిద్యాఢ్యుఁ డీ
రాధేయుం డొకచేరికిం గొనఁడు వీరవ్రాతముం బోరులన్. 11

క. శౌర్యాటోపంబున దో, ర్వీర్యంబున నస్త్రశస్త్రవిత్త్వమునను మా
త్సర్యంబు సేయు నాకును, దుర్యోధనుఁ డెపుడుఁ దన్నెదురు సేయంగన్. 12

చ. అతిదృఢవేది పేరు గలయట్టిమగండు రణంబు గల్గె నే
డితనికి నాకుఁ దెల్లముగ నిట్టియెడం బరికించి చూడుమీ
మతి గలఁగంగ నీక యనుమానము వాయఁగ నీవు సాయకో
ద్ధతిఁ బ్రకటించుచో బహువిధంబుల నిద్దఱతారతమ్యముల్. 13

క. ఈయెడ ననుఁ గని వారణ, సేయుదు నితఁ డగ్గమైనఁ జిచ్చుఱపిడుగై
పోయి పయిఁ బడుదు నీ వర, వాయించుక లేక పఱపవలయు రథంబున్. 14

ఉ. ఉగ్రుఁ డనూనమానమహిమోన్నతచిత్తుఁ డజయ్యవిక్రమో
దగ్రుఁడు హస్తలాఘవసమన్వితుఁ డేయునెడన్ సమగ్రకో
పాగ్రహబుద్ధి మాదెస ననార్యుఁడు కార్యమునందు ధార్తరా
ష్ట్రాగ్రజుఁ డీతనిం గదిసినప్పుడు పంపుము నాకు నుత్తరా. 15

తే. అరసికొని యెన్నిభంగుల నైన నితని, తేరు మనబారి కగపడఁ దెఱఁగు నాఁచి
యడరి బాసటయైయెవ్వ రడ్డపడిన, మొఱపు మొఱచినదానవునఁ దఱియఁ బోగుము.

క. అశ్వత్థామయుం డతి, విస్మయజననప్రతాపవిభవాగ్నిశిఖా
భస్మీభూతప్రతిప, క్షస్మయకాననుఁడు ప్రథమగణ్యుఁడు బుద్ధిన్. 17

క. బహుమహితాయుధవిద్యా, రహస్యసంవేది ధార్తరాష్ట్రులకును మా
కు హితంబ కోరు సముఁడై, సహాయుఁ డగు వారలకు నచటఁ దానునికిన్
క. వివిధము లగులక్ష్యంబులు, ననలీలం దునియ నాట నవియఁగ నేయన్
భువనైకధన్వి నత్యుగ్రవిచేష్టితు నోర్వఁ బరశురాముం బోరన్. 19
క. శంతనునందనునరదము, పొంతం బో వలవ దలుక పుట్టె యతఁడు భూ
కాంతునకు సైన్యమునకుం, జెంతలఁ జేరంగ నీక సిలుగులఁ బెట్టున్. 20
వ. అని యిట్లు వేఱువేఱ చూపి క్రమంబున నేర్పడం జెప్పి సవ్యసాచి సమరోన్ముఖుం
డగుసమయంబున సన్నిహితుండగుచు నశ్వత్థామ రవితనయునవలోకించి యిట్లనియె.
క. నిను నిన పొగడికొని పలికినపలుకులు పెక్కు గలవు క్రీడి యనికి వ
చ్చినవాఁ డిదె పులివలె నూ, ర్కొన రాదే కర్ణ సేనకుం బ్రియ మెసఁగన్
క. తలఁకు గల దేని శకునిం, బిలిచి విచారింపఁ బొమ్ము పృథివీపతి నీ
తలన దనకార్యఖడ్గం, బులమో పెక్కించె రిత్త వోపుని నీకున్ 23
వ. అనిన విని యతండు క్రోధఘూర్ణమాన తారకుం డగుచు ని ట్లనియె. 24
చ. తలఁకెడువానికిన్ మగఁడ తానట నన్నడఁకించువాఁ డనీ
పలుకకు భీతునట్లాడుఁగఁ బాఱునె శూరుఁడు నిన్ను నచ్చియే
కలనికి వచ్చితిన్ నరుఁడు గాఁ డట వాసవుఁ డైన నేమి నా
బలముఁ జలంబు నేరిమియు బంటుతనంబును నీవ చూడుమీ. 25
క. అని కడఁగునినసుతునకు, న్ననుఁ ద్రోణుఁడు ద్రోణనందనుఁడుఁ గృపుఁడును శాం
తనవుఁడుఁ గడఁగుట దుర్యో, ధనుఁ డవలోకించి యత్యుదగ్రతఁ గడఁగెన్ 26
వ. ఇవ్విధంబున నయ్యేవురుదారులును ధరణీశుండును సరభసంబుగా బరవసంబు సేసి
దుశ్శాసన దుష్పహ దుర్ముఖప్రముఖనిఖిలకురుకుమారనికాయంబును శకుని సైం
ధవప్రభృతిబంధునివహంబును బాహ్లీకసోమదత్తాదిసామంతనికురుంబంబును వ
ఱియునుం గలవివిధయోధవీరనిచయంబును నొక్కటఁ గరటిఘటాఘోటకధ్వ
రథయూథపదాతివితతిసంరంభసంభృత సేనాసమూహసహితంబుగాఁ ద్రోచినడచిన
చ. ధరణి వడంకె ధూళి దివిఁ గప్పిన భానుని గానరాద బం
ధురవివిధప్రకారపటుతూర్యరవంబులఁ బొంగె దిక్కులో
స్ఫురితమహాయుధోగ్రరుచిపుంజవిజృంభణఘోర మయ్యె నం
తరము సహస్రనేత్రముఖదైవతమండలదుర్నిరీక్ష్యమై. 28

అర్జునుఁడు కౌరవసైన్యంబుల నెఱుపాడుట.

వ. అట్టియెడ నుద్భటహాసోల్లాసభాసురముఖుం డగుచు శతమఖతనయుండు. 29
చ. గుణమున నస్త్రకంబునను గోఁకయుగంబునఁ జేఁత దార భీ
షణముగ నుప్పతిల్లి రథశింజనమున్ శేఁకనమాంజిల్లు దీవ్రమా

ర్గణనికరంబు త్రొక్కుట నరాతిబలంబులఁ గప్ప గాండివ
క్వణనము రోదసీకుహరకర్పరముం బగిలింప నుగ్రతన్. 30

క. తలపడి తలమీఱినకా, ల్బలములఁ బొడిసేయ మఱియుఁ బైపైఁ బీనుం
గులఁ ద్రొక్కికొనుచు వెసముం, గలిమొనగవియుటయుఁ గడఁకగడలుకొనంగన్.

క. తనదృష్టియు ముష్టియుఁ దగు, ననువున మున్నిత్తి యేయ నతఁ డప్పు డుడిం
చినక్రాయముల సపాటం, బునఁ బదియుఁ బదేను నుచ్చి పోయెం గోలల్. 32

చ. ఉడుగక పిండియున్ సుభటు లొక్కమొగిన్ వెస నంటఁ దాఁకి క
వ్వడి పటుబాణభాస్వదనివార్యసముద్ధతిఁ జేసి మంటలో
మిడుతలు సొచ్చినట్లయిన మేటిమగల్ గని యీడఁబోక బ
ల్విడి మఱియున్ వడిం బొదువ వ్రేల్మిడిఁ ద్రుంచె నతండు దోడుతోన్. 33

తే. అంతకంతకుఁ గదిసి సైన్యములు సుట్టు,ముట్టి శస్త్రాస్త్రసంచయమున నభంబు
దీటుకొనునట్లు సేయఁ గిరీటి గాండి,వంబుపరిచాలనంబు దీవ్రంబు గాఁగ.

సీ. గోరఁ బోఁజినమాడ్కిఁ గొన్నింటిఁ జక్కసాఁ,బాలుగా వ్రయ్యలు వాపి పాపి
బాడిఱ వఱికినభంగిఁ గొన్నింటిఁ దు,త్తునియలుగా బిట్టు త్రుంచి త్రుంచి
వెస నంపమున నిడ్డవసిగఁ గొన్నిటి విసు,మంతలుగా నుఱుమాడి యాడి
పనివడి ఱోలఁ గొట్టినలీలఁ గొన్నింటిఁ, జిఱునుగ్గుగాఁ బొడిసేసి చేసి

తే. యడరిపాదివినబలమునాయుధములఁ, బ్రతిహతంబులఁ గావించె నతిరయమున
నతులధ్వజసూతహయత్వలసద, ఘల్లురథవల్గనుం డగుఫల్గునుండు. 35

క. ఆమెయిన వివిధవస్త్ర, స్తోమం బఱువ్రుచ్చు సేసి సునిశితబాణో
ద్దామప్రసారవిభవ, శ్రీ మాస్త్వర కద్నతంబు సేసెం గడిమిన్. 36

క. గర్జద్గుణుఁ డై పగతుర, జర్జరితాంగులుగఁ జేసె సాయకజాల
స్ఫూర్జన చూపఱు పొగడఁగ, నిర్జరవరనందనుండు నిమిషార్ధమునన్. 37

శా. శక్తిస్ఫారధనంజయాయతభుజాసంరంభగాండీవని
ర్ముక్తక్రూరశరావలీదళితశత్రువ్రాతముల్ శోణితా
సిక్తాకారతఁ బొంది సాంద్రకుసుమశ్రేణీవికాసోల్లస
ద్రక్తాశోకతరువ్రజంబులక్రియన్ రంజిల్లి యొప్పెం గనున్. 38

చ. తదవసరంబునన్ దొర లుదగ్రతఁ ద్రోచినవజ్రధట్టముల్
మదమున నొక్కపెట్ట బలమర్దనుసూనురథంబు గ్రక్కునం
బొదివెఁ దురంగకింకిణులభూరిరవంబుఁ గరీంద్రఘంటికా
భ్యుదితనినాదమున్ రథవరోత్థితఘోషము నుత్కటంబుగన్. 39

తే. అట్టియెడ వేల్పు వచ్చినయట్ల మేను, వొంగ నలిరేఁగి పాండవపుంగవుండు
మత్స్యనృపనందనుని బలుమాటలోడి, యేపు సెపికిని జూడ్కికి నింపు నొసఁగ.

క. మేదురదీర్ఘతరం బగు, నాదం బెడ తెగక గుణమునను వడి నిగుడం

గోదండము సంతతవల, యోద్దాత్తస్ఫురణ వెలుఁగు చుండఁగ నేసెన్. 41

మ. ఒకమాత్రన్ వితతప్రసారనిబిడాకృత్యుగ్రాస్త్రసంతానముల్
సకలానీకములందుఁ బర్వ నరుభాస్వన్మూర్తి శోభిల్లె దీ
ప్తికలాపంబులు లోక మంతటను విస్తీర్ణంబులై యాగవ
ద్యకృతవ్యాప్తి వెలుంగ నొప్పెసఁగుమార్తాండుఁ విడంబించుచున్. 42

క. నరు లారులు దృశ్యములపైఁ, బరఁగింపఁగఁ జూడ్కి లెల్లు వడుఁ దప్పక య
ప్పురుసున నరుఁ డేయునిశిత, శరములు లక్ష్యములు దప్పి చన వించుకయున్.

క. గజఘోటకరథసూత, ధ్వజకంకటయోధగాత్రతతియం దెచటం
విజయధనుర్ముక్తశర, వ్రజములు దవులంగఁ బడక వారణ నిగుడున్. 44

చ. కవదొన లేల పూనునొకొ కవ్వడి నా వల దుగ్రసంగరో
త్సవమున సవ్యపాణి నపసవ్యకరంబున మార్చి మార్చి గాం
డివము ధరింపఁగా శరపటిష్ఠతయుం బోరిఁ జేయి మార్చి చూ
పువెరవుతోన వీడ్వడక పొం దొడఁగూడెడు నెప్డు సూచినన్. 45

క. సమవిషమవినిమ్నోన్నత, సమీపదూరస్థలములు సదృశములు గఁ జి
త్రము క్రియ నవిహతగతులను, సమరమహిం గ్రీడిరథము సను నవితథమై.

వ. వెండియు నతండు. 47

మ. బల మెల్లన్ వెఱ రెండుపాయలు గ శుంభద్వేగుఁడై చొచ్చి యా
వలగా నడ్డము వచ్చి నాలువు గ దుర్వారోద్ధతిం బోయి మూ
లల నానాకలాకృతిం బొరయ లీలాయానదుర్దాంతుఁడై
వలయంబుల్ సని చించి చిక్కువఱుచున్ వైకల్యసంపాది యై. 48

వ. ఇవ్విధంబున నంబుధిలోన మహామత్స్యంబు విహరించుచందంబునఁ దదీయ
రథంబు కౌరవసైన్యంబునందు సంచరించునయ్యవసరంబున. 49

ఆ. రత్నకేతనములు రాజితశేఖరం, బులును రుచిరఘంటికలును బాహు
బాణనిహతిఁ దునిసి పడుఁ గౌరవులచేటు, దెలుప దుల్లు నుల్కములును బోలె. 50

క. నరుభల్లంబుల నగ్రిమ, చరణంబులు ద్రెస్సి మ్రొగ్గుజవనాశ్వంబుల్
కరుణమెయి రాహుతులకున్, శరణం బగు మనుచు మ్రొక్కుచందం బొందెన్.

క. దంతిఘటాసంతానము, కుంతీసుతునారసములఁ గూలినతఱి న
త్యంతనిబిడాభ్రమున దివి, యెంతయు సొంపారుభంగి నిల చెలు వొందెన్. 52

క. పలుపులుఁ గాండ్లుం బగ్గం, బులుఁ దనయస్త్రంబు లడరి పొడిసేసిన వి
చ్చలవిడిఁ బాఱెడురథ్యం, బుల నేయుఁడు దివిజరాజపుత్త్రుఁడు గృపతోన్. 53

ఆ. అర్జునాస్త్రఖండితాతపత్రధ్వజ, చామరములు గాలిఁ జదలఁ దూలఁ
జిహ్నములవిభూతిఁ జెందంగఁ గని యొప్పె, నప్పు డాడుచున్నయట్ట లచట.

క. ఒకమఱి కిరీటికట్టెదు, రికి నుఱుమునఁ బోయి రేని రెండవమాఱి

య్యకొనుట కోర్వఁగ లేరై, రొకళ్లఁ గురురాజసేన యోధులలోనన్. 55

సీ. మండితధ్వజదండ మండలంబులఁ గిట్టి, విటతాటనంబుగా విఱిచి విఱిచి
చటులఖురోద్భటాశ్వశ్రేణిఁ బొదివి ర, యంబునఁ దునిమి తూఁటాడి యాడి
రాజితబహువిధ రథసమూహముఁ జొచ్చి, కలిబిలి యగునట్లు గలఁచి కలఁచి
మదభరభీషణ మాతంగముల ముట్టి, ఛిందఱవందఱ చేసి చేసి
ఆ. పటుపదాతిచయముపై రౌద్రరసమహో, గ్రముగ నడరి నేలఁ జమరి చమరి
సవ్యసాచి బాణసంఘంబు మత్తిలుం, గాలఘోరలీలఁ గేలి సలిపె. 56

ఉ. శిక్షితచిత్రసంగరవిశేషములం బ్రతిసీతిఖండనా
దక్షతపెంపుసొంపునను దైవబలంబున నత్తిఱేఁ డహా
స్రాక్షుతనూజసారథిరథాశ్వచయధ్వజముల్ పరాస్త్రశ
స్త్రక్షతి లేక యొప్పెఁ గురుసైన్యము వెక్కసమంది చెన్నలన్. 57

కం. తేజోధనుఁ డగునరుఁ డు, ద్వ్యాజితగతి నడుమ మెఱసి బడబాగ్ని దశం
బై జలనిధిఁ ద్రెక్కొనియెను, నోజం గురుబలము పేర్చి యుడిపెం దోడ్తోన్. 58

తే. కాలపక్వంబులైన లోకముల జముఁడు, బొరిసమరెడుచాడ్పున మారిమసఁగి
యుగ్రరూపుఁడై శౌర్యసముగ్రబాహు, సంపదుద్దాముఁ డగుక్రీడి సంపె రిపుల.

వ. అట్టియెడ మున్ను తురంగమఖురానులందూలిన కెందూళియుం బైపయి నెగయఁ బరబలంబు నెత్తుట జొత్తిల్లుచు నుచ్చి చనువివ్వచ్చునిశితశరపరంపరలును, సైనిక శరీరంబులపై పుడిసి తడిసి రుధిరశీకరనికరరవికిరణపరిణతంబగుసమీరణంబును, ధారాళకరాళరక్తపరిషిక్తవిశ్వంభరాభాగంబును, గలయం గెంపుసొంపు సంపాదించి యకాలసంధ్యానావహించినం దదుచితవ్యాపారపారంగతంబులై పొడసూపిన యుడుగణంబులుం బోలెఁ బొలుచుధనంజయసాయకదళితకుంజరకుంభవికీర్ణ మౌక్తికవిసరంబులవలనను, సముదీర్ణమదవేగదుర్నివారవారణవిదారణంబులగునర్జునాస్త్రపాతంబుల బెదరి తేం బ్లగయుట పొగ లెగయుటయుం, బ్రతిభటబాణఘట్టనంబునం బాండవమధ్యమకాండప్రకాండంబుల నిబిడజ్వాలలు నిగుడుటయుంటయునుగా, మూర్తం బగుతదీయక్రోధదవానలంబు ఘటచ్ఛటాశబ్దంబుల చాడ్పునం జెలంగుచున్నయుధిష్ఠిరానుజాతిస్ఫురభల్లభజ్యమానబలవదరాతిఖరాస్థినిస్వనంబులవలనను; దొట్టి తొట్టి యెడనెడ మడువులు గట్టుశోణితంబు నీళ్లు, నందుఁ బడి తేలాడు వెలిగొడుగులు పుండరీకంబులును, వింజామరలు మరాళపుంజంబును నై కొలంకులచందంబు నొంద వాని కెలఁకులు గొదమతుమ్మెదపనుపులపగిదిఁ దొరఁగునాఖండలతనయఖండితపరవీరకాలాయసనారాచశకలంబుల వలనను; గిరీటిశరపాటవపరిస్ఫోటితరిపుకపాలగళితమస్తిష్కపలలపంకంబునను, నలుదెసల నంతంతఁ గదియం జాఁగిపడి యున్నకృత్తకరచరణంబులను, వెదపదనికిఁ దొంపి గలంచి వరుజులు పదిలంబుగా నమర్చిన కేదారంబు తెలంగు దోఁచుటకు

నీ డై చతురహాలికుండు సల్లుపరువంపు మొలకలచెలువునఁ బెల్లు దుల్లుఫల్గునాశుగ
సంతాడనవికీర్ణశత్రుశేఖరవజ్రవ్రజంబులవలనను; సంగ్రామం బభిరామం బయ్యె
ను ఘోరప్రకారం బయ్యె నమ్మహాభయంకరసంకులసమరంబున. 60

చ. ఉఱక విరోధిసైన్యముల నుక్కుమడంగఁగ నుల్లసద్గతిం
బఱప రథద్విపాశ్వములు పాండవమధ్యము తేరివీథియం
దఱవఱలై పడం గని భయంపడి యిద్దెస వచ్చె నేని న
త్తైఱఁ గయి పోమె యంచు నెడతెంపిగఁ గొందఱు వాయఁ బాఱఁగన్. 61

క. వాలమ్ములు దాఁకి ధరకా, వ్రాలుభటులఁ జూచి యెడలువడఁకఁగ మేనుల్
దూలఁగఁ దముఁ దాఁకకయును, నాలము సాలించి కొంద ఱవలఁ జనంగన్. 62

తే. ప్రొద్దు గ్రుంకిన మఱి కాని పోవఁడొక్కొ, క్రీడి యని కొంద ఱాజికి నీడఁబోవ
బలము నెల్లను దెగటాఱఁబఱపి కాని, తక్కఁడెట్టులుననుచుఁ గొందఱు చలింప.

క. తరతరమ ప్రజలఁ దునిమెదు, వదునప్పటియొత్తికోలునరు సురవిద్యా
ధరఖేచరులును భీతిం, బొరసిరి తమదెసకు నేమి పుట్టునొ యనుచున్. 64

క. తమతమయొద్దిబలంబులు, క్రమవిరళము లైన దొరలు గాండివిపై ను
గ్రముగఁ దఱుముటయు నాతఁడు, సమరోల్లాసమున దివ్యశరతత్పరుఁ డై. 65

సీ. ఆచార్యు డెబ్బదియమ్ముల నాచార్యపుత్త్రు నేడింటఁ గృపునిఁ బదింట
దుష్ప్రిహుఁ బండ్రెంట దుశ్శాసనునిఁ బది, యేనింట సౌబలు నెనిమిదింట
సమరనదీసూను నఱువదింటను నేసి, రవిసుతురథ్యసారథుల నొంచి
వర్మమంతయుఁ ద్రుంచి వైచి మత్స్యాస్త్రిబం, ధములు భేదించి విక్రమము నెఱపి

ఆ. యిట్లు దొరలు నొవ్వ నేసెఁ దనచేతి, కోలఁది సూపి క్రీడి సెలఁగి దేవ
దత్త మొత్తుటయును దత్సైన్యములు సెడ, విఱిగి పాఱి భీష్మమఱువు సొచ్చె.

క. గాంగేయుఁ డవష్టంభో, త్తుంగతనుం డగుచు నిల్లు దూలినకురుసే
నాంగంబులఁ బురికొలిపి సు, సంగతములు సేసె సమరసమ్ముఖములుగాన్. 67

వ. ఇట్లు భగ్నబలసమాశ్వాసనోద్భాసి యగుభీష్మభుజబలంబు ప్రాపున మాతంగ
తురంగస్యందనసందోహంబులతోఁ గుంభసంభవకృపాశ్వత్థామకర్ణవికర్ణప్రముఖ
నిఖిలయోధజనంబులు సుయోధనముందటఁ బన్ని నిలిచినం జూచి సవ్యసాచి
ప్రత్యేకప్రధనకుతూహలాయత్తచిత్తుం డగుచు నుత్తరున కిట్లనియె. 68

ఉ. కందము లప్పళించి తురగంబుల నించుక నిల్పు వైరిసే
నం దెలియంగఁ జూడుము ఘనప్రకరంబునుబోలెఁ గాఱుకొం
చుం దఱ చైనదంతిభటసుందరకేతనరాజి గ్రాలఁగా
ముందట నిల్వఁ గట్టెదిరి మోహర మున్నవిధంబు గాంచితే. 69

ఆ. కర్ణుకేతనంబు గ్రాలెడు నల్లదె, యాతఁ డాజికేళికౌతుకమునఁ
గడఁగి వచ్చుటయును గలిగియున్నదిమున్న, తోడరవలయు నతనితోడ మనము.

వ. అని మఱియును. 71

చ. రయమునఁ గిట్టి యీతనిపరాక్రమలీల యడంచి నొంచి దు
ర్జయుఁ డని నమ్మి యున్నకురురాజునకున్ వగ వుట్టఁ జేసెదన్
హయములఁ బోవ నిమ్మనుడు । నాతఁడు నాతనిలావు నచ్చి ని
ర్భయమునఁ దేరు నోఁ బఱపె । భాస్కరసూతికి సమ్ముఖమ్ముగన్. 72

అర్జునుఁడు చిత్రాంగదప్రభృతికురుకుమారుల నిర్జించుట.

వ. ఇవ్విధంబున వృషభంబున కాదికొను బెబ్బులియునుంబోలె రాధేయుదెస నడచు కవ్వడిం గని చిత్రాంగదుండును జిత్రరథుండును సంగ్రామజిత్తును దుష్ప్రహుండును జిత్రసేనుండును వివింశతియును దుర్ముఖుండును దుర్జయుండును వికర్ణుండును శత్రుంతపుండును దుశ్శాసనుండును లోనుగాఁ గలకురుకుమారవర్గంబు నిరర్గళప్రకారంబు లగురథచిత్రప్రచారంబులు మెఱయ మొనకుం దలకడచి చటులపటుబాణవేణికాపరంపరలు నిగుడ నొక్కపెట్ట కవిసిన నతండును గుణధ్వని తంత్రీనాదంబుగా నావిండ్లవా రొత్తుకాఱుగా గాండీవంబు వీణెగా వినోదంబు సలిపె నట్టియెడ వికర్ణుండు. 73

క. తలమీఱి నిశితశరమం। డలిఁ గప్పం బార్థు నుత్కటక్రోధమునన్
విలు విఱుగ నేసి యతనిం, దొలఁగంగాఁ జేసె నరుఁడు । దోర్బలలీలన్. 74

క. ఇంతయుఁ గనుఁగొనియును శత్రుంతపుఁ డొసరిల కాజి । దోహల మలరం
గౌంతేయుతోడఁ దలపడి, వింత లయినకూర్మనఖరవిశిఖము లేసెన్. 75

వ. అర్జునుండును. 76

క. సూతుఁ బదింటను నైదిట, నాతనియంగంబు నొంచి । యంత నిలువమిన్
శాతఘనశరము వే కొని, యాతల వెడలంగ నేసి । యసువులఁ బాపెన్. 77

తే. ఇట్లు శత్రుంతపునిఁ ద్రుంచి । యివ్విధమున
నొక్కఁ డొక్కఁడ తలపడు । టుడుపఁ దలఁచి
వివిధబాణపరంపర । వెల్లిగొలిపె
భయరసమువఱ్ఱుపెట్టునఁ । బగఱు వాఱ. 78

క. అందఱు రథికులు పఱవఁగ, నిం దేటికి మున్ను వచ్చి । రిస్సీ యని సం
క్రందనసుతు మార్కొనియెఁ ద, గం దెగి సంగ్రామజిత్తు । గర్వోద్ధతుఁ డై. 79

క. తలపడి వాలమ్ములు పై, నల వేర్పడ నినుచుటయును । నలుక వొడమినం
దల దునిమివైచె నాతని, బలసూదనసూనుఁ డొక్క।పటుభల్లమునన్. 80

తే. అప్పుడు రాధేయుఁ డిమ్మెయి । ననుజుపాటుఁ, జూచి యేనుంగునకు సిల్లు।సూపినట్లు
గవిసిహయముల మత్స్యభూ।కాంతుతనయు, నేసి పండ్రెండుశరముల। నేసె నరుని.

ఉ. కేసరివిక్రముండు కపి।కేతనుఁ డత్తఱి వైరివీరసం
త్రాసకరప్రకార మగు।దర్ప మెలర్పఁగ బాణజాలవి

న్యాసమునఁ బెనఁ బొదివె । నర్కసుతుఁ గరుడుండు పాము ను
ద్భాసితపక్షుఁ డై పొదువు । భంగి సుగావలి పిచ్చలింపఁగన్. 82

క. ఇరువురు వీరులు నిట్లొం, డొరువులఁ దలపడుట సూచి । యుత్కటమగున
చ్చెరువాటుఁ గౌతుకంబు న, డర నూరక యుండె నవ్యో । డం గురుసేనల్. 83

మ. ప్రళయాంభోధరముక్తసాంద్రవిసర । త్పాషాణవర్షంబు మి
క్కిలి యై శైలముఁ గప్పునట్లు నరున । క్షీణాస్త్రసంతాన మి
ట్టల మై కప్పినఁ దీవ్రమారుతము గా । ఢవ్యాప్తిజీమూతమం
డలిఁ బోలెన్ విరియించె భానుజుఁ డవ । ష్టంభోజ్జ్వలాకారుఁ డై. 84

క. విల్లును దానును శిఖ రా, జిల్లఁగ వెలుఁ గొందువహ్ని । చెలువంబున శో
భిల్లుటఁ గని కురుసైన్యము, లెల్లను తూర్యములు మ్రోయ । నెత్తెఱఁ జెలఁగెన్

క. రవితనయు బాణములు వా, సవనందనుఁ బొదివినపుడు । సంతోషముఁ ద
ద్వివిధాస్త్రము లాతనిపైఁ, గవియ విషాదంబు నొందుఁ । గౌరవసేనల్, 86

వ. ఇవ్విధంబున నే ట్లాడుచుం గదిసి గాండీవి కర్ణున కి ట్లనియె. 87

ఆ. సభలఁ బలుకు దీవు । సరి లేరు నా కని, యిదె రణంబు వచ్చె । నెల్లవారి
కెఱుఁగవచ్చు దీనఁ । బెఱిచోట రజ్జైన, యట్లు పూరగింప । నగునె యిచట. 88

క. మాటలు పెక్కాడితి వీ, పోటుమగలు వినఁగ నింకఁ । బోవుట దగ దె
ప్పాట నది గాక తమ్ముని, పాటును గన్నారఁ గంటి । పాఱకు మింకన్. 89

ఆ. పలుక వచ్చుఁగాక । పలికినయట్టుల, చేయ వచ్చునెట్లు । దాయ యెందుఁ
బోయె దట్లు ద్రుపద । పుత్త్రికఁ బఱుపంగఁ, గాంచి నగినఫలము । గందు గాక, 90

క. ఏ నపుడు ధర్మపాశా, ధీనుఁడ నై కోపమునకు । దీ కొనరింపం
గా నేరకున్న మెయిమెయిఁ, బో నయ్యెం గాక యింకఁ । బొమ్మా యిచటన్

వ. అనిన విని రాధేయుం డి ట్లనియె. 92

ఉ. అప్పుడు ధర్మహానికి భ । యంపడి నిల్చితివో కడంకతో
నిప్పుడు వచ్చినాఁడ విట । యెల్లను జేయుదుఁ గాక యన్నపైఁ
దప్పు ఘటించి నీవు నొక । తాలిమి గల్గినవాఁడ వై నెపం
బొప్పినఁ జెల్లె నీదునిలు । పోపును జూతము గాక యిచ్చటన్. 93

క. సమయంబు నడపినను రా, జ్యముభాగం బీరె యెట్లు । నను నాస నర
ణ్యమున వసించితి గాక ని, జమునకు నీయందు ధైర్య । సారము గలదే. 94

క. మును నీ వచట నచటఁ జే, సినబంటుతనంబు లెల్లఁ । జెప్పఁగ విందుం
గనినఁ గదా నమ్ముదు నవి, యనుమానము నాకు నీభ । యస్థితిఁ గనుటన్. 95

కర్ణార్జునలద్వంద్వయుద్ధము.

వ. అనుచు వాలమ్ములు గురిసిన నర్జునుండును బ్రీతుం డై గాండీవవిక్షేపక్షోభిత

నభోభాగం బగుచుం గానీను పై నానావిధవిశిఖంబులు నిచి చెన ట్లయ్యిరువురును
దేవాసురసంగ్రామసాదృశ్యవిక్రమప్రక్రియం బొలిచి రట్టిసమయంబున. 96

క. రవిదీప్తులు సార నేరమిఁ, గవిసెం జీఁకట్లు పవనుకిగమనం బడఁగా
వివిధాస్త్రంబుల నంబర, మవిరళముగఁ బొదువఁబడుట నద్భుతభంగిన్. 97

ఉ. అప్పుడు కర్ణసైన్య మమరేశ్వరాధిపనందనుఁ జుట్టు ముట్టఁ దే
ర్పుష్పరవీధి మై వలయ మొప్ప వెసం బ్రహరించి క్రీడి పెం
గుప్పలుగా రథావలిని ఘోటతతిం గరిరాజిఁ గూల్చుచుం
దప్పక భానుసూను మెయి దాఁకఁగ నేయుచు నుల్లసిల్లినన్. 98

వ. రాధేయుండును. 99

క. శతిమి పయి నదరుటయు విలు, విఱుగంగా నేసె నరుఁడు విక్రమలీలం
గొఱఁగువడ నీక కర్ణుఁడు, మెఱుఁగు లడరుశక్తి సురలు మెచ్చఁగ వైచెన్.

ఆ. వైచుటయును సవ్యసాచియుఁ గౌరవుల్, విస్మయంబుతోడఁ విఱుపు పొంద
నధికరయము మెఱయ నది పెక్కుదునియలు, చేసె నంతరమున శితశరముల.

వ. అట్టియెడ నినతనయు మన్నించుజోదులు డిగ్గి పయిం బడినఁ గ్రోధారుణనయన
పల్లవితంబును దంతకాంతి స్తబకితంబును గుంభస్థలఫలితంబును నగుతదీయకరటి
ఘటావికటవిటపిపటలంబు నాకిరీటివిశిఖవ్యాపారమహావాతంబునఁ బడలువడం
గూల్చి చండమూర్తి దాల్చి శోభిల్లుబీభత్సుం గని యతండు బొమముడి
నెక్కొన వేఱొక్కవి ల్లెత్తికొని. 102

క. తురగముల నాలుగిట ను, త్తరు నాఱిట నెనిమిదిట రథమును బదిటను దా
నను నఱువదిశరముల న, న్నరునంగంబులను బెలుచ నాటఁగ నేసెన్. 103

వ. ఇత్తెఱంగున. 104

సీ. రోషంబు భీషణాకారమై చెలు వొంద, ..తులకేతువు శిఖయై వెలుంగ
శరజాలములు పెనుజ్వాలలై నిగుడ న, ర్కతనూభవోగ్రాగ్ని ప్రజ్వరిల్లు
నుగ్రశక్తి సైపక యుజ్జ్వలదివ్యప, తాక మెఱుంగు గా దళితధరణి
రథనేమిరవము గర్జనము గ శరపరం, పరలు ధారలు గాఁగఁ బరఁగి యడరె

ఆ. నర్జునాంబుదం బనన్యసామాన్యస, ముద్యమమున ముఖసరోరుహముల
కాంతి దఱిఁగి యపుడు కౌరవసేనాస, రోవరంబు దీనభావ మొందె.

క. చెండియు నుడుగక రవిసుతుఁ, డొండొండ నిశాతసాయకోత్కరము సము
ద్దండతఁ బైనించిన నా, ఖండలనందనుఁడు గెంపు కనుఁగవఁ గదురన్. 106

క. శిరము లలాటంబును గం, ధరమును బాహువులు నురము దండడి వ్రయ్యన్
గిరిపైఁ బిడుగులు వోలెఁ గెడు, సరుసున దృఢదీప్తశాతభల్లము లేసెన్. 107

క. అఱిముఱి నంగము లెల్లను, నుఱుముగ ని ట్లడరునగ్నినునియములకున్
వెఱచఱచి సూతపుత్త్రుఁడు, పఱచెఁ బుడమి యద్రువ మత్స్యభూపతిసుతుఁ డార్వన్.

వ. ఇట్లు కర్ణుండు గయ్యంబు విడిచి పాఱినఁ బార్థుండు దేవదత్తంబు పూరించి యు
త్తరున కిట్లనియె. 109

క. వీఁడె కర్ణుఁడు కురుబలంబున, వాఁడిమగం డనఁగఁ జాలువాఁ డిబ్భంగిం
బోఁడిమి సెడియెను ద్రోణుల, వేఁడిమి యిట మనకు మునుము । విక్రమమునకున్

వ. అనుచు వీరావేశంబునఁ గౌరవానీకంబు నాలోకించునప్పు డుత్తరుండు. 111

ఉ. వెక్కసపాటు భీతియును । విహ్వలభావము నొంది యిట్లను
న్నిక్కలి యైనశౌర్యమును । నిర్భరతేజము నంత కంత కి
ట్లెక్కుడులావుఁ జూచి మది । నెంతయు గగ్గెలె మేను చేష్టలం
దక్క నశక్య మింకిట ర । థవ్యవహారము నిర్వహింపఁగన్. 112

ఆ. పుట్టినంతనుండి । యిట్టివి యెన్నఁడుఁ, గాన నెందు నట్లు । గాన చోద్య
మంది యంతరంగ । మవశతఁ బొందిన, కతన నింద్రియములు । కడఁక దక్కె. 113

తే. అనినఁ గొండొకనవ్వొలయంగఁ జూచి, యింద్రనందనుఁ డాతని । కిట్టులనియె
నేను గలుగంగ నీ కేమి । యెలమి వాహ, నముల కుబ్బుగ సంచోదనంబు సేయు.

క. అనుటయు నాతఁడు దగ నూ, ల్కొనినం దా నుదితనినద । కోదండుం డై
యనితరసులభోద్యమమున, ధనంజయుం డిట్టు లను నతనితో మఱియున్ 115

క. అరుణాశ్వంబులఁ బూనిన, యరదంబున వీఁడె నిడుపు । లగుచేతులు బం
ధురకంధరంబు వెడలుపు, టురమును నై ద్రోణుఁ డొప్పె । నుత్తర కంటె. 116

వ. అని చూపి వెండియు నిట్లనియె. 117

ఆ. సకలకురుకుమార । చాపశిక్షాచార్యుఁ, డాజిదుస్సహుండు । సాంగవేద
వేది నీతిశాస్త్ర । విదుఁడు దివ్యాస్త్రకో, విదుఁడు సుజనహితుఁడు । విమలబుద్ధి.

వ. అని యగ్గించి. 119

క. తనతనయుకంటె నెమ్మన, మున నాకుం గూర్చు భావ । మున గురులకు మా
ర్కొనియెదము రాచధర్మం, బునకీడునఁ జేసి యింత । వుట్టఁగ వలసెన్. 120

చ. ఎదురుగఁ బోవ నిమ్ము రథ । మీతని తేరికి నన్న నాతఁడుం
బదిలముతోడ రథ్యముల । పగ్గము లెత్తెఱ నూలుకొల్పి యు
న్నదగతి నట్ల చేసిన న । మానుషవిక్రముఁ డైన ద్రోణుఁడుం
గదిసి యిభం బిభంబుఁ జెన । కం జనుదెంచినలీల వచ్చినన్. 121

నరుఁడు నమస్కరించి గురున కిట్లనియె. 122

అడవులఁ బెద్దయుం గాలం, బిడుమలఁ గుడిచితిమి మాకు । నిది దఱి యని యి
వ్వొడ వచ్చితిమి విపన్నుల, యెడఁ గృపసేయుటయ లెస్స । యీ రలుగకుఁడీ.

అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధంబు సేయుట.

క. మును వెఱతు సేయ మీరలు, నను సేసినఁ గాని యనుడు । నాకేశసుతుఁ

ధనురాచార్యుం డిరువది, సునిశితబాణముల నేసెఁ జూపఱు వొగడన్. 124

ఆ. అర్జునుండు వానినన్నింటి నడుమన, తునియ నేయుటయును ద్రోణుఁ డ[illegible]
శతసహస్రసంఖ్య శరములు గప్పిన, నతఁడు నతనిఁ గప్పెఁ బ్రతిశరముల.

చ. అతిరథు లస్త్రశస్త్రవిదు లద్భుతబాహుబలుల్ పరాక్రమో
ర్జితయశు లిట్లు దాఁకి గురుశిష్యులు కౌరవసేనలో నిభూ
పతినుతకోటికిన్ వెఱఁగుపా టొనరించిరి బాణజాలసం
వృతగగనాంగణం బగు నపీనమహాహవ విభ్రమంబునన్. 126

వ. అట్టియెడఁ గురుసైన్యంబుజనంబులు. 127

క. నరుఁ డొక్కరుండు దక్కఁగ. గురుఁడు గడగినపుడు మాఱుకొనఁ జాపధరుం
డొరుఁడు గలఁడె మఱి వెదకిన, హరుఁడు గలం డింకఁ గలుగ డనరా దెందున్-

క. ద్రోణుఁడు రయమున నేసిన, బాణము లెడ తెగక యొక్క బాణముపోలెన్
శ్రేణి యయి పోవఁ బార్థుఁడు, రేణువు గావించుఁ గంటి రే చిత్రగతిన్. 129

క. గురుశరములు సితపక్ష, స్ఫురణంబున నంచపిండు పోలుపు వహించెన్
నరుబాణతతి ఘనావలి, కరణి మిగుల నొప్పె నల్లగఱుల చెలువునన్ 130

వ. అనుచుం గనుంగొనుచుండ. 131

శా. శ్రావ్యం బై చెలఁగెన్ గభీరమధురజ్యానాద ముద్దామపీ
రవ్యాపారనిఘాతితం బ్రతిశరారంభంబు మర్దించుచున్
సవ్యప్రోద్ధృతచాపసవ్యగతి నాశ్చర్యంబుగా నేయుచున్
దివ్యాస్త్రంబులఁ బోరి రిద్ధఱును సాదృశ్యం బదృశ్యంబుగన్. 132

వ. ఇంద్రాగ్నివాయువరుణదైవత్యంబు లగుశరంబులు గురుం డేసిన నరుండును దత్తద్దేవతాకంబు లగునంబకంబులఁ బ్రతిహతంబులు సేయుచు వచ్చె నయ్యిరువురుం బెల్లేయుసాయకంబు లంతరిక్షంబున దలం బై సంతమసంబు గలిగి యున్నికి నేబాణం బెక్కడఁ బాఱుటయుం గోపకుండై నట్టియెడఁ గుంభసంభవుబలంబు సరభసంబుగా నతని కడ్డంబు సొచ్చిన విబ్బచ్చుండు వ్రేల్మిడిం బొడిసేసి సకేయూరంబు లగుబాహుదండంబులను సకుండలంబు లగుకర్ణపాశంబులను సకిరీటంబు లగుశిరోభాగంబులను భూభాగం బలంకరించి యప్పు డావహిల్లినరుధిరసాగరంబునకు రత్నాకరత్వం బలవరించె నిట్లు దుర్జయుం డగునర్జునుండు సైన్యంబు దైన్యంబు నొందించుచు నాచార్యునకు భరంబుగ నేర్లాడుచున్నం జూచి యతండు విస్మితుం డై. 133

క. అర్జునుని నాహవంబున, నిర్జింపఁగ నగునె ఫాలనేత్రున కైనన్
బర్జన్యసుతుఁడు శరవ, ర్షోర్జితమూర్తి యగు టరయ నుచితము కాదే. 134

వ. అని మఱియును దగినపలుకుల నగ్గింప నిలింపనికరంబు. 135

[illegible] నిలువ, వెంట నున్న ద్రోణుండ । వింటివాఁడు
[illegible] వారండ, బలిమిఁ దలమీఱునే యిట్లు । నిలువవలదె.
[illegible] ద్రోణసూనుఁడు రయం । బత్యంతఘోరంబుగా
[illegible] ధారవిలసద్బాణంబులన్ ద్రోణుఁడా
[illegible] నాదిని । క్షిప్రాభిదిర్ఘ స్ఫుర
[illegible] సర్వాంగస్యందనంబులన్. 137
క. [illegible] దోడుతోడఁ । దఱుఁగులయు రథ
[illegible] నశ్వత్థామ వెసం దాఁకెం బాండుసుతనయునితోడన్. 138

అర్జునుఁ డశ్వత్థామతో యుద్ధము సేయుట.

ఉ. అతఁడును దీవ్రబాణముల । నాతనిఁ గప్పుచు మాఱుకొన్న నా
శరమువ్యవతిసంగరముచందము దోఁచె వడిం జటచ్ఛటా
యుతరవ మన్న వేణువుల । నేస్పురవాసలుమోఁతభంగి ది
క్తతిఁ బరఁగఁగ మహాద్భుతము । కౌరవసేనకు నావహిల్లఁగన్. 139
వ. అట్టియెడ. 140
చ. ఉఱక నరుండు ద్రోణసుతుయుగ్యములన్ వెస నొంచె నాతఁడుం
దెఱపి యొకింత గాంచి ఘనతీవ్రశరంబున నారిఁ ద్రుంచి క
న్గిఱిపినమాత్రలోన నతనిం బటుబాణచతుష్కయుగ్మ మే
ర్తెఱఁ దొడి మార్వి గ్రమ్మఱ ఘటించు నెడన్ వడి నేసి యార్చినన్. 141
క. కురుసేనలోన నిట్లి, వ్వరుఁ జేసిన వారు లేరు వార్యభుజావి
స్ఫురణోదగ్రుండు గదే, గురుపుత్రుం డనుచు సమరకోటి నుతించెన్. 142
చ. చిఱునగ వొప్ప గాండివము । సచ్చర నబ్బము సేసి సేసలు
క్కఱ రభసంబుమై నడరెఁ । గవ్వడి ద్రోణియు సీడఁబోక య
త్తఱిఁ దఱుమంగ నస్త్రములు । దండడి మార్కొని మండు చుండెఁ జి
చ్చఱపిడుగుల్ వడిం దొరఁగుచాడ్పున నంబరవీథి నుగ్రమై. 143
వ. ఇవ్విధంబున ధనంజయుం డేయువేగంబున నేయుటయు ద్రోణతనయుతూణీ
రంబులు శరశూన్యంబు లయ్యెఁ దనతూణీరంబు లక్షయబాణంబు లగుటం
జేసి యంతకంతకు నతిశయిల్లు పెల్లున నేయుచు నధికుండగునప్పాండవమధ్యముం
గనుంగొని కృపాచార్యుండు చెంగటం దలమీఱిన. 144

అర్జునుఁడు కృపాచార్యునితో యుద్ధము సేయుట.

క. గురుపుత్రునిరథము విడిచి, సరభసముగ నందు సవ్యసాచి గవియుడుం
దిరమై యాతఁడు శితశర, పరంపరలు గురిసె నుగ్రబంధుర గతులన్. 145

వ. పాండుపుత్త్రుండును జిత్రసంచారంబుల మెఱయుచు 146

క. పటువిశిఖపంక్తి యత్యుత్కటరయమున నిగుడఁ జేయఁగా నవ్విధ మా
దుట దైన మండె దీప్తోద్భటభంగిఁ గృపానలంబు బలములు వొంగన్. 147

వ. ఇట్లు మండిశిఖఁబోలెడికనకలిప్తపుంఖబాణంబు వనచరకేతువుం దాఁకించి వేఁడిమి చూపి వివిధాస్త్రజ్వాలలు గవియించి దిక్కులు పెలంగ నార్చినం గోపంబున నాటోపంబు మిగిలి బలసూదనసూనుం డతని కేతనంబు దునిమి తరణికిరణానుకారపారంగతంబు లగునారాచంబులు దదీయాంగంబుల నినుపం దొడంగిన రథరక్షకు లగుచంద్రకేతుండును జిత్రాశ్వుండును మణిమంతుండును మంజుమాళియు హేమవర్మయును సురథుండును సుషేణుండును నరిష్టుండును సుకేతుండును నుక్కు మెఱయ నొక్కటం దాఁకిన. 148

ఆ. అన్నివెడఁదవాతియమ్ము లద్భుతముగ, నొక్కముష్టిఁ దొడిగి క్రక్కసంగ
నతఁడు లీలఁ దునిమె నందఱతలలును, ఘోరభంగి రక్తధార లెగయ. 149

సీ. తునిమి తోడన యొక్కసునిశితశరమునఁ, గాఁడియు రెంట నక్షములఁ ద్రుంచి
హరుల నాల్గిటఁ జంపి యాలంపుగోలతో, నొగలు మూఁడమ్ముల నుగ్గుసేసి
ధనువును సూతునితలయుఁ జెఱొక్కట, నఱకి లోచనముల నవ్వు నెఱయఁ
గృపుని నాలోకించి క్రీడి తద్వక్షఃస్థలంబునఁ గ్రూరభల్లంబు నాట

ఆ. హతరథుండు నిపతితాశ్వుండు సంఛిన్నచాపుఁడును నికృత్తసారథియును
నయ్యు నొచ్చియును భుజార్గళసంరంభ, మతిశయిల్ల శక్తి నతఁడు వైచె.

ఉ. మండుచు వచ్చుదానిఁ బదిమార్గణముల్ గొని వేగ మొప్ప నా
ఖండలనందనుండు గడికండలు సేసినఁ జూచి యప్పు డా
తం డుడివోక లేక సమరంబున ఖడ్గము ఖేటకంబు ను
ద్దండతఁ గొంచుఁ దేరు డిగి తాఁ గవిసెన్ రయ ముల్లసిల్లఁగన్. 151

వ. ఇట్లు గవిసిన. 152

క. పలుకయు వాలును నింతిం, తలు దునియలు సేసె బాణతతిఁ బాండవుఁ డి
ట్టలి మైనవెఱఁగుపాటున, నిలిచి కృపుఁడు ద్రోణపుత్త్రునిరథం బెక్కెన్. 153

ఆ. అప్పుడే పడంగి యన్నిసేనలు భీష్ము, రథముపొంత కొదిఁగె రౌద్రరసవి
నోది యైనయర్జునుఁడు ధనుర్జ్వాలన, దీప్తమూర్తి యగుచుఁ దిట్ట కుఱికె.

వ. ఇత్తెఱంగున నుఱక తఱియ నుఱికిన. 155

క. బలములు దొరలుఁ బొదివి సం, కులయుద్ధము సేయఁ గోపధరఘోరాకృతి యై
యులఁ బొరిపుగఁ జనురంగంబుల ద్రెళ్ళిడిఁ బాండురాజపుత్త్రుఁడు సూచెన్

ఉ. చేతులతీఁట వో నిటు లశేషబలంబుల నుగ్గుసేసి మాం
సాతతపంక మై బహువిధానుసమానము లొప్పఁ జామర

వ్రాతము ఫేనభంగిగ నిరంతరవీరశిరస్సరోరుహ
స్ఫీతవిభూతిఁ బొల్చునది సేసె రణస్థలియందు నెత్తుటన్, 157
తే. ఇట్లు కౌరవానీకంబు నెల్లఁ గలఁచి యాడి భీష్మునిదెసఁ బోవు కిరీటిఁ దాఁకెఁ
గొండతోఁ దాఁకుతగరు నుద్దండవృత్తి,దోఃప్రవృష సేనుఁడాహవదోహలమున.
వ. విజయుండును. 159
తే. భల్ల మొక్కట నాతనివిల్లు దునిమి, యైదునారసములు వక్షమూఁడ సేసె
నతఁడు సైరింప రానినొవ్వడరుటయును, బెగ్గలంబున నరదంబు డిగ్గి పాఱె.
వ. అట్టియెడ దుశ్శాసనశకునిదుర్ముఖవివింశతి వికర్ణులు. దన్నుం బొదివికొనిన వారల
రథరథ్యకేతువర్గంబులు జర్జరితంబులుగా నేసి గాసిచేసిన నందఱుం గనుకనిఁ
బఱవందొడంగినఁ బార్థుండును బ్రహాసోల్లాసభాసియగుచు నుత్తరుం గనుంగొని.
తే. కనకమయతాలకేతువు గ్రాలఁ జరత, టిల్లతాలీలఁ గలిగి శోభిల్లునంబు
దంబుచాడ్పున సురనదీతనయుఁ డున్న, వాఁడు సూచితె మత్స్యభూవరతనూజ.

అర్జునుఁడు భీష్మునితో యుద్ధంబు సేయుట.

క. బలువిడి మనదివ్యాస్త్రం, బులచవి సూపంగవలయుఁ బో నిమ్ము రథం
బలసగతి నతనిఘన కని, పలికిన నతఁ డట్ల చేసెఁ బరమప్రీతిన్. 163
ఉ. శాంతనవుండు నప్డు నిజశంఖము కౌరవరాజసైన్యముల్
సంతస మంద నొత్తుచు ససంభ్రమలీల నెదుర్కొనంగ దు
ర్దాంతభుజాబలప్రకటదర్ప మెలర్ప నరుండు నొత్తె ది
గ్దంతినికాయకర్ణపుటదారణవిత్తము దేవదత్తమున్. 164
తే. మలసి అంకెలు వైచుచు మూఁకొనిన
వృషభములభంగి నక్కురువృషభు లిట్లు
సమరగతిఁ జేరునెడఁ జూచి యమరు లర్థి
ననిమిషత్వంబు దమకప్పు డచ్చుపడఁగ. 165
వ. ఇవ్విధంబునం గనుంగొనుచు వారలు దమలోన. 166
క. మనలను దానవులను గడ,చినయవి భుజబలము లస్త్రశిక్షావిధముల్
గొనియాడఁ గొలఁది గా దీ,తని నాతఁడ యతని నితఁడ తగుఁ జెనయంగన్.
సీ. అనుచుండ సైన్యంబు లార్పులుఁ బెడబొబ్బ, లును దూర్యనాదంబు లుల్లసిల్లఁ
బేర్చి యొక్కుమ్మడి భీష్ము నగ్గింపంగ, నతఁడు నిశాతబాణాష్టకమునఁ
బడగపై హనుమంతు నొడలును బహుశరం,బులనందుఁ జెలఁగెడుభూతములను
దశవిశిఖములరథ్యములను సారథి, నేసె వాసవియును నెసక మెసఁగు
తే. నగ్గలిక గాండీవంబు చక్రాకృతిప్ర, కాశవహ్నిస్వరూపత గలిగి విడువు
తెఱపి గానంగ రాకుండ నెఱసి యొప్పు,సాంద్రసాయకతతి నాకసంబు గప్పె.

తే. అర్జునుఁడు గవియించిన। యంప మూఁక, మంచు దళముగఁ గప్పిన। మార్గణాంశు
జాలముల వెస విరియించె। శాంతనవుఁ, డంగుఁ దుద్ద్యోతమానప్ర। తాపకేళి.

క. అమరేంద్రతనయుఁ డుగ్రా, స్త్రములు వడిం గురియ నడుమ। దరమిడి వానిం
దుమురుగఁ జేయుచు వచ్చెను, సమరోల్లాసంబు మెఱయ। శంతనుసుతుఁడున్.

క. అర్జునుఁడు దివ్యబాణ, స్ఫూర్జితగోశ్శక్తి దనకుఁ। జూపిన నతఁడు
ద్దూర్జితబలుఁడై నియమో, పార్జితఘోరాస్త్రవితతిఁ। బ్రతిహతిఁ జేసెన్.

క. కవ్వడి యమ్మెయి నేసిన, నవ్విధమున నాశరంబు। లన్నియు దాదా
దవ్వులన నిలువరింపఁగ, నివ్వచ్చుఁడు గినిసి యేసె। విలు విఱుగంగన్. 172

మ. తనకోదండము ఖండితం బగుడుఁ గ్రోధం బార మందాకినీ
తనయుం డప్డు సఖా విలుం చనసము। ద్యల్లోలక్రోధసింహాకృతిన్
ధను వొం డుద్ధతకేళి నెత్తికొని య। స్త్రశ్రేణిఁ బర్వించె న
ర్జునుపైఁ దాఁకిరి చక్రరక్షకులు నా। ర్వుల్ నింగి ముట్టన్ వడిన్. 173

చ. విజయుఁడు వారి నెల్లఁ గొకఁ। వ్రేల్మిడిఁ ద్రుంచియు భీష్మునాయక
ధ్వజము నడంచియున్ రథము। వాజుల నొంచియు నాజికేళియం
దజితవిలాసముల్ మెఱయ। నప్పుడు విస్మయ మంది చూడఁ గుం
భజముఖయోధవీరతతి। ప్రస్తుతి సేసిరి సిద్ధఖేచరుల్. 174

క. కోఁడొకమెడఁ గని శాంతన, వుం డాఖండలతనూభ। వునిడామూఁ ప్ర
చండభుజబలము మెఱయఁ బ్ర, చండాస్త్రతతము సేసె। సరభసవృత్తిన్. 175

చ. కినుక మనంబునం గదిరి। క్రీడి పితామహువిల్లు వ్రేల్మిడిం
దునిమి నిశాంతగాఢరయ। దోర్విభవంబున నొండువిల్లు గై
కొని మొనసుందురన్ నిని చేఁ। గ్రూరశరంబు లురంబునందు గ్ర
చ్చ్చిన నతఁ డొల్లఁ బోయి రథ। కూబర మూఁతగ నిల్చె సోలుచున్. 176

క. కనుఁగొని సూతుం డరదముఁ, గొనిపోయెం దొలఁగ నప్పు। డు కుంతీతనయుం
డనిఁ దనివి సనక గుంపులు, గొని యున్నడ లరసెఁ గలయఁ। గురుసైన్యమునన్.

వ. ఇట్లు [illegible] చూచి గాండీవంబు దొడసి గుణంబు సారించి కనకోనలు బిగియించి.

క. ఆచార్యసూర్యతనయకృ, పాచార్యప్రభృతిరథికు। లందఱు మొద్రై
సూచుచు నుండఁగ నద్దెస, కేచి భుజాబలము మెఱయ। నింద్రజుఁ డరిగెన్.

వ. అప్పు డశ్వత్థామ కర్ణున కిట్లనియె. 180

ఆ. వీఁడె వచ్చుచున్న। వాఁడు పార్థుఁడు మన, మేమి సేయువార। మీవు దక్క
నొరులు నిలువరింప। నోపెడువారు లే, రోట లేక తాఁకి। యోర్వవలయు.

క. అని తను నుల్లస మాటకుఁ, గినిసి యినతనూజుఁ డేను। క్రీడి నిచట మా
ర్కొనుపీఁకఁ గన్నులారం, గనుఁగొనుఁడీ నిలిచి యనుచుఁ। గవిసెం బెలుచన్

క. ధారలును సుభటులుఁ గన్గొని, యరదమునకు మున్న పొదివి ♦ యర్జును నచటం
గరి సామ్చుతుంగమదుపున, బరుసున మొన చాఁపకట్టు ♦ వడిఁ బతనిచేన్.

తే. ఇవ్విధంబునఁ బోరెడుకనిం ద్రతనయు, నుక్కలావును నంతంత ♦ నుక్కు డమె
నలసి మేనులు దూలాడకనిలిచి రంత, నంత నయ్యోధముఖ్యులాగహావము డక్కె.

వ. అట్టియెడ నుత్తరుండు నరున కిట్లనియె. 185

చ. ఎదుకువ లేనికయ్యమున ♦ నొర్వఁగ వచ్చుని నాకు దప్పి వు
ట్టెడు నొకమాటు నాగ్రహము ♦ డింపవు నీవును జక్కసేని వ
చ్చెడి గలపంగ వెండియును ♦ జండితనంబున వచ్చి వచ్చి పో
రెను మొన లింకఁ జాల నొనరించ భవద్రథసూతకృత్యమున్. 186

వ. అనిన విని కవ్వడి నవ్వుచు నేను గలుగ నీకు నొహటింప నేల యంతియ వలసినం దు
రంగంబులఁ దోడు గడపెద నించుక సైరించి నిలువ వలయు నెల్లపనులును జక్క
నయ్యెరా జొక్కరుండు గొంత యాతం డభిమాని మనలం గని సరకుగొనం
డిప్పు డున్నచందంబు మనతోడం దలపడం గడంగుట దోఁచుచున్నయది తమ్ములు
నాప్తభృత్యులు నిరుగెలంకుల నగ్గలిక మెఱసి దగ్గఱియున్నవారని కౌరవేశ్వరుని
గట్టిమోహరంబు సూపి యతనిం బురికొల్పి యద్దిక్కు దేరు వోవ నిమ్మనుటయు
నతండును దలకొనియట్ల చేయ నడరి యెడ నెడ నద్దపముకురువీరులం జిఱునగవు గెడ
నిగుడ మెఱుంగువాలమ్ములఁ దొలంగ జడియుచుం గదిసిన నమ్మేదినీవల్లభుండు.

అర్జునుఁడు దుర్యోధనునితో యుద్ధంబు సేయుట.

క. పులి గోల వేసిన ట్టి, ట్టలపురయంబునఁ గడంగుకటయుఁ దద్వ
క్షస్థలమునఁ గిరీటి రెండ, మ్ముల నాటఁగ నేసె బొమలు ♦ ముడివడుచుండన్.

క. క్షతములఁ బెల్లు దొరఁగుశో, ణితధారలు మదముగా వికనిర్గళకరియా
కృతిం గవిసి యతం డేసెను, శతమఖసుతుఫాలతలము ♦ శాతశరమునన్. 189

తే. రక్తధారయు వెడలంగ ♦ రశ్మి వెలుఁగఁ
బొలుచు బాలార్కుచాడ్పునఁ ♦ జెలువు మిగిలి
ఫల్గునుండు ప్రతాపసంభరితమూర్తి
యగుచు శరకిరణంబులు ♦ నిగుడఁ జేసె. 190

శా. వానిం దీవ్రశరంబులం దునిమి గర్వాం బెక్కి నానాస్త్రసం
తానంబుల్ గురిసెన్ సుయోధనుఁడు దుర్ధాంతాకృతిన్ గోత్రభి
త్సూనుండుం బటుసాయకోత్కరమునం ♦ జూపెన్ భుజాటోప మి
ట్లేనుం గేనుఁగుఁ దాఁకునట్లు సమరం ♦ బేపారఁగా నయ్యెడన్. 191

తే. హస్తిపురిఁ బేరు గల మదహస్తి నెక్కి, ప్రోలు కావలిరథములు ♦ గవియ దేర
నగ్రగజముపైఁ బర్జన్యుఁ ♦ డనఁగ నంప, వాన పరఁగ వికర్ణుండు ♦ వచ్చి తాఁకె.

ఉ. వీఁక నదల్చి యిట్లు కురు।వీరులకుం బ్రమదం బొనర్చుచుం
దాఁకినఁ గ్రోధవేగసము।దగ్రత నెఱ్ఱనిచూడ్కిఁ జూచి పే
రాఁకలితోడ నున్నజము।నాకృతి భీషణరేఖ యొప్పఁగా
ప్రేఁకనినారసంబు దొడి। క్రీడి కిరీటి దృఢముష్టి సేసినన్. 193

ఆ. ఫాలకుంభసంధిఁ। బడి వాలమునదెస, నుచ్చిపోవుటయును। నుర్వి యద్రువఁ
గూలె నగ్గజంబు। కులిశచండాహతిఁ, బడుమహానగంబు।భంగి దోఁప. 194

క. అరుణమణిమాలికావి, స్ఫురణంబున దంతితనువు। సూడఁగ నొప్పెన్
ధరణిఁ బడియున్నబహుముఖ, పరిగతదావాగ్నిఁ బొల్చు।పర్వతము క్రియన్.

వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగైన వికర్ణుండు వెఱచఱచి పఱచి వివింశతిరథం బెక్కె నాలోనన యట్టినారాచంబున రారాజునురంబు నో నాట నేసినఁ గరీంద్రుండు వడుటయు నరేంద్రుండు నొచ్చుటయుం గని ఱిచ్చవడురథికుల వివ్వచ్చుం డనర్గళప్రసారంబగుమార్గణాసారంబున ముంచిన వెగడుపడి విఱిగి పాఱి రిత్తెఱంగునఁ దనచుట్టును బయలైన నయ్యురగకేతనుండును మరలె నిట్లు దొరయును విఱిగి కలను వాసి కాలుద్రోసిపోవుటయు నతిరథమహారథు లెల్లం జెల్లాచెదరగుటయుం జూచి సైన్యంబు లున్నవి యున్నచోటన తెరలి కనుకనిం బఱువం దొడంగిన. 196

తే. యూథపతితోడిదంతిస।ముత్కరంబు, వెనుకఁ దగిలెడుసింగంబు।విధము దోఁప
నార్పు నాదంబుగా నరుఁ।డంటఁ దాఁకె, రాజుఁ దారును బాఱెడు।రథికవరుల.

క. వెనుకొని కర్ణుని పెదతల, యును దుశ్శాసనునివీఁపు। నొక్కొక్కశరం
బున నేసె నప్పు డయ్యును, దనయుం డిట్లనియె నతిర।థశ్రేష్ఠులతోన్. 198

ఆ. కూడి ముట్టెఁ గ్రీడి। కురువంశమున కెల్ల, మూలకంద మీనృ।పాలుఁ డితని
నిచటఁ గాచికొనుట। యెల్లపౌరుషములుఁ, జేత నిలిచి లావు। సేయవలయు.

క. అన వినుచుఁ గురుపితామహుఁ,డును ద్రోణుఁడు ద్రోణపుత్త్రుఁ।డును గృపుడును గ
ర్ణునిమాట సరకు సేయక, చను చుండఁగ దీనవృత్తి। జనపతి పలికెన్. 200

క. లోకంబులోడివారుగ, వీఁకుం జనునయ్య మగఁటి।మికి గుఱి గాదే
నా కెడ రైనయెడం దగఁ, జేకొని యది వీరు చక్కఁ।జేయుట యరయన్.

వ. అనిన విని వారలు వెనుకయై యాశ్వాసనవచనంబులు పలుకుచుం బోవం బోవుచున్నయన్నరేంద్రు నెలుంగెత్తి పిలిచి పార్థుం డిట్లనియె. 202

అర్జునుఁడు దుర్యోధను నుపాలంభించుట.

ఉ. క్షత్త్రియుఁ డోడునే తగదు। కౌరవరాజ యొకండ నేఁ బృథా
పుత్త్రులలోనఁ జిన్న నినుఁ। బోరికిఁ బిల్వఁగ మాని నాఁగ ని
ర్ఘాత్త్రిఁ బ్రసిద్ధి కెక్కి బల।దర్పసమగ్రుఁడ వైననీవు నీ

మిత్త్రులుఁ గూడ నిట్లయిన మెత్తురె వత్తురె కొల్వ భూభుజుల్. 203

సీ. ఏనుంగు నెక్కి పెక్కేనుంగు లిరుగడ, రా బురవీథులఁ గ్రాలఁ గలదె
మణిమయం బైనభూషణజాలముల నొప్పి, యొడ్డోలగంబున నుండఁ గలదె
కర్పూరచందనకస్తూరికాదుల, నింపు సొంపార భోగింపఁ గలదె
యతిమనోహర లగుకాంతలతోడి, సంగతి వేడ్కలు సలుపఁ గలదె

తే. కయ్యమునకోడి పోయినఁ గౌరవేంద్ర, వినుము నాబుద్ధి మరలి యీకతనువు విడిచి
సుగతి వడయుము తొల్లింటిచూఱ గలదె, జూద మిచ్చట నాడంగ రాదు సుమ్ము. 205

వ. అని వెండియు.

క. నీయట్టివాఁడు నిక్కి, పోయెడిదే యిట్లు పోకు పోకు మనుడు భూ
నాయకుఁడు మరలి పటుకో, పాయత్తతఁ గ్రొక్కఁబడ్డయహిగతిఁ గవిసెన్.

వ. ఇట్లు గవిసి రథంబులం గడచి కవ్వడిం దలపడియె భీష్మద్రోణాదియోధవీరులు నొక్కుమ్మడి మగిడి యధిపతితోడన నిగిడి క్రీడియరదంబుఁ బొదివిరి తక్కిన బలంబులు నంతకు మున్న కౌంతేయుదెస మరలి చూచుచుం బొఱు చునికిం జేసి యేలినవాఁ డఱుమటయును దొరలు దెగి తిరుగుటయుం గని తెంపుసేసి కూడికొని రభసంబునం జట్టుముట్టి యతనిపైఁ గ్రందుకొన నడరె నివ్విధంబున వివిధవ్యూహంబు లగుబహుయోధయూథంబులు గురిసినయనేకాస్త్రశస్త్రంబులు నానాప్రకారంబులఁ గుప్పంగూరలుగాఁ దొరఁగినం బెరిఁగినశౌర్యసంరంభంబున విజృంభించి విజయుం డాశ్చర్యధుర్యనిరతిశయరయభరితకరయుగళుం డయి రథరథ్యసారథిస్వాంగంబులు గాచికొని తనతోడంబుట్టువుల ప్రతినలూహించి యొండుసేయ నొల్లక సపరివారంబుగా ధార్తరాష్ట్రుల భంగపెట్టం దలంచి యింద్రదైవత్యంబును సత్యసంవాదనంబును సరోషసైన్యదైన్యసంపాదనంబును నగుసమ్మోహనాస్త్రంబుఁ బ్రయోగించిన. 207

ఆ. ఆయుధములు విడిచి యంగముల్ సోలంగఁ, దలలు మెడలుఁ జక్కనిలువ కొఱగ
నెల్లవారు నెఱుక లెడలి చొక్కి ని, ద్రాతిశయము గూరినట్లు వొరలె. 208

వ. అప్పుడు పాండవోత్తముం డుత్తరమాటలు దలంచి యుత్తరుం గనుంగొని. 209

సీ. ఇక్కురుసైన్యంబు సొక్కి దక్కక మున్న, గ్రక్కునఁ జనుము రాజరాజు ద్రోణ
తనయుండుఁ జట్టినతెలచుట్లు నల్లని, యవి సూతపుత్త్రుకోంబరంబు
వచ్చనియది కుంభభవకృపాచార్యుల, యుష్ణీషములు వెల్ల లుఱక నివ్వ
దెమ్మింతవట్టును దేవనదీసూనుఁ, డియ్యస్త్రమునకు మూఁక తెఱుఁగుఁ గాన

ఆ. యతఁడు దెలిసియుండు నాతని చెన వోకు, మనిన మత్స్యరాజతనయుఁ డెలమి
దొలఁక నొగలఁ బగ్గములు గట్టి చని వాని, వల్వఁ దెచ్చి యునికి మొక్కుటయును.

వ. ఉరథబృందంబులయిఱుకటంబు వెడలి నిలుచి మని కదలినం గిరీటిం దాఁకి గుసు

పితామహుండు శరవర్షంబులు గురిసిన. 211

క. ఆతనిరథ్యంబులఁ ద, త్సూతుని నొప్పించి సాంద్రసునిశితబాణ
వ్రాతంబు మేన నించి పృ, థాతనయుఁడు నిలిపి వెడలె దర్పోజ్జ్వలుఁడై. 212

వ. ఇవ్విధంబున శరదంబులయిఱకటంబు గడచి యెడ గలుగ నిలిచి రాహు నిగ్రహ నిరాసభాసురుం డగుభానుండునుంబోలె వెలుంగుచున్నంత బలంబులు దెలిసిన.

ఆ. కౌరవేశ్వరుండు గను విచ్చి దిక్కులు, గలయఁ జూచి పార్థుఁ గాంచి కడఁగి
యడరఁ జూచుటయును నమరనదీసూనుఁ, డతని కిట్లనియె నల్ల నగుచు.

క. ఇంత యెఱుంగవు సైన్యము, లింతవడిం దలలు చీర లెఱుఁగక మోహా
క్రాంతంబు లయ్యెఁ బని దెగుఁ, గాంతేయుఁడు సారఁడుగాని క్రౌర్యంబునకున్.

క. మెడ యొఱగఁ జేతికైదువు, వడ నిను నీ వెఱుఁగకున్నభంగి గనియుఁ గ
వ్వడి యూరకుండు నటె చె, ప్పెడుకోలఁదియె వానికరుణ కెంపు కుమారా.

వ. అతండు మనప్రాణంబులపైఁ గానొల్లక నిలిచిన మన మింతట నిలుచుట కార్యంబు.

ఉ. మోహనబాణపాతమునఁ జుండలచీర లెఱుంగకున్నయీ
బాహుబలంబులోఁ గడఁగి పార్థునిఁ దాఁకెడుబుద్ధి గ్రమ్మఱన్
సాహసవృత్తిఁ జేసి యవిచారతఁ బోయితిమేని వాఁడు పూ
ర్ణాహుతి సేయుఁడే మనలఁ జండఱ నొక్కట మార్గణాగ్నికిన్. 218

వ. కావున. 219

క. మనదేశమునకుఁ బోదము, మన మల్లన తెరువు వట్టి మత్స్యవిభునిగో
ధనముఁ గొని యతఁడు ప్రీతిం, జనుఁ గా కటు మనకు నంతచల మేమిటికిన్.

దుర్యోధనుండు పరాజితుండై మరలి తనపురంబునకుఁ బోవుట.

వ. అని చెప్పినపితామహుహితవచనంబు లాకర్ణించి సంగ్రామాతికామియుం గోపాటోపఘూర్ణమానమానసుండు నగునమ్మానవేశ్వరుండు నిట్టూర్పు నిగిడించి యుద్రేకంబు దక్కి నిలిచెం దక్కటివారలు నూర్జితం బగు నర్జునానలంబు నాలోకించి ధార్తరాష్ట్రరక్షణతాత్పర్యంబున శౌర్యంబు సాలించి భీష్మవాక్యప్రకారంబు సేసి రిట్లందఱు ముందఱ దమవచ్చినవంకన తిరిగి యరుగుచున్నం గని కిరీటి శంఖరవజ్యానాదంబులు సెలంగఁ గొండొకదవ్వు వెన్నడించి యెమి బిరుదులతోడిగొడుగులు నడియాలంబులతోడిసిడంబులును వైపించుకొని తృప్తింబొందిమరలువాఁడై యెల్లవారును వినం బెద్దయెలుంగునం బోయివచ్చెదనని చెప్పి గాంగేయద్రోణకృపాచార్యులకుఁ బ్రణామబాణంబు లేసి వారి పీఠ్యానిపవాఁడై మిట్టకోలల రారాజుమకుటంబుమణులు దులిచి యతనికిం జెప్పినవాఁడై యఖర్వబాహాగర్వనిర్వాహణంబు మెఱయ నప్పుడు మధ్యందినమార్తాండప్రచండుం డగుచుండఁ గౌరవపక్షు లతనిం దేఱి చూడనుంజాలక చని రతండును జూపఱుం దోలి నిలిచిన

మదపుటేనుంగుచందంబున నిలిచి విరాటతనయున కిట్లనియె. 221

ఆ. పసులు మరలె శత్రుబలములు వీనుంగు, పెంటలయ్యె రాజు పెద్దదొరలుఁ
జీర లొలువఁబడిరి సిగ్గఱి బిరుదులు, వైచి రింక మగుడ వలదె మనకు.

క. హయముల మరల్పు మీఁదట, బ్రియబంధులు నెడలు సంచరింప గుములు గ
ట్టి యెదురుసూతురు వారికిఁ, బ్రియముగ శీఘ్రమ్మునం బురికిం బో వలయున్.

వ. అనిన నతండు రథంబు మగిడించినం జని చని. 224

తే. కాలుతక్కువవారలు గలయఁ బెదరి, వెనుకఁబడిపోవు నెడఁ దన్నుఁ గని భయమునఁ
బ్రాణదానంబు వేఁడినఁ బార్థుఁ డభయ, హస్తమిచ్చుచు దయ పెనుపారఁ బలుకు.

వ. ఇట్లు నానావిధదీనదశాదంద హ్యమానులగు కృపణులం దనకృపామృతంబునం
దడిపినం దేఱి వారు దీవించుచుం బ్రణమిల్లుచుం బొగడుచుం బోవుచుండ ధనం
జయుండు భూమింజయుం జూచి. 226

ఆ. కురుబలంబు గెలిచి గోవులఁ గ్రమ్మఱఁ, దెచ్చు పెల్లు నీయదీర్ఘబాహు
బలము కాఁగ నీవు పలుకుము వెలిఁబుచ్చు, టుడుగు మధిపుపాల నొండుదెఱఁగు.

క. అనవుడు నీచేసినయీ, పని నాచేఁ గాక యునికి పతి యెఱుఁగఁడో కో
జనులు నిజము సేయుదురే, నిను నెఱిఁగింపకయ చెప్ప నేర్తున పొసఁగన్.

వ. అని యుత్తరుండు మఱియును. 229

క. నీ వలచినయప్పుడ ధా, త్రీవల్లభుఁ డెఱుఁగునట్టి తెఱఁగు నడపెదన్
దేవేంద్రపుత్ర యే ననఁ, గా వేఱొక పేరు గలదె కార్యము నడపన్. 230

వ. అనువచనంబు లియ్యకొనుచుం జని శమీవృక్షసమీపంబున నిల్చి గాండీవాది
సాధనంబులు పూర్వప్రకారంబున నిక్షేపింప నియోగించి కపిధ్వజదేవదత్తకిరీటాది
దివ్యపరికరంబుల సవినయంబుగాఁ బ్రార్థించి యంతర్ధానంబు సేయించి యెప్పటి
సింహపతాక రథంబున బంధింపఁ బనిచి విరాటతనయుండు నిజాయుధంబులు
గైకొని రథికుండయి వచ్చునట్లుగాఁ జేసి తొంటిచందంబునం దలచీర యలవ
రించికొని సారథి యై సవ్యసాచి నొగ యెక్కినట్టిసమయంబునఁ బురందరాది
బృందారకులును దేవమునిసిద్ధగంధర్వాదులును బాండుప్రముఖరాజలోకంబును
నాశ్చర్యహర్షాయత్తచిత్తులయి సమరవిషయంబు లయినమాట లాడుచు నిజ
నివాసంబుల కరిగి రట నరుండు నుత్తరు నాలోకించి 'నీవిజయంబు పురంబున
ఘోషింప గోపాలురం బుచ్చు' మనిన నతం డది యెఱుంగుగాఁ గైకొని యట్ల చేయ
నిట్లు నిగూఢంబుగాఁ బట్టణంబునకుం 'జనుచుండ నంతకు మున్న మత్స్యమహీవ
ల్లభుం డాహవజయదర్పితవాహినీపరివృతుం డై నగరంబు సొత్తెంచి. 231

తే. మందిరాభ్యంతరమున కాంతావలులఁ, బాండుపుత్రులుఁ దక్కటి బంధుజనులు
దానుఁ జని విప్రులును పౌరజనంబు, సేన గొలువఁగ సింహాసనాసీనుఁ డయ్యె.

వ. ఇవ్విధంబునం దనవిజయంబు గొనియాడ వచ్చినవారి నెల్ల నభినందించి యుత్తరుం డెచ్చట నున్నవాఁ డని యడిగి వారలవలనం గురునాథుండు భీష్మద్రోణకర్ణకృపాశ్వత్థామాదియోధవీరులు వెరసినబలంబులతోడ నడచి యుత్తరంబునఁ బసులం బట్టిన నతండు బృహన్నల సారథిం గాఁ గైకొని యొక్కరుండ కుయి వోవుట విని విషాదవేదనాదోదూయమానమానసుం డగుచు మంత్రుల మొగంబు సూచి యి ట్లనియె.

విరాటుఁ డుత్తరుఁడు కురుసైన్యంబు గెలువఁ బోవుట విని చింతించుట.

చ. అసమున మీఁ దెఱుంగక మహోగ్రహవృత్తిఁ గడంగి చెచ్చెరం
బసులకుఁ గూయిగాఁ జనియెఁ బాపఁడు కౌరవసేన యేడ యొం
టి సనుట యేడ నాకిది గడిందివిచారము పుట్టె సైన్యముల్
వెసఁ జని తోడు గావలయు వేగమ పంపుఁడు సాలునట్లుగన్. 234

చ. అనుటయుఁ గంకుఁ డి ట్లనియె నక్కడ వచ్చి సుశర్మ యోడెఁ గా
వున నిట వీరికిన్ జయ మగున్ బెఱ పేటికి నీకు నుత్తరుం
డని యొకరుండు నాకుము బృహన్నల సారథి గాన గెల్చు న
య్యనిమిషకోటి నైన నతఁ డద్భుతవిక్రమజృంభణంబునన్. 235

చ. అన వినుచుం గలంగుహృదయంబునఁ దాపము నివ్వటిల్ల ని
ట్లను మఱియున్ విరాటుఁడు రణావనియందుఁ ద్రిగర్తసేనచే
ననయము నొచ్చినట్టిజను లందఱుఁ దక్కఁగ నేఁటుఁ బోటుఁ దా
కని ఘనయోధకోటి చనఁగా వలయున్ బలుమై రయంబునన్. 236

క. చని యక్కుమారుఁ డేమ,య్యెనొ యత్తెఱఁ గెఱిఁగి మనకు నెయిదించుట పు
ట్టినకార్యమునకుఁ దగియెడు,పని యట విధి గెలువ వసమె బ్రహ్మకు నైనన్.

వ. అనుచు నుత్తలపడునయ్యవసరంబున నుత్తరుండు పుత్తెంచినగోపాలురు పఱ
తెంచి యతనిం గాంచి. 238

చ. కురుబలమున్ జయించి మనగోవుల నెల్లను గ్రమ్మఱించి యు
త్తరుఁ డిదె తాను సూతుఁడు నరదగ్రత వచ్చుచు నున్నవాఁడు త
త్తురగరథధ్వజాలి నొకశత్రుప్పుడు రాలదు మమ్ముఁ బిల్చి వే
పురి నెఱిఁగింపుఁ డన్న నృపపుంగవ వచ్చితి మేము నావుడున్. 239

తే. అంతరంగంబు నిండి కొరకడలువులందు
వెడలుసంతోషపూరంబువిధము దోఁపఁ
గన్నుఁగవ సమ్మదాస్రులు గడలుకొనుచు
గండపులకాంకురములతోఁ గ్రమ్ము దేర. 240

క. ఏమేమీ యని గోప, స్తోమముఁ బలుమాఱు నడుగుచున్ మెయి నొదలన్
భూమీశుఁ డపుడు మంత్రుల, మోములు గనుఁగొని సగర్వమున ని ట్లనియెన్

శా. విరటుఁ డీవీథుల నెల్ల నేనుఁగులపై విస్ఫారఘంటాధ్వనిం
జాటం బంపుఁడు కీర్తి నుత్తరుజయోదారైశ్వర్యంబుఁ బుణ్యాంగనా
కోటిం బుచ్చుఁ డెదుర్కొనంగ మహితోత్కృష్టోర్వీసురవ్రాతముల్
ఘోటస్యందనవారణప్రతతులం గూడన్ సతూర్యంబుగన్. 242

క. ఉత్తమకన్యాజనములు, నుత్తరయును గంధమాల్యయుక్తముగఁ గుమా
రోత్తము నెదుర్కొనం దగు, నత్తెఱఁగున సంఘటింపుఁ డభిరామము గాన్.

వ. అని నియోగించి గోపాలురకుం గట్ట నిప్పించి కంకు నాలోకించి నెత్తం బాకసలుక యాడుద మే యని యుబ్బుమైమాటగాఁ బలికిన నతండు నీవు సుమహాళంబున నున్నవాఁడవు నేఁడు నీతోడ నాడి జయింప రాదు వెఱతు ననిన విరాటుండు నగుచుఁ దత్ప్రదేశంబున మెలంగు సైరంధ్రిం గనుంగొని సారెలు దెమ్మని పనిచి పలుక ముందటికిఁ దిగిచికొనుచు నిందు రమ్మనవుడుఁ బాండవాగ్రజుండు జూదం బాడుట యెంతలెస్స యనుచుం జేరి యాడం దొడంగునప్పుడు మఱియు నిట్లనియె. 244

ఆ. జూద మాడి ధర్మసూనుండు రాజ్యంబు, ననుజులను బ్రియాంగనను బణంబు
గాఁగ నొడ్డి యోడి కాఱియఁ బడఁడె య, ట్లగుట దీనితోడి యాసక్తి గీడు. 245

వ. అని పలికి యాడుచుండు సమయంబున. 246

మ. నరనాథుండు ప్రమోదసంపదుదితోన్మాదంబుమై నిట్లనుం
గురుసైన్యంబుల మట్టి గెల్చి యలమిన్ గోవర్గముం దెచ్చె ను
త్తరుబాహాబలశౌర్యసారము లుదాత్తంబుల్ గదే యెందు ని
వ్వరు నక్కాలము విల్లు నేసిరె కులైశ్వర్యం బవార్యంబుగన్. 247

వ. అనిన విని కంకుం డతని కిట్లనియె. 248

చ. కురుపతి భీష్మ కర్ణ కృప కుంభజముఖ్యమహోగ్రయోధవి
స్ఫురణము నోర్వఁ జాలి రణభూమి భుజాబల ముల్లసిల్ల ను
త్తరుఁడు జయించెనేని వసుధావర యింతటికంటె నింక న
చ్చెరువును గల్గునే ధరఁ బ్రసిద్ధికి నెక్కఁడె యాతఁ డొక్కఁడున్. 249

తే. అనినఁ గటకటఁబడి యిట్టు లాడు టొప్ప, నతనివిజయము సందియ మనుట గాదె
యింతవట్టును సైరించి తీవు గాన, యింక నీమాట లుడుగుము కంకభట్ట.

వ. అనుచు విరాటుండు గటంబు లదరఁ గన్నులఁ గెంపు గదురఁ బలుకఁ జవ్వ డస్స
లంబుగా నాడుచున్న సరకు సేయక యుధిష్ఠిరుండు వెండియు నిట్లనియె. 251

చ. కురుబల మేల దైత్యసురకోటులు వచ్చిన గెల్వ రాదె యు
త్తరునకు నాబృహన్నల రథంబువయిం బరవాహినీభయం
కరభుజసారముల్ మెఱయఁ గాఁ దతి గాంచితి నంచు విక్రమా

ధురగతి నాజికేళినిరతుం డయి యుద్ధమహీల నుండఁగన్ 252

క. అనిన విని సక్రోధహాసోల్లాసవిస్ఫురితాననుం డై మత్స్యమహీనాథుండు. 253

ఉ. వింతలు సాల నీవలన ♦ వింటిమి గాని ధరిత్రి నెందు నే
మింతకు మున్ను సారథుల ♦ నెవ్వరిఁ జూడ మె వైరివీరదు
ర్దాంతభుజావిలాస మలరం దెగి పోరుల నస్త్రశస్త్రవి
క్రాంతిఁ గడంగువారి నని ♦ కన్నుల నిప్పులు రాలు చుండఁగన్ 254

క. నాకొడుకుపోటుమాటలు, నీ కేటికిఁ బొసఁగ నాడ ♦ నేరవు మాఱ్ఱో
ద్రేకమునఁ బలుకు చుండుట, మాకు సహింపఁగ రాదు ♦ మానుము విప్రా.

క. అనినం బలమునఁ గుంతీ, తనయాగ్రజుఁ డిట్టు లనియె ♦ దరహాసం బా
ననమున మునుఁగువడఁగ నృజననాయకుతోడ ని ట్లశంకితభంగిన్ 256

ఉ. ఆహవకేళి వేడుక బృహన్నలచిత్తమునం దెలర్చినన్
సాహసవృత్తి నుత్తరుని ♦ సారథిఁగాఁ గొనిపోయి కౌరవ
వ్యూహము నొర్చి నీపసుల ♦ నొక్కఁడుఁ దక్కక యుండ సత్వరో
త్సాహతఁ దెచ్చెఁ గా వలయుఁ ♦ దప్పదు నాపలు కట్ల చూడుమీ. 257

క. అని యంతట నిలువక యుమ్మనుజేశ్వరు మొగముఁ జూచి ♦ మఱియును నతఁ డి
ట్లనుఁ బురములోనఁ జాటం, బనుపు బృహన్నలజయంబు ♦ భవ్యవిచారా. 258

విరాటుండు కంకుని సారె గొని వ్రేయుట.

ఆ. అనిన రౌద్రరసము ♦ మనమున నడరంగఁ, బడగ యెత్తునురగశ పాలురేఖ
నెనయుచేతిసారెకొని వ్రేసె నతి పేడి,గడన యుడుగు మన్న కినుకఁగ వనుచు.

వ. ఇవ్విధంబున వ్రేటువడి యజాతశత్రుం డలుక గదురనిహృదయంబుతోడం బాంచాలిదెసం జూడ్కి మలఁగ నూరకుండె నన్నారీరత్నంబును రయంబునం జేరి వ్రేలుగంటిం దొరఁగురుధిరంబుఁ దనయుత్తరీయంబున మెత్తన యొత్తి యచ్చేరువ నున్నకనకకలశజలంబులం గరతలంబు దడిపికొని తుడుచునప్పుడు మత్స్యమహీవల్లభుం డీశోణితంబు పై చీరం బట్టుటకుఁ గతం బేమి యని త న్నడిగిన నతని కి ట్లనియె. 260

తే. విమలవంశంబునను బుణ్యవృత్తమునను, వఱలునీతనిరక్తంబు ♦ వసుమతీశ
ధరణిపై నెన్నిబిందువుల్ దొరఁగెనన్ని, వర్షములు గల్గు నిం దనావర్షభయము.

వ. అని చెప్పి యుత్తమద్విజలోహితపాతం బెట్లునుం గీడు గావున నీకు నొకహాని పుట్టుటకుఁ జాలక యిబ్భంగిం జేసితి నని వెండియుఁ గొండొకకీలాలంబు దొరఁగం దొరఁగం దుడుచు చుండె నంత నట యుత్తరు నెదుర్కొనం బోయి. 262

క. మంగళతూర్యరవములు సెలంగఁగ మౌక్తికవిమిశ్రకలలితాక్షతవృ
ష్టిం గురిసిరి విప్రులుఁ బుణ్యాంగనలును భద్రవాక్యచయంబులతోడన్. 263

ఉ. అత్తఱిఁ గన్యకాజనసహాసశ్రీయముఁ దానును జేరి వేడ్కమై
నుత్తర చంద్రసాంద్రకుసుమోత్కరమున్ నవరత్నసంచయో
దాత్తసువర్ణపుష్పములు దండడిఁ జల్లెఁ గిరీటిమీఁద న
య్యుత్తరుఁ బ్రమోదకలశోత్కటసంభ్రమసంభృతంబుగన్. 264

ఉ. తక్కటివారలుం గని ముదంబలరారఁగఁ గౌఁగిలించుచున్
మొక్కుచు నాడటం దనదుమోముపయిం దనివోనిచూడ్కులం
గ్రిక్కిఱియించుచుం బొదివి గెల్పు నుతింపఁగ రాజపుత్త్రుఁ డ
య్యొక్కడుమాట కోరువక యిట్లను నర్థ్మాదనంబులోఁ దగన్. 265

చ. కురుబలమున్ జయించుటయు గోవులఁ దెచ్చుటయున్ బృహన్నలా
స్ఫురితభుజాబలంబునన చూవె నిజం బిది నాక యేల యె
వ్వరికిని నెవ్వరిం గెలువవచ్చున యిట్టిసహాయసంపదం
బొరయక యున్న మీ రెఱుఁగఁ బోలు నె నాబదు కెట్టిభంగియో. 266

వ. అని సారథ్యప్రశంసాప్రకారంబుగా నక్కుమారుం డత్యుపచారవచనంబుల చందంబున సంక్రందననందను నుతించుచుం జనుదెంచి రాజమందిరద్వారంబుఁ జేరునవసరంబునఁ బ్రతిహారి ససంభ్రమగతిం జని భూవల్లభునకుం బ్రణమిల్లి భూమింజయప్రవేశంబు తెలుఁగు విన్నవించిన నారథికసారథులం జూచు వేడ్కమనంబు వేగిరపెట్టెడు నయ్యిరువురఁ నియ్యోడకుం జయ్యనఁ దోడితెమ్మనువిభుని పలుకులు విని ధర్మతనయుండు పడిహారితో నల్లన యిట్లనియె. 267

క. ఇన్నెత్తురు గనుఁగొనిన బృహన్నల కోపించు నన్ను నతిభక్తిమెయిన్
మన్నించుఁ గాన రాజుం దన్ను విచారింప కేమి దప్పఁ దలఁచునో. 268

వ. ఇది లెస్సగాఁ దుడుచునంతకుఁ దదీయప్రవేశం బించుకవడి వారింపుము పదంపడి రా నిత్తు గాని యంతకు నుత్తరుం డొక్కరుండు వచ్చునట్లుగాఁ జేయుము.

క. అని చెప్ప హర్షసంభ్రమమున నజ్జననాయకుండు మునుఁగుట నది యే మని యడుగఁ దలంపమిఁ దన కను వై కార్యము ఘటించి క్రయతనిం బుచ్చెన్.

చ. అతఁడును బార్థుఁ దెచ్చి వినయంబున నుత్తరుఁ దోడితెచ్చినం బితృచరణాంబుజంబులకుఁ బ్రీతిమెయిం బ్రణమిల్లె నాతఁ డా
పతియునుఁ జక్కఁ జేర్చి గరువపాటెడుమేనును హర్షబాష్పసం
ప్లుత మగునాననంబు నయి పుత్త్రునిఁ బెద్దయుఁ బ్రొద్దు గౌఁగిటన్. 271

వ. ఇవ్విధంబున నాలింగితుం డయి భూమింజయుండు పునఃపునఃప్రణామంబు సేసి కంకునిం గనుంగొని సగౌరవంబుగా నమస్కరించి మొగంబుగంటి సూచి యిది యేమి యని యడిగిన. 272

క. ఏ నీవిజయము వొగడఁగఁ, డా నప్పుడు పేశిఁ బొగడె దానం గోపం

బూనిన సైరింపక నా, దే నడిచితి సారె గొని విశృంఖలవృత్తిన్. 273
క. అని పతి పలికిన విని సన్మనమున భయసంభ్రమములు । మల్లడిగొన న
మ్మనుజేంద్రనందనుం డి, ట్లను నత్యాదరము మెఱయ । నాతనితోడన్. 274
తే. తప్పు సేసితి రిట్టులు । దగునె వీర, లేమిగతిఁ బల్కినను నది । యెల్ల మనము
గైకొనవలయుఁ గా కిట్లు । గాదు గూడ, దని నిషేధించు టొప్పునె । మనుజనాథ.
వ. అని మఱియును. 276
క. సవినయముగఁ బ్రార్థింపుఁడు, పవిత్రచారిత్రులైన । పరమద్విజు లి
ట్లవమతులై కోపించిన, నవనీశుల కేల కల్గు । నాయువు సిరియున్. 277
వ. అనిన విని యమ్మాటలు పాటిగాఁబట్టి విరాటుండు భయభక్తియుక్తంబుగా వేఁడి కొనినం బాండవాగ్రజుండు నగుచు నాకు నలుక యెక్కడిది యితండును గీడు సేరువువాఁడు గాఁ డిదియొకప్రొద్దు కీడున నయ్యెం గాని యని తాను రాజు దెసఁ బ్రసన్నుం డగుట దెలియునట్లుగా నుత్తరుతోడం బలికిన నమ్మహీవల్లభుండు సంతసిల్లి తదవసరంబునఁ బ్రవేశించి కాంచినయాబృహన్నల నాదరించి నిజనందను నాలోకించి యి ట్లనియె. 278

విరాటుఁ డుత్తరుని సమరప్రకారం బడుగుట.

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు । ద్రోణసుతుండును గర్ణుఁడుం బరి
త్రాణపరాయణత్వమున । దర్పసముజ్జ్వలభంగి నుల్లస
ద్బాణపరంపరల్ గురియఁ । బార్థివుఁడుర్ వెను దన్ని చూడ స
త్క్షీణజవంబునం గవియు । సేనకు మార్కొన నగ్గలించితే. 279
ఉ. కాసట లేదు క్రొవ్వడర । బంటుతనంబునఁ దాఁకి తేసియుం
బాసినచోట వాయుఁ బెఱ । పట్టులవీరు లుదగ్రవృత్తిమై
మూసికొనంగ వత్తు రొక । మోహర । మమ్ముల మగ్గనేని నా
సాసల నొక్కరుండ యను । నాగ్రహవృత్తి బలంబు సైఁ బనున్. 280
ఆ. ఒకఁడు పరశురాము । నోర్చినవాఁ డొక్కరుండు ధనువునకు గురుఁడుండు దాన
హార్యవరమునఁ బుట్టి । యక్షీణబలవిక్రమముల నొక్కఁ డొప్పు । మాఱు లేక.
ఉ. తక్కటివారలుర్ సురల । దైత్యుల నైనను బోర గెల్చువా
రక్కురుసేన మేటిమగ । లాధృతరాష్ట్రతనూజు లాజి నొ
క్కొక్కఁడ ధాత్రి యంతయును । నోర్వఁగఁ జాలుదు రట్టివారి ని
వ్వొక్కటి దాఁకి నొవ్వకయు । నెమ్మెయి గెల్చితి నాకుఁ జెప్పుమా. 282
ఉ. గోవుల నెట్టు లాఁగితి వ । కుంఠితవిక్రముఁ డైన రాజరా
జేవిధి మానభంగమున । కెల్లను నోర్చి పలాయమానుఁ డై
నీవిజయంబు సైఁచి ఘన । నిందకు నియ్యకొనంగఁ జాలె బు

త్రా వెఱఁ గయ్యెదుర్ణ రణవిరోధం బఖిలంబు నెఱుంగఁ జెప్పుమా

చ. అనవుడు నాతఁ డిట్లనియె నక్కురుసేనల నేను గెల్వ గో
ధనమును నే మరల్ప మనదైవబలంబునఁ జేసి దేవసం
జనితుఁడు నాఁగ నర్హ మగుచందమువాఁడు మహాత్ముఁ డొక్కరుం
డని ననుఁ గాచెఁ గౌరవుల నందఱ గెల్చె మరల్చె గోవులన్ 284

వ. అత్తెఱంగు వివరించి విన్నవించెద నవధరింపుము. 285

తే. ధూళి పెల్లుగ నెగయంగ నేల గోడి,నడఁగఁ జనుమూఁకఁ గని నడునవడ వడంకి
పాఱు దేరంగ నమ్మహాభాగుఁ డప్పు, డోడ కోడకు మని నన్నుఁ గూడ వచ్చి.

వ. పట్టుకొని మగుడం గొనిపోయి రథంబుపైఁ బెట్టిన నే నతనియాజ్ఞకు మిగుల
కుండితి. 287

ఉ. కౌరవసేన గోగణముఁ గైకొని పోవ నతండు ముట్టి యం
దారసి రాజుఁ గానక యుపాంతమునం దొలఁగించి వేగ నా
తేరట దోలి యడ్డపడి తీవ్రశరంబుల నబ్బలంబుదు
ర్వారరయంబు మాన్చి పశువర్గము నిల్చిన వెల్చె నార్చుచున్. 288

ఆ. చెదర కుండఁ బసుల బొదివి యుంచుక మేర, యిక్కడరుగుదెంచి యలమిమగిడి
కడచి పోవుచున్న కౌరవపతి ముట్టి, నడరినంత సేన లతనిఁ గూడె. 289

మ. కురురాజుల్ సబలంబుగాఁ గవిసినన్ ఘోరాహవం బయ్యె నం
దరదంబుల్ నుఱు మయ్యె నశ్వములు నుగ్గయ్యెం గరివ్రాతముల్
ధర దంతంబుల యూఁతగా నొఱగె నుద్యద్బాహుదృప్యద్భటో
త్కరముల్ దిట్టినయట్లు గూలెఁ గలయం దద్బాణపాతంబులన్. 290

క. శత్రుంతపాదు లగునృప, పుత్రులుఁ బేరు గలయోధపుంగవులును ద
చ్చిత్రశరనిహతి సంగర,ధాత్రిఁ బడిరి వారి నెన్నఁ దడవై యుండున్. 291

తే. మొనలు దెరలినఁ గర్ణుండు మునుచి తాఁక
నమ్మహావీరుఁ డాతనితమ్ముఁ జంపి
హరుల నొప్పించి సూతు నో నాడ నేసి
యంగముల బాణములు నించి యతనిఁ బఱపె. 292

క. గురుఁడు దలపడిన నతఁ డ, చ్చెరువుగ దివ్యాస్త్రవితతిఁ జిక్కువఱిచి త
ద్వరసుతుఁడుఁ గృపుఁడుఁ దాఁకినఁ, దెరలిచి భీష్మునకుఁ గవిసె దృఢరభసమునన్

మ. అతనిం దీవ్రశరంబులం బొదివి నాగాస్త్రంబు లేసెన్ నదీ
సుతుఁడుం దత్సమయంబునం గినిసి యూరశూకుండు చాపంబు ద్రుం
చి తదీయాంగము నొంచినన్ వివశుఁడై చేష్టుడ్డచో సూతుఁ డు
ద్ధతభీతిం దొలఁగంగఁ దోలె రథముం దద్బాహువీరార్థియై. 294

క. తమతమబలములతో ని, ట్లమితభుజావీర్యులైన యారథికవరుల్
గ్రమమునఁ దలపడి కోడిన, సమరవిహారమునఁ దనివిసనక యతండున్. 295

మ. ధరణీనాథుఁడు దానుఁ దమ్ములును దుర్దాంతోద్ధతిం గూడి మో
హర మత్యూర్జితభంగి నేర్చికొని యుద్యద్విక్రమం బొప్ప బం
ధురసంరంభత నున్నఁ జూచి బలవద్దోస్స్తంభలీలాభయం
కరరేఖాచలమానచాపుఁ డయి పేఁకకం దాఁకె నాసేనతోన్. 296

క. కౌరవపతియనుజన్ముల, దూరమునకు విశిఖనిహతిఁ దొలఁగఁ జడియుచుం
జేరి వికర్ణునికరి నొక, నారసమునఁ గూల్చి కవిసి నరపతి నొంచెన్. 297

తే. రాజు నొచ్చిన విఱిగిరి రథికవరులు, విభుఁడు వోడిన తిరిగె నశ్వీరుఁ డప్పుడు
దోలి యాచిక్కుమాఁకలతోడఁ గూడ, నతని దప్పుల నడవికిఁ బఱచి మగిడె.

వ. ఇది యమ్మహాపురుషుచేసిన విధం బనిన విని యచ్చెరు వంది విరాటుండు. 299

ఆ. అతఁ డెవ్వఁడొక్కొ యమ్మహాత్మునిఁ గనుం, గొనఁగఁ గౌఁగిలింప వినయ మొప్ప
నర్ఘ్యపాద్యవిధుల నర్చింప భక్తిసం, యుక్తి నెపుడుఁ గొలిచియుండవలయు.

క. ఎచ్చోట నున్నవాఁ డతఁ, డిచ్చోటికి నేల రాఁడొ యిప్డు డనుడుఁ దా
నచ్చట సంతర్హితుఁడై, యిచ్చఁ జనియెఁ దోఁచు నేఁటికో యెల్లిటిలోనన్. 301

ఉ. దేవకుమారకుండ యగుఁ దేజముచందము సూడ నాతఁ డీ
గోవులఁ గ్రమ్మఱించుటకుఁ గూడినయంతియ కాదు నాకు సం
భావన సేయువత్సలతఁ బంపినదా మనవంశ మంతయుం
గావను బ్రోవనుం దలఁపు గల్గుట దెల్లము సేసె నెంతయున్. 302

వ. అని చెప్పి యుత్తరుం డతనిం బ్రమోదాయత్తచిత్తుం జేసె నట్టిసమయంబునఁ గౌంతేయాగ్రజుండు ముఖప్రాంతంబు పైఁజీరచెఱంగునం బొదివికొని ధనంజయునిఁ జక్కం జూడక యుండె విరాటుండు కిరీటిపరాక్రమంబు క్రమంబున నిట్లు దనతనయునివలన వినియునుం దెలియక యెప్పటినపుంసకత్వబుద్ధితోడన సంభావించి పోవం బనిచిన బృహన్నలయును జతురంబుగాఁ బలికి తిదియు తెఱంగు ధర్మనందనునకు నింతకు మిక్కిలి యెఱింగింప కుండునది యని వైరాటితో నల్లన చెప్పుచుం జనియె నజ్జననాయకుండును గంకునిం బొమ్మని యుచితపరివారవృతుం డయి భూమింజయు నంతిపురంబునకుం దోడ్కొని యరిగి సుదేష్ణాసందర్శనసమాచరణంబు నడపి యుతం డడుగఁ ద్రిగర్తపతి నోర్చిన తెఱం గెఱింగించె నట నరుండు నాట్యశాలకుం బోయి. 303

అర్జునుఁ డుత్తరకు బొమ్మపొత్తికలుగాఁ గురువీరులశిరోంబరంబు లిచ్చుట.

తే. చెలులుఁ దానును నుత్తర యెలమిఁ దన్నుఁ
గాంచుటయుఁ బ్రీతి మొసలార గౌరవించి

జనముల సభాస్థలిం గయికొని పంచాస్యములుం బోలెం గూర్చున్నంతన. 316

తే. వేడ్కఁ దొడిపూసి కట్టి యవ్విరటభూఁ డుత్తరుండు దోఁజను దేరఁ గొల్వుండు బుద్ధి
వచటికేతెంచి కని విస్మయంబు నొంది, యెల్లిదంబుగఁ దలఁచుచు నిట్టులనియె.

క. ఇది యేమి కంక నీ వు, న్నదవృత్తివి శంక దక్కి నాగద్దియపైఁ
బదిలంబుగఁ గూర్చుండితి, వదియును గా కిపుడు డిగ వహంకారమునన్. 318

వ. అనిన విని మందహాసంబు సేసి సంక్రందననందనుం డతని కిట్లనియె. 319

సీ. నడదీవియలు సేసె నగరికి మాణిక్య, మకుటముల్ పూనినమనుజపతులఁ
దగు నాజ్ఞసూయాణముగ నొసరించె మం,చిగ నేలనాలుగుచెఱఁగులకును
శ్రీతార్థిజనుల సచేతనత్యాగధ్వ,జములుగా నన్ని దేశములఁ బఱపె
దిక్కులన్నింటను దెలుపారుపూఁత గా,వించె నుజ్జ్వలయశోవిభ్రమంబు

తే. రాజసూయాధ్వరప్రవర్తకుఁడు నిత్య, సత్యభాషామహావ్రతశాలి పాండు
రాజదుగ్ధపయోనిధిరాజు ధర్మ,రాజు సుమ్ము మహాత్మ్యవసీశ్వరమగా యితఁడు. 320

ఉ. ఈతఁ డజాతశత్రుఁడు మహీం దగ దిగ్విజయంబు సేసె ని
ర్వ్యాతిశయోర్జి వాసవుమహాసన మైనను నెక్క నర్హుఁ డు
ద్యోతితమూర్తి కౌరవకులోద్వహుఁ డార్యనికాయసంతత
ఖ్యాతచరిత్రుఁ డీచిఱుతగద్దియకుం దగఁడే నరేశ్వరా. 321

అర్జునుఁడు విరాటునకుఁ దమ్ము నెఱిఁగించుట.

వ. అనిన విని యతండు విస్మయసంశయంబులు మనంబునం బెనంగొన నితండు ధర్మతనయుండయేని భీమార్జుననకులసహదేవులుం బాంచాలియు నేరి యని యడిగినం గవ్వడి యిట్లనియె. 322

చ. వలలుఁ డనంగ నీనగర వంటలవాఁడయి నిల్చె వేడ్కకుం
బులిఁ గరిఁ గేసరిం దొడరి పోరఁగఁ బంచినఁ బోరు వెట్టి మ
ల్లుల విఱుచుం గడంగి ప్రబలుం డనఁగాఁ జరియించు చుండు వి
చ్చలవిడి భీముఁ డీతఁ డవిషహ్యపరాక్రమదుర్దముం డనిన్. 323

తే. బకమహాసురు నిర్జించి బ్రాహ్మణులకుఁ
బ్రీతిఁ గావించెఁ గిమ్మీరుఁ బేరడంచి
వనము నిష్కంటకము సేసె ఘను హిడింబుఁ
గూల్చి యాతనిచెలియలిఁ గోసియె నితఁడు. 324

క. నీమెచ్చువారువంబులఁ, దామచ్చిగ నరయు నిత్యతాత్పర్యమునన్
దామగ్రంథి యనఁగ నొక,నామము ధరియించె నితఁడు నకులుం డధిపా. 325

క. శత్రునృపకాలకూటము, మిత్రామృతవృష్టి బుధసమీహితసిద్ధి
క్షేత్రము సజ్జనసంస్తుతి,పాత్ర మితఁడు మాద్రిపొలుతపట్టి నరేంద్రా. 326

క. నీపాలిక వచ్చి సఖుల, గోపాలకముఖ్యవృత్తిఁ గొలువు వడసి తం
త్రీపాలుఁ డనఁగ మత్స్య, క్ష్మాపాలకు మెలఁగు వాఁడె సహదేవుండున్. 327

క. సుకుమారమానసుఁడు గోం, తికిఁ బ్రాణము ప్రాణమిత్రుఁడు తేజోగణ్యుం
డకుటిలుఁడు రాజనీతి, ప్రకారసంవేది వంశపావనుఁడు నృపా. 328

వ. అని యిట్లు ధర్మజభీమనకులసహదేవుల క్రమంబున జూపి చెప్పి మఱియు ని
ట్లనియె. 329

క. విను సైరంధ్రీవేషం, బున మాలిని యనఁగ బరఁగి పూతచరిత్రం
బునఁ గేకయభూవరనం, దనకడ మెలఁగునది ద్రుపదతనయ మహీశా. 330

క. ఆచపలాక్షికిఁగా మన, కీచకు లందఱను రాత్రి గీటడఁచె రహ
స్యోచితవిధమున గంధ, ర్వాచరణము పేర భీముఁ డతిభీమముగాన్. 331

విరాటునకు భీముఁ డర్జును నెఱింగించుట.

వ. అనిన నప్పుడు వృకోదరుండు. 332

సీ. షండరూపమునఁ బ్రచ్ఛన్నుఁడై వచ్చి కన్నియలకు నెల్లను నృత్తగీత
వాద్యనైపుణ మనవద్యరీతివిధి, నలవరించుచు బృహన్నల యనంగఁ
బరఁగునతండు బీభత్సుండు సుమ్ము, చూపి యుష్మత్తనూజునకుఁ జెప్పి
వెండియుఁ బలుకు నాకఖండలు నోడించి, ఖాండవ మేర్చె నాతఁ డందు దన్ను
తే. గారవించిన నెక్కటి కాలకేయ, వర్గములఁ బరిమార్చె నివాతకవచ
సంఘములనోర్చె గంధర్వసమితి గెలిచి, ధార్తరాష్ట్రాగ్రజుని చెఱఁదలఁగె నితఁడు.

వ. అనిన విని యద్భుతరసాక్రాంతం బగునంతరంగంబునం గలుగుసందేహావేశంబు
వినయసంభ్రమంబుల నిగుడనీక కునికిం జేసి చిక్కువడి యున్న నిజజనకునకు నర్జు
నుం జూపి యుత్తరుం డిట్లనియె. 334

తే. ఈతఁ డింతకు మీకుఁ దన్నెఱుఁగఁ జెప్ప
వలవ దని నియమించినఁ దెలియఁ బలుక
నలికి యొకదేవసన్నిభుం డంటిఁ గాని
నిన్న యంతయుఁ దాఁ గదా నిర్వహించె. 335

చ. ఒకరుఁడ తాను భీతి వెగడొందెడునన్ను నెట్టకే
లకుఁ దగఁ దేర్చినప్పుడు బలంబులతోఁ గురురాజు సూడ దా
నికి మది శంక లేమి మహనీయపరాక్రముఁడైన యాకిరీ
టికిఁ జనుఁ గాక యివ్విధము చెప్పర మన్యుల కోర్వ వచ్చునే. 336

చ. తము నెఱింగించి యల్ల నుచితప్రియభాషల నన్ను సూతకృ
త్యమునకుఁ బొన్న నేను భ్రమతదంబున నప్పటి కియ్యకొంటి లో
కముసమరంబునట్లు యని కయ్యముతీవ్రతకుం దగంగ న

ధ్యములఁ జరింపఁ జేతఁ దర । నైతి యుదిఁ బల్గుణు నోహటించితిన్. 337

క. మొగ మోడఁ జితఁడు కౌరవ, జగతీశుఁడు విఱిగినపుడు । జవమున వెనుకం
దగిలి యిది చూడ నూడఁగ, నగు నెడ నా దఱుమ వలయు । ననియె నతనితోన్.

ఆ. అనిన నతఁడు వెఱపు । నత్యాదరంబును, సంతసంబు మానసమున బెరయ
నవయవముల సంభ్రమావేశ మేర్పడ. గారవమున విజయుఁ । గౌఁగిలించె. 339

క. వినయంబు మిగులఁ గుంతీ, తనయాగ్రజుపాదపీఠతలమున ఫాలం
బును బొందఁ జాఁగి మ్రొక్కి యతనికౌఁగిలి వడసె సమ్మదము దళుకొత్తన్

ఆ. ప్రీతి నలుమడింప । భీమునిఁ గవల నాలింగనంబు సేసి । యంకములఁ
బులక లెగయఁ గేలు । దల మోడ్చి ధర్మజు, నాననమున దృష్టి నయదర నిలిపె.

ఉ. అత్తటి లేచి వచ్చి తన యన్నలఁ దమ్ములఁ గానిపించె న
య్యుత్తరు నర్జునుండు దగ । నొందఁగ నప్పుడ పిల్వఁ బంచె మా
త్స్యోత్తముఁ డార్యమిత్రసచివోత్కరసోదరవర్గపుత్రకో
దాత్తభటాదియోగ్యుల ముదంబునఁ బాండవదర్శనార్థమై. 342

వ. ఇట్లు సమస్తజనసమేతంబుగా ధర్మతనయసేవాతత్పరుం డై తదనుమతి సముచిత రుచిరాసనంబున నుండి విరాటుం డంతఃపురవర్తులం బిలిచి యంతయు సుదేష్ణ కెఱింగింపం బనిచి పాంచాలిం దగిన తెఱంగున గారవించునట్లు గావించె నట్టియెడ ధనంజయున కిట్లనియె. 343

తే. చాల దుస్తర మైన యజ్ఞాతవాస, వత్సరంబు భవద్గర్భవాసగుప్తి
వలనఁ గడపితి మతిసుఖావాప్తచిత్త, వృత్తి నేము నిర్భయుల మై యిందు లట్ల.

అనిన విని విరాటుం డతని కిట్లనియె. 345

ఏ నన వేఱ యొక్కఁడనె । యిట్లనఁగాఁ దగునయ్య యిమ్మెయిం
గానన దేశవాసములఁ । గాఱియ కోర్చి యడంగి యుండి మీ
పూనిక దీర్చి మీ రెలమిఁ । బొందుట యెల్లను బుణ్యదేవతా
నూనదయాసమృద్ధి నను । నొందుట గాదె సురేంద్రనందనా. 346

అని పలికి ధర్మనందనుం జూచి. 347

చ. ధరణియుఁ బట్టణంబు హయదంతిరథంబులు గోవులుం భటో
త్కరము నమాత్యవర్గమును । గాఁ గలరాజ్య మితండ యేలు ని
ర్భరమున నేనుఁ బుత్రులును । బంధులుఁ దమ్ములుఁ గొల్చి యుండెదం
గరిపురి కేత్తునట్టిపని । గల్గిన నోపినయంత సేసెదన్. ౩౪౮

అన విని యుత్తరుండు దగ । సజ్జనపాలకుతోడ నిట్లను
న్మన కొక రాజ్యముం గలదె । నన్నును నిన్నును నిన్న మొన్న నీ
రసిభర సాధ్యశత్రువిజయంబునఁ గాచినయప్డు గల్గఁ జే

పినయది దక్క దాని మఱి సెప్పఁగ నేటికి నింతవింతగన్. 349

వ. అది సిద్ధంబట్ల యెల్లుం గాక యించుకవిశేషంబు గలదు వినుము. 350

చ. సవినయవృత్తిఁ గొల్వ నిటు చన్నదినంబుల వీరు నీకు పైఁ
గవిసిననిప్పులట్ల యధికం బగుతేజము వోఁప కున్కి నే
ట్టివిధము సావకాధతను డెందము లూఁటఁ బొంది యుండ నే
రవు మన కట్లు గాన తగఁ బ్రార్థన సేయుట యుక్త మి త్తఱిన్. 351

వ. అదియునుం గాక. 353

క. ధనవర్గంబులు వీ రి, చ్చినయది యట్లగుట వేడ్క సేయవు తగ నూ
తన మగుకానిక యీవల,యును వే తోఁ ద్వరఁ బనుపు ము త్తరఁ బ్రీతిన్.

వ. అనిన విని మత్స్యమహీవల్లభుండు మనం బలర మంత్రులమొగంబు సూచి కు
మారికి నలంకరించుకొని తెం డని నియోగించిన వారును ప్రియంబునం జని
తత్కార్యశ్రవణసంప్రీత యగుసుదేష్ణయనుమతంబున. 354

క. పసనికి రాఁ బులు గడిగిన,మదనాస్త్రమురేఖ గలిగి మానినిమొయి చె
న్నొదవఁ గయిసేసి రప్పుడు, ముదితాజనములు ప్రమోదమున లలితముగన్.

విరాటునిమంత్రు లుత్తరను పాండవులయొద్దకుం దోడ్కొచ్చుట.

వ. ఇట్లు శృంగారంబు సేసినయమ్ముద్దియకు ముక్తాఫలప్రాలంబమాలికలతోడి గొడుగు
లు వట్టించి యత్యాదరంబున నయ్యమాత్యులు దోడ్తేర ధారాధరనికరమనో
హార యగుపర్జన్యలక్ష్మియుంబోలె వచ్చుచున్నం గని విరాటుం డెదురువోయి
పురోహితులును బంధుజనంబులుం దానునుం బొదివికొని పాండవాగ్రజునగ్ర
భాగంబునకుం దెచ్చి యచ్చెలువ నిలిపి సపరివారంబుగా దండప్రణామంబు సేసి
చేతులు మొగిడ్చి యిట్లనియె. 356

క. ఎఱుఁగమి చీఁకటి సిపె,ద్దలికంబు దలంప నేమితప్పు గలిగినన్
మఱచి దయఁ జూడు మి ట్లిం, దఱు నీకుం బనులు సేయఁ దగుదురు వీరల్.

వ. అని నిజానుజతనూజులం జూపి మఱియును. 358

క. ఇమ్ముదియ నర్జునునకు, నిమ్మాపని బంధుజనుల కెందఱకుఁ గడు
సమ్మత మెల్లప్రజకు నే, నిమ్మెయి నినుఁ జేరి బ్రదుకు టిష్టం బధిపా. 359

క. అని పలికిన విని కుంతీ, తనయాగ్రజుఁ డింద్రసుతువదన మాలోకిం
చిన నాతఁ డిట్లు లను న,మ్మనుజేంద్రుఁడు వినుచు నుండ మత్స్యాధిపుతోన్

క. ఈకన్నియఁ గోడలిఁగాఁ, గైకొనియెదఁ గాని యిది దగ దుచితవృత్తిన్
నాకడన యబల మెలఁగుట, లోకము శంకించు నన్ను లోలాత్మునిఁగాన్.

వ. అదియునుం గాక స్వ త్తగీతాదులయెడ నిక్కోమలికి గురుండ నైననాకు నివ్వి
ధంబు ధర్మంబు గాదు గావున. 362

మ. హరిమేనల్లుఁడు బాహువీర్యపటుశౌర్యస్ఫూర్తి త్రైలోక్యసుం
దరుఁ డాచారపవిత్రుఁ డంచితకళాదక్షుం డుదారుండు గా
తరసంరక్షకుఁ డార్యసమ్మతుఁడు విద్యావైభవోల్లాసి య
త్యురుతేజుండు వరించుఁ గాక యభిమన్యుం డీసరోజాననన్. 363

వ. అనిన విని మత్స్యమహీకాంతుం డత్యంతసంతుష్టాంతరంగుం డై 364

తే. అర్జునునివియ్య మనియెడునంతకంటెఁ, గడవఁ బెంపు నాకెయ్యది కార్యనిశ్చ
యంబు ధర్మతనూభవుం డానతిచ్చువాఁడు మన మెల్లఁ గావించువార మదియు.

ఆ. అనుడు నతని కిట్టులనుఁ బాండవాగ్రజుం, డింద్రతనయుఁ డుచితము నెఱిఁగి పలికె
నిట్లు సేయువారము మిప్పుడు సుట్టాల, కెల్లఁ జెప్పి పుచ్చుఁ డీశుభంబు. 366

వ. అని నిశ్చయించి పలికిన విరాటుండును గౌరవాన్వయసంబంధంబున మాత్స్య
వంశంబు పావనం బయ్యె నని పలుకుచు ధర్మజభీమార్జుననకులసహదేవులకుఁ
గ్రమంబున నుత్తరఁ బ్రణామంబు సేయించిన వారు దీవించి యంతఃపురగమనం
బునకు ననుజ్ఞ సేయ నచ్చెలువ నెచ్చెలులుం దానును దత్సమయసముచితపరివార
పరివృత యై యరిగిన యనంతరంబ మౌహూర్తికుల రావించి లగ్ననిరూపణంబు
సేసి యాదవపాంచాలాదిబంధుజనంబుల నెల్లఁ బెండ్లికిం బిలువ రెండుదెఱంగుల
వారును గాలరులం బనిచి యజాతశత్రుండును విరటు గారవించి తా రతనిపాల
నజ్ఞాతవాసంబు సుఖవృత్తి నడపికొనుట వాక్రుచ్చి పలికి యతనిగుణంబులు
గొనియాడి నీవు మాకు వాసుదేవునట్ల కాక సామాన్యబంధుండవే యని సంభా
వించి వినయనిభృతుం డగు నతనిం దిగిచి పునఃపునరాలింగనంబు సేసిన
నతండును ససంభ్రమపరిజనసముపనీయమానంబు లగు నానావిధోపకరణంబులం
గౌంతేయులకు వివిధోపచారంబు లాచరించి మహార్హమజ్జనభోజనంబులు నడపె
నంత నక్కడ దుర్యోధనుండు నిజపురంబునకుం జని చని నడుమ విడిసిన యెడం
గర్ణశకునిదుశ్శాసనులతో మంత్రంబు నడపి గాంగేయునివచనంబు లప్రమాణంబు
లు సేసి ధర్మతనయుం డసత్యంబున కియ్యకొనమి యెఱింగి యాతనిపాలికి దూతం
బుత్తెంచిన వాఁడు నేతెంచి కాంచి యిట్లనియె. 367

తే. వాలి యజ్ఞాతవాససంవత్సరంబు, నిండకుండంగ మున్న పార్థుండు బయలు
మెఱసి సమయంబు దప్పె నీ వెఱిఁగి దీని, కేది దగు నది సేయుము మేదినీశ.

వ. అని పునర్వనవాసకరణంబు దోఁప నాడిన నవ్వి యధిష్ఠితసత్యవ్రతుం డయినయు
ధిష్ఠిరుం డతని కిట్లనియె. 369

క. నిండె సమయాబ్దములు నిం, కొండన లే దిపుడ చని సుయోధనుతో భీ
ష్ముండును గురుఁడును వినఁగా, నిండె ననుము నిండె నిండె నిక్కంబునకున్. 370

వ. అని తగఁ జెప్పి పుచ్చఁ జని యాతఁడు దప్పక చెప్పె నంతయుఁ

విని ధృతరాష్ట్రసూనుఁడు వివేకవిహీనత నాఁటిరాత్రి గో
ల్యాన గురుభీష్మకృపులుం దనతమ్ములు నుండ ధర్మసం
నమునకు దూఱఁ బుచ్చినవిధంబు ప్రకాశము సేయ కెల్లనున్. 371

మనము మోసపోయి యనిమిషపతిసూతితోడఁ బోరి చితిమి యగపోవ
వఱఁదు సమయకాలమంతయుఁ గడచిన, వచ్చెనో యెఱుంగవలయు నిజము.

క. అనిన విని యేటిమాటలు, వినువారలు నగరె యేను వివ్వచ్చుఁడు వ
చ్చినయపుడ తెలుపనే వల, దనుమానము సమయకాలమట మును కడచెన్.

క. అనవుడు భీష్మునిపలుకులు, విని యందఱు సమ్మతించి వెరవిడి యే ఫ
ల్గునుఁ డనిరి పతియుఁ బురికిం, జనియెను మఱునాఁడు విరళసైన్యంబులతోన్.

శ్రీకృష్ణుఁడు బలదేవాదులతోఁ బాండవులఁ జూడ వచ్చుట.

వ. ఇవ్విధంబునం బ్రకాశులై పాండునందనులు శమీవృక్షనిక్షిప్తసమస్తసాధనంబులుఁ బూజాపూర్వకంబుగాఁ దెచ్చికొని యుపప్లావ్యంబున వసియించి మత్స్యమహీనాథుండు పంపు సేయం బెంపు మిగిలి పౌరజానపదనానావిధోపహారంబులు గైకొనుచు బహురత్నంబులకు భాజనంబులై మహనీయవిభూతి శోభిల్లుచున్నంత వాసుదేవుండు బలభద్రపురస్సరంబుగా సాత్యకిసమేతుండై సుభద్రాభిమన్యులం దోడ్కొని కృతవర్మయుఁ బ్రద్యుమ్నుండును సాంబుండును యుయుధానుండును రుక్మిండు నక్రూరుండును నింద్రసేనాదిపాండవసారథులును రథారూఢులై కొల్చి రా మఱియు ననేకయాదవకుమారులును గరితురగస్యందననిబిడంబు లగు బలంబులతోడ నిరుగెలంకుల నడవం జనుదెంచి. 375

తే. భవ్యవిభవంబుతో నుపప్లావ్యపురము, సొచ్చి సంభ్రమమునఁ బాండుసుతులు దనకు
నెదురు వచ్చిన నాహ్లాద మెసక మెసఁగఁ, దత్సమాగమయోగ్యవిధంబు నడపె.

వ. బలదేవప్రముఖులకును దదీయసందర్శనసముచితసమాచారంబు లొనర్చి సుభద్రాభిమన్యులం బాంచాలిపాలికిం గొనిపోవ నభ్యంతరజనంబుల నియోగించి.

క. లలితమణిమయవిభూషణములు రుచిరాంబరములును బ్రమోద మెసఁగ ని
ట్టలముగ హరి కుంతీపుత్రుల కెల్లను నిచ్చి పిదప ద్రౌపది కిచ్చెన్. 378

వ. ఇట్లు గట్టనిచ్చి వేఱువేఱ రథకరితురగదాసదాసీజనంబుల నొసంగి పద్మనాభుండు పాండవులుం దానునుం గలసి సంతసంబున నలరారుచుండెఁ దదనంతరంబ. 379

సీ. ద్రుపదభూవిభుఁడు పుత్రులుఁ దానుఁ జతురంగ, బలములతో వచ్చి పాండుసుతులఁ
గాంచి వారలు దన్నుఁ గరము సంప్రీతిమై, గారవింపఁగ నుండెఁ గాశిరాజు
శైబ్యుండుఁ బదపడి సైన్యసమేతులై, చనుదెంచి ధర్మనందనుని చేయు
సత్కారముల గారవసముద్రంబునఁ బొంది, రవ్విరాటుండును నంతవట్టు

తే. వారలనుఁ దత్తదుచితప్రకారములఁ బ్రి

యంబు దలకొన సంవిధానంబు సేసె
మఱియు బహుదేశములబంధుమాన్యమిత్ర
వర్గములు వేడ్కఁ బెండ్లికి వచ్చెఁ గలయ. 380

వ. ఇవ్విధంబున రెండుదెఱంగులచుట్టంబులు నైనభూపతులు దమతమవిభవంబులు మెఱసి వచ్చి యుండ విరాటుండు పురంబున నుత్సవంబు సాటించిన. 381

క. కలువడములు మణితోరణ, ములుఁ గట్టిరి క్రముకకాండమోచాస్తంభం
బులు నాటిరి కుంకుమమునఁ, గలయ నలికి ముగ్గు లిడిరి కర్పూరమునన్.

క. వివిధాలంకరణంబుల, నవకాంతి వహించి పట్టణంబు వివాహో
త్సవమాధవలక్ష్మికి లలి, తవనం బై యెలమికలిమితావల మయ్యెన్. 383

ఉ. తాను సుదేష్ణయుఁ సుతులుఁ దమ్ములు బంధులు గంధమాల్యనా
నానవరత్నభూషణములనప్రియమాంగలికప్రసాధనా
నూనవిభూతి మత్స్యవిభుఁ డుజ్జ్వలలీల వహించి భూమిదే
వానయనాదికృత్యపరు లై నజనంబుల గారవించుచున్. 384

వ. గరువంపుసంభ్రమంబులతోడ నిజమందిరంబునందు. 385

సీ. అమలరత్నప్రదీపానలి మెఱుఁగిడఁ, బనిచి మణిస్తంభపంక్తిఁ గ్రొత్త
జిగి దళుకొత్తునట్లుగఁ దొడయించి వి,చిత్రవితానముల్ సెలువు మిగులఁ
గట్టించి నూత్నముక్తాదామములతోడఁ, గుసుమమాలిక లెడగ్రుచ్చి వ్రేలఁ
గీలింప నియమించి కేవలమంగళ,భూరుహపల్లవతోరణములు

తే. సంఘటింప నియోగించి చందనమునఁ, బరిణయాగారమలుకంగఁ బాణియాణి
గలుగుము త్తియములముగ్గుగా నొనర్పఁ,జతురపుణ్యాంగనాజనతతిఁ బనర్చె.

క. వైవాహికవిధిసం, పాదితవివిధార్థవస్తుభరితత్వమునన్
వేదిక పొలు పగునట్లుగ, మోదమునఁ బురోహితుండు మునుకొని చేయన్

క. ఉత్తర నలంకరింప ను, దాత్తాభరణాదివస్తుతతి యొసఁగి నరేం
ద్రోత్తముఁడు నేర్పు గలచెలి, కత్తియలం బుచ్చెఁ బ్రీతి గడలుకొనంగన్.

అభిమన్యునివివాహమహోత్సవము.

వ. ఇట్లు వైవాహికవర్తనసంవిధానసావధానుం డగుమత్స్యమహీనాథుండు మహా మహార్త్విగాదిశిష్టజనులు పరివేష్టింప నుండి లగ్నం బాసన్నం బగుచువచ్చెనని ధర్మతనయున కెఱింగింపం బనిచిన నతండు ననుజసహితంబుగా నలంకృతుం డై వివిధప్రసాధనశోభితు లగుసమస్తబంధుజనంబులం గూర్చికొని యభిమన్యునకు శృంగారంబుసేయించి భద్రగజారూఢుం జేసికొని యేనుంగులం బేరు గలవారు వంబులను మట్టపుదట్టంబు సేసికొని మణిగణంబులు నంబరనికరంబులుఁ బుష్పపుంజంబులు ఫలసంచయంబులు లోనుగాఁ గలయోగ్యవస్తువుల విస్తరిల్లినక్రంత

నడవ మంగళతూర్యనాదంబులు విప్రాశీర్వాదంబులు మాగధగానంబులు వంది
జనవాక్యసంతానంబులుఁ జెలంగ వాసుదేవపురస్సరంబుగా విరాటుమందిరంబున
కేతెంచి శంఖజయఘంటాపణవాదినిక్వణంబులతోడ నెదుర్కొని చల్లుసేసలు
గైకొనుచుం జొత్తెంచిన. 389

క. విరటుఁడు సంభ్రమమును నాదరమును భక్తియును నాత్మఁ దలకొనఁ బూజా
పరుఁడై సమయసముచితాచరణంబులు నిర్వహించె సమ్మదలీలన్. 390

తే. విహితపరిపాటితో విప్రవృద్ధజనులు, పుణ్యకర్మపరంపరఁ బూని నడప
నర్థిఁ గృష్ణయుధిష్ఠిరపార్థమత్స్య, వరులు దెర[1]యొద్ద నవ్వధూవరుల నిలిపి.

వ. సాంవత్సరికదత్తకాలకళావిశేషంబుల మంగళతూర్యంబులు సెలంగ నత్తెర
యెత్తించిన. 392

ఉ. వీనులఁ దియ్యమెక్కి మును విన్కిఁ బరస్పరరాగవృత్తిలో
నూనినఁ జూచువేడుకల నువ్విళు లూరెడు నెమ్మనంబు ల
చ్చో నొకయింతసేపు నెడసొచ్చుట కోర్వక యుండ నున్నయ
మ్మానినియుం గుమారుఁడును మారవికారము లంకురింపఁగన్. 393

వ. అన్యోన్యావలోకనంబు సేయునప్పుడు. 394

సీ. వరుచూడ్కి ముద్దియవదనంబుపైఁ బాఱి, తివుటమై నునుఁగాంతితీపు గ్రోలు
సుందరీరత్నంబుచూపు మనోరము, నడుగులయొప్పుపై నల్ల నడరుఁ
బతివిలోకనములు పడఁతుకమైఁదీవఁ, గలయంగఁ బులుమఱు మెలఁగుచుండు
వెలఁదికటాక్షముల్ విభునిపైఁ గ్రమమున, నెగసి మోమునఁ జొక్కి మగిడివచ్చు
తే. నొండొరువులలేఁజెమటల నూని క్రేఁగు,పడినచాడ్పున నవయవభంగులందుఁ
దగిలి మఱపునఁ దడయు నిద్దఱవిశాల,నయనదీప్తులు నెఱుకువ బయలుపడఁగ.

వ. తదనంతరంబ. 396

తే. ఒండొరులదోయిళుల నినుపొందఁ జేయు, నక్షతప్రకరంబు లన్యోన్యమస్త
కములఁ బోసిరి మందారకల్పలతలు, విరులుగమియు నొండొంటిపైఁ గురియునట్లు.

చ. లలితతనూవిలాసముల లజ్జకతంబునఁ జేసి మున్ను వి
చ్చలవిడిఁ బట్టఁగా వెరవు సాలక యోరలు వాఱుచూపులన్
లలిఁ దలఁబ్రాలు వోయునెడలం దగఁ బొందిన సూలుకొల్పి యి
మ్ములఁ బచరింతు రొండొరుల మోహనమూర్తులపై వధూవరుల్. 398

తే. చిత్తమున గాఢరాగంబు చేతఁ జూపు, తెఱఁగు దోఁపఁ గెంపారెడు తీఁగబోఁడి
మృదులపాణిఁ గుమారుండు మెలపుమైఁ గ్ర,హించెఁ బల్లవాలంబిమత్తేభలీల.

వ. ఇట్లు పాణిగ్రహణం బాచరించి. 400

క. పెనుఁగుదుట నిడినమాతం, బును నవమాలికయుఁ బోలెఁ బాలు పొంది రతం

దును సముగ్ధయు నేఁగా, సనమున నున్నపుడు నూత్నసౌభాగ్యమునన్. 401

కోర్కులు గడఁగూడుకొని పార మెయిద్దిన, చిత్తంబు లూఁటఁ జిగురు లొత్తఁ
బులకాంకురములకుఁ దలకాఁకుడై యిరు, మేనను మవ్వంబు మిగిలి పొదలఁ
దతి వేచి చనఁబోయి తడఁబడి మార్గతి, వడి చూపు లాదట బయలుపఱుపఁ
జెమటలతావులు తమలోనఁ గలసి వే, ఱొక్క సౌరభము నై చొక్కు సేయ
గాఢసంస్పర్శభంగులు గల్గునట్టి, హోమసమయకృత్యంబుల నొదవి సౌఖ్య
రసము పెన్నిట్ట పొరిఁబొరి గ్రమ్ము దేర, సమ్మదాంబుధిఁ దేలిరి సతియుఁ బతియు.

ఇవ్విధంబున వివాహంబు నిర్వహించి మత్స్యమహీనాథుండు మణిభూషణంబులు రుచిరాంబరంబులుఁ గర్పూరాదిసుగంధద్రవ్యంబులుఁ దాంబూలంబులతోడి పళ్లెరంబులఁ బచరించి పాండవులకు వాసుదేవపూర్వకంబుగాఁ బురోహితప్రకరంబునకుం గట్ట నిచ్చి యాజ్ఞసేనీసుభద్రలకు ననురూపాభరణపరిధానంబు లంతఃపురవర్తులైనయర్హజనంబులచేతం బుచ్చి సౌభద్రునకు భద్రసామజసప్తశతియును లోకోత్తరతురంగదశసహస్రంబును సలక్షణగోపంచలక్షయు రథంబులు రెండు వేలును దాసదాసీజనంబు లక్షయు మఱియు నానాప్రకారంబు లగుధనంబులు నరణం బిచ్చె నమ్మహనీయమహోత్సవంబు మంగళసంవిధానసావధానపుణ్యాంగనలవలనను నృత్తగీతాదివైచిత్ర్యమనోహరవారనారీజనంబులవలనను వినూత్నరత్నమయభూషణాది దీప్తవేషవిరాజమానులగుకుమారులచతురపరిహాసాదివిలాసంబులవలనను బ్రభూతవిభవవిభ్రాజితులగురాజసూనులమాననీయగరిమలలితవిహారవిశేషంబులవలనను బాంచాలయాదవకేకయాదిబాంధవమహితమహిమాంచితసంచరణంబులవలనను నానందనిష్యందిపాండునందనసౌహార్దంబువలనను మత్స్యమనుజపతిమందిరంబు పరమసంపత్పూరితం బై యుండె నని చెప్పిన విని వైశంపాయనునితో జనమేజయుండు. 403

కుంతీనందను లట్లత్యంతవిభవ మెసఁగఁ బరిణయము సేసి సుహృ
త్సంతోషోజ్జ్వలులై తద, నంతర మొప్పంగ నడచి రనవుడుఁ బ్రీతిన్. 404

అమృతమయాత్మ భక్తిసుగమానుభవోజ్జ్వలదివ్యవర్త్మ ష
ట్సమయగతానుభావ పురుషత్రయతా వివృతస్వభావ ని
ర్మమహృదయైకవాస మునిరంజననిత్యవిలాస దోషసం
గమవినివర్తనా పరమగౌరవధుర్యపదప్రవర్తనా. 405

సర్వసహాపటుతాపత్రయ, నిర్వాపణకరణ బోధనిర్మలజనహృ
త్పర్వాచరణ మహాసుర. గర్వాపహరత్వసంప్రకాశైకరణా. 406

మాలిని. నిగమకుసుమగంధోర్వీనేషభూతాభిధానా
సగుణవిగుణలీలా సౌమ్యసాక్షిత్వనానా
జగదవన విధానాస్థైర్యదత్తావధానా
నగశరధినివాసానంద సంస్తూయమానా 407

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున విరాటపర్వంబునందు సర్వంబును బంచమాశ్వాసము. 408

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము నం ద లి

విరాటపర్వము సమాప్తము.

శ్రీ

హరిహరనాథాయ నమః.

# శ్రీమదాంధ్రమహాభారతము,

## ఉద్యోగపర్వము, ప్రథమాశ్వాసము.

---



గౌరీపల్లవపుట
భోగాశ్రయమంజరీసముజ్జ్వలమూర్తీ
యోగీంద్రసంతతాంత
ర్యాగపరీపాకరూప హరిహరనాథా. 1

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. ఎలమి నభిమన్యుపెండిలి యివ్విధమునఁ, జేసి యుల్లాసలక్ష్మి గైసేసి మత్స్య
మనుజపతియన్వయంబు పావనము సేసి, దినచతుష్టయానంతరమునఁ బ్రియమున.

వ. ధర్మతనయుండు దమ్ములుం గొడుకులుం బరివేష్టించి యుండ విశాలరమణీయం
బగువిరాటుకొలువుకూటంబున కరిగి యుండు. 4

క. విరటుఁడుఁ బాంచాలుండును, హరియును రాముండు వారియనుజతనూజుల్
పరిణయసమాగతాఖిల, ధరణీశులు బలసి యుండ దద్దయు నెమ్మిన్. 5

వ. ఉన్నసమయంబున సభాసదులైనమానవేంద్రులు నానావిధంబులఁ గృష్ణయుధి
ష్ఠిరులతో సంభాషణంబులు సేయుచుండఁ బాండవకార్యార్థియై కృష్ణుండు
దదీయవచనంబులు వారించి వారలఁ గలయం గనుంగొని యిట్లనియె. 6

మ. కపటద్యూతమునందు సౌబలునిచేఁ గౌంతేయు లాత్మీయరా
జ్యపదభ్రంశముఁ బొంది సత్యనిరతిన్ శక్తాత్ములై యుండియుం
గుపితస్వాంతులు గాక తత్సమయసంక్షోభంబు గా కుండఁగా
విపినావాసము గూఢచర్యయును గావింపం దలం పొప్పదే. 7

ఆ. తలఁచినట్ల వ్రతముఁ జలిపి యమ్మాడ్కిఁ బం, డ్రెండువత్సరములు పాండవేయు
లకట క్రూరసత్త్వయాతుధానావలి, తోడఁ గాననమునఁ గూడి మనరె. 8

క. పదపడి దుస్తర మగునీ, పదమూఁడవయేఁడు గడవఁబడుట యరిది తె
మ్మెదు రెఱుఁగమికై యాపద, లొదవిన సైరించి రిట్టియునికియుఁ గలదే. 9

క. మీరలు ధర్మజువర్తన, గారవ మెఱుఁగుదుర కావున నాగాం
ధారితనూభవులకును, వీరలకును హితము గా వివేకప్రౌఢిన్. 10

తే. ధర్మమార్గంబు దప్పక ✽ తలఁపు డొక్క, తెలుఁగు ధర్మువు దప్పి, యుధిష్ఠిరుండు
వడయ నోడఁబడఁ డయ్యింద్రపదవి యైన, నుచితగతి నెంత వడపిన ✽ నల్లసిల్లు.

వ. కావునఁ బాండవులకుఁ బితృధనం బగు రాజ్యంబు గపటద్యూతంబున దుర్యోధనుఁ డపహరించుటయు నది వీరలు దిగ్విజయంబుఁ జేసి యలవరించికొన్నపదం బగుటయు ధర్మసూనుమహానుభావంబు విచారింపక ధార్తరాష్ట్రులు పరిభవించినం దెగి యితండు వారలకుం గీడు సేయ రోయుమియు నీరెండుదెఱంగులవారికిం బంచి కుడువం దగుటయుం దలపోసి తగినకార్యంబు సెప్ప నర్హుల రేనును నాకన్నంత సెప్పెద వినుండు. 12

కుంతీతనయులు సమయము, శాంతతమై నడపి తమభుజాబలమును దు
ర్దాంతోద్యమశౌర్యము నెఱిఁ, గింతు మనుచు నున్నవారు ✽ గినుకెదఁ గదురన్.

క. వీరితలం పెఱిఁగిన గాం, ధారీతనయుఁడు సుహృద్వితానముఁ గూర్చుం
బోరఁ బరిమార్తుఁ గొంచెపు,వా రై యున్నాడన యని యవశ్యముఁ గడఁకన్.

క. అలఘుబలవిక్రమోదా,త్తుల కైనను బలము లేక ✽ దోర్గర్వము మై
గెలువఁగ వశమె సహాయము, కలిమి ననంతంబు లగుపగఱసైన్యములన్. 15

క. కావునఁ బాండవపక్షము, భూవల్లభకోటి యిచటఁ ✽ బోవ్రి వగు నిమ్మై
నావీరులు నీవీరులు, దేవాసురులట్ల యనికిఁ ✽ దెగుదురు గడిమిన్. 16

వ. ఇది యిక్కడి తెఱంగునకుఁ దోఁచినతలం పక్కడివారిచిత్తవృత్తి యెట్టి దగుట యెఱుంగ మెదిరి మతం బెఱుంగక యెట్టికార్యంబు నిశ్చయింప నెర నగునే కావున నియ్యవసరంబునం దగినమానిసి నందులకుం బుచ్చవలయు దుర్యోధనుండు వీరికి రాజ్యంబుపాలిచ్చిన మే లగుఁ గాక తక్కిన నప్పటికిఁ బోలినపని సూచుకొంద మని పలికిన విని బలరామదేవుం డయ్యకొని రాజలోకంబు నాలోకించి యిట్లనియె. 17

క. హరివాక్యము వింటిరె యది, యిరుదెఱఁగులజనములకును ✽ హితమును ధర్మో
త్తరమును నై యున్నది యీ, వెరవున శక్యంబు మనకు ✽ వీరలఁ దీర్పన్. 18

చ. తమసగఁబాలు గోల్పడి ✽ దానిన యిప్పుడు గోరువీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమ ✽ సామున సంతస మంది యున్కి యు
క్తము ధృతరాష్ట్రసూనునకు ✽ దాన నపాయము లేక యుండుఁ గో
ప ముడిగి వీరు సేయుదురు ✽ బాంధవ మిజ్జగముం బ్రియంపడున్. 19

వ. కావున నిక్కార్యం బెడ సేయక యొక్కరుం బనుప వలయు వాఁడునుం జని యభిమతంబు సాధించునప్పుడు. 20

ఆ. మాటపొం దెఱింగి ✽ యోటమై నల్లన, చేరి కౌరవేంద్రుఁ గాంచి తత్ప్రవృత్తి
కనుగుణంబు గాఁగ ✽ సానతుం డగుచుఁ బ్రార్థించి యడుగకున్నఁ ✽ దెఱఁగుపడఁగ.

అది [illegible] నిన ధర్మనందనుం డతనియుద్ధతికిం బుయిలోడి యొయివడి గలనడవడిం
బ్రవ[illegible] మండియు జూదంబువెంట మోసపోయి తొడరి చిక్కునం బడియె నది
యును నతం డక్షవిద్యాపాటవంబు దనకు మిగుల లేమిం జేసియు బంధుజనంబులు
దన్ను వారించుటయుం దా నాడుట మాని గాంధారరాజు నియమించినం దత్కా
కౌశలంబునం బరిణతుండు గావున నాశకునియాడి యుధిష్ఠిరుం డొడ్డినయొడ్డిమియు
గెలుచుచు వచ్చినట్లగుట నాతనియందును గొఱంత లేది త్తెఱంగున వార లధ
ర్మపరు లని నిందింపరా కునికి కారణంబుగా వీరలు వృచ్ఛినమానిసి వినయంబు
తోన యిక్కార్యంబు దీర్చికొని రావలయు ననిన సాత్యకి కోపించి యిట్లనియె.

సాత్యకి దుర్యోధనుకడకు దూతం బంపం గూడ దని చెప్పట.

ఆ. ఇట్టు లాడం దగునె యిది నీక పోలు ని, న్నే మనంగ నేర్తు ని త్తెఱంగు
పాడి గాంగం బూని పలుకంగం జెవి యొగ్గి, యాదరించువారి నందుం గాక.
క. వేడుక పుట్టినజూదం, బాడెను ధర్మజుండు వారలందఱుం దమలో
గూడికొని పిలిచి బలిమిన, యాడి కపటజయము గొనుట యది దగ వగునే.
క. ధర్మతనూభవుదెస దుష్కర్మము రూపించి సభ నొకండును మైమైం
బేర్మి సెడక పోనేర్చునె, ధార్మికు లింకెట్టివారు తథ్యం బరయన్. 25
చ. పలికినచందముల్ నెఱపి పైతృక మైచనురాజ్యభాగ మి
మ్ములం బడయం దలంచి బలిమిం జలమున్ నెఱపం గడంగు వీ
రలు నొరు వేడం బోదురె యరాతులు సాధుల మెత్తురే రణం
బుల జయలక్ష్మిం జేకొనుటం బోలునె యొండొకరాజధర్మముల్. 26
తే. సముచితము లగుమాటలం జక్కంబడక, తక్కెనేనుక్కివుం డగుధార్తరాష్ట్రుం
గ్రూరశరముల నేనియ్యకొలుపువాండ, నవని కౌంతేయులకు నిచ్చునట్లుగాంగ.
క. భీమార్జునులకు రణమున, నేమగలును బ్రతియె వీరు నేనును సైన్యో
ద్దాముల మై నడచిన నే,భూమీశులు నెదిరి బ్రదికిపోవం గలరే. 28
ఆ. కవలవారుం గొడుకులుగమియుం బాంచాలవర్గంబు వృష్ణివరులుం గడంగిరేని
నొక్కమాత్రలోన నువ్వెత్తుగొనరె దుర్యోధనాదిశతము నుద్ధవిడిన. 29
క. ఈమత్స్యపతి సహాయము, గా మాకుం దీర్ప రానికార్యము గలదే
సామాద్యుపాయపరుం డుద్దామభుజాబలయుతుం డితండు కేవలుండే. 30
క. నామతమునం గార్యము సంగ్రామము సేయుటయ యిట్లు గాకీలోనర్
పామవచనంబు లక్కురు, భూమీశ్వరుతోడ నాడం బుచ్చెద రేనిన్. 31
ఉ. దైన్యము దక్కి దూత యుచితంబుగం బాండునృపాలుపాలు రా
జన్యవరుండు ధర్మజుండు సమ్మతి వేండెడు నన్న లోకసా
మాన్యవిధిం దగంగ గరిమంబున నిచ్చినం బుచ్చికొంద మ

నన్యోన్యవిరుద్ధభాషణము లాడినఁ దత్ఫల మాతఁ డందెడున్. 32

వ. అనిన ద్రుపదుం డిది యేలు బలదేవుమాట మాట గాదు బలవిక్రమవంతుండును సహాయసంపన్నుండును దుష్టాత్ముండును నైన దుర్యోధనుండు ప్రియవచనంబుల రాజ్యంబు పాలిచ్చుట కియ్యకొనమి సిద్ధంబు యుద్ధంబునం గాని చక్కంబడదు అని పలికి మఱియు నిట్లనియె. 33

క. మృదుభాషణముల దుర్జన,హృదయములు ప్రసన్నతాముఖేహముఁ బొందుని మెల్లిదముగఁ గొని యంతంతకు, మద మెక్కుం గాక దురభిమానము పేర్మిన్.

వ. అదియునుం గాక, 35

తే. కూటికై ద్రోణభీష్ములు కుమతి యనక
యనుసరింతురు ధృతరాష్ట్రుఁడును దనూజు
తృష్ణ నూనినవాఁడు రాధేయుఁబోఁటి
తులువ లెల్లను నతని సద్బుద్ధి యండ్రు. 36

వ. కావున నతండు దుర్వినీతుం డై యుండు నెల్లభంగుల సంగరంబు గాఁ గలదు ది యాసమయంబున బలంబులం గూర్చికొని పెంపం దగురాజులం బిలిచి పుచ్చవలయు సుయోధనుండును దో డాసపడి పుచ్చు నుచితపరు లగునరపతులు దొలుతఁ జెప్పినవారికి సహాయత్వంబుఁ జేయం జూతురు మనము వేగ గలకాలరుల వేగంబ పుచ్చి శల్యకేకయధృష్టకేతుజరాసంధతనయప్రభృతు లయినభూపతులకును వారివారిబంధుమిత్రజనంబులకును నెఱింగించిపుచ్చుట కార్యం బిది నాకుం బోలిన తెఱం గని పలికి తనకెలన సముచితాసనంబున నున్నవిప్రవరుం జూపి. 37

క. ఇతఁడు మదీయాగ్రపురోహితుఁ డితనికి నెల్లపనులు నెఱిఁగించి తగఁగ ధృతరాష్ట్రుకడకుఁ బనుపుఁడు, చతురవచనరచనఁ గఱపి సంప్రీతి మెయిన్. 38

ఉ. ఆతనిసమ్ముఖంబునఁ దదగ్రతనూజకడకఁ మరున్నదీ
జాతుఁడు సన్నిధిం గలశసంభవుఁడు గ్రమోచితంబుగా
నీ తెఱఁ గిట్టు లాడు మని యేర్పడ నంతయుఁ జెప్పి పుచ్చఁగా
నీతి యెఱుంగ దగం బలుక నెయ్యము లాభముఁ బెంపుఁ జొప్పడున్. 39

వ. అనిన వాసుదేవుండు పాంచాలపతివచనంబు లుచితంబు లయి యున్నయవి యిబ్భంగిన చేయవలయు నని పలికి మఱియు నిట్లనియె. 40

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నే నొక్కరూప యట్లగుటఁ దగఁ
వారును వీరును దమతమ, నేరిమి మెయి ధరణి యేలి నెగడఁగఁ జూతున్. 41

తే. పెండ్లి కని పిల్వఁ బంచిన ప్రియముతోడ, నేఁగుదెంచితి మిన్నాళ్లు నెల్లయొప్పిదములఁ జూచితి మియ్యెడఁ బడవుగాఁగ నిలువఁ దీఱదు పోయి రావలయుమాకు.

వ. అని పలికి ద్రుపదు నాలోకించి మీరు మా కెల్లవారికి గురుస్థానంబు మీమాట
యనిన ధృతరాష్ట్రుండు బహుమానంబు సేయు మిమ్ము శాంతనవుండునుం గాని
యాడు మీయందు ద్రోణకృపాచార్యులు సఖ్యంబు వాటింతు రట్లగుటం జేసి.

తే. పాండవార్థమై యొక్కరుం ǂ బనుప మీక, భరము మీపలుకం ǂ దలుకు మీరు
తెలుగుపఱుపంగ మిగిలి యు ǂ ద్రేకులైన, వార చెడువారు విమలవి ǂ చారవిభవ.

క. పొందైన లెస్స విరసపుఁ, గ్రందయ్యెడుచంద మైన ǂ రాజుల నెల్లన్
ముందఱ రావించి క్రమం, బొందఁగ మముఁ బిలువఁ బంపుఁ ǂ డొయ్యన పిదపన్.

క. మీపనుపున రాజ్యము పాండుతనూభవులకు ǂ నీకున్న భుజా
టోపభయంకరుఁ డర్జును, కోపానల మడరి ముట్టి ǂ కొనదే వారిన్. 46

చ. అని గమనోన్ముఖుం డయి ము ǂ రాంతకుఁ డాద్రుపదుండు ధర్మనం
దనుఁడు వృకోదరాదు లగు ǂ తమ్ములు మత్స్యమహీవిభుండుఁ ద
న్ననుప హలాయుధప్రభృతి ǂ యాదవలోకము తోడ రా ముదం
బున నిజపట్టణంబునకుఁ ǂ బోయె సముజ్జ్వలవైభవంబునన్. 47

వ. వివాహమహోత్సవంబునకు వచ్చినతక్కటిరాజులును సంగ్రామసన్నాహంబున
కై తమతమపురంబులకుం జనిరి తదనంతరంబ. 48

క. సమరమునకుఁ దగునుద్యో, గమునఁ బ్రవర్తిల్లి రెలమిఁ ǂ గౌంతేయులు మ
త్స్యమహీనాథుఁడు సన్నా, హము సేసెన్ ద్రుపదవిభుఁడు ǂ నాయిత మయ్యెన్.

వ. ఇట్లు సన్నద్ధులై వెలివీడు విడిసి తమకు ననురక్తులైన రాజులపాలికిం దగుదూతలం
బుచ్చి రట దుర్యోధనుండు వీరలచందంబు విని తానును దనబంధుమిత్ర
గణం బైన రాజలోకంబు నెల్ల రావించిన. 50

క. ఇభతురగస్యందనగతి, రభసంబునఁ బృథివి యద్రువ ǂ రాఁ దొడఁగిరి భూ
విభులు నలుదిక్కులను లో, కభయంకరలీల నుభయ ǂ కటకంబులకున్. 51

ద్రుపదుఁడు దనపురోహితుని దుర్యోధనుకడకు దూతఁగాఁ బంపుట.

వ. అట్టిసమయంబున నజాతశత్రుననుమతి వడసి పాంచాలపతి వయోజ్ఞానవృద్ధుం
డైనతనపురోహితుం గురుపతిపాలికిఁ బుచ్చువాఁడై యతని రావించి. 52

క. హితుఁడవు మతిమంతుండవు, చతురవచనకోవిదుఁడవు ǂ సమయజ్ఞుఁడ వు
న్నతవంశవర్ధనుఁడ విం, గితవేదివి నెచ్చెలివి సు ǂ కృతి వట్లగుటన్. 53

తే. నాకుఁ గర్తవ్య మగుపని ǂ నీకుఁ జేయఁ, దగవు గావున నెల్లవి ǂ ధములఁ బూని
పాండవార్థంబు ధృతరాష్ట్ర ǂ పాలి కరిగి, నేర్పు వాటించి కార్యంబు ǂ దీర్పవలయు.

వ. అని చెప్పి యొడంబఱిచి యతనితో మఱియు నిట్లనియె. 55

క. విను కొడుకు గొన్న వేఁదుఱ, కొని కొట్టినతిండికాఁడు ǂ కుటిలుం డతఁ డా
జనపతిచందము ధర్మజు, ననుపమశీలంబు నెఱుఁగు ǂ దది యట్లుండెన్. 56

తే. పుడమిపాలు పాండవులకు నడుగఁ బోయి
నీవు ధృతరాష్ట్రుతో ధర్మనిష్ఠ మైన
యుచిత మాడిన నందుఁ బో టొడ్డియున్న
దారలభృత్యులమనములు దిరుగఁబడవె. 57

క. గురుభీష్మాదులమనములు, దురమునకుం జొరక యుండ దుర్యోధనుఁ డా
తురుఁ డై యొడఁబఱుపఁగ ని, ష్ఠురుసున నెర వైన ఋచ్చవదు బల మెల్లన్.

ఉ. పాండుతనూభవుల్ వడినపాటులు బంధుల కెల్లఁ దెల్పుచుం
బండితవృద్ధసజ్జనులపాలికిఁ బోయి కులోచితంబు గా
కుండుట సూపి చెప్పుచుఁ బ్రియోక్తులఁ దక్కటివారి నిట్లు మే
లొండొకచంద మొప్ప దని యుల్లములం దలపోయఁ జేయుచున్. 59

వ. మఱియు సమస్తజనంబులమనంబులు నిక్కడ వార్యలునట్టియుపాయంబు లెన్ని
గల వన్నియు నప్రమత్తగవులమై నాచరించుచుఁ జరియించునది యిచ్చట విరా
టుకోలువుకూటంబునం బుట్టినకృష్ణాదులసంవాదంబు తెలంగును మనయెఱిం
గినయదియ తదనురూపంబుగాఁ బలికి పాండవులకుఁ దేజోలాభంబుం గావిం
చుట కర్తవ్యంబు నీవు కరినగరంబున వసియించి ధృతరాష్ట్రధార్తరాష్ట్ర
గాంగేయవిదురగురుకృపాదులకడ కరిగి నానాఁటికి వారివారిచిత్తంబుల తెలం
గెఱింగి ప్రవర్తింపుము దైవగతిం జేసి నీ యొడ్డినపూతంబునకు సుయోధనుం డొ
డంబడియె నేనియు నదియ సకలజనసమ్మతం బయినవిధం బగు దాన నజాతశత్రుం
డును బ్రీతుం డగుఁ బోయి రమ్మని నిశ్చయంబు నేసిన నమ్మహీసురవరుండు.

క. మును పాంచాలవిభుని వీ, డ్కొని ధర్మజు భీము నరు నకులు సహదేవుం
గని యమమతుఁ డై యందఱు, ననుపఁగ మన్ననలు వడసి యరిగెం బ్రీతిన్.

వ. అంత నక్కడ దుర్యోధనుండు సకలరాజన్యసామాప్యంబుగా గోపాలదేవుపాలికి
దూతం బుచ్చుట దగ వగు నే యని విచారించి. 62

క. వెరవుమెయిఁ దాన కతిపయ, పరిజనసహితముగ నరిగెఁ బటుతురగగతి
స్ఫురణానుమోదలీలా, భరితుఁ డగుచు వేగిరంపుఁబయనములఁ దగన్. 63

వ. చని తదీయపురప్రవేశంబు సేసె నాదివసంబునన ధనంజయుండును గోవిందుం
గాన వచ్చె నట్టియెడ. 64

తే. అతఁడు పవడింప మును కౌరవాధినాథుఁ, డరిగి తలయంపిదెస నున్నతాసనమున
నుండెఁ బదపడి కాల్కడయొద్ద కల్లఁ, జని వినమ్రుఁ డై నిలుచుండె సవ్యసాచి. 66

వ. అంత.

క. మేలుకని కృష్ణుఁ డర్జును, నాలోకించి మఱి కౌరవాధిపుఁ గని త
త్కాలోచితబహుమతిమైఁ, జాలఁ బ్రియం బిరువురకుఁ బ్రసన్నతఁ జేసెన్.

వ. తదనంతరంబ. 68

ఉ. వారలఁ జూచి కేశవుఁడు । వచ్చినకార్యము సెప్పుఁ డన్న న
క్కౌరవనాథుఁ డి ట్లనియెఁ । గయ్యము సేయువాఁడ సహాయముం
గోరి భవత్సకాశమునకుం జనుదెంచితి మేము వీరు నీ
కారయ నొక్కరూప హృదయంబునఁ బేర్చిన బాంధవంబునన్. 69

క. ము న్నేను గాన వచ్చితి, నిన్ను సుజను లైనవారు । నెమ్మిని మునుమున్
గన్నం దగఁ గైకొందు ర, యున్నతసౌజన్యసార । యుతుఁడవు నీవున్. 70

వ. కావున లోకంబుపాడి విచారించి నాకుం దోడు గా వలయు ననిన వాసుదేవుం
డి ట్లనియె. 71

ఉ. నీ విట మున్న వచ్చి తిది । నిక్కము పార్థునిఁ దొల్తఁ గాంచితిం
గావున మీకు నిద్దఱకుఁ । గౌరవ మొప్పఁగ దోడుపాటు స
ద్భావము దీనికిం దెఱఁగు । దప్పక యుండఁగ నేర్పరించెద
న్నీవల పెట్టు లట్లు తగ । నీవును నీతఁడు గోరికొం డొగిన్. 72

క. నాపాటియ పదివేవురు, గోపాలురు గలరు సమర । కోవిద బాహా
టోపాభిరామమూర్తులు, చాపాద్యాయుధకళావి । శారదచిత్తుల్. 73

క. నారాయణాభిధానులు, వారలు గయ్యంబు సేయు । వా రొక్కెడ నే
నూరక నిరాయుధవ్యా, పారతమై నుండువాఁడ । బరమాప్తుఁడ నై. 74

క. వా రొకతల యే నొకతల, యీరెండుదెఱంగులందు । నెయ్యది ప్రియ మె
వ్వారికిఁ జెప్పుఁడు దొలితొలి, గోరికొనఁ బాలునికిఁ ద । గుం బాడిమెయిన్. 75

అర్జునుఁడు శ్రీకృష్ణునిం దనకు సహాయునిఁగాఁ గోరికొనుట.

క. అని పలికె హరి కిరీటిం, గనుఁగొని కొందుకవు నీవు । గావున నీకుఁ
మును గోరఁ బాడి యనవుడు, విని కృష్ణునిఁ గోరికొనియె । విజయుం డెలమిన్.

ఆ. దాని కాత్మఁ బొంగి । ధార్తరాష్ట్రుఁడు వారి, నపహరించికొనిన । యట్ల కాఁగఁ
దలఁచి చెన్ను మీఱి । బలములఁ గైకొని, చనియెఁ బ్రీతి రాము । సదనమునకు.

వ. చని యతనిం గని సన్మానంబు వడసి తనవచ్చినకార్యం బెఱింగించిన దుర్యోధను
నకు బలదేవుం డి ట్లనియె. 78

క. అభిమన్యువివాహమునకుఁ, బ్రభువర్గం బెల్ల గూడఁ । బడి యుండఁగ నా
సభ నీకై యేఁ బలికితి, నిభపురమున మాట వ్రట్ట । దె ట్లీవు వినన్. 79

వ. దానికిఁ గొంద ఱసహ్యపడి పాండవపక్షపాతంబునం బ్రతికూలవచనంబులు పలి
కిన నది కృష్ణునకుఁ బ్రియంబు లై యుండె న ట్లగుటం జేసి. 80

తే. అతనిఁ బాసి యొక్కింతిప్రొ । ద్దైననిలువఁ, జాలమియుమూలముగ విర । సంపుమాట

లాఁడ నొల్లమి నేమియు ననక యంత, నుండి యొకనిశ్చయమ్ము మైనున్నవాఁడ. 82

వ. అది యెయ్యది యంటేని.

క. మీరును వారును జలమునఁ, బోరెడు నెడ నెద్ది యెట్లు వోయిన నెఱి నే
నూరక యుండుదుఁ బోఁడె, వ్వారికిఁ బో నింత నిక్కువం బెప్పంగిన్. 83

వ. అనిన విని దుర్యోధనుండు దాని కియ్యకొని సవినయంబుగా బలదేవుని వీడ్కొని
వాసుదేవు నామంత్రణంబు సేసి కృతవర్మపాలికిం జని యాతం డొక్కయక్షౌహిణి
తోడఁ దన్నుం గలయ వచ్చువాఁ డయి యాడినం బలికినఁ బ్రియం బంది నిజ
పురంబునకరిగెఁ దదనంతరంబ కృష్ణుం డర్జునున కిట్లనియె. 84

క. నారాయణగోపాలుర, భూరిపరాక్రములఁ గురువిభుఁడు గొన సంగ్రా
మారంభరహితు నన్నుం, గోరికొనుట నీకు మేలగునె తలపోయన్. 85

క. అనుటయు నాతఁడు హరి కి, ట్లను నేను రణంబునకు సహాయం బొల్లన్
వినుము ప్రసిద్ధుఁడవు నీ, వని సేసినఁ బేరు నీక యగు నెప్పాటన్. 86

వ. నీ కెందుఁ గైజయంబు గొనబా దట్లగుటం జేసి విజయమూలం బగునీతోడును
వలయు నీవు సమరంబు సేయకునికియుం బ్రియంబు గావున నిన్నుం గోరికొంటి
నని చెప్పి మఱియు నిట్లనియె. 87

క. సారథ్యం బొనరింపుము, దారకృపాలీల నెల్లభంగుల నాకీ
గౌరవమును జిరకాలము, గోరినయది దీని విష్ణు గుణరత్ననిధీ. 88

క. అనినఁ గిరీటికి హరి యి, ట్లను నీ దగుకోర్కి దీర్పుటది నాకు వ్రతం
బనఘా తగ సారథ్యం, బొనరించెద నీకు నసమయుద్ధక్రీడన్. 89

క. అని యూఱడించి నరుఁ దో, డ్కొని ధర్మతనూజునొద్దకుం బ్రియ మొసఁగం
జనుదెంచెం గార్యాలో, చనమును దగఁ జేయుబుద్ధి శౌరి గడంకన్. 90

వ. అంత నట శల్యుపాలికిం బోయినదూత లతనిం గని సముచితాలాపంబుల సమర
సహాయత్వంబునకుఁ గోరి పిలిచినం బ్రీతుండై యతండును బుత్త్రమిత్త్రసమేతంబు
గా నానాసేనాతిసంకులంబుగాఁ గదలి పాండవు లున్నయెడకు నిత్యప్రయాణం
బుల నడచుసమయంబున. 91

దుర్యోధనుండు శల్యుని వశ్యుం జేయుట.

తే. ఇంతయును విని కౌరవాధీశ్వరుండు, నతులు లగునాప్తజనములఁ దత్క్షణంబ
మద్రనాథుని చనియెడుమార్గమునకుఁ, బుచ్చి యెడ నెడ నతులవిభూతి మెఱయ.

సీ. అరుదారు మేలుకట్లాయితంబై చూడ, నొప్పారి తను పగుచప్పరములుఁ
బరఁపైన చెలువంబు గరగరికయుఁ దియ్య, తెలిసిరుఁ గలిగినదీర్ఘికలును
బొడవై సముద్ఘించు బొలుచునట్లుగ నేయుఁ, గులరు గుల్మములకుఁ గోష్ఠములును

ముందఱ బయలైనచందంబుఁ జలువాఱి, మత్తమైనయాస్థానమండపములు
ఆ. బియ్యములును నేయుఁ బెరుఁగును గూరగా, యలును వంటకట్టియలును గడ్డి
కవణములును బెల్లుగా నొడఁగూర్చి ని, గూఢవృత్తిఁ దానుఁ గూడ నడచె.

ఇవ్విధంబున విడిదలపయనంపుసంపదలు పొంపిరివోవం దనకు సమకట్టినసమస్తవస్తువులయ్యై కల్యంబునకు శల్యుండు సంతుష్టాంతరంగుండై నిజపరిజనంబులం జూచి యిట్లు చతురంబుగా మనకు వలయువాని సంపాదించుటకుఁ బ్రవర్తకులైన యుధిష్ఠిరామాత్యు లెవ్వారు వారలం దోడ్కొని రండు వారలు ప్రసాదదానంబున కర్హు లని పలుకునవసరంబున నటమున్న పలువెఱంగులఁ బనులు సేయుచున్న తనపన్నాయనంబువారిలోఁ గలసి మఱుఁగుపడి యున్న కౌరవేశ్వరుం డమ్మాటలు విని యతనికిం బొడసూప నిదియ సమయం బని సముచితప్రకారంబునఁ దన్నెఱింగించికొని వినయంబునఁ గనిన నతండును సంభ్రమంబున గాఢాలింగనంబు సేసి కనకాసనంబున నునిచి యింతయు నిమ్మహాత్మునుద్యోగంబున నయ్యెం గావలయు నని తలంచి విస్మయం బంది నీ కెయ్యది యిష్టంబు గోరు మిచ్చెద ననిన గాంధారీనందనుండు పరమానందంబునం బొంది యిట్లనియె. 94

క. సత్యసరస్వతి వగు మా, చిత్యవిశారదము నీమనశ్చిత్తము నియమా
హాత్మ్యంబు మెఱయ నాకు న, మాత్యుఁడవై పూని నడపు మత్సైన్యంబున్.

ఆ. తలఁపఁ బాండవులును ధార్తరాష్ట్రులు నీకు, నొక్కరూప భక్తియుక్తిఁ జాల
నీవు నన్ను మానవేశ్వరుఁడు గాఁగ న, నుగ్రహించి తగఁ బరిగ్రహింపు. 96

చ. అనవుడు శల్యుఁ డియ్యకొని యట్టిద కాదె విభేదవృత్తి నా
మనమున లేదు పాండవసమాజము మీరును నొక్కరూప కా
వున నిది యెన్నమాట దగవుం గలపోయఁగ మున్ను ప్రీతిఁ గాం
చిననిను నమ్మి గూడుటయ చేయుదు నిట్టుల యెల్లభంగులన్. 97

ఉ. దానఁ గొఱంత లేదభిమతం బిది గాకయుఁ గల్గెనేనియుం
బూని యొనర్తు నన్నఁ గురుపుంగవుఁ డెంతయుఁ బొంగి నీవు స
న్మానము సేసి నా కిటు లమాత్యుఁడవైనపదంబుకంటె మే
లై నుతికెక్కుకోర్కె యెటు లారసి చూచిన నొండు గల్గునే. 98

వ. అనిన విని వికచవదనుం డగుచు మద్రేశ్వరుండు. 99

క. చను నీవు హాస్తినగరం, బున కేనును బాండుభూమిపుత్త్రులఁ బ్రీతిం
గని యట వత్తు నవశ్యం, బును వారలఁ జూడవలయుఁ బోయెద ననినన్. 100

ఆ. అట్లకాక వేగ మట పోయి మరలుండు, వరము మఱవకుండవలయు మమ్ముఁ
జేరి నెగడువాఁడఁ గారుణ్యమున నిట, యరసి యుండుఁ డనియెఁ గురువిభుండు.

వ. అనవుడు. 102



101

క. దరహాసముతో మద్రే, శ్వరుఁ డాలింగనము సేసి సందియపడ కీ
వరుగు మని పనుప నాతఁడు, కరిపురికిం జనియె మది వికాసముఁ బొందన్. 103

శల్యుఁడు పాండవులం జూడ నుపప్లావ్యంబునకు వచ్చుట.

వ. అంత శల్యుండు నుపప్లావ్యంబునకుం జని స్కంధావారంబు దఱియం జొచ్చి ధర్మనందనునివాసంబున కరిగిన నతండును దమ్ములుం దానును ద్రౌపదీసుభద్రలు నభిమన్యుప్రభృతిపుత్త్రవర్గంబును నెదురు వచ్చి కృతప్రణాముఁ డై తోడ్కొని పోయి కాంచనాసనంబున నునిచి యర్ఘ్యపాద్యంబు లిచ్చి కుశలం బడిగిన, సర్వంబును గుశలసంపన్నం బని వారల నందఱ నభినందించి యుధిష్ఠిరుం బునరాలింగనంబు సేసి యి ట్లనియె. 104

క. జనవరహితం బగువనమున, ననుజన్ములు ద్రుపదభూవరాత్మజయును నీ
వును నింతకాల మలయక, యునికి కెఱుఁగ దుష్కరము మహోదాత్తమతీ. 105

ఆ. దానికంటె నరిది దలపోయ నజ్ఞాత, వాస ముజ్జ్వలాంగభాసమాను
లైన సహోదరీ సూనృతాదుల, పెంపు మిమ్ముఁ గడవఁ బెట్టుకున్నె. 106

క. ఇమ్మహి యెల్లను నీమది, యుమ్మలికముఁ జాల నొచ్చె నుర్వీపతి నీ
విమ్మయి నిప్పు డఖిలమురి, తమ్ములుఁ గడచుటకు సమ్మదమ్మునఁ బొదలెన్. 107

వ. అని యుచితసంభాషణంబులు సేసి దుర్యోధనుండు దన్నుం గాంచినవిధంబును నతండు ప్రార్థించిన తెఱంగును దానికిం దా నియ్యకొనుటయుం జెప్పిన ధర్మనందనుం డతని కి ట్లనియె. 108

తే. మేలు సేసితి రొక్కరి మెచ్చి వారి, కోర్కి దీర్చుట పెద్దలగుణము గాదె
యని మదీయచిత్తమునకు హర్షకరము, నిపుడు నొక్కటి వేఁడెద నవధరింపు.

వ. పార్థునకుఁ గృష్ణుండు సారథ్యంబు సేయువాఁ డై యున్నవాఁడు కర్ణుండు పార్థుతోడి నెప్పుడు మచ్చరించుచు నుండు వీ రిరువురకు సంగ్రామం బైనయప్పుడు కృష్ణునకుం బ్రతిసారథ్యం బొనరింప మీరకాని యొక్కరుండు దక్కొరుండు లేఁడు గావున నవశ్యంబును మీకుం గర్ణసారథ్యంబు కర్తవ్యంబు గాఁగలయది సమరసమయంబున నిరాకరించి పలికి కర్ణుచిత్తంబునకుం గలంక పుట్టించి పార్థు రక్షింపవలయు నకృత్యం బని యనుమానింపక మత్ప్రార్థనంబున నెల్లభంగుల నివ్విధం బనుష్ఠించువార లని యభ్యర్థించిన సంతసించి శల్యుం డి ట్లనియె. 110

క. అగు నిది పోలును నాకుం, దగ నట్టిద కర్ణునకు రథంబు గడపన్
వగు దని కోరినకౌరవ, జగతీశ్వరుప్రార్థనంబు సఫలంగ వలయున్. 111

క. కర్ణునిసారథి నైనను, నిర్ణయముగ నేను బార్థునిం గాచెద నా
దుర్ణయవిచారు నెమ్మెయిఁ, గర్ణకఠోరంబు లాడి కలఁతుం బోరన్. 112

తే. దర్పమును దేజమును మాయఁ దలఁగఁ బలికి చిక్కువఱిచిన నేయంగ రాజసుతుఁడ

కునికి రాధాతనూజు నర్జునుఁడు తీవ్ర, బహుళబాణపరంపరలపాలు పఱుచు.

చ. ఇది యొకఁ డేల నీవు మది నెయ్యది గోరినఁ జేయువాఁడ నాఁ
డదయత సూతసూతి సభ నాడినమాటకుఁ జాల నొచ్చి మా
హృదయము లెల్ల నీవలన నెంతయు బాధము సేయు నక్కటా
యదియును గాక మీపడినయాపద లెవ్వరి నొవ్వఁ జేయవే. 114

ఆ. ఇట్లు వడితి వనుచు నెడ నీవు వగవకు, గారవమున నీ మనోరథమ్ము
ఫలము వొందు నెల్లకథంగుల దేవతలయును బడుదు రొక్కొకయవసరమున.

క. వాసవుఁడు వొల్లి నిజకాంతాసహితము గాఁగ నధికదైన్యము వొందెన్
మీ సంపద పెద్దయె విధి, సేసినగతిఁ బడకయుండ శివునకు వశమే. 116

వ. అనిన విని ధర్మనందనుం డింద్రుండు శచీసమేతంబుగా నట్టిమహావ్యథ యేమికారణం
బున నెట్టిచందంబున ననుభవించె నని యడిగిన మద్రపతి యొల్లింటియితిహాసంబు
సెప్పెద వినుము తొల్లి యిట్లనియె దేవతలయందు మాన్యుండైన త్వష్ట యను పేరం
బరఁగువాఁడు వాసవునకుం గీడు దలంచి మూఁడుతలలవాని నొక్కని సృజియించి
విశ్వరూపనామధేయుం జేసిన నతం డింద్రపదవిం గోరి ఘోరతపంబు సేయుచున్న
దానికి భయం బంది నిలింపపతి యప్సరస్త్రీల న త్తపోభంగంబు సేయుం డని
నియమించి పంచిన. 117

క. వారివిలాసంబులను వి. హారముల విలోకనముల నాలాపములన్
నారవికారం బాతనిఁ జేరద యన్నాకపతియు నిసి గ్గదఁ గదురన్. 118

తే. తలరి యమ్మునిఁ దెగఁజూచి ధర్మరహితుఁ
డగుట యెవ్వరు నెఱుఁగనికయట్లు గాఁగ
నేఁడుగాలంబు గడచిన నెఱిఁగి భూత
గణము లాక్రోశ మొనరింపఁగా నతండు. 119

వ. తనదుష్కృత్యంబు ప్రకటంబు గాకుండుటకు రోసి యొక్కవిషమవ్రతం బాచరించి సముద్ర
తరుధరణీస్త్రీజనంబులయందు బ్రహ్మహత్య విభాగించి పెట్టి నిజకల్మషంబుఁ బాపి
కొని మునిగణసేవితుం డయి సముల్లాసంబునం బొంది యునికిఁ ద్వష్ట గోపించి.

తే. అనఘ రాఘవుఁ దపోనిధి నధికశాంతి, యుక్తుఁ జంపినపాపాత్ము నుఱుక పట్టి
మ్రింగఁజాలెడువాని నత్యుగ్రదేహు, నేను సృజియింతుఁ జూడుఁ డీక్షయిత్రణంబ.

చ. అనుచుఁ గడంగి నిష్ఠ మెయి నగ్నిముఖంబు నొనరించి వేల్మిం
దనయు సృజించి లోకవిదితంబుగ వృత్రసమాఖ్య యిచ్చి మ
ద్వినుతతపోబలంబునఁ బ్రదీపితతేజుఁడ వై జయింపు మీ
వని నియమించి పంచె నమరాధిపుతో సమరంబు సేయఁగన్. 122

ఇంద్రుఁడు వృత్రాసురునితో యుద్ధంబు సేయుట.

సమకూర నేర్చునే యనుటయు నమ్మునులు సత్పురుషసాంగత్యంబు సంభవించినం
జేయమి నీతి గాదు మహేంద్రుండు సకలలోకసమ్మతసద్భావుండు గావున నతని
తోడిచుట్టరికంబు మే లనిన నొడంబడి యతండు వారల కి ట్లనియె. 135

క. ఏ నొక్క తెఱఁగు సెప్పెద, దానిం గా దనక చేసి తగ మీరలు సం
ధానము దృఢముగఁ జేయుం, డానాకేశునకు నాకు నధిక ప్రీతిన్. 136

వ. అది యెయ్యది యనిన నార్ద్రంబగుదానను శుష్కంబైనసాధనంబునను దారువు
నం బాషాణంబున శస్త్రాస్త్రంబులం దివంబున రాత్రియందును నేను వధ్యుండఁ
గాకుండ వలయు ననిన వారును దానికి నొడంబడి యవ్వరంబు లొసంగి వృత్ర
వజ్రధరులకు మిత్రభావం బొనరించి మగుడం జని యత్తెఱంగు వాసవున కెఱిం
గించి నిజనివాసంబుల కరిగిరి సురనాథుండు సుఖం బుండి పెద్దకాలంబునకుం దన
మనంబునఁ బాయనివైరంబు సైరింపం జాలక దామోదరునిపూనికయు ముని
జనంబు సేసినసంధివిధంబును నిరూపించి రిపుం బరిభవింప రంధ్రాన్వేషణంబు
సేయుచుండి యొక్కనాఁడు. 137

చ. జలనిధితీరభూమిఁ దనశత్రుఁ గనుంగొని వీని నిప్పు డో
ర్బల మెసఁగంగ నాదుభిదురంబునఁ ద్రుంచెద రాత్రి గాదు తా
వలఁపు దివంబు గా దిది యుదగ్రపరాక్రమసౌమ్యసంధ్య నా
యలవుఁ జలంబుఁ జూపు నెప నై తగుసాధన మొద్ది గల్గునో 138

క. అని తలఁచుచు నచ్చట నొక, వననిధిఫేనంబుఁ జూచి వాసవుఁ డార్ద్రం
బును శుష్కంబును గా దిది, యనుచుం గులిశమునఁ గూర్చి యధికరయమునన్.

తే. దాన వృత్రుని వ్రేయ నత్తఱి మురారి
యందుఁ దగ సంక్రమించి యయ్యసురఁ జంపె
జిష్ణుఁ డతిభక్తి విష్ణుఁ బూజించె నాత్మ
నఖిలలోకంబులకు మోద మావహిల్లె. 140

వ. ఇవ్విధంబునం బగతుం బరిమార్చి పేర్చి యింద్రుండు నిజపురంబునకుం జనియె
మఱియును భూతసంఘం బిట్లు బ్రహ్మహత్య సేయం దగునె యని యతని నిందిం
చినం బ్రభుత్వసంపద సెడుటయు. 141

ఆ. నిచదశకు వచ్చి నిషధాచలంబున, కరిగి సురవరేణ్యుఁ డడఁగి యుండె
నసురు లెల్లఁ గలఁగి యన్యోన్యపీడన, భయముఁ బొంది కూడఁ బాటి నుండె

క. కావలి యై సురరాజ్య, శ్రీ పాలింపంగఁ దగువిశేషంబున సం
భావితుఁడు నహుషుఁ డని చని, యావిభుఁ గని తారు మునులు నతనికి నెమ్మిన్.

దేవతలు నహుషుని సురరాజ్యాభిషిక్తునిం జేయుట.

వ. పాకశాసనుతెఱం గాకర్ణించి. 144

కహితంబు గాఁగఁ బుచ్చుము, మహోత్తమచిత్తమునయ్యమర్షం బడఁగన్. 156

క. అనవుడు శోకం బడరఁగ, ననిమిషగురుఁ జూచి యిట్టులను శచి యిటు వు
చ్చిన దూఱు రాదె నను శుచి, యని మీఁకొనియాడు టెల్ల ననృతము గాదే

వ. అనిన విని దరహాసితవదనుం డగుచుఁ బురుహూతపురోహితుండు. 158

క. నహుషుండు వినుచువాఁ డటె, విహితానుష్ఠానపరులు వీ రటె తా లో
కహితం బటె యిది మనకుఁ, మహనీయము కాక యెట్లు మానఁగవచ్చున్

వ. అని యుల్లసం బాడి యనిమిషులను ఋషులను జూచి యిట్లనియె 160

తే. శరణు సొచ్చిన రక్షింపఁ జాలియుండి, కడపి పుచ్చిన నూర్ధ్వలోకములు దప్పఁ
బుణ్యార్థంబు లఫలతఁ బొందు ననఁడె, కమలగర్భుండు తొల్లి జగద్ధితముగ.

వ. అని యనుచితాలాపంబుల నిషేధించి వార లట్లనిన గర్తవ్యం బెయ్యది యూ
హింపు మనిన నద్దేవి నహుషునకడకుం జని సముచితంబుగాఁ దదీయసాంగత్యం
బున కొడంబడికకొని వచ్చునది యటమీఁద మన మందఱముం బురందరున కభ్యు
దయం బగునట్లు గాఁ జరించువార మనుటయు వాచస్పతివచనంబులకు సంతసించి
సురసంయమిసంఘంబు లరిగిన యనంతరంబ. 162

క. పౌలోమియు నానహుషుని, పాలికిఁ జనుటయు నతండు భావజవికృతి
వ్యాలోలమానసుం డయి, లీలాసంభావనాలలితముఖుఁ డయ్యెన్ 163

వ. అట్టియెడ. 164

ఉ. అల్లన యింతి యిట్లనియె నారసి వాసవుకర్తి . లేమియుం
జెల్లముగా నెఱింగికొని తేఁకువ లేకిట వచ్చుటొప్పు నా
యుల్లము శంకితం బగుచు నుండఁగ వేగిరపాటు మేలె నీ
వెల్ల నెఱుంగ జెప్పుడెడ యిచ్చుట యుక్తము నాకుఁ జూడఁగన్. 165

వ. అని యొడంబఱిచి కొండొకకాలం బెడ వలికికొని యింద్రాణియు మగుడం జను
దెంచె సురగణంబును మునిజనసహితంబుగ విష్ణుదేవుపాలికి రహస్యవృత్తిం
బోయి జిష్ణునిమరితంబు వాపుటఁ గోరిన శౌరి కరుణాయత్తచిత్తుం డై. 166

క. హయమేధంబున నాకుం, బ్రియ మొనరింపంగ వృత్రభేదికిఁ బుణ్యో
దయ మగు నావుడు వారలు, రయమునఁ జని రందఱుం బురందరుకడకున్. 167

ఇంద్రుఁడు నహుషుతేజోవిశేషంబు సూచి మఱుఁగుపడుట.

క. చని యచ్చోని నశ్వమేధంబునఁ గల్మషరహితుఁ జేయఁ బురుహూతుండుం
దనపురికి నరిగి నహుషుం, గని తత్తేజోవిశేషకంపితుఁ డయ్యెన్. 168

వ. ఇట్లు వృత్రారి తన బ్రహ్మహత్య వాయుటయే కాని నహుషునంతబలంబు శేమిం
జేసి భయాకులితచిత్తుం డై. 169

క. ఎంతేసిఁ జనియె నాతఁడు, ఘంటరియును నిమ్మనమున శోకోద్రేకం

బొంది పురందరుఁ డరిగిన, కందువ యే నిక్క మెట్లు గాంతునొ యనుచున్.

వ. నిశాసమయంబున నుపశ్రుతి నారాధించినఁ దదీయాధిదేవత నీసత్యంబువలన నీమగనిం గను మని చెప్పి యనంతరంబు సాకారయై పొడసూపినఁ బౌలోమి యీ వెవ్వర వని యడిగిన నది నాను భవత్పాతివ్రత్యశౌచంబులకుఁ బ్రియంబంది వచ్చితి నుపశ్రుతి నని చెప్పి నీకుం బాకశాసనుం జూపెద ర మ్మని తోడ్కొని హిమవంతంబునుత్తరంబున ముంజవంతం బనుమహాశైలంబున కరిగి దాని యందు శతయోజనవిస్తీర్ణం బై నయొక్క సరోవరంబు సొచ్చి యచ్చట నుల్లసిల్లు పంచవర్ణకమనీయంబు లగుకమలంబులలో నొక్క నాళంబు భేదించి ముందటఁ బ్రవేశించె నింద్రాణియుం దోడన చని తదీయతంతుమధ్యంబున సూక్ష్మరూపంబున నున్నసురపతిం గన్నంత నయ్యుపశ్రుతి యదృశ్యం బగుటయు. 171

క. పతిసన్నిధి నడఁగి మహా, ద్యుతి నందెదుటఁ జని తదీయపూర్వసుకర్మ
స్తుతి సేయుచు నిలిచిన నతఁ, డతివం గని సంభ్రమాదరాత్ముం డగుచున్. 172

ఉ. ఇచ్చట నేను నిల్చుటది యెట్లు తెలింగితి వన్నఁ గాన నీ
వచ్చిన కార్య మేమి యనవద్యగుణోత్తర చెప్పు నావుడుం
బొచ్చెము లేక యానహుషుఁ బోయిన పోకలు వానికిం దగం
జెచ్చెరఁ గాలయాపనము సేసినభంగియుఁ జెప్పె దేవియున్. 173

వ. చెప్పి యుపశ్రుతి తెఱంగును నతని కెఱింగించి దేవా నీవిత్తఱిం బ్రకాశుండ వై భవత్ప్రతాపంబున నహుషునకుఁ బరాభవం బొనరించి నన్ను రక్షింపక తక్కి నక్కియుం డగునతనిపాపనిశ్చయంబున నాపద వచ్చు ననిన విని వల్లభకు దివి వల్లభుం డి ట్లనియె. 174

క. అనహుషుబాహుగర్వ మ, నూనం బై యున్న యది సకముజ్జ్వలమునివి
న్యాన ప్రవృద్ధ మగుటను, దానం గాలంబు వేచెదను జయమునకున్. 175

చ. తఱి యగునంతకున్ రిపునిదగ్రత నెంచుట సిరి నీవు నా
కఱిపినయట్లు చేయుము తగం జని యాతనిఁ గాంచి నన్ను నె
త్తెఱఁగున నైనఁ బొందఁగ మదిం దలపోసెదు కన్యకానినీఁ గ్ర
చ్చఱ మునివర్గవాహనుఁడ వై చనుదె మ్మను మంతఁ దీఱెడున్. 176

ఆ. అనిన నట్ల కాక యని పతి వీడ్కొని, యింతి నహుషుపాలి కేఁగుదెంచె
నతఁడు దమక మడర నద్దేవిఁ బెద్దయు, నాదరించి యిష్ట మడుగుటయును.

వ. ఇంద్రాణియు నిట్లనియె మున నిరూపించినసమయంబునకుఁ గొంచెపుతడవు గలదు కాలం బగుటయు నిన్ను వరియించెద నీవు మహామునివాహనుండవు గా వలయు నది నాకుఁ బ్రియంబు నీకు ననన్యసామాన్యం బైనయానంబు తేజోవిశేషకరం

బగు నని నప్పులోమజకు నహుషుండు ప్రహర్షచిత్తుం డై. 178

తే. ఏను దక్క నోరుల కెవ్వరి కైన న, వ్వాహనంబు నెక్క వశమె నీకు
సమ్మదంబు గాఁగ సప్తర్షిగణము నా, యందలంబు మోవ నరుగు దెంతు.

క. అని వనితఁ బంచి యప్పుడు, మునులం బిలిపించి మార్ఖ్యశమునఁ దనకుఁ దా
హాసముగఁ జేసి యొకింతయు, ననుమానము లేక తిరిగె నతఁ డెల్లెడలన్.

క. చని పౌలోమియు సురగురుఁ, గని నహుషుఁడు వేచి యున్నకాలం బెడ లే
కనిమిషనాథుని కిత్తఱి, ననుగ్రహము సేయ వలయు నవహితబుద్ధిన్. 181

వ. శరణాగత నైన నన్ను రక్షింపు మనిన నతం డిట్లనియె. 182

క. అనహుషునవలన నాపద, రా నీ నాతనికి నాయురత గావింపం
బూని యొనర్చెద వేలిమి, దానన్ మునివాహనత గతస్థైర్యుఁ డగున్. 183

క. వెరవున నీపతియునికియు, నరసెద నని యూఱడించి యప్పుడ యైశ్వా
నరు నర్చితుఁ జేసి పురందరు తెఱఁగుం జెప్పి యతనిఁ దడవం బనిచెన్. 184

అగ్నిదేవుఁ డింద్రుని వెదకి బృహస్పతికిం దెలుపుట.

వ. పనిచిన వహ్నియు వనితారూపంబునం జని మనోగతి యగుటం జేసి సర్వదిశలును భూమ్యంతరిక్షంబులును గిరివిపినంబులును గొండొకసేపునకుం గలయం జూచి సంక్రందను నెందునుం గానక మగిడి వచ్చి వాచస్పతికి నత్తెఱం గెఱింగించి నాకు జలంబులు ప్రవేశింప రామి నంద పరికింప నేర నైతి నప్పులవలన నగ్నియు బ్రాహ్మణులవలన క్షత్త్రియజాతియు నశ్మంబులవలన లోహంబును నుద్భవించె వాని వాఁడిమి యెల్లయెడలనుం జెల్లుఁ దమతమజన్మస్థానంబులయందుం దడంగుం గావున నీళ్లు నాకు సంక్షయంబు సేయుట సుప్రసిద్ధం బనిన విని యనిమిషగురుండు హవ్యవాహను నత్యంతగౌరవంబునం గనుంగొని. 185

మ. సకలస్థావరజంగమంబులు భవత్సాన్నిధ్యమాత్రంబునన్
వికసిల్లుం గ్రతువైభవంబులుఁ జతుర్వేదంబులున్ నీవ పా
వక నీయంద జలంబులుం గలిగె విశ్వవ్యాప్తిమై నున్న నీ
కొకచో నెట్టు లగమ్య మయ్యె నిను నీ వూహింపు మెం పారఁగన్. 186

ఉ. ఏనును బ్రాహ్మమంత్రముల నెంతయు నీ కభివృద్ధిఁ జేసెదం
గాన విశంకతన్ సలిలగామివి గ మ్మనినం గృశానుఁడుం
బూనిక నేఁగి వారినిధిభూరినదీసరసీతటాకసం
తానము రోయుచుం జని శతక్రతుఁ డున్నసరోవరంబునన్. 187

ఉ. అంబురుహంబులం గలయ నారసి చొచ్చి యొకండు నాళసూ
త్రంబున నున్నయింద్రుఁ గని రాగమునన్ గురునొద్ద కగ్ని

ఘూర్ణంబున నేఁగుదెంచి తనకున్న తెఱం గెఱిఁగింప నాతఁడు
ల్లంబున నుల్లసిల్లి సురవరుల్ మునులం దగఁ గూడి గ్రక్కునన్. 188
మ. దివిజాధీశ్వరుపాలికిం జని కృతార్థీభూతచేతస్కుఁ డై
వివిధస్తోత్రపరంపరాచతురవాగ్విన్యాసతం బ్రీతుఁ జే
సి వరిష్ఠం బగుసీమకృత్యము సమాశ్వాసింపఁగ నీ వుత్సహిం
పవు నీ కేమిగొఱంత వృత్రవధ మేఁపాపంబు రూపింపుమా. 189
క. శరనిధిఫేనంబున నా, హరి వొందించె జగద్విరోధి యగువృత్రునిఁ దాఁ
బరిమార్ప నీకు విజయము, దొరకొనియెం గాక దీనఁ గ దోసము గలదే. 190
వ. అని సముచితంబుగా సంబోధించిన సురసంభాషితంబుల నిర్దోషితుం డయి నిజరూపంబు వహించి సకలసురమునోముఖసహితంబుగా నతని సంభావించి జంభారి కర్తవ్యం బెయ్యది యని యడిగిన నాచార్యుం డితం డెఱింగినను విస్పష్టంబుగా నహుషువృత్తాంతం బంతయు వివరించెదం గాక యని తలంచి యి ట్లనియె. 191
క. నాఁ డట్లు నీవు నీ దగు, పోఁడిమి సెడి యడఁగుటయును భువనంబుల
వ్వాఁడును రక్షకుఁ డయ్యెడు, వాఁడిమగఁడు లేమిఁ ద్రిదశవర్గము మునులున్.
ఉ. ఒండొరుచేతఁ బీడ వడ నోపక రక్షకుఁ డైనవాని నా
ఖండలతుల్యు నేమిగతిఁ గాంతు మొకో యను చున్నచోట ను
ద్దండబలాఢ్యుఁ డై కరతుల్యము శతక్రతురాజ్యము గాని నేల స
మ్యం డిదు సమర్థుఁడే యనుచు నొల్లరు దివ్యులలోన నెవ్వరున్. 193
వ. అట్టిసమయంబున మునిజనసహితంబుగ ననిమిషులు నహుషుకడకుం జని మనంబుల నునుజుం డనునవమానంబు దక్కి యతని నింద్రపదవిఁ బరిపాలించుటకుం బ్రార్థించిన నతండును దాను హీనబలుండ నని శంకించినం దమతమతేజంబుల యంశంబు లతని కొసంగి శక్తిమంతుం గావించి యభిషిక్తుం జేసిన. 194
క. మహాసీయభవత్పదవీ, మహితుం డై నహుషుఁ డేచి మదమున ధర్మ
స్పృహ దక్కి తన్ను నిప్పుడు, వహాయింపఁగ నన్నుసింద్రవర్గముఁ బనిచెన్. 195
ఆ. ఇదియ కాదు మఱియు నెన్నియు దుర్నయములు గలవు వాని గలసి నిన్ను
వెదక వచ్చితిమి వివేకహీనుం డగు నతనిఁ జెఱుప నిప్పు డవసరంబు. 196
వ. అది యెట్లం టేని వినుము నాఁడు హరిపంపునం జేసినయశ్వమేధంబున నీ వపగతకల్మషుండ వై నను నహుషునకుఁ దేజోహాని లేమిం జేసి యతని నాక్రమింప రాదయ్యె నిప్పుడు మహామునుల నధఃకరించి యతండు నిస్తేజుం డై యున్నవాఁడు గావున నీచేతం జెడు నట్లగుటయుం దురగమేధఫలపరిపాకంబయుం గాన నుత్సాహంబు సేయు మనుచున్నసమయంబున యమవరుణకుబేరులు సోమసహితంబుగా నరుగుదెంచి పురందరుం గాంచిన నతండు ప్రియం బంది యప్పటికార్యంబు తెఱంగు

వారల కెఱింగించి తగినసంభాషణంబుల వారలం బ్రియచేతస్కులం జేసి దృష్టి
విషదుస్సహుం డైన నహుషు గెలుచునుపాయంబు విచారించునవసరంబున 197

క. కష్టుం డగు నానహుషుఁడు, నష్టాత్మకుఁ డయ్యె దివిజనాయక నీయు
త్కృష్టచరితమున సురలకుఁ, దుష్టిగ నిజరాజ్యసంగతుఁడ వగు మనుచున్. 198

క. మునివరుఁ డైన యగస్త్యుఁడు, సను దెంచిన శచిముఖుండు సమ్ముఁ డుచితా
సన మిడి యర్ఘ్యముఁ బాద్యము, నొనరిచి యిట్లనియె సవినయోక్తి నతనితోన్.

ఆ. అధికవిభవ మెసఁగ నసమానశక్తిన, నాథుఁ డగుచు నున్న నహుషుఁ డిప్పు
డేమికతన భాగ్యహీనుఁ డై యుజ్జ్వల, శ్రీ పాసెంగె మునివరేణ్య చెపుము.

అగస్త్యుఁ డింద్రునకు నహుషుభ్రష్టతఁ జెప్పుట.

వ. అనిన విని యమ్మునీంద్రుం డిట్లనియె నన్నహుషుని పాఁచి వేసరు చున్నమును
లతనికడ గోష్ఠీవినోదంబుల నుండి బ్రాహ్మణంబు లయినమంత్రంబులు
గోసంప్రోక్షణంబునందుఁ జెప్పంబడి యుండు నవి నీకుఁ బ్రమాణభూతంబు
లగునే యని యడిగినం బాపనిశ్చయుం డై యవియం దమ్మంత్రంబులు ప్రమా
ణంబులు గావనిన నే నమ్మాట నిషేధించి పూర్వాచార్యులచేత నభినందితంబు
లగుమంత్రంబులు నిందించుట యజ్ఞానం బని వివాదంబుసేసిన నతండు కోపించి
మదీయమస్తకంబు దన్నిన నతనిం గనుంగొని పుణ్యహీనుండును దేజోహాని
దీనుండును నగుట యుపలక్షించి నీవు పూజనీయు లయినమహామునుల నిన్ను
వహింపం బనిచితి వారలు గొనియాడుమంత్రంబులు గర్హించి తిదియునుం
గాక నన్ను నవమానించితి గావున నింద్రపదభ్రష్టుండ వై బహుసంవత్సరం
బులు భూలోకంబున నురగరూపంబున నుండు మని శాపం బిచ్చి పదంపడి
యనుగ్రహించి భవదీయవంశజాతుం డయి యజాతశత్రుం డనుపేరు గలిగి
యుధిష్ఠిరనామధేయుం డైనయొక్కసత్పురుషునిసందర్శనంబున దురితంబులం
బాసి పుణ్యలోకంబు వడయువాఁడ వనినం దత్క్షణంబ. 201

క. స్వర్గపరిభ్రష్టుం డై, దుర్గతికం బోయె నతఁడు దుష్టాత్మునకున్
దౌర్గత్యము సుజనులకు న,నర్గళసద్గతియు నగుట యరుదే యెందున్. 202

మ. అనినన్ దేవతలుం దపోధనులు నత్యానందముం బొంది రా
మునిఁ బూజించె నమర్త్యనాథుఁడు మనోమోదంబు సంధిల్ల న
య్యనురాగంబు చరాచరంబులకు హృద్యం బయ్యె సర్వాప్సరో
జనముం గౌశికుఁ గాన వచ్చె సుభగైశ్వర్యంబు శోభిల్లఁగన్. 203

వ. తదనంతరంబ. 204

ఉ. పావకుఁ డాదిగా దిగధిపాలురుఁ గిన్నరసిద్ధసాధ్యులున్
దేవగురుండుఁ దోన చనుదేరఁగ వైభవ ముల్లసిల్ల

రావణునంతి నెక్కి యమరావతికిం జని యింద్రుఁ డోడి యీ
దేవియుఁ దాను మోదమునఁ జేరె సభీష్టవినోదలీలలన్. 205
వ. ఇవ్విధంబున మహానుభావుం డగునహుషేంద్రుండు. 206
క. ఆజ్ఞాభంగం బయినం, బ్రాజ్ఞేతగునట్లు దుఃఖపడి యుండఁడె తా
నజ్ఞాతివాసమును గా, లజ్ఞతఁ జలుపండె యన్యులకు వగ పేలా. 207
క. కావున మీరుపడినయర, ణ్యావాసక్లేశమునకు నజ్ఞాతవిధిన్
సేవకుల రైనదానికి, నోవకుఁడీ మీరు లఘుమనోవృత్తుల రై. 208
వ. అని యిట్లు సెప్పి శల్యుండు సభాసదులం గలయం గనుంగొని. 209
ఉ. కౌరవనాథుఁ డానహుషుకైవడి నాశముఁ బొందు వాసవ
శ్రీరమణీయుఁ డై జయముఁ జేకొని ధర్మజుఁ డంబురాశివే
లారశనాసముజ్జ్వలవిలాసమనోహరమేదినీవధూ
సారసమగ్రభోగసముపస్థితిఁ గెక్కొనుఁ దానుఁ దమ్ములున్. 210
వ. అని పలికి పెండియు నతండు పాండవాగ్రజున కిట్లనియె. 211
క. సౌఖ్యంబులు పొందు జగ, త్ప్రఖ్యాతులుఁ జెందుఁ దగఁ బురందరవిజయో
పాఖ్యానము విన్నను ద, ద్వ్యాఖ్యానము సేసినను జనావలి కనఘా. 212
క. మోహరము నడచు చుండఁగ, నీహారవిజయంబు వినుసురేంద్రుఁడు రిపుసం
దోహంబు గెల్చుటకు సం, దేహం బింతయును లేదు ధీరవిచారా. 213
అనిన విని ధర్మనందనుండు మద్రపతిం బ్రస్తుతించి మహానుభావా భవదీయభాషణ
శ్రవణంబునఁ జిత్తంబు కలంక దేఱె నని సంభావించి యతనికి సముచితంబు
లగుమజ్జనభోజనంబు లొనరించి యనంతరంబ యతండు పయనంబునకు
నుద్యోగించిన. 214
ఆ. అతని ననుప నేగి యధికసంప్రీతి నే, తెంచునప్పు డయ్యుధిష్ఠిరుండు
రణములోన మీరు రాధేయుఁ బలుకుట, మఱవకుండవలయు మమ్ముఁ దలఁచి.
క. అనుటయు మద్రేశ్వరుఁ డా, తని సూడఁ బలికి గాఢతరముగ నాలిం
గన మొనరించి చనియె హ, స్తినాపురికి బలముతో నతిత్వరితగతిన్. 216
వ. అట్టియవసరంబున. 217
మ. సకలారాతిభయంకరుం డగుచు నుత్సాహంబు వాటించి సే
లకు శ్రేంగయ్యెడుభంగి వచ్చె రణలీలాకౌతుకం బొప్పఁ దా
నొక యక్షౌహిణితోడఁ బాండవబలం బుల్లాసముం బొంద సా
త్యకి బాహాబలగర్వనిర్వహణవిద్యాప్రౌఢిసంరూఢుఁ డై. 218
వ. అంతం జేదిపతి యగుధృష్టకేతుండును జరాసంధనందనుం డగుసహదేవుండును
నై యొక్కొయక్షౌహిణితోడం జనుదెంచిరి సహోదరులు లేవు రగుకేకయ

పతులు నేకాక్షౌహిణీసమేతు లై యేఁగుదెంచిరి తదనంతరంబ. 219

క. కొడుకులుఁ దానును గుఱ్ఱపు, దడములఁ గపిఘటల భటరథవ్రాతములం
బుడమి చలింపఁగ ద్రుపదుఁడు, గడువేడుకఁ దోడు సూపెఁ గౌంతేయులకున్

వ. అదియును నొకయక్షౌహిణికిం గలిగి యొప్పె నయ్యవసరంబున ననుజతనుజ సమేతుండును బార్వతీయమహీపాలసహితుండును నై యొక్కయక్షౌహిణి యొడ్డనంబు దీర్చి. 221

క. చిందములఁ బ్రోతఁ బగతుర, డెందంబులతోడ దిక్తటీసంధులు సం
దంద పగులంగఁ గుంతీ, నందనులకుఁ దోడు మత్స్యనాథుఁడు సూపెన్. 222

వ. పాండ్యవిభుండు లోనుగాఁ బలుదెసలనుండి వచ్చినబలం బొక్కయక్షౌహిణికిం గలిగి యొప్పె. 223

క. ఏడక్షౌహిణు లిమ్మెయిఁ, గూడెం బాండునృపసుతులఁ గ్రూరాహవసం
క్రీడావినోదమునకుం, దోడుపడం బూని యతిశుభతాసాలవృత్తిన్. 224

వ. ఇవ్విధంబునం గూడి పెరిఁగి యుధిష్ఠిరుసైన్యంబు గయ్యంబునకుం గాలుద్రవ్వుచు నుండె నంత నక్కడం గరాత్మకాంచనసైన్యనిచయంబులం గూర్చుకొని సమరంబునకు నమరి యొక్కయక్షౌహిణి గలభగదత్తుండు సుయోధనుం గలసె భూరిపరాక్రముం డయినభూరిశ్రవుండును మహాబలుం డయినశల్యుండును నేకాక్షౌహిణీసమేతంబుగా నేతెంచిరి వారలయట్ల సన్నద్ధుఁడై కాంభోజనాథుం డైనసుదక్షిణుం డనుయవనేశ్వరుండును వచ్చె నట్టియంగున సముత్కటు జయద్రథప్రముఖు లైనసింధుసౌవీరపతు లరుగుదెంచిరి మాహిష్మతీపతి యగునీలుండు యాదవవీరుం డగుకృతవర్మయు నవంతీశ్వరులు సోదరులు నగువిందానువిందు లిరువురును గా నిన్నలువురు నొక్కొక్కయక్షౌహిణితోడఁ జనుదెంచిరి మఱియును బలుదెసలనుండి వచ్చి కూడినవాహినులు మూఁడక్షౌహిణులునుం గలిగె ధార్తరాష్ట్రులకుఁ దోడుపడం బూనినయవి పదునొకండక్షౌహిణు లయ్యె నట్టియెడ.

క. సవరణల నొప్పి యసిఁ బాం, డవబలముల మూఁకలం గదడంగుచు నత్యు
త్సవమునఁ బేర్చినసేనల, కవకాశము లేదు విడియ హాస్తిపురమునన్. 226

క. నానాముఖముల విడియం, గా నియమించెను బలంబుఁ గౌరవపతి యా
సేనలవారలకు నిలువఁగ, నైనను నెడ లేమి నధికహర్షం బెసఁగన్. 227

వ. ఇత్తెఱంగునం గురుజాంగలంబున రోహితకారణ్యంబున మరుదేశంబున నహిచ్ఛత్త్రంబునఁ గాలకూటంబున గంగాకూలంబున వారణావతంబున వటస్థానంబున విచ్చలవిడి విడిసి ధనధాన్యాదిసమస్తవస్తువులకలిమిం జేసి యెలమిమిగిలియున్నంత.

క. పాంచాలమహీవల్లభు, పంచినభూదేవుఁ డుచితరథంబున నగరి కే
తెంచి ధృతరాష్ట్రుఁ బ్రీతిం, గాంచి కృపద్రోణవిదురగంగాసుతులన్. 229

వ. వారివారిమందిరంబులకుం జని కని సముచితాలాపంబులం బ్రసన్నచిత్తులం జేసి దుర్యోధనుసందర్శనంబును నిర్వర్తించి నిత్యనిపుణారాధనంబున ధృతరాష్ట్రు నభిముఖుం గావించి యొక్కనాఁ డక్కౌరవేశ్వరుపేరోలగంబున సమస్తసేనా పతులం గలయం గనుంగొని యిట్లనియె. 230

సీ. ధృతరాష్ట్రపాండుభూపతులు సహోదరు, లగుటయు వారలయాత్మజులకుఁ
దమతమతండ్రులరక్షణములు గైకొనఁ, దగుటయు మీకు నందఱకుఁ జూడ
నుచితంబ కాదె యట్లుండఁ బొల్లింటిచందంబును మనకుఁ దెల్లంబ కాదె
ప్రాణగొడ్డము లగుపనుల వారలఁ దీర్పఁ, దలఁచినఁ బుణ్యంబుకలిమిఁ జేసి
తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవిఁ బొంది
యున్న వంచనమెయి మహిఁ గొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్య
కొనియె నీపెద్దరాజు నే మనఁగ నేర్తు. 231

శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలో నవ్వారలుం జూడఁగాఁ
జీరల్ ప్రోవులు గాఁగ నొల్చుటయు లచ్చిం బుచ్చికోలుల్ మహో
గ్రారణ్యస్థలి నిల్వఁ బంచుటయు దైన్యవ్యక్తిమీపల్కులుల్
సైరింపం జనుపాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే. 232

క. వీరలవృత్తముఁ బొందుకు,మారులవర్తనము తెఱఁగు మాత్సర్యము తే
టారసి ధృతరాష్ట్రునకున్, గౌరవమున బుద్ధి సెప్పఁ గాఁ దగు మీకున్. 233

తే. పాండవులు కౌరవులతోడి పగకు నొల్ల, రఖిలభూప్రజనాశన మగుటఁ జేసి
వార లసదని తలఁపంగ వలవ దధిక, ధర్మపరులైన కతమునఁ దగవు నడచె.

వ. అందుఁ గూడినవి యేడక్షోహిణు లిందుఁ గూడినవి పదునొకం డక్షోహిణు లని తలంతు రేని వినుండు. 235

క. బాహుబలఘనుఁడు భీముఁడు, సాహసరసికాత్ముఁ డయిన సాత్యకియు మహో
గ్రాహవభూమి సహస్రాక్షోహిణు లట్లగుట మీరు సూడరె యెందున్. 236

క. గాండీవధన్వునాహవ,పాండిత్యముఁ దలఁప నతని భండనమున మా
ర్కొండు నని యొకఁడు గడఁగుట, కొండం గని తగరు దాఁకఁ గోరుట గాదే.

క. బీభత్సునిఘోరభు,జాబలమును మఱి వారి శౌర్యము శరవి
ద్యాబహుళతయును బందికి, నైబవరముఁ జేసినట్టిహరుఁడ యెఱుంగున్. 238

వ. అదియునుం గాక. 239

మ. వివిధోపాయపరాయణుండు త్రిపురదోర్వీర్యాపహారక్రియా
ప్రవణోద్యోగుఁడు మంత్రరక్షణకళాప్రావీణ్యగణ్యుండు దై
ర్యవివేకాదిగుణోత్తరుం డఖిలవిద్యాజాలసంవేది మా

ధర్మజుఁ డాదిక్కకు పాండవేయుల కసాధ్యం బెద్దియుం గల్గునే. 240

ఆ. అదను దప్పకుండ నస్మద్ధితాత్ముల నెమ్మిఁ, బిలువఁ బంచి హితము (?) యము రెండు
పక్షములకు నగుట పాటించి తగవుమైఁ, గొంతభూమి యిచ్చి కూడిమనుఁడు.

చ. అనవుడు భీష్ముఁ డిట్లనియె నక్కట భాగ్యము గాదె పాండునం
దను లోకయాపదం బడక ధర్మగతిం దగ నందఱుం సుహృ
జ్జనులను గృష్ణునిం గలసి సమ్మద మొందుటయుం బ్రశాంతిమై
మనముల నీను దక్క మృదుమార్గము వట్టుటయుం దలంపఁగన్. 242

క. నీవాక్యము విప్రస్వా, భావిక మైయుండ్లు శ్రుతికిఁ బరుషం బైనన్
భావింపఁ గార్యమునయుం, దేవిధమున సభకు నింతయిష్టం బగునే. 243

చ. సమయము యూఁది పాండవులు శత్రులచాడ్పున నిందు నాఁడు ప
న్నము వడి చన్న దైన్యము వనంబునఁ బడ్డవిషాద వేదనా
శ్రమము విరాటువీట లఘుసంచరణంబున దాఁగి యున్నదుః
ఖమును జగం బెఱుంగదె యుదక్లమలం బఱుపంగఁ బాడియే. 244

క. పితృధన మగుపా లుచితి, స్థితి వారల కిచ్చి నిర్విశేషుం డై యీ
పతి లోకము మెచ్చఁగ నిజ, సుతనివహమునట్ల వారిఁ జూడఁగవలయున్. 245

వ. అట్లుం గాక. 246

చ. కడవఁగ జూద మాడి యప్పుఁ గాదన సేరక సత్యభాషణం
బెడలిన వచ్చుధర్మగతిహీనత కోర్వక రాజ్యహీనతం
బడుటకు నోర్చి ధర్మజుఁడు పంచిన నైరణ సేసెఁ గాక క
వ్వడి నెఱిగిన్క కెట్టిమగ పాఁడును నోర్తురె యుద్ధగంబులన్. 247

వ. అనిన విని కర్ణుండు కనలి యిట్లనియె. 248

క. జను లెల్ల నెఱుంగినయిూ, పని యేటికి నుగ్గడింపఁ బలుమఱు దుర్యో
ధనునకయి శకుని జూదం,బున మేదిని గెలిచె ధర్మపుత్త్రుం డోడెన్. 249

ఆ. దీన క్షేమితప్పు కానకు నేఁగిన, యతఁడు సమయవృత్తి నాక్రమించి
తండ్రి పాలు మాకుఁ దగు నంచు నడియరి, తినము సేసి రాక తప్పు గాక. 250

క. విరటుఁడు ద్రుపదుఁడుఁ దోడుగ, బరవసమున నెత్తి విడిసి బలిమి నడిగినం
గురుపతియు వెఱచి యిచ్చునె, ధరలోఁ జక్కనగ మిట్టితగవులు గలవే. 251

వ. అనిన గాంగేయుండు గటకటంబడి కర్ణున కిట్లనియె. 252

ఉ. చిక్కనిపోటుమాని సింవిర సీ వినువారలు నవ్వ నేమిగా
నక్కడుమాట లాడెద వహీనపరాక్రమశాలి యర్జునుం
డొక్కఁడ యూర్వరన్ మనల నుగ్రరణంబున గెల్చె నిన్న నేఁ
డిక్కడఁ బల్కులన్ గెలిచె దీవతనిన్ మనరాజుకొల్వునన్. 253

డిన నిక్కం బగునల్క నర్జునుఁడు గాండీవంబు మోపెట్టఁ గృ
ష్ణునిసారథ్యము నై జగత్త్రితయసంక్షోభంబు గాకుండునే. 266

తే. అలఘుగదఁ బూంచికొని భీముఁ డతిరయమునఁ
గురుకుమారులపైఁ దీవ్రకోప మెసఁగఁ
గవియు టొత్త భావించినఁ గంప మడఁగు
నిక్క మెవ్వరు మార్కొని నిలుచువారు. 267

సీ. కవ లగ్రజన్ములకంటె నేమిటఁ గీడు, ద్రుపదుఁ డల్లుండె తత్సుతులు బాహు
గర్వసమగ్రులు గారె విరాటుండు, నాతనితమ్ములు నాత్మజులును
నసదులే సాత్యకి యలఁతులఁ బోయెను, వాఁడె వృష్ణికుమారవరులు లనేక
లక్షయోధులు పోర సరవాయి గొందురే, పాండ్యుండుఁ గేకయపతులు నాది

తే. మైనబంధులు మిత్త్రులు నగ్గలికలఁ, గొఱఁతవడియెడువారె యంతటను గెల్వ
నోపినను రుద్రునకు నైన నోర్వరాని, ధర్మపుత్త్రుకోపమునకుఁ దలఁక వలదె.

వ. అని పలికి సంజయుదిక్కు మొగం బై యుల్లవారును విన ని ట్లనియె. 269

తే. నీవు ధర్మజుపాలికి నెమ్మి నరుగు. మతఁడు పేరోలగం బున్నయవసరమునఁ
గాన్పు మతనికి ననుజవర్గంబునకును, బంధులకు నింపు పుట్టంగఁ బలుకు మచట.

క. నెయ్యము వాటించి కడుం, దియ్య మెసఁగ నబుక తెల్లఁ దీఱునటులుగాఁ
గయ్య మనుతలఁపు లోనుగ, నయ్యమనందనుఁడు మానునట్టి తెఱఁగునన్.

సంజయుఁ డుపప్లావ్యంబున నున్నపాండవులకడకు వచ్చుట.

వ. కాంతిప్రకారంబునం గార్యంబు నడపి యొక్కటియై మనుట యొడఁగూర్చి రమ్ము
రథం బెక్కి పొమ్మని తగిన తెఱంగున నీడ్కొలిపిన సంజయుండును జని యుపప్లా
వ్యంబు సొచ్చి మాధవుమందిరంబున కరిగి యభ్యంతరవినోదంబుల సరసహితుం
డై యున్నయన్నారాయణునకుం దనరాక యెఱింగించి పుచ్చి తగఁ బ్రవేశించి
భయభక్తివినయసంభ్రమంబులు మెఱయ వారలం గాంచి యమ్మహాత్ము లిరువుర
సంభావనంబులును సంభాషణంబులునుం బడసి సంప్రీతచేతస్కుండై మఱునాఁడు
ధర్మతనయునోలగం బున్నసమయంబు వేచి సముచితంబుగా నతనిం గని
సాష్టాంగంబుగాఁ బ్రణమిల్లిన నతండును బ్రియపూర్వకంబుగా నాదరించి సమీ
పంబున నునిచినం గొలిచి యుండి యతని కిట్లనియె. 272

తే. భాగ్యమున నిన్నుఁ గనుఁగొనఁ బడసి నాఁడు
చూడ్కి చరితార్థమయ్యె నకలలోకపుణ్య
ధనుఁడు మీతండ్రి ధృతరాష్ట్రధరణినాథుఁ
డిందు మీయున్కి విని ప్రియ మెసక మెసఁగ. 273

క. అనుజులు నీవును ద్రోపది, యును బుత్త్రచయంబు నున్నవె యోగక్షేమం

బునతెఱఁగారయఁ బుత్తెంచె నితాంతస్నేహపూర్ణ। చేతోవృత్తిన్ 274

వ. అనిన సూతనందనునకు ధర్మనందనుం డిట్లనియె. 275

క. ఆరాజు మాదెసం గల, కారుణ్యముకతమునను సు।ఖంబున నిట్లు
న్నారము నినుఁ బుత్తెంచిన, గారవమున నాదుమది వి।కాసముఁ బొందెన్. 276

క. అమ్మనుజేశ్వరునకు సే, మమ్మే పుత్రకులు సుఖులె। మనుమలు సమ్మో
దమ్మునఁ బెరిఁగెదరే నగ, రమ్ముల భూములను శుభప।రంపర గలదే 277

సీ. ద్రోణుండుఁ గృపుఁడును। ద్రోణసుతుండును, సుఖమున్నవారె సు।శ్లోకుఁడైన
భీష్ముండు కుశలియే। పెద్దతనం బిచ్చి, యాతనిఁ గౌరవు। లనుసరించి
మెలఁగుదురే బ్రాహ్మ।ణులకు మన్నన గల్గి, యుండునే నే మర్థి। నొసఁగినట్టి
వృత్తులు సెల్లునే। యొల్లొరు వాండుల, వలనఁ బుట్టదు గదా। కలఁకులందుఁ
తే. బుట్టినప్పుడు గాండీవి।భుజబలంబు, దలఁతురా భీమసేనుగ।దావిహార
ముగ్గడింతురె కవలు మ।హోగ్రరిపుల, భూము లంతంత కొత్తుట। పొగడఁబడునె.

మ. ఒకనాఁడా తమముందటం బలుమఱుల్। పోరాటమై నేల యొ
త్తికొనంగా బవరంబులన్ గెలువఁగాఁ। దెల్లంబుగాఁ జూచి పాం
డుకుమారాళి నుతింప కుందుదురె యా।కోపంబునన్ ఘోషయా
త్రకు గంధర్వులు వచ్చినప్పటిచరి।త్రం బాత్మలం బాయునే. 279

క. వినుము మనము మధ్యస్థుల, మని నర్జును నెదిరి సంజ।యా యిట మున్నె
వ్వనికిని మానముఁ బ్రాణం, బును దగఁ దక్కించుకొనఁగ। బోలెనె చెపుమా,

క. దుర్యోధనునింటం దగు, కార్యమునకు ఖడ్గమునకుఁ। గలవాఁడై చా
తుర్యంబు మెఱయుకర్ణుని, యార్యత్వము సెల్లు చున్న।యది యే నెమ్మిన్. 281

వ. అనిన విని సంజయుండు సవినయంబుగా నిట్లనుఁ గురురాజునొద్ద నవినీతులు నీతిమంతులు సత్త్వసంపన్నులు దురహంకారులు మఱియు వివిధప్రకారులు నయి బెరసి యుండుదురు వారొక్కొక్కమాటలం బోయెడువారు గారు కావున వారి నంత యనం బనిలేదు నావిన్నపంబు చిత్తగింపుము. 282

క. పొం దొందఁగఁ దలఁచితి నీ, విందుశిశిరస్నైనవిమల।హృదయంబున. వా
రందఱకును సేమం బిట, ముందఱ లేకున్న నేఁడు।మొదలుగఁ గలుగున్. 283

క. ధృతరాష్ట్రభూపతికి వృ, ద్ధతకతమునఁ జిత్త మొకవి।రోధము గామి సుతో
ద్ధతి మాన్పఁడ నాఁడు మనసి, ఘతి పిదపం బుట్టి యిపుడు। శాంతుం డయ్యెన్.
తే. ఇట్టిచందంబు లెల్లను। నీవు పుణ్య, చిత్తవృత్తి మై సైఁచినఁ। జెల్లి వచ్చు
నీయజాతశత్రుత్వంబు। నిఖిలలోక, విశ్రుతము గాదె ధర్మప్ర।వీణహృదయ.

చ. జగముల నెల్లెడన్ దురిత।సంతమసంబు జయింపఁ గోరి పా
ల్పుగఁ బరమేష్ఠి నిల్పినవె।లుంగు మహీసురు లట్టివారికిం

దగవు ఘటింప సత్పురుషసత్తము లై చనుజీవనంబు లెం
తగుమతు లైన మాఱ్తురె ప్రమదంపడి యాయువు శ్రీయు నొల్లరే. 286

ఉ. ఒక్కొకచోఁ గడంగి ప్రతియోధులు మార్కొనునప్పు డాత్మలన్
నక్కొని మోములం బొడము నవ్వగతోడ జనంబు లిట్టియం
దక్కట భీముఁ డైన మనయర్జునుఁ డైనను మాద్రిపుత్త్రులం
దొక్కరుఁ డైన నీపగఱ నుక్కడఁగింపరె యొక్కవ్రేల్మిడిన్. 287

క. వారొకయాగ్రహవృత్తిం, గూరియు ధర్మంబు సెడుటకుం జాలదు —
ర్వారబలు లయ్యుఁ బాండుసు, మారులు శాంతాత్ము లండ్రు మనుజాధీశా.

క. నలువురు తమ్ములు భవదా, ప్తులుఁ గృష్ణుఁడు వినుచు నుండ భూవర నీ కేఁ
గొలువునను విన్నవింపం, బలుకులు గల వవధరింపు పరిపాటి మెయిన్. 289

చ. అనపుడు వీరె తమ్ములును నాప్తులుఁ గృష్ణుఁడు వీరె తక్కఁ గొ
ల్వునఁ గలయట్టిసర్వజనులున్ వినుచుండెద రయ్య నిన్ను నే
మను మని పంచెఁ జెప్పు మది యంతయు నేర్పడ నన్న ధర్మనం
దనుగరువంపుఁబల్కులవిరోధంబునకున్ మదిలోన నుల్కుచున్. 290

ఆ. సంజయుండు కృష్ణు సద్భక్తి నీక్షించి, పవనపుత్త్రుఁ బార్థుఁ గవల ద్రుపద
తనయు సవినయమునఁ గనుఁగొని ప్రీతిఁ బాం, చాలు మత్స్యధరణిపాలుఁ జూచి.

వ. సావధానుల రై వినుం డని పలికి యుధిష్ఠిరుదెసకు మోడ్పుఁగేలు నిగిడించి
యి ట్లనియె. 292

ఉ. శాంతతఁ బొంది కార్యముదెసన్ ధృతరాష్ట్రమహీశుఁ డాత్మ న
త్యంతముఁ దేజి నన్నిట ప్రియంబునఁ బంచెడునప్డు నాకుఁ దే
రెంతయు వేడ్కఁ దాన వెర వేర్పడఁ జెప్పుచుఁ బన్నఁ బంచె ని
ట్లింత ఘటించెఁ బొందు మన యీపదనం దెలివొందఁగాఁ దగున్. 293

క. చులుకని కార్యము సేయం, దలఁచుట మీయట్టిసర్వధర్మజ్ఞులు శాం
తులు నన ప్రసిద్ధు లగుపె, ద్దలకుం దగ వగునె యెవ్విధంబునఁ జూడన్. 294

ఆ. మడుఁగుఁజీరయందు మసి దాఁకినట్లు మీ, సత్కులమునఁ గల్మషంబు కౌర
వేంద్రుకతసఁ బొందె నింతయుఁ బాపంగ, నీవ నేర్తు కార్యనిపుణహృదయ.

చ. అఖిలజనక్షయం బయి జయాపజయంబులు రెండునుం దుదిన్
సుఖములు గానియాపనికిఁ జొత్తురె యుత్తము లట్లుఁ గాక యా
నిఖిలసుఖంబు లేమిటికి నీ వని వృద్ధజనంబు బాలురన్
సఖులను బంధులన్ గురులఁ జంపితి యేని దయాపయోనిధీ. 296

ఉ. పెట్టనికోట నీకు హరి భీముఁడు నర్జునుఁడున్ రణంబునం
దొట్టినమంట లాకొలఁదియోధుల సాత్యకియున్ విరాటుఁడుం

జట్టపు మేరు వ్యగ్ర రణశోభితుఁ డీద్రుపదుండు విన్ను నీ
ట్టట్టన వచ్చునే సుతల కైనను నొల్లవు గాక చివ్వకున్. 297

వ. మఱియు నక్కడ. 298

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణశల్యుల
బ్రాణము లాసుయోధనునిపాలివ యందు నిజానుజన్ము ల
క్షీణపరాక్రముల్ సుతు లజేయులు బాహ్లికసోమదత్తు లం
స్థాణున కైన నోడరు వశంబె జయింపఁగ వారి నేరికిన్. 299

ఆ. అధిప యిట్టిమీకు సన్యోన్యకలహంబు, నాకుఁ జూడ మేలకనంగ రాదు
రెండుపక్షములకుఁ బ్రియము హితంబును, నాత్మఁ గోరువారి నడిగి చూడు. 300

వ. అని పలికి సూతనందనుండు గొలువు గలయం గనుంగొని. 301

ఉ. మ్రొక్కెద వాసుదేవునకు మోడ్చెదఁ జేతులు సవ్యసాచికిం
దక్కటిమిత్త్రబాంధవహితప్రియమంత్రివయస్యకోటికిన్
స్రుక్కుచు విన్నవించెద నసూయలు దక్కి యనుజ్ఞ సేయుఁడీ
యుక్కరుణాకరుల్ శరణ మే నిదె వేఁడెదఁ గ్రోధశాంతికిన్. 302

వ. అనుచుం బ్రణామపూర్వకంబుగాఁ బాండవాగ్రజవదనంబునం జూడ్కి నిలిపి
దేవా యుపశమించుట లెస్స యిమ్మెయికిం గురుపితామహుండును సంతసిల్లు
నాతని కనుమతం బయిన తెఱంగు సర్వలోకసమ్మతం బగు నన విని ధర్మనంద
నుం డి ట్లనియె. 303

ఉ. నెయ్యము దప్ప నొండొకటి నీచెవి సోఁకెన నాదుపల్కులం
దియ్యెడ సంజయా యనికి నిమ్మెయి నక్కడ నీవు మాకుఁ దాఁ
గయ్యము దక్కి మన్కి తగుకార్యము గాదొకొ పోరితంబు లే
కయ్యెడునర్థసిద్ధి వెడఁ గైనను నొల్లక యొండు సేయునే. 304

క. జనులకు నెల్లను బథ్యము, లనఁగా ధర్మానుగతము లగు ననఁ బోగడం
జనుపనులు సేయుభీమా, ర్జునులే దుష్కర్మములకు రోయని వారల్. 305

క. మది సుఖము గోరి దుఃఖం, బొదవం గలకార్యములకు నుత్సాహమ్ము సే
యుదు రొప్పనితృష్ణం బడి, చదు రేమియు లేనియట్టిజను లాతురులై. 306

ఆ. యోగ్యతృష్ణదారు లుచితంపుఁ గోలఁదిమై, నడచినట్టివారు చెడిదములకు
సంత సొత్తు రెట్లు సంతాపకారుల, కాక పెనఁకువలు సుఖంబు లగునె. 307

వ. భోగంబులు వలదా యని తలంతు మేని. 308

తే. వస్త్రమాల్యానులేపనావసరములును, జతురపూర్వత్రయంబులసమయములును
నేను వెలిగాఁగ మాతండ్రి కెంచు నెట్లు, పుత్త్రు లన బట్టి మ మ్మేలఁ బోవఁ ద్రోచు.

వ. అయినను నొకమాట సెప్పెద సముచితుండ వై విను మని యి ట్లనియె. 310

క. తానైన నప్పుడు వక్రం, బై నీతిపథంబు విడుచు నక్కట పతి మ
మ్మైనను జక్కని తెరువునఁ, బూని నడపుఁ డనుచు నిప్పుడు బుద్ధులు సెప్పెన్.

క. ఎదిరిం దమయట్టులకా, మదిఁ దలఁచినఁ బొసఁగుఁ గాక మాకుం గుడుమిఁ
డిదె మీరు వ్రక్కఁ గొనుఁ డని, చదు రడిచిన మనసుపొందు చక్కంబడునే. 31

వ. అని చూపి చెప్పి వెండియు.

ఉ. సంపద దక్కి యుండఁగ నశక్తు లనం జనుమమ్ముఁ బిల్చి పూ
జింపఁగ నంత బేల పతి సెప్పెడువారలబుద్ధి నాఁడ మ
న్నింపఁడ యింక నేల యగు నీ వడియాసల వచ్చి రిత్త గా
రింపక మాను మాతనిచరిత్రము నీకును మాకు వింతయే. 314

క. తగుమాట లాంబికేయుం, డగు నని కైకొనును నె మ్మన్నఁ దైనను గొడుకున్
మగఁటిమి గలఁ డనియెడు న,మ్మిగఁ జూచుచునుండు విషము మ్రింగినయేనిన్.

క. జూదపుసిరి యాసపడం, గా దని విదురుండు సెప్పఁగా నప్పుడు క
ర్ణాదులపలుకులు విని పతి, యాదరణము సేయు కున్న నంతన తీరున్. 316

క. ధృతరాష్ట్రుం డిటమీఁదను, సుతులును శకునియును సూతసుతుఁడును దను నే
గతి నడిపించిరి వారల, మతము యనుష్ఠించుఁ గాక మరలంబడునే. 317

క. కార్యము తెలిఁ గిట్టిది నీ, వార్యచరితమునకుఁ జొచ్చి యాడెదు నీ కా
దుర్యోధనునవినయ మని, వార్యం బని యెఱుఁగరామి వలనో వెడఁగో. 318

క. చక్రధరు లెక్కఁగొనఁడు ప, రాక్రమనిధి యర్జునులకు రాధేయభుజా
విక్రమ మెదురుగఁ గొని ని, ర్వక్రముఁ జేసికొను వాఁడు రాజ్యం బెల్లన్.

వ. అని పలికి వెడవెడ యలుక పొడమిన మఱియు నిట్లనియె. 320

శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గర్ణుఁడున్
భూపశ్రేష్ఠుఁడుఁ దారు మున్నెఱుఁగరే పోరెట్లుఁ గయ్యంబు లా
శాపాశంబులు చుట్ట లా వెఱఁగియుం జావేఁడి మార్కొందు రిం
తే పో తమ్ముఁ గపిధ్వజప్రభల యంధీభూతులం జేయవే. 321

క. మును మమ్ముఁ బొగడి పదపడి, యని వారల గెలువ నరిది యని పొత్తుగఁ జె
ప్పినమాటకు నే నోడఁబడ, విను సంజయ పక్షపాతవృత్తి విడువుమీ. 322

స్రగ్ధర. గాండీవజ్యారవం బుత్కట మయి పెలుచం గ్రమ్మినన్ భీముబాహా
దండం బేపారి శుంభద్గద జడియుచు రౌద్రంబుగాఁ దోఁచినన్ వే
దండద్వంద్వంబుమాడ్కిం దఱిమి కవలు మార్వ్యగ్గతిం దాఁకినం జా
కుండం బోకుండఁ గౌరవ్యులకు వశమె భిట్టులిక్క మార్చిల్ల కుండన్ 323

వ కావున. 324

చ. రణమున వారలన్ గెలువ ♦ రా దనుపల్కు లటుండ నిమ్ము స
ద్గుణుఁడవు నీవు వచ్చితి ప్ర♦కోపశమంబు గఁ బల్కు టింక నై
రణ దగఁ జేయువారము ప♦రాభవ మొందియు మున్ను వారిదు
ర్గుణములు సైఁచు టీవు నొక♦కొంత యెఱుంగుదు వింత యేటికిన్. 325

ఉ. ఇంకను నట్ల కాఁ దలఁపు ♦ మే మొకకీడునకుం దొడంగ మా
శంకలు దక్కుమయ్య కువి♦చారము గల్గెనయేని బాంధవం
బంకుర మొత్త మావలన ♦ నక్కటికం బొలయంగ మమ్ము నే
వంకకుఁ బోవ నీక గరు♦వంబు జగంబు ప్రశంస సేయఁగన్. 326

క. రం డని పిలువఁ బనిచి పా, లిం డని కొడుకులకుఁ జెప్పి ♦ యింద్రప్రస్థం
బొం డెను వేఱొకపట్టణ, మొండెను మా కిచ్చి యనుచు ♦ టుచితమ కాదే.

ఉ. నా విని సంజయుండు నర♦నాథున కి ట్లను నెట్టితప్పులుం
బోవఁగఁ ద్రోచి తాలిమియ ♦ పూనుదు గావున నన్నిమాట లి
ట్లీవు వినంగ నాడియును ♦ నేఁ దనివోవక విన్నవించెదన్
నీవిధవం బహింసయు న♦నింద్యచరిత్రము కాక యన్యమే. 328

క. పా లీక కౌరవులు దుః, శ్శీలతఁ జెడఁ దలఁచి రేని ♦ జెప్పెద రుధిరా
భీలాన్నంబునకం టెను, మే లగు భిక్షాన్న మైన ♦ మీనడవడికిన్. 329

వ. అది యె ట్లంటేని. 330

సీ. రాజసూయమహాధ్వ♦రం బట్లు నడపి స, ద్ద్విజులకు సురలకుఁ ♦ దృప్తిఁ జేసి
శాంతియు దాంతియు ♦ సకలలోకంబులఁ, బొగడొంద బ్రదికిన♦పుణ్యమూర్తి
విట్టినీచరితం బు ♦ హింసాకళంకిత, మగు టెంత యొప్పదు ♦ నదియుఁ గాక
దుర్ణయవృత్తి దుర♦ద్యూతంబు పుట్టించి, యంతలు సేసిన♦యట్టివారి
తే. నేల గర్వంబు సెల్లంగ ♦ నిచ్చి జగము, చేతఁ దిట్టులు వడునట్లు ♦ సేసి పోయి
తేల యడవుల నిమ్మెయి ♦ నిడుమ గుడిచి, తేల తాల్మియ ధనముగా ♦ నింత వడితి.

క. తుదిఁ బోయి క్రూరకర్మా, స్పద మగు తెఱఁగు నకుఁ జొచ్చి ♦ బంధుల గురులన్
వెదకి వధియించుసౌఖ్యం, బది యేటికి నార్యనింద్య ♦ మస్థిర మరయన్. 332

తే. అల్పులకు మ్రింగఁ జేఁ దైన♦హాలహలము
భంగిఁ బొంగెడుకోపంబు ♦ మ్రింగికొనఁగ
నీలగళు నెన్ని ని న్నన్న ♦ బోలు నట్టి
నీవు సాలినఁ గా కేల ♦ నెగడుఁ జేరు. 333

చ. అనవుడుఁ బాండురాజతన♦యాగ్రణి సంజయుమోముఁ జూచి యి
ట్లను నది యెల్ల నీపలికి♦నట్టిద ధర్మువు లట్ల యుండి పో
ధను లరయంగ వచ్చిన న♦ధర్మము లై చెడుఁ గొన్ని ధర్మవ

ర్తనములు గాక తోఁచి తుది ధర్మము లై చనుఁ గొన్ని కర్మముల్. 334

వ. కావున నన్ను దూఱఁదలంచితేని నాచేయునది ధర్మం బధర్మం బని నిరూపించి మఱి దూఱుము క్రోధంబు నివారింపం దగు నహింసయ యుత్తమధర్మం బగు నట్లయినను వంశదూషకులును లోకకంటకులును నగు పాపాత్ముల నిర్మూలంబు గాఁ జేయుచుట ధర్మం బని పెద్దలచేత విందు మది యట్లుండె సంగ్రామంబు రాజులకు ధర్మం బవుంగాదని నీవ చెప్ప మట్లుంగాక యిది కర్తవ్యం బిది యకర్తవ్యం బని మనల శాసింప వాసుదేవుండు గలండు మన కీవితర్కం బేటికి నితండు ధర్మార్థవిదులకు గురుండు కార్యాకార్యనిరూపకులకు శిక్షకుం డుచితానుచితజ్ఞులకుఁ బ్రవర్తకుం డితనిపంపునం గాదె యదు భోజాంధక వృష్ణి సృంజయ కేకయ ప్రభృతిభూపతిప్రకరంబు ప్రశస్తపథంబునం బ్రవర్తిల్లుచున్నయది విశేషించి మాకు నితనిబుద్ధియ సమస్తపురుషార్థములకు మూలం బగుట నితనివచనం బవశ్యంబు నలంఘనీయ బనిన విని జనార్దనుండు సంజయున కిట్లనియె. 335.

ఉ. పాండుతనూజకోటికి శుభం బెడఁ గోరుదు నెప్డు నాంబికే
యుండును బుత్రపౌత్రమహితోజ్జ్వలుఁ డక్కట చేటు మేలె యం
చుండుదు నట్లు గాన తెలివొంది యతం డిట వీరిఁ దేర్పఁగా
నిండుమనంబుతోఁ బనిచె నిన్నని దీనికిఁ బ్రీతిఁ బొందితిన్. 336

ఆ. నీవు నుచితవృత్తి నెయ్యంబు ధర్మంబు, వినయ మొప్పఁ దెలిపి వీరు శాంతిఁ
బొందునట్టిభంగి బొసఁగఁ బల్కుటయును. నాకు సమ్మదం బొనర్చె నిపుడు.

ఆ. అనఘ యిట్టు లంతయును దలఁపం గదు, నెనసినట్టు లుండెనేని వింటె
పాండవాగ్రజన్ము పలుకులచందంబు, సూడ సంధి లేని చొప్ప దోఁచె. 338

క. అది యట్టిద సంధానము, దుది నెమ్మెయిఁ గల్గు నెట్లు దుర్యోధనుఁ డు
న్మదుఁడు ధృతరాష్ట్రభూవిభు, హృదయంబు దెలుంగుఁగొంత యెఱుఁగుదు మెకదా.

క. ఆరాజు సేయునెయ్యము, గారామును జెప్పె దీవు గడుఁ దీపులు గా
వీరు దమపాలు వడయక, నేరిమిమాటలన తేఱ నేర్తురె చెపుమా. 340

ఉ. వీరులు పెద్ద ద్రవ్వ కొకవెంట నొడంబడి తేఱి శాంతులై
కౌరవకోటిఁ గూడి మనఁగా మదిఁ గోరుట పెంపుఁ దాల్మియుం
గారుణికత్వముం దగవుగాదె జగంబున పాడిఁ దండ్రిపా
లీ రని తెంపు సేసి పయినెత్తిన నెత్తిరి గాక ద్రోహమే. 341

క. విను మవమానము పడి యి, ట్లునికిఁ బడయుపోగడుకంటె నుజ్జ్వలులై మా
ర్కొనిన నది లెస్స యెట్లయి,నను వీరికిఁ బోటు మేలు నాకుం జూడన్. 342

వ. సంగ్రామంబు రాజులకు ధర్మం బవుం గా దని నీవ చెప్ప మని యుధిష్ఠిరుండు నిన్నడిగెఁ గదా ద్విజాతులకు యజనయాజనాదికర్మకరణవిభాగంబు ధర్మశా

స్త్రాచార్యులు విధించునప్పుడు రాజు లిచ్చువారు గాని వేఁడుకొనువారు గా రని చెప్పుట సకలలోకప్రసిద్ధంబు సర్వవర్ణాశ్రమధర్మపరిపాలనంబు సేయునట్టి రాజులు దార నిజధర్మంబు వదలుదురా యదియునుం గాక పాడితోడియార్జనంబువం దమకుఁ గలకలిమి యనుభవించుచు సత్పథంబున నడచుచుండఁ బ న్మొరు లన్యాయంబు సేసినయప్పటికిం గదా యీశాస్త్రధర్మంబు లింద్రాదు లగు పెద్దలు గావించిరి నీచెప్పినధర్మంబులు కౌరవులకుం జెప్ప వలవదా వారలు గదా వీరిఁ దెఱుంగక కొంటెతనములకు లై చెడుతెరువునం బోయెదువా రని పలికి మఱియు నిట్లనియె. 343

క. నెట్టన సభలో నేవ్వర, కట్టుమర నరాతితనము గాఁ గెంతయు వా
రెట్టితులువలో ద్రౌపది, నట్టులు పఱిచెసి దె బాద మాడరె యెందున్. 344

వ. అనవుడు సంజయుండు దేవా నీచిత్తంబున నిడి దీని నింత గొనియాడినఁ గర్జం బొడఁగూడునే యనిన వాసుదేవుం డిట్లనియె. 345

ఉ. అత్తఱి భీష్మముఖ్యు లగునచ్చటివృద్ధజనంబు లెల్ల నో
రెత్తక యూర కుండిరి మహీశ్వరుచిత్త మెఱుంగ కున్కిఁ దా
నొత్తి కుమారులం గినియ నోపఁడ యక్కట మూన్పఁ గన్న నా
చిత్తము గాదు లోకములచిత్తము లెల్లను సంతసింపవే. 346

ఉ. తిట్టులఁ బోయి యక్కటలువు తేఁకువవారలలోని కింతిఁ దా
నట్టులు దుస్ససేనుఁ డనయాకృతి ముందల పట్టి యీడ్వఁగా
నెట్టు సహించె మూడు సతియేడ్పు లెఱుంగున కెట్టు లోర్చె నీ
పట్టున నేమ మూరయఁగఁ బంచుట కెట్టులు నేర్చెఁ గ్రమ్మఱన్. 347

చ. ఇది దగ దంచు సద్గుణనింతకు నేరక సభ్యు లందఱున్
మది మఱఁగొన్నయట్టియెడ మానినికిం దనుఁ దాన కాచికో
లోదవిన దానఁ జేసి సభ నొచ్చెము దక్కనఁ బాండునందనుల్
బ్రదికిరి గాక యయ్యెడ రాచకొమారుల కోర్చునట్టిదే. 348

వ. సంజయా వినవే యప్పుడు సభాసదులకుఁ గర్ణశూలంబు లగునట్లుగాఁ గర్ణుండు.

క. లేరిచట మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని వెదకికొను మొరు నన్నఁడే. 350

క. నరునకు నది వాఙ్మయ మగు, శరమై హృదయంబు నాటి చలియింపక దు
ర్భరవేదనఁ జేయంగాఁ, జిరకాలము దచ్చికిత్స చేసెన చెపుమా. 351

వ. మఱియు సభాసనుండు వీర లందఱును గొడ్డువోయినవారలు పౌరుషంబు గల మానిసి యిం దెవ్వం డనియె నతనిచెప్పినట్లు పెద్దగాలంబేని వీరల గొడ్డువోయిరి గాక వీరిదెస వారికి నేమి ఫలించె నెండియుఁ దత్సమయంబునఁ బుట్టినమాట

క. ఏకు రున్నరూపు వలుకఁగ, దుదిఁ గటకటఁబడవు నీవు దుర్జయమును నె
ట్టిదమును బెండును నగుపలు, కొదవదు నీనాలుకకు వక్రయోగ్యత మెపుడున్.
క. నీ వొండె విదురుఁ డొండెను, గావలయుం గాక యిట్టికార్యంబులకున్
రా వేఱ కలరె తగువా, రీవినయమునేర్పు గలదె యితరుల కెందున్. 364
చ. అరిగినయప్డు పెద్ద లగునందలివిప్రుల నెల్లఁ గాంచి యా
దరమున వారిసేమ ముచితంబుగ నారసి వెండి కొన్నుమీ
గురునిఁ బితామహుం గృపునిఁ గూర్తురు వారలు నాకు నానమ
స్కరణము గాఁగ వారి కధిక ప్రియభక్తి నమస్కరింపుమీ. 365
సీ. మాతండ్రిఁ గని యేను ప్రీతిమ్రొక్కుట గాఁగ, దండప్రణామంబు దగనొనర్పు
దుర్వృత్తిఁ బొరయునా దుర్యోధనుని సేమ, మడిగితి నని చెప్పు మతనితమ్ముఁ
డగుటకుఁ దగియెడునా దుస్ససేనుని, కుశల మారయుము దక్కినకుమార
వర్గంబు నెల్లను వనితాజనంబుల, నుచితంపుమై సుఖ మునికి యడుగు
ఆ. విదురు శల్యుఁ గాంచి వినయంబు దోఁపంగ, నాదు ద్రోణతనయు నక్కసేర్చి
కొంటి నవుమ బాహ్లికుని సోమదత్తు భూరిశ్రవసునిఁ దలఁచి ప్రియము నెఱపు.
వ. మఱియు వంశవంతులు వయోవృద్ధులు నగుభూపతులను గృతవర్మను గర్ణశకుని
సైంధవప్రభృతులను దక్కటిరాజలోకంబును గయ్యంబునకుఁ దోడువచ్చిన
సకలదేశాధీశులనుం గని యెవ్వరితోడ నెవ్విధంబునం బలుకం దగుప్రణామ
వినయబాంధవమైత్రీవాత్సల్యంబులకు సమ్యక్ప్రకారంబుల మద్వచనంబులుగాఁ
బలికి యుచితంబుమెయి నుపచరింపుము. 367
క. దాసీదాసజనముల కు, దాసీనము గాక యుండఁ దడయక యే మి
త్త్రాసంగ మొంది శత్రుని, రాసం బొనరించి తమ్ము నరసెద ననుమీ. 368
క. పోయినమొగమున నచ్చటఁ, జేయుతెఱం గెల్ల నీకుఁ జెప్పితిఁ బిదపన్
మాయయ్య పెద్దకొలువున, వా యోడక యిట్టనంగవలయుం జుమ్మీ. 369
చ. అనఘ భవద్బలంబున నయాపద యించుక లేక పాండునం
దనులు నిజాప్తబంధుసహితంబు సుఖస్థితి నున్నవారు త
జ్జనకునిరాజ్యపీఠమున సమ్మద మొందఁగ నిల్పి శైశవం
బునన ప్రభుత్వ మిచ్చి తగఁ బ్రోచితి వారల విశ్రుతంబుగన్. 370
ఉ. ఇప్పు డుపేక్ష సేసి కృప యేమియు లేక విహీనవృత్తి వా
రొప్పమిఁ బొందఁ జూచు టిది యొప్పనె యింతట సంతసింప రా
దెప్పుడు నంత కంజ నట యెక్కుడు గోరినఁ జాల కుండదే
యొప్పదె కూడి మన్కి మన కొప్పనివారలయుక్కు దక్కఁగన్. 371
వ. అని తదవసరంబునం బితామహుతోడ నిట్లనుము. 372

చ. అడఁగఁగ నీక శంతనునియన్వయముం గలిగించి తీవ యి
ప్పుడు దగ నీమతంబునన పాం దొడఁగూడఁగఁ జేర్చి పౌత్రులన్
సడికి నధర్మవృత్తికిని జావునకుం దొలఁగించి మెచ్చినం
బుడమిజనంబు రాజులును భూసురులున్ నినుఁ బ్రస్తుతింపరే. 373

వ. అని పలికి వెండియు. 374

క. ఇంతలు పుట్టినచోటను, శంతనునందన యహింసశాంతిపరుం డై
కౌంతేయాగ్రజుఁ డాలము,పొంతం బో నొల్లఁ డనుము బుధు లియ్యకొనన్.

సీ. ఆసమయంబున వచ్చుటివా రెల్ల, వినునట్లుగా సుయోధనునితోడ
బాహుబలాఢ్యుల బలవిహీనులక్రియ, వెడలంగ నడిచిన వెట్టితనము
నత్యంతచిరకాల మడవులఁ గొండల, బాధలఁ బెట్టిన పరుసఁదనము
సభలోన నట్లు పాంచాలరాజాత్మజఁ, దల వట్టి యీడ్చిన తులువతనము

తే. ధర్మపుత్త్రుండు సైరించెఁ దథ్య మీవు, కురుకుమారుల నని బ్రుంగికొనకు మొరుల
సొమ్మునకు నాసపడఁ దగ దిమ్ము వారి, పాలు వారలతోఁ గూడి బ్రదుకు మనుము.

వ. ఏము కలహం బొల్లక పొందు గోరుట తనకు మేలు దనమనంబున దరికొను
తృష్ణానలం బార్ప నొరు లడ్డంబు సొరమిం జేసి యేన బుద్ధి సెప్ప వలసెఁ దన
యొద్దం గలయోధవీరు లెయ్యెడల లేమి దెల్లం బయినను మాకుఁ జేదోడు
ధర్మంబు గల దదియునుం గాక యఖిలలోకసేవితుం డై నకృష్ణుండు పెనుఁబ్రాపు
గావునఁ దమకు మమ్ము గెలువం గొలఁది గా దది యట్లుండె నేను భీమసేనాదు
లకుం దమకుం బెద్దవాఁడ నగుట వీరును దారును మదీయప్రార్థనాభంగంబు సేయక
నా దగుశాంతియు దాంతియుఁ జెల్లించి నన్నలజడిఁ బెట్టక పోరితం బుడిగి తమ
తమధనంబులు గుడిచి సుఖం బుండుట మనపెద్దలకుం దక్కటిబుద్ధిమంతులకును
సంతోషం బగుఁ బెద్ద యీ నోపఁ డయ్యేనేనిఁ గుశస్థలంబును వృకస్థలంబును
వాసంతియు వారణావతంబును జాలుఁ గాదేని మఱియు నెందేనియు నొక్కటి
యొసగునట్లుగాఁ దనతోడఁబుట్టువు లేవురకు నిలువ తావు లయి దిచ్చిన సర్వశాంతి
యగు నట్లయిన నిందలియందలిబంధుమిత్త్రసహాయజనంబులు గలసి నవ్వు
చుం దెగడుచు సునికి మనమనంబులకుఁ బ్రియంబు సేయుఁ గురుపాంచాలయాద
వమాత్స్యులు పరస్పరప్రీతిసంపాదకత్వసంపన్ను లై బ్రదుకుట నాకుం గోర్కి
యింతయు నమ్మహాపురుషునకుం దెలియం జెప్పు మనిన విని దేవా నీయానతిచ్చిన
మార్గం బంతియు నడపెద మీతండ్రి నీకును దమ్ములకును వాసుదేవునకు నెట్లు
ప్రియం బట్లు సేయువాఁడ కాక యనుచుం బ్రణామంబు సేసినసంజయునకు
ధనంజయుం డిట్లనియె. 377

క. బాలసఖుండవు నాకును, నీ లెస్సఁదనంబు నేము నీతి విడిచి దు
శ్శీలుర మగుటయు శైశవ, లీల మొదలు గాఁగ మును దెలియదే నీకున్. 378

మ. బలమత్తాకృతి యైనభీముఁ డనుశుంభత్కుంభిసంరంభమున్
నిలిపెన్ నాఁడును నంకుశంబయి తుదిన్ నేఁడుం దదుద్రేకమున్
మలుఁగం జేయు నజాతశత్రునికృపామార్ధ్యంబ చాలంగ వా
రల కేలా నయవిక్రమోచితవిచారక్లేశముల్ సంజయా. 379

వ. అని పలికి ధర్మతనయానుమతంబున సంజయునకు సపరివారంబుగా సముచిత ప్రకారంబున మజ్జనభోజనంబు లొనరించి మాల్యానులేపనాద్యుపచారంబులు సేయించి మణిభూషణచిత్రాంబరంబు లొసంగి వీడుకొల్పిన నతండును బాండవులను వాసుదేవుని వీడ్కొని చనియె నని చెప్పిన. 380

క. విని యత్యంతకుతూహల, మునఁ బొదలుచు సంజయుండు మున్నచ్చటికిం
జనియెను నెవ్వరితో నే, మనియెను విన వలయు మునిజనాధిప చెప్పుమా. 381

వ. అని యడిగిన. 382

ఉ. భూరికృపానుషంగ మునిపుంగవచిత్తసరోజభృంగ సం
సారదవప్రవర్ష సురసంస్తుతదివ్యగుణప్రకర్ష దో
స్సారనిరస్తదైత్య శమశాలిమనస్స్థితినిత్య లోకని
స్తారకశీల నిర్వృతివిశాల నిరంజన పాపభంజనా. 383

క. శ్రుతివనితాశిరత్నమూర్తీ, శతధృతిముఖపద్మషండసౌరభకీర్తీ
రతిపతిసూతాహితాక్షా, సతతసమాచరితభక్తజనసంరక్షా. 384

మాలిని. సదయవిమలదృష్టీ సంశ్రితాశేషప్రవృష్టీ
హృదయకమలవాసా యుద్ధమాయావిలాసా
విదితనిఖిలభూతీ విశ్వరక్షాత్తహేతీ
సదసదుపచితాత్మా సంభృతానందవర్త్మా. 385

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందుఁ బ్రథమాశ్వాసము. 386

పైన యతండు పుణ్యమును । బాపముఁ బెట్టినవాఁడు నీవు నీ
సూనువశంబ కాని యొక । చొప్పుఁ దలంపవు కర్ణసౌబలా
ధీనము గార్యనిశ్చయము । దెల్లము నీమత మొప్ప దేమియున్.

ఆ. ఆలుబిడ్డ లేని । యట్టి బ్రహ్మర్షి యగు, కొయ్య గాక కుదుటఁ । గూడు పెట్టి
కుడుచువార లిట్టి । క్రొవ్విదంబులు సేయఁ, జొచ్చు టిచ్చగించి । చూతురయ్య. 9

చ. కొడుకులఁ గానరే నృపు । లకుంఠిత తేజుల నెందు నిమ్మెయిం
జెడుతెరు వైనచోఁ దగవు । సెప్పక యొప్పరికించి చూతురే
పుడమిజనంబు లెల్ల నినుఁ । బ్రువ్వఁగఁ దిట్టఁగ వించు నుక్కి నొ
చ్చెదు మది యెప్పుడుం జెవులు । చీములు గట్టెడుఁ గౌరవేశ్వరా 10

చ. చలమున దుస్ససేనుఁడును । సౌబలుఁడుం మిముఁ బట్టి యార్చ బొ
మ్మలక్రియ నాడుచుండుదురు । మానక నీవు సుయోధనుండుఁ దా
రలసి యొకప్డు పాండుసుతు । లాగ్రహవృత్తికిఁ జొచ్చి రేని నీ
చలము బలంబునుం గులముఁ । జక్కఁగఁ జేయరె యొక్కవ్రేల్మిడిన్ 11

క. వినుము యుధిష్ఠిరుసైరణ, మనవారలు వెఱపుగా సమర్థింతురు డీ
కొనఁగాఁ దగ రని వాసిన, గని యోటమి వెట్టినట్లు । కౌరవనాథా. 12

క. అనుజులకు నడ్డపడి యే, మిని జేయఁగ నీమిఁ జూచి । మెచ్చితి గా కీ
వును సాదు రేఁగె నేని, న్నిను తలపొలమునన కాని । నిలుపదు సుమ్మీ. 13

చ. అనయము పుట్టె జూదమున । యప్పుడ యెంతయుఁ జిచ్చు పెట్టి కా
ల్చినయది నీయుపేక్షయ వ । శీకృతచిత్తుఁడు ధర్మసూతి మె
త్తనివులి యెల్లవారలు న । ధర్మము నీపయిఁ బెట్టునంతకు
న్వినఁడును గానఁడుం బిదప । నీకును నాకు మరల్ప వచ్చునే. 14

చ. అనయము నొచ్చుచున్నయది । యంగము లెల్లను వేగ వచ్చుట
న్మనము వశంబు గాదు జన । నాయక ప్రొద్దును బోయె నివ్వ డేఁ
బనివిని రేపు పుత్త్రులును । బంధులు నాప్తులు నీవు సేర్పఁదగ్
విన మనకార్య మంతయు స । విస్తరతం దగ విన్నవించెదన్. 15

ఆ. అనిన నట్ల కాక । యని సంజయుని వీడు, కొలిపి కొంతప్రొద్దు । కురువిభుండు
కార్యచింత మునిఁగి । కంచుకి నొక్కరుఁ, బిలిచి వేగ విదురుఁ । బిలువు మనియె.

వ. వాఁడును సత్వరంబుగాఁ జని యతనిం దోడ్తెచ్చి కాన్పించిన నమ్మహీవరుం
డత్యాదరంబున విదురుం దనయొద్ద నునిచికొని యతని కిట్లనియె. 17

తే. పాండురాజసుతుల । పాలికిఁ జని యిప్డు, సంజయుండు వచ్చి । సమ్ముఖమున
నన్నుఁ జాల దూఱె । నాకు రే పచ్చటి, పనులు సెప్పవాఁడ । ననుచుఁ జనియె. 18

క. అప్పటినుండియు నెవ్వగ, గప్పికొనినఁ జిత్తవృత్తి గలఁగెడు మెయిన్
నిప్పులఁ బొరలినయట్లయి, చొప్పడ దించుకయు నిద్ర శుద్ధవిచారా. 19

వ. అనిన విదురుం డిట్లనియె. 20

క. బలవంతుఁడు పై నెత్తిన, బలహీనుఁడు ధనము గోలుపడినయతఁడు మ్రు
చ్చిల వేచువాఁడుఁ గామా,కులచిత్తుఁడు నిద్ర లేక కుందుదు రధిపా. 21

క. ఇక్కట్టగాములలోపల, నొక్కటి నీచిత్తవృత్తి నొందెనొ యొరుసొ
మ్మొక్కటి గుడువఁ దలంచితొ, నిక్కము గత మేమి సెప్పుము నిద్ర సెడుటకున్.

తే. అనిన ధృతరాష్ట్రుఁ డిట్లను నతనితోడ
ధర్మసుతుమాటచొప్పవివిధంబొ యెఱుఁగ
కునికిఁ జేసి చింతిల్లితి నొవ్వు దీవు
తెలియఁ జెప్పి నా యలమట మలుఁగఁ జేయు. 23

చ. అనవుడు నిట్లనున్ విదురుఁ డక్కట ధర్మసుతుండు బాంధవుం
డును జెలికాఁడునుం దగుభటుండును బ్రెగ్గడయున్ గురుండుఁ గాఁ
డె నృపవరేణ్య నీకుఁ బ్రకటీకృత సత్యుఁడు శాంతిమూర్తి స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు గీడు వల్కునే. 24

ఆ. నీవుఁ గొడుకు వారి నెఱి లేక పఱిచితి, రదియ చాలు నుచిత మైనపాలు
పంచియిండు పిల్లివట్టిన యీరువు. సేసి యున్న నేల చెల్ల నేర్చు. 25

వ. మీరు శకునికర్ణదుశ్శాసనులమీఁద రాజ్యభారంబు వెట్టికొనియుండుదు రిది దుది
ముట్ట నేర దెట్లం టేని. 26

క. తముఁ దా రెఱుఁగుట వేగప,డమి దాలిమి విడుపు గలుగుటయు లేనిప్రభు
త్వము గలదె వారియందీ,సుమానుషము లోకుఁడుఁ బట్టి చూడం గలఁడే. 27

వ. యుధిష్ఠిరుండు నీవు నిక్కము తండ్రి వని తగవు నమ్మి చాల సైరించి యున్నవాఁ
డది నీవ యెఱుంగు దనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె. 28

తే. సంజయునిచేతఁ గార్యంబుచంద మెల్ల
యెఱిఁగి మన కెద్ది సేయంగ తెఱఁగు దాని
బనిచి చేయింపు మిపుడు నామనము దల్ల
డిలుట హితభాషణంబుల డిందుపఱుపు. 29

వ. నీవు ధర్మాధర్మవిదుండవు నయానయజ్ఞుండవు నాకుం బ్రజాగరం బొనర్చు చున్న
సంతాపం బుపశమించునట్లు భవద్వచనామృతంబు నాయుల్లంబున వెల్లిగొల్పు
మనిన విదురుం డిట్లనియె. 30

క. జనులకు నొడఁబా టగువిధ, మున నడచుచు లోకనింద్యముల నుడుగుచు మీఁ
దని యొకనికలిమి కులుకక, మనుజులతోఁ బొంది పొసఁగి మను టొప్పు నృపా.

క. కోపము నుబ్బును గర్వము, నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము ననునివి, కాపురుషగుణంబు లండ్రు కౌరవనాథా. 32

క. ఏలినవానిని దైవము, నాలిని బంధులను సముచితారాధనసం
శీలతఁ బ్రీతులఁ జేయని, పాలసుఁడా ఫలము లాసపడు మనుజేంద్రా 33

క. నెమ్మి గలవారి నొల్లరు, తమ్మొల్లనివారి వెనుకఁ దగులుదు రధిక
త్వమ్మెఱిఁగి యెఱిఁగి లోడరుదు, రిమ్మెఱుఁగనియట్టివార లిభపురనాథా. 34

క. ధనమును విద్యయు వంశం, బును దుర్మతులకు మదంబుఁ బొనరించును స
జ్జను లైనవారి కడఁకువ, యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా. 35

క. అరిదివిలుకానియుజ్జ్వల, శర మొక్కని నొంచుఁ దప్పి చనినం జను నే
ర్పరి యైనవానినీతి, స్ఫురణము పగరాజు సతతిభూమిం జెఱుచున్. 36

తే. ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటఁ గడువశ్యములుగఁ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు, విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు.

క. విను మధురాహారంబులు, గొనుటయుఁ బెక్కండ్రు నిద్ర గూరినయెడ మే
ల్కనియునికియుఁ గార్యాలో, చనముఁ దెరువునడచుటయును జన దొక్కనికిన్.

క. నడవడి యనుమున్నిటిం, గడవం బెట్టంగ నోడ కరణిం దగి తా
నోడఁగూడు ననిన సత్యము, గడచినగుణ మింక నొండు గలదే యరయన్. 39

క. క్షమియించువారిఁ గని చా, లమి వెట్టును రైనముం దలంప ననూన
క్షమయ కడు మెఱయుతోడవు, త్తమరూపము గోరువారు దాల్తురు దానిన్.

క. పురుషుండు రెండుదెఱఁగుల, ధర నుత్తముఁ డనఁగఁ బరఁగుఁ దా నెయ్యెడలం
బరుసములు వలుక కునికిఁ, దురితంబులు వొరయుపనులు దొఱఁగుటకతనన్

తే. చెల్లియుండియు సైరణ సేయునతఁడుఁ, బేదవడియును నర్థికిఁ బ్రియముతోడఁ
దనకుఁ గలభంగి నిచ్చునతండుఁ బుణ్య, పురుషు లనిచెప్పి రార్యులు గురునరేణ్య.

ఆ. పాడి దప్పకుండఁ బడయు సొమ్ములకు న, పాత్రములకు నీగి పాత్రములకుఁ
బెట్ట కునికి యనఁగ నెట్టన రెండువి, ధములఁ గీడు దొడరు ధరణినాథ. 43

తే. వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు, ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము నిష్ప్రయోజనముగ వ్యయము సేఁత, యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల

తే. తగినవేషంబు దనుఁ దాన పొగడుకొనమి, నొచ్చియును గీడువలుకమి యిచ్చినగవ
కునికి దన కెంత నడవకయున్నఁ బథము, దప్పకుండుట నడవడి కొప్పు సేయు.

క. చెలిమియు సంభాషణమును, బలిమి వివాదంబుఁ ద్రోపులబాడియుఁ దమయం
తలవారితోన తగు నధి, కులహీనులతోడ నైనఁ గొఱ గా దధిపా. 46

తే. కొంచె మైనను దగఁ బంచి కుడుపు మేలు
పనులయెడ దుఃఖ మోర్చి యల్పంబు సుఖము

సమభవించుట హితము శత్రువునకు నైన
విమ్ముటయ యెన్న యడిగిన యెడ నృపాల. 47

క. తను లోకము గొనియాడఁగ, విని యుబ్బఁడు సజ్జనుండు వెండియుఁ గడు మే
లొనరించుఁ గీడొకించుక, యును దన దెసఁ దోఁప నీక యునుపుచు వచ్చున్.

వ. ఇట్టిచందంబులు ధర్మనందనునకుం గల వని పలికి విదురుం డది ప్రసంగంబుగాఁ
బాండవులఁ బ్రశంసించి నీవు వారలం బెనిచి మానుసులం జేసి రక్షించి యిప్పు
డుపేక్షించి వారలు వెలి నుండ నూరకుండం దగునే తగుపాలిచ్చి వారి రా
వించి నీకొడుకులతోడివారింగా నడపుట యుచితంబు మీరును వారును నొక్కటి
యై యున్న మీదిక్కు దేవతలకుం దేఱిచూడ రా దనిన నమ్మాటలు వెడవెడ
యూఁకొని ధృతరాష్ట్రుండు విదురున కి ట్లనియె. 49

తే. హితముఁ గర్తవ్యమును నాకు నెఱుఁగుదీవ, ధర్మసుతుచందమును విదితంబునీకు
నట్లు గావున నెఱిఁగింపు మఖిలకార్య, జాతమును జిత్తతాపోపశమము గాఁగ.

క. అనుడు విదురుఁ డాతని కి, ట్లను నిమ్మెయి నన్ను నొత్తియడిగినఁ జెప్పం
జను నున్నరూపు సెప్పెద, విను మనఘానంబులోడ విమలవిచారా. 51

ఉ. డక్కను రాజ్య మంచు నకటా యిటు దమ్ముని భాగ మీక నీ
వెక్కటి మ్రింగఁ జూచె దది యె ట్లగుఁ గీ విను మీను లోలతన్
గ్రక్కున నామిషంబు చవిఁ గాలము మ్రింగినచాడ్పు నూఁచె యి
ట్లుక్కువుఁ డైన నీకొడుకు నుల్లము నున్నతు లారఁ గూరునే. 52

క. అన విని నిరుత్తరుం డయి, మనుజేంద్రుఁడు గొంతసేపు మ్రాన్పడి తలఁపుల్
పెనఁగొన నిద్రాహీనిం, దను వలయఁగ విదురుతోడఁ దా నిట్లనియెన్. 53

క. ఇందాఁక నీదుపలుకుల, డెందము తాపంబు గొంత డిందుపడియె నా
కుం దగ నయానయంబుల, చందంబులు సెప్పుచుండు సౌజన్యనిధీ. 54

వ. అనిన విని విదురుం డి ట్లనియె. 55

ఆ. తినియెఁ బండకుండ మును గోసికొనఁ జవి, చెడుఁ గాని విత్తు చేటుఁ గలుగుఁ
బక్వమైనఁ గొనిన ఫల మించుఁ బొడము నీ, జంతుఁ గార్యసిద్ధిచంద మిట్లు. 56

తే. మాలకరి పుష్పములు గోయుమాడ్కిఁ దేఁటి
పువ్వుఁ దేనియ గొనియెడుపోల్కి నిమురు
గంద కుండఁగఁ గొనునది కార్యఫలము
భాగ్యులకుఁబోలె మొదలంటఁ బొడువఁ జనదు. 57

క. వివులధనమునకు విద్యా, పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడు న, న్నరుఁడు దెవ్వులు లేని వేదనం బడు నధిపా. 58

క. ఎదిరికి హితమును బ్రియమును, మది కింపును గాఁగఁ బలుకుమాటలు పెక్కు-

యొదవినను లస్స యటు గా, కిది యది యన కూరకునికి । నెంతయు నొప్పున్.

క. చెలిమియుఁ బగయును దెలివియుఁ, గలఁకయు ధర్మంబుఁ బాపగతియును వెంపుం
దులువతనంబును వచ్చును, బలుకుబడిన కాన పొసఁగఁ । బలుకఁగ వలయున్.

క. చెడిదముగఁ గత్తి గొడ్డటఁ, బొడువఁ దెగినమాని చిగురు । వొదవుఁ బలుకులం
జెడఁ దునిసినకార్యంబు ని, గుడ సేరదు పిదప నెట్టుఁ । గురువంశనిధీ. 61

క. తనువున విఱిగినయలుఁగుల, ననువునఁ బుచ్చంగ వచ్చు । నతివిస్ఫురతఁ
మనమున నాటినమాటలు, విను మెన్నియుపాయములను । వెడలునె యధిపా.

ఉ. అక్కట ధర్మనందనుని । యాస్యమునం దొకనాఁడుఁ గీడుప
ల్కొక్కఁడు లేదు నీకొడుకు । లొండొరు మీఱి నికృష్టవాక్యముల్
పెక్కులు పెక్కుభంగులను । బ్రేలుచు నుండఁగ నీవు దానికిన్
స్రుక్కక వించు నుండె దను । రూపమె నీ కిది కౌరవేశ్వరా. 63

ఆ. చేటుకాల మైనఁ । జెట్టమాటలు నెఱి, గాని తెరువు పట్టు । కర్జములును
దగవు లట్ల తోఁచుఁ । దగిమెదునవి యవి, నీతు లని మనంబు । నిశ్చయించు. 64

వ. నీబుద్ధి పాండవులతోడివిరోధంబు నెడ మరలంబడమి పాపం బింతియ కాక యేమి సేయుదము మనకులంబునం దేజోధైర్యధార్మికత్వాదిగుణంబుల గరిష్ఠుం డయిన యుధిష్ఠిరుండు నీసిరికి వెలి యై యుట్లుండుట దగ వగునే నీపెద్దతనంబు సూచి సైరణ వాటించి యున్నవాఁ డనిన విదురుదిక్కు మొగం బై ధృతరాష్ట్రుండు నీ చెప్పిననీతివాక్యంబులు నామనంబు దనివోవ దింకను జెప్పు మనవుడు నతండు వెండియు ని ట్లనియె. 65

ఆ. సకలపుణ్యకర్మ । చయమును నొకదెస, వినుము పాడి దప్పఁ । కునికి యొక్క
దిక్కు దీని శ్రుతులు । దెలిపెడు నెడఁ బాడి, కలిమి యెందుఁ బెద్ద । గా నుతించె.

తే. పాడి గలిగిన నిహలోక । ఫలము లెల్లఁ, జేరుటయ కాదు కీర్తి యుఁ । జెందుఁ బురుషు
ధరణిఁ బొగడిత యెందాఁక । బరఁగు నంత, కాలమును బుణ్యలోకంబు । గల్గునండ్రు.

వ. తొల్లి ప్రహ్లాదుండు దైత్యజాతిసంభవుం డయ్యును దనకొడుకు విరోచనుండును నంగిరసుం డనువిప్రకొడుకు సుధన్వుండును దమతమప్రాణంబు లొడ్డిగా నొడ్డి యొక్కధర్మసందేహంబునకుఁ బన్నిదంబు సఱచి వచ్చి తన్నడిగిన నితండు గొడు కితండు లాఁతి యని తలంపక మధ్యస్థుం డై సుధన్వు గెలిపించి యతనిచేత నిజ తనయునిజీవితంబు దానంబుగాఁ గొని వాని శ్రదికించెం గావున నీవును ధర్మంబు విడువక యధర్మోపేతు లై ననీకొడుకులవలనిపక్షపాతంబు విడిచి తెఱంగు సేయుము వారును వీరును నాపద లేక బ్రదుకుదురు నీవును శోకంబు లేక తక్కుదు వని చెప్పి మఱియును. 68

పాపంబులు కర్జము లని, యేపునఁ జేయంగ నవియు । నింపగు ధర్మ

వ్యాపారంబులకార్యము, లై పరిణతిఁ బొందవని యట్లుల చల్లున్ 69
చ. అది సభయే ప్రియం బెసఁగ నార్యులు పెల్వర యుని నార్యులే
మదిఁ దలఁపంగ వారలు సమంచితధర్మము వల్కరేని న
ట్టిదియును ధర్మవే తగ ఘటించిన నిక్కము లేదయేనిఁ దా
బడిలపునిక్కమే యొకనెపం బిడుచో ప్పగునేని భూవరా. 70
ఉ. నీతిపథంబునన్ బ్రదుక నేర్చుట యుత్తమభంగి శౌర్యసం
జాతము లై కరం బలరుసంపద లొందుట మధ్యవృత్తి య
స్ఫీతము లైనభారవహజీవనముల్ దలఁపం గనిష్ఠముల్
నీతికి బాహ్యు లైన ధరణీవర మెత్తురె వారి నుత్తముల్. 71
ఆ. కయ్యమునక యెపుడుఁ గాలుద్రవ్వెదురు నీ, పుత్రు లెల్ల సూతపుత్రుఁ డాది
యగుతదీయమంత్రు లంతకు ముందర, బిరుసు లీవు నీతి తెరువు సారవు. 72
క. పాండవులు శౌర్య మొల్లర, ఖండితనీతిప్రకారకార్యము మెచ్చ
యుండుదు రెదు రేచినఁ దుది, మండుదు రార్పంగ రాదు మఱియెవ్వరికిన్. 73
క. తమతండ్రిభంగి నీకును, సముచిత మగుభక్తి సేసి సజ్జననుతమా
ర్గమున నడచువారల నీ, విమలమతిం గన్నకొడుకుల ట్లరయఁ దగున్. 74
వ. అని పలికి మఱియు నిట్లనియె. 75
క. కారణము లేకయును నుప, కారపరత్వమున నొరులకార్యంబులకున్
వారనియలజడిఁ బడియెడు, వారల చూ యేడుగడయు వారికి నధిపా. 76
చ. ఒకరునిచేతిప్రోవును దదున్నతిప్రాపును గాంచి యెల్లవెం
టకును గొఱంత లేక పొగడం దగుసంపద నొంది యట్టిదా
తకుఁ మదిఁ గీడు సేసినకృతఘ్నునిపీనుఁగు నైన గోతపు
ట్టక కబళింపఁ గుక్కలు నొడంబడునే కురువంశవర్ధనా. 77
వ. కావునఁ గృతము దలంపమి గీడు పాండురాజు నీకుం బరమభక్తుండు పాండవు
లునుం దేజోలాభంబులు గాంచినవారలు వారల నాదరింపు మని చెప్పి
వెండియు నిట్లనియె. 78
ఆ. బ్రదుకు చేటు పొగడువడుట దూఱొందుట
యాగి వేఁడుకొనుట యిట్లు మఱియుఁ
గలుగుసౌఖ్యదుఃఖములు వచ్చు నెడపడి
వాని కెంత యేల వగవ నధిప. 79
క. వగ బలము డఱుఁగు రూపఱు, వగచిన ఘ్రాతి దప్పుఁ దెవులు వచ్చుం దూరన్
వగచి నలంగినఁ బ్రియ మగుఁ, బగతురకును వగచుటుడుగు పార్థివముఖ్యా. 80
వ. అనిన విని ధృతరాష్ట్రుం డిట్లనియె 81
క. రిత్తయుపచారముల నే, నుత్తముఁ డగుధర్మతనయు నుడికించితి దు

ర్వృత్తు లగుమిత్రులును, మిత్రు యగుం బౌరవ వగలు దొలంగులక యున్నె. 82

వ. నెవ్వగలు నివ్వటిల్ల నీక నిలుపునట్టిది యెయ్యది దాని నెఱింగింపు మనిన విదురుండి ట్లనియె. 83

తే. నియతతపమును నింద్రియనిగ్రహంబు, భూరివిద్యయు శాంతికిఁ గారణములు వానియన్నింటికంటె మేలైన శాంతి, కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర 84

వ. అని పెండియు 85

క. జ్ఞాతుల పోరితమును గో, వ్రాతమునాక్రమము విప్రవర్గముచనవుల్ నాతులకారించుటయును, బ్రీతిం జన నిచ్చునతనిఁ బెం పొప్పం గృపా. 86

క. అలమికొని యొండొరులపొ, త్తులఁ బ్రాపుల నెలమిఁ గలిమిఁ బొందిన బహుజ్ఞాతులు నెమ్మిఁ గూడి తామర, కొలనిక్రియన్ సిరికిఁ బట్టగుదు రుజ్జ్వలులై. 87

చ. కరితురగాదిఘట్టనయుఁ గాలియు నొంపదె యొంటి యున్నయు త్తరువు ననేకభూరుహవితానము గుంపయి పేర్చి బాధలం బొరయునె యన్నదమ్ములును బొందిన నేరి కసాధ్యు లట్లు గా కెరవయి నిల్చినం గెలని కెల్లిద మై పఱివోదు రెంతయున్. 88

వ. కావునం గౌరవులుం బాండవులు నొండొరులకుఁ బ్రాపై పొదలిన నెదిరికి నజయ్యు లగుదురు పరులయొత్తు లేనిరాజ్యంబు పూజ్యమహిమం బరఁగు వనవాసంబునం గుందినకౌంతేయులం దడయక తెచ్చి యుచితపదం బిచ్చి నిలుపుట నీకొడుకులకు నిలుపు గావించుట యగు నని చెప్పి మఱియు నిట్లనుఁ బ్రియవాదు లెందును గల రప్రియం బగుంగాకేమి యని పథ్యంబు వలుకువారు లేరు జూదంబునప్పుడే నడ్డపడి యప్రియం బగుటకు శంకింపక పథ్యంబు వలికితి నది నీకు రుచియింపక రోగికిఁ బథ్యాహారంబు దల కంటగించున ట్లయ్యె నైన నిప్పుడుం జెప్పెద వినుము కాకంబులం గైకొని మయూరంబులం బరిహరించు విధంబున మార్జాలంబులం బాటించి సింహంబులయెడ ననాదరంబు సేయు చందంబున సుయోధనాదులం బట్టి యుధిష్ఠిరప్రముఖుల విడిచితి నేఁడు కార్యంబు ముట్టవచ్చినం దోఁపక మిదురగుఱు సోఁకినట్లు దల్లడించెదవు కులంబునకై యొకనిఁ దొఱంగుటయు నీతి యని పెద్దలు సెప్పుదురు దుర్నయపరుండై సద్బుద్ధి సెప్పు వినం డేని మనము దుర్యోధనుం దొఱంగిన నేమి యగునది యట్లుండె సంపద సహాయంబు నపేక్షించియుండు సహాయంబు సంపదనుద్దేశించి వర్తిల్లు నిట్లవియొక టొకటిఁ బొందునంగాని సిద్ధింపవు గావున నీసంపద పాండవులకును వారిసహాయత్వంబుల నీకునుం బ్రియం బొనరింప నొండొరులకలయుట మేలు గాక మనలావు వెలి సేయుట లెస్స యగునే కురువంశనిస్తారకు లగుభీష్మ యుధిష్ఠిరులును నవక్రవిక్రము లగుకర్ణార్జునులును బ్రతాపధాము లగుభీమదుర్యోధనులును శస్త్రాస్త్రపారగు

లగునభిమన్యులక్ష్మణప్రభృతికుమారులును శాపానుగ్రహసమర్థు లగువారిం ద్రుపదాదిపరమాప్తులును వారివారిబంధుమిత్త్రజనంబులును నొక్కమొగం బై నీవనుపు సేయుచు నయవిక్రమంబు లప్రతిహతంబు లై నడవం బృథివి శాసింప భవదీయవిభవం బుజ్జ్వలం బై యొరుల కెడ లేక చెల్లుచున్న నంతయు నొప్పగునో యటు విచారింపుము పాండవులు స్థిరమతు లై వైర మెత్తక యూరక తొలంగి యుండి రేనియుఁ గతిపయదివసంబులలోనఁ జీకాకుపడి చెడుం గాక గాంధారీనందనుచేత వసుంధరాపరిపాలనభారంబు నిర్వహింపంబడునే యనిన విని ధృతరాష్ట్రుండు విదురున కిట్లనియె. 89

తే. నీవు సెప్పినమాటలు నిర్మలములు, నిపుణసమ్మతములు రాజనీతిమార్గ
బోధకంబులు నై సనుకంబుత్త్రు విడువ, నోప ధర్మో జయతి యని యుండువాఁడ.

వ. అనిన విని విదురుం డతని కిట్లనియె దేవా జ్ఞాతులు గుణహీను లైనను విడువం దగ దనిన సకలగుణసంపన్ను లై భవత్ప్రసాదంబు గోరుచున్న కౌంతేయులఁ దిగవిడువం దగునే యేను నీకు హితంబు గోరెడువాఁడ నని నిశ్చయించి నాబుద్ధి వినుము వారలజీవనంబునకుఁ గొన్ని యలంతిపల్లియ లైనను దుర్యోధను నొడంబఱచి యేర్పఱచి తెఱంగు విచారించిన లెస్స యని చూచెద నతని విడువ వలయు నని చెప్పితి నేనిఁ బెనఁకువం బశ్చాత్తాపంబు పుట్టు దాని కప్పుడు ప్రతీకారంబు లేదు గావున నల్లభంగుల నియ్యకొని పాండవులతోడ సంధి సేయవలయు నట్లుం గాక.

క. తమలోనిపొత్తుకుంగా, సమరము సేసినను గాని చాఁ జనదె శరీ
రము లాధివ్యాధిజరా, సమన్వితము లగుటఁ జేటు సహజం బరయన్. 92

చ. గజతురగాదిసంపదలుఁ గాంతలతోడివిహారలీలలుం
బ్రజ కనురాగ మొందఁ బరిపాలన సేయుక్రమంబుఁ బోరులన్
విజయముఁ బొంది పేర్చుటయు విస్ఫురితాభరణానులేపన
స్రజనితవైభవంబుఁ గలరాజులుఁ బోయిర కాక నిల్చిరే. 93

క. కావునఁ జెవికిం జేఁ దగు, నీవాక్యము వినఁగఁ జాలితేని నిహపర
శ్రీవిభవములకుఁ గీర్తికిఁ, దావల మై వెలయుటింత తథ్యము సుమ్మీ. 94

క. తగ నీలో నూహింపుము, దిగవిడువకు ధర్మతనయు దృఢమతి వై పాం
దగుచందము కొడుకులకుం, బ్రెగడలకుం జెప్పి తీర్పు పెం పేర్పడఁగన్. 95

ఆ. అనిన నంబికేయుఁ డను నీదుపలుకులఁ, గలఁక దేఱె బుద్ధి దెలివి నొందె
నిట్లు చేయువాఁడ నిదియ కర్తవ్యము ధర్మమును యశంబు లాభకమును దలంప.

ఉ. అనుడు ముదంబు నమ్మియు నాత్మఁ బెనంగొన నన్నతోడ ని
ట్లను విదురుండు పెద్దవడి కక్కట నీమది కౌర్యవృత్తి నూ
ల్కొని యాసుయోధనుం గని యకుంఠితనిశ్చయ మై యుతండు వ్రా

లినవేస న్నాల కుండిన బళిలే మముబోంటులకుం బ్రియం బగున్ 97

వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి. 98

క. దైవంబ నేర్పుఁ గాకిటు, వోవఁగ నే నేర్తు నేరఁ బోమ్మని పలుకం
గా వశమె నరున కెక్కుడు, దైవము పౌరుషముకంటె ధరణీనాథా. 99

వ. అనిన విదురునకు వైచిత్రవీర్యుం డి ట్లనియె. 100

తే. ధర్మపథమును నీతితత్త్వంబు తెరువు, నిర్మలము లగుపలుకుల నీవు నాకు
దెలియఁ జెప్పితి పరమార్థదృష్టి యెట్టి, వాక్యములఁ గల్గుఁ జెప్పుము వాని ననఘ.

సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు నధ్యాత్మతత్త్వంబు తెలియఁ జెప్పుట.

వ. అని యడిగిన విదురుం డతని కి ట్లనియె నాకుఁ దోఁచినయన్నియు నానేర్చినట్లు
నీ కెఱింగించితి నత్యంతగుహ్యంబు లగునర్థంబులు పురాణుం డయ్యునుం గుమా
రుం డగుసనత్సుజాతుండు దెలుప నోపుం గాని యిటమీఁద నాకుం దెలియ దనిన
ధృతరాష్ట్రుం డమ్మునీంద్రుండు నా కెంతదవ్వు నీవ యవియునుం జెప్పు మనిన
నేను శూద్రయోనిజాతుండ వేదాంతవేద్యంబు లగునర్థంబులు నా కగోచరంబు
లమ్మహాత్ముబుద్ధి నే నెఱుంగుదు దేవతలకుం దెలియనట్టివి యాతనికిం దెలియు
నతండు దెలుపం జాలు ననిన ధృతరాష్ట్రుం డతికుతూహలుం డై. 102

ఉ. మనసు నిష్ఠ డతనిఁ గను తెఱం గెయ్యది, యగుటయును నెఱుంగ ననిన విదురుఁ
డధికభక్తిఁ దలఁచె నార్తలోకాశ్రిత, వత్సలత్వనిధి సనత్సుజాతు 103

వ. ఇట్లు దలంచుటయును దివ్యజ్ఞానమానసీయుం డగునమ్మునివరేణ్యుం డాక్షణంబ
పొడసూపిన విదురుం డతనివచ్చుట యుగ్గడించుచు వినయంబున నతని నెదుర్కొని
దండనమస్కారంబు లాచరించి యున్నతాసనం బిడి యర్ఘ్యపాద్యంబు లిచ్చి
ససంభ్రమంబుగాఁ బ్రత్యుత్థానంబును బ్రణామంబునుం జేసి యున్న ధృతరాష్ట్రు
నతనికిం జూపి విదురుం డి ట్లనియె 104

క. దేవా దేవరకృప నీ, భూవల్లభుఁ డమలతత్త్వబోధక మై సౌ
ఖ్యావహ మగువాక్యచయముఁ, నా వినఁ గోరుటయు మిమ్ముఁ దలఁచితి భక్తిన్

వ. మీరును గారుణ్యాతిశయంబున విజయంచేసితిరి గురుసమాశ్రితులగువార లెద్దాని
వలన సుఖదుఃఖంబులు లాభాలాభంబులుఁ బ్రియద్వేషంబులు నాదిగాఁ గల
ద్వంద్వంబులం బడక బ్రదుకుదు రట్టిపరమార్థోపదేశంబున నితనిం గృతార్థునిం
గావించి రక్షింప వలయు నని ప్రార్థించినం బార్థివుండునుం దదనురూపంబు లగు
నాలాపంబుల నారాధించినం బ్రసన్నుం డై సనత్సుజాతుం డధ్యాత్మవిషయంబు
లగువివిధవాక్యంబుల సోపానప్రకారంబున నంత కంతకు సూక్ష్మంబు లగునర్థం
బులు సమర్థించుచు సందుఁ బ్రజ్ఞాచక్షుం డెయ్యది యేర్పడ నడిగె నది యెల్ల వివ
రించుచు హృదయపుష్కరకలితం బగుపరతత్త్వంబు ప్రసాదించుచునట్టిగూఢోక్తు

లనుగ్రహించుచుండ నట్టికేలకుఁ బ్రభాతం బగుటయు ధృతరాష్ట్రవిదురుల నా
మంత్రణంబు సేసి యద్దేవముని యంతర్ధానంబు నొందె నట్టిసమయంబున. 106

ప్రాతఃకాలవర్ణనము

తే. తనకులంబునఁ బుట్టిన ధార్తరాష్ట్రు, లన్నదమ్ములతో విగ్రహంబు నొనుట
కుమ్మలించి వివర్ణత నొందినట్లు, గంది యెంతయుఁ జెలు వేదెఁ జందురుండు.

క. కుముదములుఁ దారు నొక్కటఁ, బ్రమదంబున నుండి వాసిపదవి దొలఁగినం
దమకుఁ దిలువఁగఁ దగ దను, క్రమమునఁ జనునట్లు తారకంబులు విరిసెన్.

ఉ. ఎత్తిన వేడ్కఁ గంధరము లెత్తి మొగంబులు సాఁచి మూఁడుకాలం
జిత్తములుం దిగిడ్చి తమ చెందెడునిక్కలు రోసి యింపు ద
క్కొత్తఁగ నొక్కచో నొకటి నొక్కటి గాంచి యెలర్చు కాయ్పాలం
జిత్తజుకేళిఁ దేలె విలసిల్లుచుఁ జక్కవదోయి వేకువన్. 109

మ. మును సౌరభ్యము నివ్వటిల్లఁగ మనోమోదంబునం దేఁటు ల
ల్లన యోలిం వెడలంగ రేకులు సముల్లాసంబునం బింక మె
క్కనయం బెక్కుచు గద్దెపై దడలి పీఁకం గేసరంబుల్ గడ
లొక్కనఁ దోడ్తో మము వృచ్చి పేరెలమిఁ బొల్పొం జెందె నంభోజముల్. 110

చ. వెడవెడ నిద్రవొంది కను విచ్చిన పాంథులమీఁద దాడివోఁ
దడఁబడ నొండొరుం బిలుచు దర్పకుపంపుబలంబులో నియ
ల్కడుకరణిం జెలంగె శుకకోకిలభృంగతతుల్ వనంబులం
దెడనెడఁ బల్కఁ గూయ సాగ యింపఁగ మ్రోయఁగఁ దద్విరావముల్. 111

సీ. పద్మరాగంబు బరఁగించు నరుణోదయంబు కాంతికిఁ జెలువంబు మిగులఁ
బరువంబు దప్పిన విరుల రాలుచుఁ దరుచయము చుక్కలు లేని చదలఁ జెనయ
నరవిరి నెత్తావి నడరించు నున్నిద్ర, విటపీటి సౌరభవితతి వొదల
నెలఁత చీఁకటి యెఱకల నెఱిఁ దీర్చు జ, క్కవలు చెందొవల కేఁకట యొనర్చ

ఆ. వెలఁగువాఁడు దివియల నల్ల నల్లార్చు, పొర్ణగండ్లయందుఁ బొచ్చి సుడిసి
తిరిగి వేఁగుఁబోక తెమ్మెర తెలదీఁగ, కొనలవంక లొత్తు ననలఁ బోఁచు.

ఆ. అంత నుదయశైల మనునశోకద్రుమ, సమితియందుఁ గాంతిచారుభంగి
నెఱయ విరిసి తొలుత నెగసిన యుజ్జ్వల, స్తబక మనఁగఁ బద్మసఖుఁడు వొడిచె.

సీ. ఉర్వీధరంబుల నొప్పెడు జేవురుఁ, జఱుల కాంతికి ననుమొలుఁగు వెట్టి
ధరణిజగుల్మల తావిరాసము పల్లవములకుఁ గట్టెఱ్ఱవన్నె యొసఁగి
యరుణాంబుజంబుల యంతర్దళంబుల, తళతళ యనుజిగి దళముకొల్పి
చక్రవాకద్వయ సంతతి యెఱకల, కొమరారు కెంజాయఁ గ్రొత్త సేసి

ఆ. తనదు బాలబింబ | మనుపమేయప్రభా, పటలజటిలగగన | భాగ మగుచు
నుల్లసిల్లి జగము | లెల్లను విలసిల్లఁ, బూర్వశిఖరిమీఁదఁ | బొడిచె నినుఁడు. 114

వ. ఇట్లు సూర్యోదయం బగుటయు ధృతరాష్ట్రుండు దత్కాలోచితాచారంబులు నిర్వర్తించి తగుతెఱంగున నలంకృతుం డయి యాస్థానమండపంబున కరిగి పేరోలగం బిచ్చినఁ గుంభసంభవకృపకృతవర్మాశ్వత్థామకర్ణాదు లగుదొరలును భీష్మవిదురబాహ్లీకసోమదత్తభూరిశ్రవఃప్రభృతు లగుబంధుజనులును సుయోధనదుశ్శాసనప్రముఖు లగుకుమారులును లోనుగాఁ గలసమస్తపరిజనంబులును వచ్చి బలసి యుండి రయ్యవసరంబున సంజయుండు వచ్చి వాకిట నిలిచి పడిహారులవలనఁ దన్నెఱింగించి పుచ్చి చొచ్చి సముచితప్రదేశంబునఁ గూర్చుండి తనమాటలు వినుటకుఁ జిడిముడిపడు చున్నకొలువుఁ గలయఁ గనుంగొని యి ట్లనియె. 115

సంజయుఁడు ధృతరాష్ట్రునితోఁ బాండవుల తెఱంగు చెప్పుట.

తే. పాండురాజతనూజులఁ | బాలి కరిగి, నిమ్మహారాజు పనుపంగ | నేఁగి ధర్మ
పుత్త్రుఁ గాంచితి నాతండు | మైత్రి మెఱయఁ, గౌరవుల సేమ మెల్లఁ బేర్వేర నడిగె.

వ. మఱియుం దగువారల నెల్ల నయ్యైయుచితవిధిం బ్రణామంబున వినయంబున బాంధవంబున మిత్త్రభావంబున వాత్సల్యంబునఁ బ్రసాదంబున నాదరించె నేను భూనాథుండు గఱపిన తెఱంగునఁ గొఱంతలేకుండ బంధుత్వంబునకు నలయుమాట లాడితిఁ బదంపడి కార్యంబు ప్రసంగించి నాయాడినమాటలకు నయ్యుధిష్ఠిరుండు పలికినవచనంబు లింత యొప్పవే యని యగ్గించిన ధృతరాష్ట్రుం డవహితుం డై యడుగఁ దా నయ్యుధిష్ఠిరునకుం జెప్పినభంగులు నతండు వానికి నెల్ల నుత్తరం బిచ్చిన తెఱంగును నెఱింగించి ధృతరాష్ట్రునకుం బితామహునకు సుయోధనునకుం గ్రమంబున వారివారితో నాడు మని నియమించినచందంబులు ధర్మనందను పలుకులపరిపాటిం దేటపడం జెప్పి సూతసూనుండు వెండియు ని ట్లనియె. 117

తే. ఏ నుపప్లావ్యపురమున | కేఁగి తొలుత, వాసుదేవార్జునులఁ గంటి | వారు నీతి
పథము దప్పనిమాటలు | బలిమిఁ బోఁచు, నట్లుగా నాడి రని విను | మాదరించి.

వ. అనిన విని ధృతరాష్ట్రుం డవ్వాసుదేవుచిత్తం బెట్లు తం డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె 119

ఉ. తానును సత్యభామయును | ద్రౌపదియుం నరుఁడుం రహస్యగో
ష్ఠీనిరతాత్ముఁ డై సుతులుఁ | జేరని చెందని యట్టిచోటఁ గాం
తానివహంబు గొల్వఁ బ్ర | మదస్థితి నుండియుఁ బిల్వఁ బంచె
న్నానలినోదరుండు హృద | యంబున నీదెసకూర్మి యెట్టిదో. 120

వ. ఏనును దత్ప్రకారంబు పడిహారులవలన మున్న యెఱింగినవాఁడ నగుటం జేసి కంచుకంబును శిరోవేష్టనంబును ధరియించి వినీతవేషుండ నై పోవునప్పుడు కృ

ష్ణార్జును లనేకమణిమయభూషణప్రభాభాసితు లై యొక్కసెజ్జ నున్నవారు
కృష్ణుండు పవ్వళించియుండి చాఁచినచరణంబులు దొడలపై నిడికొని యర్జునుండు
గూర్చున్నవాఁడు సత్యభామయుం బాంచాలియుం గద్దియలపై నున్నవారు
సవినయంబుగా నేను దండప్రణామంబు సేసిన న న్నాదరించి కృష్ణునిచేసన్న
నర్జునుపనుపునం గనకరత్నమయం బగునతనిపాదపీఠం బతండు పేర్చినకాళ్లు
దిగిచికొన నిద్దఱుముద్దియ లెత్తి తెచ్చి నాకుం బెట్టిన నేను దానిం గరతలంబున
నంటుచు ధరణీతలంబునఁ గూర్చుండి కేలు మొగిడ్చి ఫాలతలంబునం గదియించి
నీలవర్ణులు బాహుబలమదభరితులును నయి యేనుఁగుదోయియుంబోలె నున్న
యమ్మాధవధనంజయులఁ జూచునప్పుడు నాకు హర్షాశ్రుపులకలును దదనంతరంబ
భయంబునుం బుట్టె నట్టియెడ. 121

క. ఈయిరువురుఁ బంచినపని, సేయుదు రెట్టి ధర్మజునకుఁ ♦ జేకుఱనితలం
పేయది యతనిం దొడరుట, వే యేటికి జమునిశిరము ♦ వ్రేయుట గాదే. 122

వ. అని తలఁచుచుండ నమ్మహానుభావులు నన్ను సంభావించి తా రుపయోగించునట్టి
యన్నపానంబులను దమకుఁ గట్టఁ దగినట్టివస్త్రంబులను దాము దొడుగునట్టి
భూషణంబులను నాకుఁ బ్రియం బొనర్చి గారవించిన నేను నాపోయినకార్యంబు
విన్నవించిన విజయుండు బలుమొగంబుతో దానికి నుత్తరంబు వలుకం దొడం
గిన వారించి వారిజోదరుం డి ట్లనియె. 123

సంజయుండు ధృతరాష్ట్రునకుఁ గృష్ణుఁడు చెప్పినమాట తెలిగించుట.

తే. వినుము సంజయ ధృతరాష్ట్ర ♦ విభునిపెద్ద
కొలువునందుఁ దత్పుత్రులు ♦ గురుఁడుఁ గృపుఁడు
నాపగానందనుఁడు మొద ♦ లైనసకల
జనులు వినుచుండఁగా నిట్టు ♦ లనుము నీవు. 124

ఆ. అయ్యజాతశత్రుఁ ♦ డలుగుట నీల్గుల, నగ్ని పుట్టినట్టి ♦ దయ్యె మీకు
నార్వ వెరవు లేదు ♦ నేర్పునై నింకఁ గా, వింపవలయుపనులు ♦ వినుఁడు మీరు.

వ. అవి యెవ్వి యంటేని. 126

సీ. కలయట్టివివిధార్థములు నశేషంబుగఁ, దగ నొసంగుఁడు సత్పాత్రములకు
చెలులఁ జుట్టముల నాశ్రితులను రావించి, సత్కరింపుఁడు సంతసం బెలర్ప
నిచ్చానుగుణముగ ♦ నింద్రియసుఖముల, ననుభవింపుఁడు హృదయంబు లలర
నాండ్రను బిడ్డల ♦ నన్యోన్యవిధంబుల, గారవింపుఁడు ప్రియపూరితముగ

తే. మఱియు నెవ్వరిచిత్త మే ♦ త్తెఱఁగునందు, వాటమైయుండు నది యెల్ల ♦ వలయునట్లు
సేసి విహరింపుఁ డిం కెడ ♦ సేయ కనికి, నడపుఁ డటచేతఁ బ్రాణంబు ♦ లిడి కడంగి.

వ. అని చెప్ప నింత యేమిటి కంటేని. 128

ఉ. ఎందును నెవ్వరుం బడనియెంతయుఁ గష్టముపాటు వచ్చినం
గొందల మంది పాండువిభుకోడలు దవ్వుల నున్ననన్ను గో
విందుఁడ కావు మంచుఁ బలవించుట యీఁగఁగ రానియప్పుఁబో
లెం దలపోయ వ్రేఁగయి చలింపక యున్నది యెప్పుడున్ మదిన్. 129

తే. ఇట్టిమేఁ దేరు గడపంగ నెందు నుతికి, నెక్కుగాండీవ మేస్థితి నెక్కువెట్టి
రెండుదోనలను బూని కిరీటి యనికి, వచ్చునేఁ డెల్లి యెందుఁ బోవచ్చు మీకు.

వ. అని పలుకునప్పటివారి యెత్తికోలును నీకొడుకువిడుపోవమియును దలంచి భయం బందితి నితండు వారల నెఱుంగండు భీష్మద్రోణులప్రాపును గర్ణుగర్వంబును దన్ను గెలిపించు నని నచ్చి తొడరెడు ననిన విని ధృతరాష్ట్రుం డస్టనుం డే మనియె నని యడిగిన నతనికి సంజయుం డి ట్లనియె. 131

క. నరుఁ దలఁక వోడమియును సుస్థిరుఁడై తనయెత్తుసెరలక చెలువునఁ గెండా
మరలం దెగడెడుకన్నుల, నరుణచ్ఛవి నెఱయ నిట్టు లనియె నరేంద్రా. 132

ఆ. ఆసుయోధనుండు నతనికిఁ దోడ్పడ, నరుగుదెంచినట్టి ధరణినాథ
చయము వినుచునుండ సంజయ నావచనములు గాఁగ నిట్లనంగ వలయు.

ఉ. పాండునియగ్రనందనుఁడు పాలకుఁగం దగ నీఁడయేని మా
కొం డన నేల మేలది సుయోధనుఁ డింతకు మున్ను పెక్కు లు
ద్దండతఁ దాను జేసినవిరోధంబుల కెల్ల మొఱుంగు వెట్టిన
ట్లుండెడుఁ గాక యేనును వృకోదరుఁడుం బ్రియ మందునట్లుగాన్. 134

క. మాయిరువురతోఁ గయ్యము, సేయ నలం డియ్యకొనిన సిద్ధించెన కా
దే యుచితచరితుఁ డగుకొం, తేయాగ్రజు కార్య మట్టి తెఱఁ గొప్పఁ గదా. 135

క. వనవాసంబున భూశ,య్యను ధర్మజుఁ డున్నయట్టియాయాసము వో
వునె యంపశయ్య దుర్యో,ధనుఁడు రణక్షోణిఁ బడక తక్కినయేనిన్. 136

ఉ. సూనృత మూఁది బన్నములు సూడక లోన నడంచినట్టికో
పానల మొండి యున్ననిబిడాటవి పైఁ బచరించు తీవ్రదా
వానలుఁ బోలి శాత్రవచయంబుపయిం గవియించి నిల్చినం
గాని యుధిష్ఠిరుం డరకుగాఁ గొన రాధృతరాష్ట్రనందనుల్. 137

మ. గద సారించుచు నంత్యకాలవిచలత్కాలాకృతిం భీముఁ డు
న్నదమాతంగచయంబు నుగ్గుగ లసన్నానారథవ్రాతముల్
చదియన్ భూరిహయవ్రజంబు పొడిగా సంరంభతుంగాంగుఁ డై
కదియం జూచి బలే సుయోధనుఁడు భాగం బిచ్చు రాజ్యంబునన్. 138

సీ. కోల్పులి వీఁకమై గొదగొని తేళ్లకు, నుఱుకుతెఱంగునఁ దఱియఁ జొచ్చి
పెనుగాలి జీమూతబృందంబుపై వెట్టి,దంబుగ వీచుచందమున నడరి

కసిమసంగినమారి గడఁగి జీవులమీఁద, నుగ్రతఁ గవియున ట్లురవడించి
యాఁకొన్నలయరుద్రుఁడాగ్రహంబునజగ, త్త్రయంబుముట్టెడుభంగిఁ బొదివి
తే. నకులుఁడును దదనుజుఁడు సాత్యకియు వాసు, భద్రకొడుకును నెదిరినబలము నెల్ల
బెదరఁ జెదర బడల్పడఁ బెల్లు సావఁ, జేయఁ గని కౌరవులు సంధిసేయువారు.

ఉ. చిత్తము లుల్లసిల్ల నలసింహకిశోరము లొక్కమై మదో
న్మత్తగజావళిం బొదువుమాడ్కి నరాతిబలంబు ముట్టి యు
ద్వృత్తిఁ గడంగి యప్రతిమవీరులు ద్రౌపదిపుత్రు లేవురున్
నెత్తురుసీరఁ దేల్చిన నగనిం గని మీనృపుఁ డల్క దీఱెడిన్. 140

మ. చెలులుం జుట్టలు నిష్టభృత్యులు మహాజిం బ్రాణముల్ డాఁప కు
జ్జ్వలులై తో నడవన్ విరాటుఁడును బాంచాలుండు నేపారి సే
నలయుద్రేకము రౌద్రముం బెనుప నానాహేతిఘోరంబుగాఁ
దలపడ్డం గని గాక సుక్కుదురె గాంధారీసుతుల్ మాటలన్. 141

చ. తఱిమి శిఖండి తన్నొరులు దాఁకఁగ నవ్వారిదిక్కుఁ జూడ కే
డ్తెఱఁ దనపూన్కిపై మనము ధీరత నిల్పి రథంబు బల్విడిం
బఱపి కురుక్షితీశుఁ డనుబ్రహ్మకు వేయును నిండ భీష్ముపై
కుఱికినఁ గాక మాకు నగ మూరక యిత్తురె మీరు మేదినిన్. 142

శా. విద్యుద్దండము నిల్చి పొల్చినగతిన్ వి ల్లంద మై యుండ న
స్త్రద్యోధావలిమానసంబున రణోత్సాహంబు రెట్టింప ధృ
ష్టద్యుమ్నుండు గడంగి ద్రోణుఁ గడిమిన్ డాయంగ వీక్షించి కా
కుద్యోగించుట యేల తక్కుదురు మీ రుగ్రాహవక్రీడకున్. 143

సీ. గాండీవగుణరవం బొండొండ చెలఁగంగ, శరపరంపర లాకసంబు గప్పఁ
బ్రబలవిశిఖములు ఖండితము లై రాలంగ, నెదిరిసైన్యంబుల మదగజాది
చతురంగములును జర్జరితంబు లై యవ, యవభేద మెఱుఁగనియట్లు గాఁగఁ
దునిసిన నెత్తురు మెదడును నెమ్ములు, నెఱచియుఁ గండలు నెనసి సమర
తే. తలము ఘోరంబుగాఁ గపిధ్వజము ధవళ
హరులు శోభిల్ల నొగలపై హరి యెలర్ప
దేవదత్తంబు మ్రోయఁ దోఁతెంచునట్టి
రథముఁ గని కాని కానఁడు రాజరాజు. 144

శా. బాలక్రీడ మహాసురప్రకరమున్ భంజింపఁడే యెప్పుడుం
ద్రైలోక్యంబును భక్తియుక్తిఁ దగ నారాధింపదే యట్టి శౌ
ర్యాలంకారు మహాత్ముఁ డా నరకుసేయం డచ్యుతున్ మ మ్మతం
డేలా కైకొను నాసుయోధనునియం దే గ్గది యూహింపఁగన్. 145

వ. ఏము పితామహగురుకృపాచార్యులకు నమస్కరించి యస్మదీయరాజ్యభాగం
బునకై తొడరి కయ్యంబుసేయువారము కౌరవులకుం బూని యెవ్వరే మాతోఁ
బెనంగినను వారిశస్త్రాస్త్రంబులు ధర్మప్రతిహతంబు లగు నని తలంచెదము
పండ్రెండు వత్సరంబులు వనంబున నమ్మోయి నిడుములం బడి జనపదంబునం బదు
మూఁడగునేఁ డజ్ఞాతవాసాయాసం బట్లనుభవించివచ్చి మాతండ్రి పాలికిం బెనంగు
మమ్ము నింద్రాదిసురసహాయు లయ్యును ధార్తరాష్ట్రులు గెల్చువారై రేని ధర్మంబు
కంటె నధర్మము బలవంతం బైనయది యగు నింతియ కాని మాచేయునట్టి
నీ కైనది గాదేము వాసుదేవుని మున్నిడికొని నడతుము గావున నీయుద్ధంబున
జయంబు మాకు సిద్ధంబ యెల్లభంగులం గర్ణసహితంబుగా గాంధారీనందనులం
దునిమి యేము భూమి గొనుట దప్పదు గాండీవంబు దివియకయును గుదుసునడి
యెడు బాణంబులు దమయంతన తూణీరంబుల వెడలెడుఁ దో లూడ్చుమహా
నాగంబునుంబోలెఁ గరవాలంబున దాన యొఱ వెలికి నిగుడుచున్నయది గావున
మా కవశ్యంబును సంగరంబు సంభవించుఁ బాశుపతాదిదివ్యశరంబులం గురు
పక్షప్రజాక్షయంబు సేసి శాంతిం బొందెదము నూతనంతనా నీవు సుస్థిరుండ వై
యింతయుం దెలియం బలుకవలయు నిమ్మాటలు విని కురువృద్ధుం డగు బాహ్లికుం
డును బితామహుం డగుభీష్ముండును గురుం డగుకుంభసంభవుండును శిక్షకుం
డగుకృపాచార్యుండును గురుపుత్త్రుం డగునశ్వత్థామయు సద్బుద్ధి యగువిదురుం
డును ధర్మాచరణకల్యుం డగుశల్యుండును నెయ్యది నిశ్చయించి పలికి రది య
య్యెడు సుయోధనాదు లాయుష్మంతు లగువార కాక యని పలికె నని చెప్పిన
విని మందాకినీనందనుం డందఱు విన దుర్యోధనున కి ట్లనియె. 146

సీ. వలినగర్భుఁడు పెద్దకొలువున నున్నెడ, సురపతిప్రముఖులకు చూడ్కి కెల్ల
మెఱయు తేజంబునకు మిఱుమిట్లు గొన నిద్ద, అచ్చట నొరసికొంచు చరుగఁ జూచి
వీ రెవ్వ రిమ్మెయి మీ రుండ నరకు సే, యనియట్లు వోయెదు నట్టివార
లని బృహస్పతి బ్రహ్మ నడిగిన నతని కి, ట్లనియె నాచతురాస్యుఁ డాదరమునఁ
తే. దపము పెంపును బలశౌర్యదర్పములును, గలిగి లోకహితార్థంబు గాఁ జరింతు
రేయుగంబున నరుఁడు నారాయణుండు, ననఁ బ్రసిద్ధికి నెక్కిన మునులు నుమ్ము. 148

వ. అని పలికి వెండియు.

క. అనిమిషహితము దనుజనా,శనమును జేయుదు రధర్మసంగ్రామము గ
ల్గినచోట ధర్మపరు లగు,జనముల గెలిపింతు రధికసంరంభమునన్. 149

వ. దేవాసురయుద్ధంబునప్పు డింద్రుండు వోయి వీరి నారాధించి తో డడిగినం జను
దెంచి పౌలోమకాలకేయాదు లగుననేకదైత్యదానవులం జంపి యింద్రునకు

విజయంబు గావించి రథి మొదలుగా వీరల నెల్లవారలు నెఱింగి యుండుదు
రిది యొక్క తేజంబు రెండుదెఱంగులై వెలుంగుచుండు నని చెప్పి వినోదా
ర్థంబు జన్మాంతరంబు నొందినయమ్మహాత్ములు గదా యీయర్జునుండును వాసు
దేవుండును నర్జునుండు సముద్రతీరంబున హిరణ్యపురంబు వొడిచి నివాతకవ
చుల నఱువదివేవుర నిర్జించి పర్జన్యునకుఁ బ్రియంబు సేసె వాసుదేవుపరాక్ర
మంబు గంసనరకాసురప్రముఖనిఖిలదుష్టనిగ్రహంబునం బ్రసిద్ధంబు గాదె
తెలియ వినుమన్నరూపు సెప్పెద. 150

క. అయిదువురు నొకతలయై, యాయోధనమునకు నడచునట్టిద యేనిన్
వేయేల మనకు గాదెదు, రై యేతెఱఁగుఁ దలఁకపాటునకైన నవశమే. 151

క. సారథియు రథియునై యొక, తేరం గృష్ణు లతిఘోరతేజస్సార
స్ఫారతఁ దోఁచిన నైనను, ధీరత వాటించి చూచి తెలిసెదవు బలే. 152

వ. అనుచు నాసుయోధను నుపలక్షించి శాంతనవుండు మఱియు నిట్లనియె. 153

క. మది నామాట గొంకింతయుఁ, బెదర వకార్యంబునందుఁ బ్రియము గలిగి యుం
డుదు కౌరవులకుఁ గాలము, తుది యో కా కిట్టిగర్వితుని నే మందున్. 154

తే. హితము లగునాదువచనంబు లిపుడు వినిన, నాఁడ వైతేని నప్పుడు వార్థు వడిరి
వీరు వడి రనుపలుకులు విందు గాక. శకునికర్ణదుశ్శాసనుల్ సమ్మతింప. 155

వ. దుష్టకష్టనికృష్టాత్ము లగునిమ్ముష్వురుఁ జెప్పుడుబుద్ధులు గాని యొండు విన నొల్ల
నేమి సేయ వచ్చు నని పలికినం గాసినుండు గనలి గాంగేయున కిట్లనియె. 156

ఆ. ఇట్టు లాడఁ దగునె యే నేమి సేసితిఁ, గొలిచి కుడుచుపాడి నలవుఁ జలముఁ
బలుకు జెందు నెగ్గె పతికిఁ బుత్రులకును, మనుమలకు హితంబు యొనర నడతు.

క. కాని తెఱఁగైన నింతటి, మానిసిఁ గా నేల చేయు మనుజేంద్రుఁడు న
న్నీనెఱి దప్పినమాటలు, నీనోరన్ వెడలఁ దగునె నిండినసభలోన్. 158

వ. అనిన విని భీష్ముఁడు ధృతరాష్ట్రున కిట్లనియె. 159

భీష్ముఁడు గర్ణునిదుర్ణయంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. ఒకటనైనను వారియం దొకరిలోని, చిదురపాలును బోలండు సిగ్గు లేక
పాండవుల గెల్తు నే నని పలుకుచుండు, వీనిరజ్జులు దులువలు విండ్రు తగిలి.

క. మగఁటిమి వారికి వీఁడెమ్ము, రుగ నమ్మి సుయోధనుఁడు విరోధము గొని స
ర్వగుణాఢ్యులు బలవంతులు, నగుపాండునృపాలసుతుల నవమానించెన్. 161

ఉ. ఒక్కఁ డొకం డనేకవిధయుద్ధజయంబులు గొన్నవారు వా
రెక్కడ నేమి సేసె నితఁ డీతనితమ్మునిఁ గూల నేసి యు
క్కెక్కినపార్థుపైఁ గవిసె నే పసు లాతఁడు గ్రమ్మఱింపఁగా

నక్కడ లేఁడె వీఁడు భవదాత్మజుఁ గోల్పడ ఘోషయాత్రలోన్.

వ. ఈదుర్గ్రాహుండు కర్ణుం బెఱుంగక నీతిబాహ్యుండై వలసినట్లు ప్రేలెడుమాటఁ చుండు నీవునుం గైకొని వినుచుండుదువు మేలు కాదు యనిన భీష్మపలుకులు ద్రోణుం డమ్మహారాజుతో ని ట్లనియె.

ఉ. శాంతనవుండు సర్వకురుసంతతికిం గలవాఁడు గాఁడె య
త్యంతహితంబు లీపలుకు లాహవ మొప్పదు ధర్మసూతితోఁ
బొంతువ మేలు దేవపతిపుత్త్రుఁడు సంజయుతోడ నాడిన
ట్లంతకు నోపు మీకుఁ దెలియం దగు ఖాండవదాహ మాదిగాన్. 164

ఆ. శరశరాసనములు ధరియింప రెట్టు లెవ్వరును మగతనంబు వలనుఁ గలిగి
కయ్యమున జయంబు గైకొనరే యొరు. లర్జునుండ విజయుఁ డనఁగ నెగడె.

క. ఘనవీటన కాదయ్యర్జునునకు సరివింటివానిఁ జూడఁగ లోకం
బున నెందు లేమి దెల్లం, బనుమానము లేదు తోడర నగునే వానిన్. 166

వ. అని చెప్పి యప్పాటం బరమహితోపదేశంబు సేసిన భీష్మద్రోణులపలుకు లాదరింపక వారికి సముత్తరంబు లీక వారలతోడం దదనురూపంబుగా సంభాషింపక ధృతరాష్ట్రుండు వెండియుఁ బాండవులవలనివార్త లడుగుటకు సంజయుదిక్కు మొగంబై నం జూచి కురుపక్షవీరు లందఱుఁ బ్రాణంబుల పెస నిరాసులై యుండి రమ్మహీపతి సంజయునితో ని ట్లనియె. 167

తే. ధర్మపుత్త్రున కిక్కడి తలఁపుభంగి, యెట్టు లుండు నిప్పైన్యంబు లెల్లఁ గూడి
యునికి వినియనే యెవ్వరిఁ గొని యతండు, కౌరవులమీఁద నెత్తి రాఁ గలుగువాఁడు.

వ. అనిన విని సంజయుండు వెచ్చ నూర్చి యెచ్చవడి మూర్ఛవోయిన చందంబున డెందంబు మగుడం జేష్టలు దక్కి యుండి కొండొకసేపునకుఁ జిత్తం బొక్కింత సేసికొని యక్కటా యీభూపాలుం డింత చేల యగునే యుధిష్ఠిరుం డెవ్వరిఁ గొని యెత్తివచ్చువాఁ డని యడుగుచున్నవాఁ డింత యెఱుంగనివాఁ డెంత సెప్పినను దెలియ నేర్చునే యితనిభంగి యిట్టిదనినఁ గొడుకుల తెఱంగు వేఱె యెన్న నేమే నింక నేమనువాఁడ నైనను నన్నడిగినమాటకుం దగినమాఱుమాట వలుకవలయును గాదె యని తలంచి ధృతరాష్ట్రున కి ట్లనియె. 169

చ. వినుము నరేంద్ర పాండుపృథివీపతియగ్రసుతుండు సంధి సే
యన మదిఁ గోరు మీరు తమయయ్యసగంబును భూమి యీక తె
క్కిన మఱి కాని ముందఱ రొకకీడుఁ దలంపఁడు మీబలంబు నె
ల్లను మదిఁ జీరికింగొనఁడు లావున నేలఁ గొనం దలంచినన్. 170

క. అతం డెవ్వరిం గొని యెత్తివచ్చువాఁ డని యడిగితివి నీ యెఱుంగనివార లం
వ్వడు గల రవధరింపుము 17

బకవిధ్వంసి జటాసురాంతకు హిడింబప్రాణహారిన్ గి
చకనిర్మూలనకేళిలోలు సమరోత్సాహైకశీలప్రవ
ర్తకు నాగాయుతసామ్యకీర్తితబలోదగ్రుం బ్రతివ్యూహదా
హకు భీమున్ గొని వచ్చు ధర్మజుఁడు బాహాటోపమున్ జూడఁగన్. 172

వ. మఱియును. 173

మ. అట మిన్నందినయట్టివానిఁ బొడ వెం తన్నట్లు ఫాలాక్షు నె
క్కటికయ్యంబునఁ గన్న ఫల్గును భుజాగర్వంబు లెక్కించు టం
తటివానిం గొని ధర్మసూతి సమరోత్సాహంబుమై నెత్తి వ
చ్చుటకుం గొంకుదె నీవు సక్కనయి నిల్వం గాక మీసైన్యముల్. 174

తే. నకులు సహదేవుఁ గొని ధర్మనందనుండు, మొనసి కౌరవబలములు ముట్టికొనఁగ
దలఁచి తఱి వేచి వచ్చుట ధరణినాథ, సింగములఁ బట్టి వేఁటాడు భంగి గాదె.

తే. ద్రౌపదేయులు నాసుభద్రాసుతుండు
నుక్కుతునియలు గారె మి మ్మక్కుమార
నరులఁ గొని యోర్చువాఁ డయి వచ్చు ధర్మ
పుత్త్రుఁ డిది నీకుఁ జూడంగఁ బోల దెట్లు. 176

వ. అని చెప్పి వెండియు ని ట్లనియె. 177

క. వృష్ణికుమారోత్తముఁ డా, కృష్ణునితమ్ముండు సాత్యకియు దవదహనా
త్యుష్ణప్రతాప దీప్తులు, కృష్ణాసోదరులుఁ దలఁపఁ దేవలు లె న్నృపా. 178

సీ. శౌర్యోజ్జ్వలుండు పాంచాలభూనాథుండు, మహితవిక్రముఁ డగుమత్స్యవిభుఁడు
నధికధైర్యాన్వితు లతనితమ్ములు దగ్ర, తేజస్కులై నతనిదీయసుతులు
నన్నదమ్ములు ప్రతాపోన్నతు లేవురు, కేకయపతులు నకంపనబాహు
శక్తియుక్తులు జరాసంధసూనుఁడు సహ, దేవుండు నాజయత్సేనవిభుఁడు

తే. వినుము శిశుపాలతనయులు వీరధనులు, ధృష్టకేతుండు వృషభుండుఁ దీవ్రరణవి
నోది యదుభర్త చేకితానుండు దర్పఘనుఁడు శైబ్యనృపాలుండుఁ గలరుగాదె.

క. ఏ రెల్లఁ బాండురాజును, సూరులపాటునకుఁ గుందుమనములలోఁ డక్కా
వారిపగ దీర్పఁ గడఁగెదు, వారల కాకందు లాత్రిహారుం గలరే. 180

చ. భీమసేనుసూనుండు ఘటోత్కచుండు దంష్ట్రికం బెను లావును బీరంబునుం గల
వాఁడు మాయాబలంబున మనబలంబు నెల్లం గలంచు మఱియును దూర్పున
నుత్తరంబునం గలుగునరనాయకులు నానాసేనాసమన్వితు లయి వచ్చి చి
చ్చయినను బిడికిలింత సునుమన్నవా రదియునుం గాక. 181

క. సకలభువనములు నలంచేతికిఁ దేరం జాలునట్టిగ్రీమంతుఁడు దే
వకికొడుకు గలఁడు ధర్మజునికి నాతం డెత్తి రాక నిలుచునె భూభిపా. 182

వ. అని చెప్పిన సూతపుత్త్రునకు నంబికాపుత్త్రుం డి ట్లనియె. 183

ధృతరాష్ట్రుఁడు భీమసేనాదులపరాక్రమంబు దలంచి దుఃఖించుట.

క. వారిచేస నీవు సెప్పిన, యారథికులు ప్రబలు లగుదు రందఱు నైనన్
నా కెల్లను నొకతల యు,మ్మారుతి యొకతల బలప్రమాణము సూడన్. 184

ఉ. భీముఁ దలంచినన్ మనము భీతిఁ గలంగుచు నుండు నాకు రే
లేసుఁయు నిద్ర రా దతని నేడ్తెఱ మార్కొనఁ జాలునట్టివాఁ
డీమొన లేఁ డతం డలుక నెత్తినయాగద కాలదండ ము
ద్దామవిలాసుఁ డై కురుకదంబములో విహరింప కుండునే. 185

తే. చిఱుతనాఁడును వాఁడు నాకొడుకుఁ బోఁడు, వీరు చివ్వకుఁ జొత్తురు వైర మెత్తి
వానిచేఁ బీడ వడియును మానరదియ, కాదె యీభేదమున కెల్లఁ గారణంబు.

క. సమరమున దైత్యదానవ,సమితియు నాతని కెదుర్పఁ జాలదు భుజయు
ద్ధమున జరాసంధుని నొక,నిమిషంబునఁ జంపె నొరులు నిలుతురె యెదురన్.

మ. బొమ లల్లార్చుచు ముడివడ్డ కొప్పరస ముప్పొంగం దనర్పన్ భుజా
గ్రము లిం పెవ్వఁడు నాకు మా ననుచు శౌర్యస్ఫూర్తి శోభిల్ల ను
ద్ధమలీలం గవియంగ భీముఁ గని ధైర్యం బెది కౌరవ్యసై
న్యము లంతంతఁ గలంగఁ బాఱినటు లై నామోమునన్ వ్రేలెడిన్. 188

క. కరవాలము గద మొద లగు, పరికర మేమియును లేక బాహుబలమునం
గరిగతి నడరినను వృకో,దరునకు నొకఁ డెదుర నిలిచి తలపడువాఁడే. 189

తే. ప్రళయకాలసముద్రము భంగిఁ బొంగి, కడు భయంకరుఁ డగుభీముఁ గడవ నీఁడ
వశమె నాపుత్త్రులకువిధివశముపొంది, యెదిరెదమ్మను నెఱుఁగరు మదముకతన.

క. చిచ్చునకుఁ దోడు గరువలి, వచ్చుగతిన్ భీముదుర్నివారవిహారం
బచ్చుపడఁగఁ బ్రాపై వి,వ్వచ్చుఁడు వెస వచ్చు గాండివంబును దాల్చన్. 191

వ. సంజయా వినుము నీ కున్నరూపు సెప్పెద. 192

క. అయ్యర్జునుమగఁటిమి కెన, యేయుగములఁ జూడ వినఁగ నెందున్ గలఁడే
నీయెదుర నాడినంతయుఁ, జేయుట కతఁ డోపు రిత్త సెప్పెడువాఁడే. 193

ఉ. ఎక్కటిగాండివంబు నురి కెక్కి వెలుంగుట మీఁదఁ గేశవుం
డక్కజ మైనతేజ మది యాసపడం డనంత సత్త్వనుం
డొక్కఁడ వైరిసేనలకు నొట్టినమంట ప్రతాపమూర్తు లి
ట్లొక్కెడఁ గూడె నిన్నిటిమహోగ్రపువేఁడిమి కోర్వ వచ్చునే. 194

క. దివిజదనుజసహితము లగు, భువనము లన్నిట మహేంద్రపుత్త్రుఁడు విజయో
త్సవలీలఁ గ్రీడ సల్పుం, దవులంబడఁ డెందు నత్యుదగ్రబలమునన్. 195

వ. అని పలికి వెండియు. 196

క. కురుసేనఁ గదా గెలుచుట, కరము భరం బర్జునునకు గాండీవమునం
బెరిఁగినయమ్ములమంటల, దరికొని తెగఁ గాల్చునట్టిదయ యగుఁ జుమ్మీ. 197

వ. భీమార్జునులకోలందులు భీష్మద్రోణు లెఱుంగునంతకంటె నెవ్వ రెఱుంగుదు రె ఱింగియు మానుషంబు వాటించి సేనమొగంబున నిలుతురు కృపుఁ డట్టి ప్రాణంబులు విడుతు రింతియ కాని చేయునది లే దదియునుం గాక పౌరుషం బగుటయు శిష్యు లగుటయు గాంగేయునకు గురునకు సామాన్యం బగుటం జేసి రెండుదెఱంగుల వారికి వీ రొక్కరూప మనకడ నున్నతప్పునకు మనముందట నిలువవలయు నను నింతమాత్రమునం గా వీరల కింత వలసె నేను దైన్యాధీనతకతంబున బిడ్డల నొత్తి చెప్పను నియమింపనుం జాల మొదల విదురుం డే మని చాటి చెప్పె నది యంతయుం బాటిలె జూదంబునాఁటనుండియుఁ గురుజాతికిం జేటు మూఁడుట దోఁచు చుండు మందబుద్ధియు లోభోపహతుండును నయి దురభిలాషంబున దుర్యోధనుఁ డింత సేసెఁ గాల పర్యాయంబునఁ గౌరవులకుఁ గడవరానియవస్థ వచ్చె సంజయా నే నేమి సేయుదు నెందుఁ జొత్తు నిద్ది యెవ్వ రెవ్వరు శరణంబు వా రిరువురుఁ గలయంతటన పోయెనే విను మని మఱియు ని ట్లనియె. 198

చ. అనుజులు నట్టివార ద్రుపదాదిసుహృజ్జను లెల్ల నంతకం
బెను బలవంతు లాహవపరిశ్రమఁడు రాజు యుధిష్ఠిరుండు స
ద్వినయవివేకశీలముల విశ్రుతుఁ డాతఁడు బంధుభృత్యులం
దనకు వశంబు సేసికొను దానికి నేర్చుఁ బ్రభుత్వసంపదన్. 199

ఆ. సత్యశౌచధర్మశాలి దయాపరుం, డట్టిధర్మపుత్రు నాక్రమింప
మనము దలఁచు టెల్ల మంటలో మిడుతలు, దగ్రవృత్తి నుఱుకఁ దలఁచునట్లు.

వ. కావునఁ బాండవులతోడిభండనంబునఁ గులక్షయం బగుట దప్పదు శాంతిఁ బొం దుటయ మేలు మనవారల కది ప్రియం బగు నేని దానికిఁ దగినయత్నంబు సేసెద ననిన విని ధృతరాష్ట్రునకు సంజయుం డి ట్లనియె. 201

క. దేవర యానతియిచ్చిన, యీవాక్యము లెస్స నాఁడు నీవ యుపేక్షం
బో విడిచితి వింకను నీ, చే నత్తురు వారు వీరిచే టొప్పదు రే. 202

వ. అది యె ట్లం టేని. 203

క. వారు దెస లొత్తికొనియు ధ, రారాజ్యం బిచ్చి పోయిరా పోరా తా
రారణ్యపీడఁ బడియును, రారాజుం జెఱుకుఁ బాపరా మన మెఱుఁగన్. 204

వ. అట్టియెడ నైనను. 205

క. రావించి తగవుమై నం, భావింపవ కాక నాఁడు పాండవు లలుకం
బో విడువరె మిగులుదు రే, నీవచనంబులకుఁ బిలిచి నిలుపుము వారిన్. 206

దుర్యోధనుఁడు తండ్రితో స్వపక్షవీరులసామర్థ్యంబు చెప్పుట.

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె. 207

చ. అడవులఁ గొండలం బడి మహాపద రూపఱి చన్నవార ని
ప్పుడు గొని వచ్చి కృష్ణుఁ డొక ప్రోవుగఁ గూటువమూఁకఁ గూర్చిన
బొడుతురె పాండునందనులు భూవర యేటికి నింతభీతి మా
కడిమియు లావు నీ వసదుగాఁ గణుతింపకు గెల్తు మెమ్మెయిన్. 208

తే. పరశురాముని గెలిచినబల్లిదుండు, భీష్ముఁ డవనీశ లీతనిపేరు వినినఁ
బాఱుచుండుట యెఱుఁగవే పాండుపుత్రు,లనఁగ నెంతటివా రితం డలిగెనేని.

క. కృపుఁడును గురుఁడు నయోనిజు, లపరిమితభుజాబలాఢ్యు లాహవకేలీ
నిపుణు లజేయులు వీరలు, కుపితాత్ము లైన మాఱుకొను నే హరుఁడున్. 210

క. ఈశ్వరవరజనితుఁడు హరి,దశ్వప్రతిమానతేజుఁ డస్త్రకళాని
త్యైశ్వర్యధురంధరుఁ డి,యశ్వత్థాము గలుగ మన కని వెఱ పేలా. 211

ఆ. సహజకుండలుండు శౌర్యధుర్యుఁడు సము,దీర్ణబాహుబలుఁడు కర్ణుఁ డింకఁ
గలఁడు వీని కెదురు గలరె యని యెన్నుమా, ధర్మపుత్రుపాల ధరణినాథ.

క. వినుము నరేశ్వర కర్ణుని, ఘనుపు మహేంద్రుండు వచ్చి ప్రియమున శచికై
తను నర్థింపఁగ నిచ్చెను, గొను మని లోకంబు లెఱుఁగఁ గుండలయుగమున్.

వ. వీర లాధర్మపుత్త్రాదులచేతనె కా దెవ్వరిచేతనుం జెడమి దెల్లంబు బాహ్లికసోమదత్త
భూరిశ్రవశ్శల్యసింధురాజగాంధారరాజప్రభృతిమహావీరులు వీరలకం టెను శక్తి
సమగ్రులు దక్కటిరాజలోకంబును సహాయులై వచ్చినవివిధదేశాధీశులును
నాతోడిసుఖదుఃఖంబుల కియ్యకొని యగ్గలికలై నగ్గలైన నుఱుకను సముగ్రం
బైన నీఁదను దెంపు సేసి పొంపిరి వోవుచున్నవారు గావునఁ బాండవులకు మా
దిక్కు దేఱి చూడనుం గొలంది గా దనుమానింపకు మిట్లునుం గాక మాకు
నెవ్వరును లేక చుట్టంబులును జెలులును విడిచి తోడవచ్చినవారును విచ్చి పోయి
భృత్యులును విరక్తులై వారికి పోటుమానుసులును బంధుమిత్త్రసహాయులును
బ్రజానురాగంబునుం గలిగినట్టిదైన నది ప్రాప్తకాలం బెంతియు కాని యే
మింక వారియడుగు లొత్తను బాఱి పోవనుం జాల మెల్లభంగుల సమరంబు
సేయుదుము తలపెట్టిన నాతలంచినట్లొండె వాసుదేవుండు దలంచినట్లొండె
నయ్యెడు నెట్లైన మే లింతవట్టును నిర్ణయం బని పలికి మఱియు నిట్లనియె.

తే. కులములోఁ దలవం పగుకూడు గుడువఁ, బంపఁ జూచెద వొకరులఁ బఱతు రట్టి
వారు పైనెత్తి వచ్చినఁ బోరి కోప, మనిన ధృతిచేట కాకఁ బొందగునె చెపుమ.

క. నీవు బలిమాలి కొడుకుల, చావునకును జేటునకును జాలక యిమ్మై
వావిడిచి యఱచినం గడు, నేవపడరె జనులు నిన్ను నే మన నేర్తున్. 216

తే. శ్రీముకుందుని నింతకష్టు చేసి, పెక్కుభంగులఁ జెప్పితి యుక్కు గలఁడు

గదకు నేర్చునం చెంతయు నెవ్వరెద తఁడు, నన్నుఁ బోలమి యెఱుఁగ వే నరవరేణ్య

చ. గద నాతో సరి మూఁడులోకముల నేఁ గానం జలం బెత్తి యు
న్నదుఁ డా భీముఁడు నన్ను నిం దొడరిన న్వజ్రప్రహారంబు పె
ట్టిద మై తాఁకినఁ గూలుపర్వతము మాఱ్కిం గుంభినిం గూల వ్రే
సెద నా కోర్కి గదాగదారణము నచ్చెం బెద్దకాలంబునన్. 218

ఆ. అతఁడు పడిన వెండి యా సేనఁ గొత్తల, సేయ నొకఁడు లేమి సిద్ధ మింత
యెఱిఁగి వెఱచి కాదె యేనూళ్లు తైనను, దమకుఁ జాలు ననియె ధర్మసుతుఁడు.

వ. అర్జునుండు గలం డని తలంచితి వేని. 220

తే. కర్ణుపడసినయాశక్తి గలుగఁ బోర, బ్రదుక వచ్చునె నరునకు నదియుఁ గాక
యతని భీష్మాదిరథికు లయతులితాస్త్ర, మేయ దివ్యబాణంబులు మ్రింగికొనవె.

వ. దుశ్శాసన దుష్ప్రహ దుర్ముఖ వివింశతి వికర్ణ చిత్రసేనాదు లగునీకొడుకు లొక్కం డొకండ జగంబు లెల్ల జయింపఁ జాలుదు రందఱు నొక్క మొగం బై త్రోచిన నడచిన సవ్యసాచి నొక్కరుని కాదు పాండవుల నెల్ల నొక్కట్టున నై చికొన నోపుదు రట్లునుం గాక మాకు నక్షౌహిణులు పదునొకండు వారికి నేడక్షౌహిణులు మా సైన్యంబు సారవంతంబు వారిబలంబు నిస్సారంబు వారు మ మ్మెవ్విధంబున జయింప నోపుదు రీయెక్కువ తక్కువలు విచారింపక వలవని వెఱపు గట్టికొని ముక్కూరి వగచు చున్నవాఁడవు నిన్ను వగవ కుండ నుడువం జాల మంతియ కాని తక్కెల్లపనులను జాలుదు మని పలికి. సంజయు దెసఁ గనుంగొని సుయోధనుం డి ట్లనియె. 222

క. నానాదేశంబుల బలు, మానసులం గూర్చికొని సమత్సరబుద్ధిం
దా నే మనియెను సవ్యా, సూనుం డాతని తెఱంగు సూతమ చెప్పుమా.

వ. అనిన విని సంజయుం డి ట్లనియె. 224

సంజయుఁడు దుర్యోధనునకు ధర్మరాజునిశ్చయం బెఱింగించుట.

ఉ. ఆతఁడు భండనం బనిన నార్చిన మూరెఁడు వేర్చు నెంతయుం
బ్రీతి వహించి తమ్ము లొకపెండ్లికిఁ బోయెదునట్ల యున్నవా
రా తెలి వెందునుం గలదె యందఱి నాయకు లెప్పు డొక్కొ మా
చేతులతీఁట వృత్తు మను చిత్తము కాని చలింప రేమియున్. 225

తే. నరుని పాశుపతాదిబాణముల పెంపు
భీముగదసొంపు నమ్మి యుద్ధామలీలఁ
జెలఁగి వెఱ పేది యక్కడిబలము మునురు
గవిసి యెపుడు గయ్యమునకుఁ గాలు ద్రవ్వ. 226

క. నాపుడు నిది యహా సం[illegible] [illegible]వారము [illegible] దీవ్ర [illegible]

లేవి రణసాధనమ్ములు, గా వెలవక నడచువారు । కౌరవులపయిన్. 227

వ. అనిన సుయోధనునకు సూతనందనుం డర్జునదివ్యరథ శ్వేతాశ్వ కపిధ్వజ దేవదత్తంబులమహానుభావంబులు వేఱువేఱ వర్ణించి చెప్పి యుధిష్ఠిర భీమ నకుల సహదేవులయరదంబులు తురంగాదిపరికరంబు లిట్టిట్టి వని యేర్పడం బలికి విరాట ద్రుపదాదులకు వలయునుపకరణంబులు గొఱంత లేమియు నెఱింగించిన ధృతరాష్ట్రుం డిందఱు గలబలుమానిసు లెవ్వారికి నసాధ్యులు వీరి సాధించుతెఱం గూహించిరే యని యడిగిన నతనికి సంజయుం డిట్లనియె. 228

సీ. గంగాసుతుండు శిఖండిపాలతనికిఁ । బ్రాపు మత్స్యేశ్వరు । బలము గుంభ
భవుఁడు ధృష్టద్యుమ్నుపాలతనికిఁ దోడు, పడు ద్రౌపదీపుత్రపంచకంబు
రారాజుఁ దమ్ములు । మారుతిపాలు కు,మారు లందఱు నభిమన్యుపాలు
శకునిసైంధవులు నశ్వత్థామకర్ణులు, ప క్కురుచేఁ బోవిరాదండిమగలు

ఆ. సవ్యసాచిపాలు । సాత్యకిపాలు కృత,వర్మ చేకితానవసుమతీశ
పాలు సోమదత్తుఁ । డాలంబునకు నిట్లు, నిశ్చయించి రచట । నృపవరేణ్య. 229

క. నకులుఁడు సహదేవుండును. శకుని నులూకాదిసుతుల । సారస్వతులం
బ్రకటబలు లైనకాళేం,గకులను సమయించువారు । కౌరవనాథా. 230

క. కేకయులు మనలఁ గలసిన, కేకయుల జయించువారు । కృతపుణ్యుఁడు సు
శ్లోకుఁడు ధర్మతనూజుఁడు, లోకోత్తరు శల్యుఁ డా గెలుచువాఁ డధిపా. 231

వ. అట్టిపలుకులసమయంబున నచ్చోటఁ గొందఱుజనంబులు ధర్మనందను నుద్దేశించి.

క. ఇతఁ డెక్కడ మద్రమహీ, పతి యెక్కడ నితని కతఁడు । పాటియె యనుడుం
బ్రతివచనంబుల శల్యుని, యతిబలశౌర్యములు వారి । కాతఁడ చెప్పెన్. 233

వ. ఇట్లు గాకయు నెవ్వరిమొగంబున నెవ్వరు వడిరి వారికి వారచాలి యుండువా రని యివ్విధంబునఁ గ్రొవ్వు మిగిలి కొఱంత లేని తెగువం దేజరిల్లుచున్నవారు నీకు నీకొడుకునకు నెయ్యది గర్జం బై తోఁచె నదియ చేయుం డనిన విని విచిత్రవీర్యతనయుం డిట్లనియె. 234

క. నాకొడుకుల కెక్కడి బ్రదు, కేకొలఁదిఁ దలంప నిప్పు । డెన్నిన వీరా
నీకంబు నోర్వ వచ్చునె, యీకూడినసైనికులకు । నే మనువాఁడన్. 235

క. రాజు యుధిష్ఠిరుఁ డై హరి, దా జయ మొడఁగూర్ప నున్నఁ దత్సైన్యము రా
రా జట్లు సరకుసేయమి, నాజన్మము దుఃఖభాజనం బగుటఁ జుమీ. 236

క. నా కుడుప నేల వశ మగు, నీకూడినభూపతులకు । నింతియ కాలం
బై కడచన్నది సంజయ. నీ కీవగ పేల యింక । నిలువుము పలుకుల్. 237

వ. అనిన విని దుర్యోధనుండు నిజజనకుతో ని ట్లనియె. 238

ఏమును బాండునందనులు ✽ నేకకులంబున బుట్టి యొక్కచో
నే మొకఁడై వఁ జేసి కడ ✽ నెప్డు చరించినయట్టివార ము
ద్దామబలంబు శౌర్యమును ✽ దర్పము వారికి కల్గి వార సం
గ్రామమునన్ జయింతు రనఁగా నొకనిశ్చయ మెట్లు గల్గెడున్. 239

వారిని వారివారి నిటు ✽ వర్ణన సేసెదు గాని మమ్ము మా
వారిఁ దలంప విప్పుడమి ✽ వారికిఁ బాయను మాకు సంతయుం
జేరను మున్ సృజించె విధి ✽ సిద్ధము దీని నొకండు మాన్పఁగా
నేరఁ డకారణంబ మది ✽ నెవ్వగ నేటికిఁ బట్టుకొల్పఁగన్. 240

వ. అనిన విని సూతనందనునకు నంబికానందనుం డిట్లను నా కొడుకు స్వతప్రలాపంబులు సేయు చున్నవాఁ డింతియ కాని సత్యధర్మనయపరాక్రమసహాయసంపన్నులైనపాండవులఁ దనకు గెలువ వచ్చునే తాను బ్రబలుం డయినను బెనఁకువ కీడ కాక మే లగునే యది యట్లుండె నొక్కటి యడిగెద సంజయా చెప్పుము. 241

క. సమరమునకుఁ బురికొల్పుచు, మముఁ దలఁచిన నుల్లికుట్టుకమాటలఁ దచ్చి
త్తము లుడికించుచుఁ బాండవ, సమితిం గడఁగించువారెచట నెవ్వారొకో. 242

క. నావుడు సంజయుఁ డిట్లను, దేవా పాండవులయలుక ✽ ధృష్టద్యుమ్నుం
డేవెరవుమాట నైనను, నేవోసినయగ్నిభంగి ✽ నిగుడం జేయున్. 24

వ. అతండు ధర్మతనయుతో నిట్లను గాంగేయకుంభసంభవాదిమహావీరక్రూరసత్త్వబహుళంబును గరిఘటాగిరికదంబకలితంబును దురంగనికరతరంగపరంపరాఘోరంబు నగుకౌరవసేనాసముద్రంబునకు నే నొక్కచెలియలికట్టనై నిలిచెద నన వుడు నయ్యుధిష్ఠిరుండు నీ వింతకుఁ జాలుట యెవ్వరు నెఱుంగరే యెట్లును సంగరంబున మ ముద్ధరింపు మనియె నిట్లు గొనియాడిన నాతండు నాదెసం గనుంగొని సంజయా మీవారల కెల్లనుం దెలియం జెప్పు మీశ్వరాదిదేవతలు సమకట్టినసవరణ గలయర్జునుచేత నిర్జింపంబడినయుత్కృష్టజాతు లనేకు లగుట యెఱుంగుదుర కాదె మనుష్యు లతని కెంతపెద్దయిట్టిజెట్టి వెన్ను దన్ని చూడఁ గలవాఁడు గావున మముబోంట్లెల్లఁ బోక పెనంగినం బోరు భరం బైనం బ్రాణంబులపై వచ్చునంతకంటెను బరమదయాపరుండైనపాండవాగ్రజుమఱువు సొచ్చి బ్రదుకుం డను మంతలంతలు దప్పులు సేసితి మని తలంకపలవ దెంతలు సేసినను గాంతేయపూర్వజుండు శాంతిసుధానిధి యగుటం జేసి శరణు సొచ్చినం గాచు నని పలికె ననిన విని ధృతరాష్ట్రుండు దుర్యోధనున కిట్లనియె. 244

క. పరిజనులకు నీకును ని, ద్ధరలోన సగంబు సాలుఁ ✽ దక్కటిసగముం
గర ముచితంబుగఁ బాండవ, వరుఁ డగుధర్మజున కిచ్చి ✽ బ్రదుకుము నెమ్మిన్.

ధృతరాష్ట్రుఁడు దుర్యోధనుతో సంధి సేయు మని చెప్పుట.

చ. పెనఁకువ నాక యేల మనపెద్దల కెవ్వరి కియ్యకోలు గా
దనుచితవృత్తి గాన గురుఁ డాదిగ నాప్తులు బంధుమిత్రులుం
గొనకొని పోరికిం జొర రకుంఠితతేజుఁడు ధర్మపుత్త్రుఁ డా
తనిఁ దగఁ గూడి మన్కి ప్రమదం బగుఁ గౌరవజాతి కెంతయున్. 246

వ. అని వెండియు. 247

క. కర్ణుండు రేఁచి పెట్టఁగ, దుర్ణయపరు లైనశకుని దుశ్శాసను లీ
నిర్ణయమె మే లనఁగ నీ, కర్ణములకు నింపు వెట్టు కార్యవచనముల్ 248

వ. అనినఁ గటకటంబడి సుయోధనుం డి ట్లనియె. 249

క. నీచెప్పెడి పెద్దలు ద్రోణాచార్యులు మొదలు గాఁగ నని కొల్లనివా
రై చేరనివారిం గాని, యే చక్కం బెట్టువాఁడ నేఁ బాండవులన్. 250

శా. రాధేయుండును దుస్ససేనుఁడును బోరం బ్రాపుగాఁ బాండవ
క్రోధజ్వాలల నార్పఁ నొంటిగఁడు నాకుం దోడె నీ వింక నన్
బాధం బెట్టకు వాఁడినూడిమొన మోకపం జాల్పునం త్రైన నే
సీధాత్రీతల మిాను వారలకు నాకే లింతసేగిం బడన్. 251

వ. అనిన గాంధారీవల్లభుం డతని కి ట్లనియె. 252

ఆ. నీకు నంత వగవ నీవొప్పు లెఱుపుదుఁ, బోవువారు గాఁగఁ బూని యున్న
వారి కెల్ల నేను వగచెదఁ గర్ణుండు, వలవ దుడుగు మయ్య చలముకొనక.

చ. ఉభయబలంబులుం బొగడ నుగ్రత భీముఁడు విస్ఫురద్గదా
రభస మెలర్పఁ గుంభములు వ్రయ్యఁగ వ్రేసిన నెత్తు రొల్కఁగా
నిభములవెంట గావిసెల యేఱులతోడి నగంబులట్లు సం
క్షుభితము లై పడుం బడఁ జూచి తలంచెదు నాదువాక్యముల్ 254

చ. ఉఱక ధనంజయుండు వివిధోగ్రశరంబుల నొక్కమాత్ర నే
ర్పెఱ నుఱుమాడినం బడమిఁ ద్రెళ్లిన నీ దగుసైన్య మంతయుం
జఱికినఁ బద్ధఘోరవివిధసంధిసిద్ధంబున మన్నఁ జూచి యు
త్తఱి నయినం దలంపు ముచితం బగు నావచనంబుఁ బుత్త్రకా. 255

వ. అని పలికి యతనివలనం బెక్కు గానక మనంబు మరలం బెట్టికొని కొడుకులు జయింప నోపుదురో లేదో యనునాస సంజయుదిక్కు మొగంబు సేసి పాండవకౌరవ పక్షంబులం గలవారి సహాయులం గొలందులు దలపోయుచు నాతనివచనంబులం దనవివారంబులకు బలాబలంబులు నిశ్చయించి పాండవేయు లెక్కుడవుట వెలిఁగింపుచుఁ గృష్ణుని నాపూతపుత్త్రుతో లెక్కలు వెట్టుచుం బోలించుచుఁ బెద్దప్రొద్దు వితర్కించి కౌంతేయులశక్తి దేవతలశక్తియు గాంధారేయులశ

మానుషశక్తియుం గాఁ దెలిసినవాఁడై యంబికానందనుండు నిజనందనునితో నిట్లనియె. 256

క. నరుఁ డగ్నిదేవుఁ దనకును, వరమునిఁ గాఁ గొలిచినాఁడు । వానికిఁ గేశవు
స్ఫురణం బాదిగఁ గలసం, గరపరికర మెల్ల నతఁడు । గావించె దయన్. 257

వ. అదియునుం గాక ధర్మదేవతయు వాయుదేవుండును వాసవుండును నాశ్వినులును వారలకుఁ బాండురాజుతోడివారలు వారి నొకకీడునుం బొరయకుండ రక్షింతురు గావున భీష్మద్రోణప్రముఖులకుఁ బాండవులం బరిభవింప రామి యెల్లంబు. 258

క. దేవత లేటికిఁ బార్థుఁడు, దేవసముఁడు గాఁడె వాఁడు । దివిజులచేతం
బోవని దైత్యులఁ జంపఁడె, యీవును నీవాడు నతని । నెఱుఁగరె చెప్పుమా. 259

వ. కౌరవులకు వచ్చినయిమ్మహాభయంబునకుఁ బ్రతీకారంబు శాంతిం గడచినయది లే దెన్నిభంగులం జూచినఁ గయ్యంబు దుడుకుటయు మనకుం గర్తవ్యంబై యున్నయది యుపశమింప వచ్చు దీర్ఘవైరంబు నలవ దనినఁ దండ్రికిఁ గొడు కిట్లనియె. 260

క. దేవత లర్జునునకుఁ దోడై వత్తు రనంగ నలవ । దది యె ట్లనినన్
దేవత్వము రాగద్వేషావేశము లేమిఁ గాదె । యైనది మొదలన్. 261

వ. కావున వా రొకనిపక్షపాతులై పూని వత్తురయేని నది దేవత్వంబు గా దట్టిదేవత్వంబున నర్జునుండును సురక్షితుండు గా నేరఁడు నీకు నాపనికిఁ జింత నలవ దని పలికి వెండియు ని ట్లను నెఱిఁగి వచ్చు నార్చిచ్చు నుడుపను బాషాణవర్షంబు వారింపను మహావాయువు నిలుపను నీళ్లు గట్టిగా నభిమంత్రించి వానిపైఁ గరితురగాదుల నడిపింపను నానేన నడచునప్పుడు వలసినచోట జలంబు లుత్పాదింపను జాలుదు సింహశరభశార్దూలభూతబేతాది క్రూరసత్త్వసంరంభస్తంభనప్రకారం బెఱుంగుదు మిత్రశత్రువిషయంబు లైనశుభాశుభంబులు వలయుభంగి నావహింప నేర్తు మఱియు నానావిధసిద్ధిప్రదంబు లగుమంత్రధ్యానాద్యనుష్ఠానంబుల నాకుం గొఱంత లేదు నీచెప్పినయగ్నిప్రముఖదేవతలం బ్రసన్ను లగునట్లు గా నారాధించినవాఁడ వారికి నాకుంబోలె మహానుభావంబు గలిగినఁ బదుమూఁడువత్సరంబు లబ్బంగి నిడుమలం బడుదురె వినుము చెప్పెద. 262

దుర్యోధనుఁడు తండ్రితోఁ దనబలపరాక్రమంబులు చెప్పుట.

క. ఏ నలిగినవారిని సుర, లైనను రక్షింప నోప । రమరు లలిగినం
బూని చెడకుండఁ గాతును, మానవు లొకసరకె నాకు । మనుజాధీశా. 263

తే. గర్వమున నాడుమాటలుగాఁ దలంప, వలవ దిది యెల్ల నిక్కంబు । వసుమతీశ
నన్ను నేఁ జెప్పికొందునే । యెన్నఁడైన, నాత్మసంస్తుతి పౌరుషం । బగునె చెప్పుమ.

వ. ధర్మతనయాదిపాండవేయులును ద్రుపదాదిపాంచాలురును విరాటాదిమాత్స్య

లును వాసుదేవాదియాదవులును మఱియునుం గేకయ పాండ్య మాగధ చైద్య ప్రముఖనిఖిలదండనాయకులును నా కారిం బడి మున్నీరు సొచ్చినయేఱులచందంబున నడంగిపోవుట యవధరించెదు గాక వా రెల్లఁ దేజోధైర్యపరాక్రమోపాయ విచారవివేకంబుల నామెచ్చు వత్తురె పితామహద్రోణకృపాశ్వత్థామలు శస్త్రాస్త్ర విషయంబులుగా నేమేమి యెఱుంగుదు రంతెంత నేర్తు రది యెల్ల నెఱుంగుదు నంతయు నేర్తు నని పలికి యుండలు వెఱఁగుపడి యుండం దాను సంజయుతో సంగరంబు తెఱంగు నాలోచనంబుగాఁ బాండవులదెస మాట లాడుచుండఁ గర్ణుండు ధృతరాష్ట్రుం గైకొనక ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా ని ట్లనియె. 265

క. గురునలుక నాకు నస్త్ర, స్ఫురణ మెడలె నండ్రు జనులు ◊ బొంకది పూజా
పరతమెయి నమ్మునీశ్వరు,కరుణ గోఱలి మగుడఁ బడయఁ ◊ గాంచితిఁ బ్రీతిన్.

ఉ. కావున నస్త్రశస్త్రము లఖండితసంపద నొంది యుండు దే
వావలి కైన నన్నుఁ జెనకయఁగ భర మేఁ గలుగంగ నర్జునుం
జే విడిపించు మేదినిఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగా
నీవు బలంబు మెచ్చ నని ◊ నిల్చెద గెల్చెదఁ బాండవేయులన్. 267

శా. గాంగేయాదులు నీకడకఁ నిలిచి నేఁడ్క్యం జూడఁగా సర్వసే
నాంగాంగంబులమీఁద గాలియును జొరట్టాడంగ నీ కేను వీఁ
కం గాంతేయులఁ దాఁకి తత్తనువు లుగ్రస్ఫారబాణాలిఁ గూ
లం గోదండవిలాసముల్ మెఱయ లీలం బోరఁ గ్రీడించెదన్. 268

వ. అనిన విని యినవందనునకు మందాకినీనందనుం డి ట్లనియె. 269

క. కాలుఁడు పేరిరేపఁగ నిటు, పేలినయంతటన నిన్నుఁ ◊ బెద్దగఁ దలఁపం
బోలునె మాకును నుడుగుము, చాలుదు వీ వెల్లపనులు ◊ సాధింపంగన్. 270

ఉ. కూలెదువారె పాండవులు ◊ ఘోరపుఁబోర నొకండొకండ యీ
చాలెడువార లెల్ల మును ◊ చావఁ గ్రమంబున సేన లన్నియుం
గూలఁగఁ గౌరవుల్ పిదపఁ ◊ గూలుదు రింతియ కాక నోరిచే
చేల వృథాభిమానమున ◊ నిన్నియుఁ బ్రేలెదు సూతనందనా. 271

తే. దివిజపతి నీకు నిచ్చినదేతి వ్రశక్తి
చేతఁ గవ్వడి వడు నని ◊ చూతువేని
వాసుదేవునిచే నది ◊ వ్రయ్య లయ్యుఁ
దునియ లయ్యును బొడి యయ్యుఁ ◊ దొరఁగు ధరణి 272

క. సర్పముఖశరము గల దను, దర్పంబునఁ గ్రీడిఁ దొడరఁ ◊ దలఁపకు హరి పెం
పేర్పడఁగ నదియు కా దట, తీర్పవలయువాని నెల్లఁ ◊ దీర్చు నరునకై. 273

వ. అని పలికి ధృతరాష్ట్రునితో ని ట్లనియె. 274

జ్ఞాతులు దమలోఁ బొందినఁ, జేతోమోదమున వెలిఁగి ¦ చెలు వొందుదు ర
న్నీతిం బాసిన విగతవి,భూతిం గడుఁ గొఱవులట్ల ¦ పొగయుదు రధిపా. 275

వ. కావునఁ దమలో విరోధం బొప్పదు సరిభాషణసహభోజనాదిసత్కారంబులను సవినయవర్తనంబులను బ్రీతులైన జ్ఞాతు లిహపరార్థసాధకు లగుదు రని చెప్పి వెండియు. 276

క. విను మే నొకశైలమునకు, మును భూసురవర్గసహితుఁడ ¦ నొకపనికిం
జనునెడఁ జన గానితటంబున నొకజున్నుండె దానిఁ ¦ బొగడిరి తజ్జ్ఞుల్. 277

తే. దీని దేనియఁ ద్రావినమానవులకు
జరయు రుజయును దప్పియుఁ ¦ జావుఁ గలుగ
దనఁగఁ గొందఱు బోయలు ¦ విని కడంగి
యుఱక మొఱకులై చఱిఁ బడి ¦ నుఱికి రపుడు. 278

వ. ఇట్లుఱికి మృతిం బొంది రట్లపోలె నవినీతులైన నీకొడుకులు పుడమి యెల్లను దార యేలుతీపుఁ జూచెదరు గాని తమపాలిసిపోవుటం గానరు వీర లర్జును క్రోడం బెనంగి మానప్రాణంబులు దక్కించుకొనువారె యట్లుం గాక సమబలులైననుం గయ్యంబునఁ గదా వీరౌదురు వా రౌదు రన వచ్చు నది యేల నీలోనికి ధర్మనందనుం దెచ్చికొనుటయ నీకుఁ గర్తవ్యం బనిన బాహ్లికుండు ధార్తరాష్ట్రున కి ట్లనియె. 279

క. కను బ్రమసిన తెరువరి తన, కనపాయం బైనమార్గ ¦ మరసి తగ నెఱిం
గినవారు సెప్పఁగాఁ గై, కొననికరణిఁ దగిన వెంటఁ ¦ బోవ వకటా. 280

వ. అనిన వైచిత్రవీర్యుండు దుర్యోధనున కి ట్లనియె. 281

మ. కొడుకా యే నెఱుఁ గట్ల బాహ్లికుఁడు నీకుం గూర్చు భీష్ముండు నీ
యెడ సస్నేహుఁడు వీరిమాట వినుమే ¦ మీ మువ్వురున్ మన్ననల్
వడయంగాఁ దగునట్టివారము నినుం ¦ బ్రార్థించెదన్ ధర్మజున్
విడువంగాఁ దగ దిమ్ము వారలకు నర్ధోర్వీం బాలు నెమ్మిం దగన్. 282

క. అనినను వెండియు నొడఁబా, టునకుఁ బోరనిదానికిం ¦ గొడుకుతోడఁ గడుం
గినిసి ధరణీశ్వరుం డి, ట్లనుఁ గొలువున నున్నవార ¦ లందఱు వినఁగన్. 283

తే. బవరములు గావె విఱిగినఁ ¦ బోర వాఁడు, వచ్చునే యుక్కరుండు వికర్ణుఁ డసురి
వసులఁ బెట్టించునప్పుడు నిజబలము విఱుగ, దయ్యనే నిప్పు గర్ణుండు ¦ [illegible] చేరె.

వ. అని రాధేయు దిక్కు మొగం బై మఱియు ని ట్లనియె. 285

ఆ. నాఁటికొలఁది గాదు ¦ నారాయణుఁడు నొగ. లెక్కఁ గెలన భీముఁ ¦ డేచి నడవ
ననుజతనుజసహితుఁ ¦ డై వచ్చు వివ్వచ్చు, మార్కొనంగ నశక్యము ¦ మనకుఁ గర్ణ.

చ. బలమును దర్పముం గొ మెఱయ । బంటుతనంబున నీవు పాండవే
యుల నని మార్కొనం గడఁగు । టొప్పదు తెం పగుఁ జచ్చి శుద్ధుఁ డై
పలుకులు మాన్పు భృత్యుఁ డనుపాటి దలంచెద విట్లు మేలె య
చ్ఛలమున నీసుయోధను । చావున కోర్చుట గాదె యింతయున్. 287

వ. అనిన విని శాంతనవుండు సంక్షుభితమానసుం డై యిది యెల్ల ని ట్లయ్యె నిట్లుం గాక తక్కినయది యు ట్లుండె నదీసూనుండు నన్ను నిరాకరించి పలికినపలుకులఫలం బనుభవించుఁ గాక యని యతని నుద్దేశించి యి ట్లనియె. 288

కర్ణుఁడు భీష్మునిపై రోసముచేత నస్త్రసన్న్యాసంబు సేయుట.

తే. నీకు నాలావుఁగోల్పాటు । లేక యుండ, వలయు నీ తెగునంతకుఁ । గలన నిలువ
నాయుధంబులు విడిచితి । నంతమీఁద, మెఱసి బలవిక్రమంబులు । నెఱపువాఁడ.

వ. అని శస్త్రసన్న్యాసంబు సేసి కొలువున నిలువ నొల్లక దిగ్గన లేచి పోయె నట్టియెడ శాంతనవుండు నవ్వుచు దుర్యోధనునితో ని ట్లనియె. 290

క. అంతకుఁ జాలఁడె కర్ణుం, డింతకు మును బాస యిచ్చి । యెన్నఁడు బొంకం
డింతటిమానిసి యలిగినఁ, గౌంతేయుల కెట్లు బ్రదుకఁ । గా వచ్చు ననిన్. 291

క. అని వెండియు ని ట్లను నా, తనిమాటల కెట్లుఁ గడఁగి । ధర్మతనయుతో
నని సేయక తక్కవు నీ, వనుమానము వాయఁ జూడు । మతనిని నన్నున్. 292

వ. ఏను బాహ్లికద్రోణప్రముఖులు గనుంగొను చుండఁ బ్రతివీరుల ననేకసహస్రంబుల సమయించెదఁ బిదప రాధేయురణంబునుం జూచెదవు గాక యనిన విని దుర్యోధనుండు కర్ణపక్షపాతియు నవినీతుండును నగుటం జేసి సహింపక పితామహునితో ని ట్లనియె. 293

చ. ఎఱిఁగి యెఱింగి యుండె మది । నేది యెఱుంగక యుండె నెప్పు నం
దఱు వినఁ బాండునందనులు । దర్పితు లై యని గెల్తు రండ్రు ముం
దఱ నిను బాహ్లికుం గురునిఁ । దక్కటివారిని నమ్మి యేను నే
డ్తెఱ నని సేయఁ బూనితిఁ । గడిందిమగంటిమి తోడు సాలదే. 294

ఉ. కర్ణుఁడు దుస్ససేనుఁడును । గల్గఁగ నా కొరు లేల సద్భటా
కీర్ణవిరోధిసైన్యముల । గెల్వఁగఁ జాలుదు మేము మాకు నీ
యర్ణవవేష్టితక్షితి య । నర్గళవిక్రమ మొప్ప దక్కు మా
నిర్ణయ మెల్ల నిట్టి దవి । నీతియొ నీతియొ చూచుమీ తుదిన్. 295

క. అనుపలుకులకు విషాదము, దనుకఁగ ధృతరాష్ట్రవిభుఁడు । దననందను నే
మనియుం బలుకఁగఁ జాలక, వెనుఁబాటున నిట్టు లనియె । విదురునితోడన్. 296

తే. మృత్యుపాశోపహతుఁ డయ్యె । మీఁదు లేక
సూతనందనుతోఁ గూడి । నాతనూజుఁ

ఉత్కట నాశంబుఁ బొందువాఁ డయ్యె మనకు
నింకఁ జేయంగ నగుపని యెద్ది చెప్పుము. 297

వ. అనిన విని విదురుం డతని కిట్లను మనవారలు మున్న దుర్బలులు తమలోనం జెనంకువ లయి విరసవచనంబు లాడుచు నింతలు పుట్టించుట యది యర్జునునకుఁ గార్యం బింతియ కాక యే మనువారము వారలు బంధుమిత్త్రసహాయులుం దారును నొక్కతలంపువార లయి యున్నవారు వలవనియీవెంగలిమాటలు విడిచి పాండవులం బిలువం బనిచి తగవు నడపుట దక్క మనకుఁ జేయం దగుపని వేఱొండు గలుగునే యని చెప్పిన ధృతరాష్ట్రుండు సంజయుచెప్పినకార్యవచనంబులకొఱంత వినం గలవాఁడై యతనిదిక్కు మొగంబు సేసి. 298

క. మును వరుసతోఁ దనతలఁచినయన్నియు నీవు వినఁగఁ జెప్పి తగవుమై
నిను వీడుకొల్పు నెడ నర్జునుఁ డే మని నిశ్చయించెఁ జాతము చెప్పుమా. 299

క. అని యడిగిన సంజయుఁ డిట్లనుఁ దుదిఁ బార్థుండు నిశ్చయము సేసి సుయో
ధనుతో నిందలిపెద్దలు వినఁగా నను మన్నపలుకు వినుము నరేంద్రా. 300

మ. కురువంశోత్తముఁ డైనధర్మజుఁడు నాకుం దండ్రిపాలిం దగున్
ధరలో నా మని తాన పల్కి వినియుం దర్పంబుమై నీకత
క్కర మేనిం బటులాస్మదీయవిశిఖాగ్నిజ్వాలలం దాపుటల్
వరుసం బెట్టుము ధార్తరాష్ట్రతతి నైశ్వర్యం బవార్యంబుగన్. 301

వ. అని పలికి కౌఁగిలించికొని భూషణాంబరాదికమనీయవస్తువు లొసంగిన నేనునుం బాండవులను వాసుదేవుని సవినయంబున వీడ్కొని యింతవట్టును దేవరకు నెఱిం గింప వేగంబ వచ్చితి ననిన నమ్మాటలు దుర్యోధనుం డాదరింపక పెడచెవులం బెట్టె ధృతరాష్ట్రుండును ఱిచ్చవడి యూరకుండె నప్పు డయ్యిరువురపాలను సంజయుం డొక్కరుండు దక్క నయ్యాస్థానంబున నున్నసమస్తజనంబులును దిగ్గన లేచి తమతమనివాసంబులకుం బోయిరి తదనంతరంబ. 302

క. తనుజవశవర్తి యగున, మ్మనుజేంద్రుఁడు దనసుతుండు మర్దింపఁగ నో
పునొ యనిఁ బాండుతనూజుల, ననుమతి సంజయునితోడ నాడె దురాశన్.

సీ. ఈరెండు వీఁకలతారతమ్యంబులు, నెఱుఁగుదు వారైన నెవ్వ రోర్తు
రిది నిశ్చయింతమే యెందు నుపాయంబుఁ, బౌరుషంబును గలవారు గలరు
సూతసుత చెప్పు మన్న సూతనందనుఁడు న, న్నడిగెద వే నొంటి నేమనఁగవలదు
మీయయ్య సాత్యవతేయుఁ డీయెడకు వేంచేయునట్లుగ భక్తిఁ జేసి తలఁపు

తే. పిలువఁ బంపు గాంధారి వారలు వినీతిరతులు నిశ్చయవిదులు ధర్మజ్ఞచిత్తు
లుల్లమున నీకసూయాదు లొదవవేని, వాని మాన్పంగ నేర్తురు మానవేంద్ర.

కృష్ణద్వైపాయనుఁడు ధృతరాష్ట్రునియొద్దకు వచ్చుట.

వ. అనిన విని యంబికానందనుం డట్లకాక యని యొకకంచుకిం బిలిచి వానిం బుచ్చి గాంధారి రావించి సద్భక్తితాత్పర్యంబునఁ గృష్ణద్వైపాయనమహామునిం దలంచిన దివ్యబోధమహనీయుం డైనయమ్మహాత్ముండు విజయంచేయుటయు నందఱు దండప్రణామంబులు సేసి సమున్నతాసనంబున నునిచి యర్ఘ్యపాద్యాదివిధులం బూజించి యున్నసమయంబున ధృతరాష్ట్రుండు విన్నపంబు సేయక మున్న యమ్మహాపురుషుండు ధృతరాష్ట్రసంజయులచిత్తవృత్తులు దాన యెఱింగినవాఁ డగుటం జేసి సంజయువలనఁ బ్రసన్నదృష్టి నవలోకించి యతని కిట్లనియె. 305

క. నీవు సమస్తము నెఱుఁగుదు, గావున నీ కూరకుండఁ గాఁ దగదు ధరి
త్రీవల్లభుఁ డడిగినపని, యీవిధ మని తెలియఁ బలుకు మేము వినంగన్. 306

వ. అనిన బ్రసాదం బని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 307

క. ఆసేనకు నీసేనకు, వాసి యడిగెదవు నన్ను వసుదేవసుతుం
డాసేనఁ గలఁడు తత్సము, నీసేనం జూపుమా నరేశ్వర నాకున్ 308

వ. వాసుదేవుం డెట్టివాఁ డని యడిగెదేనిం జెప్పెద. 309

చ. జగముల నన్నిటిం దనవశంబుగఁ జేసినవీరు భంగమున్
బగయు లలాటలోచనుఁడు నాపఁగఁ జేర్చినయట్టిబాణు నొ
క్కగడియలోన గర్వ మడఁగం బరిమార్చె సురేంద్రకల్పకం
బు గరములీలఁ దెచ్చె హరిభూరిపరాక్రమ మప్రసిద్ధమే. 310

ఆ. అధికదుష్కరంబు లైనకార్యంబులు, క్రీడవోలెఁ జేయుఁ గేశవుండు
విను మతండు పార్థు నెనసి యేకార్థుఁ డై, యుండుఁ బూర్వభవసఖుండు గాన.

వ. అట్టి వాసుదేవునిచక్రంబు నిజమాయాబలంబునఁ బాండవుల సర్వసమరసాధనంబులయందును సూక్ష్మరూపవ్యాప్తి నై నిలిచి వారికి విజయం బొసంగుచుండు నని చెప్పి మఱియు నిట్లనియె. 312

క. పలుమఱుఁ బాండుతనూజుల, కొలఁది వితర్కించెదవు నిగూఢం బదియుం
దెలియం బలికెద వారికి, బలమును సత్త్వంబు హరియ పార్థివముఖ్యా. 313

వ. హరిమహత్త్వంబు విన్నవించెద నవధరింపుము. 314

క. ఒకతల సమస్తజగములు, నొకచోట జనార్దనుఁడు నిలిచి యొకతల యైనన్
సకలము నసారమాత్రం, బొకనిసారంబు చాల నుత్కృష్ట మగున్. 315

క. తలఁపునన వాసుదేవుఁడు, గలిగింపను నిలుప నడఁప గానోపు జగం
బుల, మఱియును గ్రీడార్థము, పలువోకలఁ బుచ్చుచుండుఁ బౌరవనాథా. 316

క. ఎక్కడఁ నడచును సత్యం, బెక్కడ ధర్మంబు పరఁగు నెక్కడఁ గలుగుం
జక్కటి నిలుచుం గృష్ణుం, డక్కడ నతఁ డున్నకడన యగు జయ మధిపా. 317

సీ. పురుషోత్తముం డెల్లభువనంబులును దాన, యఖిలభూతాత్మకుం డై విహార

లీల విచేష్టించు • నీలోకముల మాయ, దొట్టి యొక్కొకమరి • పుట్టి పెరిఁగి
కర్మానుచరణముల్ • గైకొని వర్తించు, శిష్టరక్షణమును • దుష్టనిగ్ర
హంబును దనపను • లగుటఁ బాండవుల నె, పం బిడుకొని ధర్మ • బాహ్యులైన
తే. నీతనూజుల నిక్కము • నిగ్రహింపఁ, దలఁచినాఁ డమ్మహాత్ముండు • దథ్య మితని
నిట్టిచందంబువాఁ డని • యెఱిఁగి యెన్న, రాశ్రయింతురు బ్రదుకుదు • రట్టివారు.
క. అనవుడు ధృతరాష్ట్రుఁడు విష్ణుని నే నెఱుఁగనివిధంబు • నీవుం దెలియఁగ నీ
కని యున్న తెఱఁగుఁ జెప్పుము, యనుటయు సూతసుతుఁ డిట్టు • లను నాతనితోన్.
వ. విద్యయు నవిద్యయు ననఁగా రెండు గల వవిద్యాదూషితుం డై తమోగ్రస్తుం
డైనవాఁడు విష్ణు నెఱుంగఁడు విద్యాసంపన్నుం డెఱుంగు ననిన విద్య యనునది
యెట్టిది యెద్దాన నీ వాసర్వేశ్వరు నెఱింగితి దాని నవిద్య యెట్టిది దానిని జెప్పు
మనుటయు నాంబికేయునకు సంజయుం డిట్లనియె సాత్త్విక రాజస తామసవికా
రంబుల తెప్పలం బడక ధర్మం బాచరించుచు భావశుద్ధి గలిగి యుండుదు దీన నే
నచ్యుతు నెఱుంగుదు విద్య యిట్టిది నీకునుం దక్కొవ్వరి కైనను నతని నెఱుం
గుటకు నిదియ తెరు విట్టిది గానివిధం బవిద్య యని చెప్పిన నతండు నిజనందనుని
కిట్లనియె. 320
క. ఘన కాప్తుఁడు సంజయుఁ డీ, తనియుపదేశంబు పట్టి • ధర్మమున ముకుం
దుని నాశ్రయింప వయ్యా యు, తనిఁ జొచ్చిన బ్రదుకు దీవుఁ • దమ్ములు సుతులున్
చ. అనిన సుయోధనుండు దమ • యయ్యకు నిట్లను నిజ్జగంబు ల
న్నిని నొకపెట్ట మ్రింగినను • నెట్టన సర్వము గాచె నేనియు
న్వినుము ముకుందుఁ డర్జునుని • నెచ్చెలి నాఁ జెవు లార వింటి నిం
క నతని నొక్క మానుసుఁ • గా ధృతిఁ బెంపఱ నాశ్రయింతునే. 322
తే. అనిన గాంధారి కిట్లను • జనవిభుండు, నీతనూజుండు దుర్మాని • నీతిబాహ్యుఁ
డుద్ధతుం డీసు మాని నా • బుద్ధి వినఁడు, వీఁడు సెడుఁ గాని బ్రదుకంగ • లేఁడు సుమ్ము.
ఉ. నావుడుఁ దల్లి యిట్టు లను • నందనుతో విది యేల యాయువుల్
శ్రీవిభవంబులన్ మము న • శేషసుహృజ్జనులం దొఱంగఁగా
నీవు గడంగె దిట్టియవినీతులునుం గల రే వృకోదరుం
డై విధి సంపఁగా నొగుల • గాఁగఁగ వచ్చునె యింకఁ బుత్రకా. 324
వ. అనియె నట్టియెడఁ గృష్ణద్వైపాయనుండు ధృతరాష్ట్రున కిట్లనుఁ గృష్ణుండు
సకుంఁ గూర్చు నీవుం బరమాప్తుం డైన సంజయు నతనిపాలికిం బుచ్చి తదీయ
కార్యం బయ్యె వీఁడును నమ్మహానుభావుమహనీయప్రభావం బున్నరూపు నెఱుంగు
వీనిబుద్ధి విని యద్దేవు నాశ్రయింపు మతం డేకాగ్రచిత్తులై యారాధించిన
వారికిఁ జేరువ యగుఁ గామక్రోధోపహతులై తమతమధనంబులం దృప్తులు

గాక యన్యాయంబున వర్తించువారలకు దూరం బై యుండు నెల్లభంగుల
నాతనిం జొచ్చి బ్రదుకు మనినం బ్రసాదం బట్ల చేయుదు నని విచిత్రవీర్యనంద
నుండు సూతనందనునితో నన్వాసుదేవనామనిర్వచనంబు నాకుం జేటపడం
దెలిపి యతనిం బొందునుపాయం బుపదేశింపవే యని యడిగిన. 325

తే. ఎల్లయందును దా వసియించు నెల్ల
యదియుం దనయందు వసియించు నండ్రు వాసు
దేవుం డనుపేరి కర్థంబు దెల్ల మింత
యెఱుంగుజనులందుం దగ వసియించు శుభము. 326

తే. అతనిం బొందునుపాయంబు లంతరంగ,నిగ్రహము గాంగ నార్యు లనుగ్రహింతు
రోపి చిత్తవికారంబు లుడిపి యేక,బుద్ధిం గొలువం బ్రసన్నతం బొందు నతండు.

వ. నీవును బలుబుద్ధు లుడిగి గోవిందు నాశ్రయింపు మనినం బ్రజ్ఞాచక్షుం డిట్లనియె.

క. నాకు నయనేంద్రియముగతి, లేకుండుట కంతవగపు లేదే యఖిలమనో
జ్ఞాకారుం డైనహరి నా, లోకింపం గానమికిం గలుగు వగ యెప్పుడున్. 329

ఉ. అతనిం గన్నులారంగ నహర్నిశముం గనుంగొంచు నుండువా
రేతప మాచరించిరో యుపేంద్రుని నాశ్రితవత్సలుం బిని
ర్ధూతకలంకు ధర్మనిరతుం గరుణాకరు సర్వలోకవి
ఖ్యాతుం బవిత్రమూర్తి శరణాగతరక్షకు నాశ్రయించెదన్. 330

వ. అని పలికి పరమశాంతుం డై పారాశర్యు నుద్దేశించి దేవా యేను వాసుదేవుని
శరణు సొచ్చి బ్రదుకువాండ ననుచుం గృతాంజలి యగుటయు వ్యాసమహాము
నియు నాశీర్వాదంబు సేసి యంతర్హితుం డయ్యెం గౌరవేశ్వరుండును దుర్యోధన
సంజయుల నిజనివాసంబులకుం బోవం బనిచి తానును గాంధారియు నభ్యంతర
మందిరంబున కరిగి యుచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచు నుండె నని చెప్పిన
విని పదంపడి పుట్టినవిశేషంబు లెట్టి వని యడిగిన. 331

శా. నిత్యానిత్యవివేకవైభవసమున్నిద్రాంతరంగస్ఫుట
ప్రత్యక్షా పరమేశ విశ్వజగదారాధ్యా మహానందచి
త్సత్యానందవిభుస్వభావమహితా సంవిత్సమాధానదా
ర్గత్యవ్యాహృతిసంప్రవర్తనవిదగ్ధశ్రీపదాంభోరుహా. 332

క. వ్యాసాదిమునిప్రోక్తమ, హాసందర్భాప్రమేయతారూఢగుణో
ల్లాసా నైర్గుణ్యసము, ద్భాసి రహస్యానుభావ భక్తాధీనా. 333

మాలిని. నమదనిమిషచూడానవ్యరత్నప్రభాసం

గమరుచిరపదాబ్జా! గర్వదుర్వారదైత్యో
ద్యమబహులతమోమార్తాండ దోఃక్రీడనప్ర
క్రమ లలిత వికాసా! గాఢభక్తప్రకాశా 334

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీమహాభారతంబునయుద్యోగపర్వంబునందు ద్వితీయాశ్వాసము. 335

శ్రీ

హరిహరనాథాయ నమః

# శ్రీమదాంధ్రమహాభారతము.

## ఉద్యోగపర్వము, తృతీయాశ్వాసము.



వాగ్విభవారోగ్య
ప్రావీణ్యప్రాభవానుభావ మహితసౌ
ఖ్యావహపద స్మరణ కరు
ణావాసకటాక్షకిరణ హరిహరనాథా. 1

### శ్రీకృష్ణునిరాయబారము.

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 2

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ
సుతుఁడు మఱునాఁడు దమ్ముల సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి
యెల్లవారును విను చుండ నిట్టు లనియె. 3

క. మనము జనార్దనుపాలికిఁ, జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు బంధుహితగురు, జనములతో రణము గాక సంప్రీతి యగున్. 4

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరంబున కరిగి యతనిచేత
సత్కృతుం డయి సమస్తపరిజనంబులుం బరివేష్టింప నొక్కపార్శ్వంబునం
బాంచాలియు సముచితపరివారపరివృత యై యుండ నతండునుం దానును
సుఖాసీనుం డై యుండి యతనితో ని ట్లనియె. 5

క. ఆపదఁ గడవం బెట్టఁగ, నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా
కీపుట్టువునకుఁ బాండు, క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. 6

తే. సమయ మిది మిత్త్రకార్యంబు చక్కఁ జేయ, నీకతంబున నే సువినీతుఁ డైన
యాసుయోధనుతోడిపోరాటదక్కి, యనుభవింతుము మాయంశ మగుధరిత్రి. 7

వ. నీకు మేము ప్రద్యుమ్నాదికుమారులతోడివారము మమ్ము దురితంబులు వొరయ
కుండ నరసి రక్షింపు మనవుడు వాసుదేవుండు నీవంచినయట్ల చేయం గలవాఁడ
నెయ్యది తలంపు సెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున కరిగి కౌరవులు

తోడం దగినమాట లాడి తెలుంగు సేయ వలయు నని ప్రార్థించి యతని నియ్యో
కొలిపి యి ట్లనియె. 8

సీ. మా తండ్రి తలఁపును । నాతనినందనుఁ, జందంబు నిన్న యాకసంజయుండు
పలికినపలుకులఁ । దెలిసెఁగదా నీకు. హరిచిత్తముభంగి । వాఁ డెఱుంగుఁ
బాలుపం పని యీక । యేలిమాటలన మ,మ్మలుక దీర్చెదరు తాకరధికముష్కా
గం బైనయానసమయం బేము పడుమూఁడు, వత్సరంబులు సల్పి । వచ్చి యుండఁ

ఆ. గులముపాడి నడపఁ । దలపఁడు పతి పెడఁ, దలఁచెనేని గొడుకు । వలఁచినట్టి
వాఁడు గాన యతనివక్రత మాన్ప లేఁ డింతకంటెఁ గలదె । యెడరు మాకు.

క. జననియు సమస్తబాంధవ, జనములుఁ బ్రియ మంద వారి । శాంతులఁగాఁ జే
యను నెమ్మిగ నొక్కటి యై, మనను దెలుఁ గేది యునికి । మాపౌరుషమే. 10

క. ఇచ్చటిబంధులు నీవును, నచ్చెరువడి వినుచు నుండ । నయిదూళ్లును మా
కిచ్చినను జాలు నంటిని, బొచ్చెము గా దింతవట్టు । పూర్ణము సుమ్మీ. 11

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రయును జేయం జాలఁడో కాని పెం
పేదం గ్రూరత కోర్వ రాదు సిరి నా । కేలందునే గ్రాసవా
సోదైన్యంబులు నచ్చు నాయుగయునీకచుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గు గౌరవము లేకనుం బొంది శ్రీ నొందినన్ 12

ఉ. అక్కట లేఁతు లైనఁ బగ । లైనను జంపఁగ కోర నేల యొం
డొక్క తెఱంగు లేదె యుడి । గొప్పదె బంధుసుహృజ్జనంబు లా
దిక్కున నున్నవారు గనుఁగొంపక సంపదకై వధించి దూ
రెక్కుట దోష ముందు టనుకీడురవస్థల కోర్వ వచ్చునే. 13

వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 14

ఆ. క్షత్త్రధర్మ మింత కష్ట మగునె పెఱ, ధర్మ మాచరింపఁ । దగద యుండ్రు
గాన శస్త్రజీవికయ తగి యున్నది, యైన వంశనాశ । మనభిమతము 15

వ. అదియునుం గాక. 16

ఆ. కలహ మగుట లక్ష్మిఁ । గావించుఁ బ్రాణహా, నియును జేయు నింత । నిక్కువంబు
పలువు రొకని గోడి । పొలుట బల్లిదు, లనచచేతఁ జెడుటయును ఘటించు. 17

క. జయమగు నోడుదు మనుని, శ్చయ మొక్కఁడు లేదు వినుము । సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హ్యా, దయపుటభేదనము సేయుఁ । దథ్యం బనఘా. 18

క. కాన యవశ్యముఁ బెనఁకువ, గానియుపాయమునఁ బగఱఁ । గడతేర్చుధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం, దానం జెయి వెట్టికొని యతఁడు నిద్రించున్ 19

ఆ. పగయ కలిగెనేనిఁ । బాము న్న యింటిలో, నున్నయట్లు గాక । యూఱడిల్లి
యుండు టెట్లు చిత్త । మొకమాటుఁ గావున, వలవ దధికదీర్ఘ । వైరవృత్తి. 20

చ. పగ యడఁగించు టంతయు సుకరం బది లెస్స యడఁగునే పగఁ

బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే కడుం
దెగ మొదలెత్తి పోవఁ బగ దీర్పఁగ వచ్చునె గార్త్య మొందు నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా. 21
ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము దా నది యట్లు లుండె శ్రీ
గావలె నంచుఁ బోరితము గామియుఁ గోరెద మెల్లసామ్ములుం
బోవుటయుం గులక్షయము పుట్టుటయుక్ వెలి గాఁగ నొందుమై
నేవిధి నైనఁ జక్కఁబడు నంతయు నొప్పుఁ జుమీ జనార్దనా 22
చ. మనమునఁ బక్షపాతగతి మానెద మానుము ధర్మసూనుప
ర్థనముల రెండుదిక్కుల హితంబును పెంపును గల్గునట్టిచొ
ప్పున విదురాదిసజ్జనులబుద్ధికి రా నుచితంబుతోడి మె
ల్పునఁ బరుసంధనంబునను భూపతు లెల్ల నెఱుంగ నాడుమీ 23
చ. తగవునఁ బోక రాజు పెడిదంబులు వల్కినయేని సైఁచి యొ
ప్పఁగ నిలుమీ గురుత్వముఁ బ్రభుత్వమునుం గలపెద్దవారిమా
ట గొనమి యాసుయోధనుకడక్ నిలువక్ మన మెల్ల గారవం
బుగఁ గురువృద్ధుపల్కుఁ దలఁపుం జన నిచ్చిన మెచ్చరే జనుల్. 24
మ. సుతువాఁడై వినయంబు సేకొనక యేచొప్పుం దగం జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు తెంపు సేయునెడ లోకం బెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబుగాఁ జేయుమీ. 25
ఆ. ఇన్నిసంకటముల నిబ్బంగి నెంతయు, నొగులుచిత్తవృత్తి నొవ్వ దీర్ప
వెజ్జ వీవ కావె వేయేల యేగతి, నడపఁ దలఁచి తేని నాకుఁ బ్రియము. 26
వ. అని చెప్పి తలంచుకొని వెండియు ని ట్లనియె. 27
క. నీవు సుయోధనుపాలికిఁ, బోవఁగ వల దనియు నొక్క బుద్ధి వొడమెడుక్.
గోవింద యుతేఁడు మంత్రులుఁ, గావరములు వక్క నినదు కార్యవచనముల్
తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్ము, లట్టిమలకడకు ని న్ననుపఁ జాల
నీవు సంకటపడియెడుక దేవపదవి, నైన నే నొల్ల నొంటి యుం దరుగు టుడుగు
చ. అనవుడుఁ గృష్ణుఁ డి ట్లనియె నాధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
త్తనయుఁడ యేల నీసలుకు తథ్యము పితలఁ పే నెఱింగితి
స్వనమున శంక దక్కుము వినక్ వలతే విను మేను నిక్క మ
గ్గిన నచటం గలండె రణకేళికి మార్కొన నొక్కఁడేనియున్. 30
క. పసుపుము కౌరవసభకేఁ, జను పెట్లును మేల యర్థసంసిద్ధి యగుక్
వనన గొరటం బాపము గా, కునికికిఁ గత మైనపలుకులొండెను గలుగున్. 31

వ. అని పలికిన యుధిష్ఠిరుం డిట్లనియె. 32

ఆ. మేలు గాక నీకుఁ బోలిన ట్లయిన నం, దరిగి యేము వారు నర్థిఁ బొంది
యుండునట్లు గాఁగ నొడఁబాటు గావింపు, మెల్లభంగి మనకు నిదియ లెస్స.

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు, నెమ్మి యెఱుఁగు దర్థసిద్ధి నెఱి యెఱుఁగుదు వా
క్యమ్ములపద్ధతి నెఱుఁగుదు, పొ మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 34

కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులదుర్ణయంబు సెప్పుట.

సీ. అనిన ముకుందుఁ డి ట్లనియె సంజయునిమాటలును నీ వన్నపల్కులును వింటి
నీమది ధర్మైకనిష్ఠమై యున్నది, వైరంబు విడువరు వారు ద్రోణ
భీష్ములు గల రని బిరుదు లై యున్నవా, రగునె రాజన్యుల కడఁగి కుడువ
నక్లేశవృత్తి రాజ్యముచవి గొన్నవా, రేల యిత్తురు నీకుఁ జాలు సెప్పుము

తే. ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు
నలుక రెన్నఁడు విడువు దైన్యంబు పొడుపు
కయ్య మరివర్గజయమునఁ గలుగు నిహప
రములఁ జిరకీర్తియును బాండురాజతనయ. 35

మ. గురుభీష్మాదులు సూచు చుండ సభ మీ కెగ్గు నాఁ డట్లు ము
ష్కరు లై చేసిరి యంత సేసియును బశ్చాత్తాపముం బొంద రో
పర వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయుం బంధుత్వముం దక్కు మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగర్వక్రౌర్యముల్ సూచినన్. 36

వ. కపటపుఁ జిత్తంబు నెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధనదుశ్శాసనశకుని
సూతనందనులు పుయిలోటు దక్కి కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింప
వచ్చునే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీరు బలవంతుల
రయి యుండియు సత్యంబు పాటించి యూరక పోక సూచి యచ్చెరుపాటులో
నుమ్మలించు చుండిరి యిట్టివాట్లం బోయెడువారు దైవోపహతు లై మున్న చెడి
యుండుదురు గావున వారలం జెఱుపనుం జాలుక న క్రూరాత్ము లగుకౌరవు లెల్ల
వారికి వధ్యులుగాఁ దగుదురు నీ కేల యవధ్యు లైరి పాపాత్మకు లగుహింసకులం
బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియించుట కర్తవ్యంబు. 37

క. మీతండ్రికి భీష్మునకుం, జేతోముద మొదవ భక్తి సేయన తగు నీ
తాతలకు నేను జని వి, ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. 38

క. చెలులుం జుట్టలు దేశం,బులరాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము, దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్.

వ. దానికి దుర్యోధనుం డియ్యకోనక తెఱంగు మాలినమాట లాడుటయుఁ దండ్రి
యతని వారింపనేరమికిఁ దోడుపడుచుండుటయుఁ జూచి మీతో నిట్టిపాట్లనుం

దలంచి యెల్లవారును వారిన గర్హింతు రింతియ కాక మనకు నొండేమి వలయు నాయోపి నంతయుఁ బెక్కుభంగుల సంధియ కావింపం జూచెద నవ్విధంబు సిద్ధించిన మేలు గాదె యట్లు గాక తక్కిన నచ్చోటియుత్సాహంబుచందంబును నందుఁ జేయం గలవారివర్తనంబులుఁ గొలందులు న్గతింగి నీకు విజయం బగు విధంబునం జనుదెంచెద. 40

తే. ఆసుయోధనుముక్కున కనావి గలుగఁ, బుడమి నీ కీఁడు గావునఁ । బోర కలుగు
నేను గయ్యపుశకునంబు । లెన్నియేని, గంటి నీ వనుత్సాహివి । గాఁగ వలదు.

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పికొనుచు నాలస్యంబు లేక సమరంబునకు సన్నాహంబు సేయుచుండ వలయు ననిపలికిన విని వృకోదరుండు దామోదరున కిట్లనియె. 42

క. సమరంబు గలుగు ననుచును, మము వెఱపింపంగ వలదు । మాధవ నీ వా
కుమతి యగుధార్తరాష్ట్రుఁడు, శమించుకార్యంబు నడపు । సౌజన్యమునన్. 43

వ. అని వెండియు. 44

శా. పాపాత్ముండు మదాంధుఁ డ్జ్ఞాతులువ నీకపం పెట్లునుం జేయఁగా
నోపం డడ్డము సెప్ప రెవ్వరును మాకనోద్రేకముఁ గర్వముం
గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం । గుందించుటం బోయిన
ట్లే పో నిత్తురు గాన నిన్నతఁడు జాకలిం బెట్టెడుం జూడుమీ. 45

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁ జూచెద నంచుఁ గడంగు చుండు న
న్మెచ్చఁడు బాహుగర్వమున । నీచు సుయోధనుఁ డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ । బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁ గురువంశముచేటున కోర్వకుండుటన్. 46

ఉ. పాండవకౌరవుల్ గలసి । పాలును నీరును బోలె నెమ్మినె
నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁ డొ
క్కండ కులక్షయంబునకుఁ । గారణ మం ద్రది తప్పదైన నీ
వొం డన నేల యాబిరుదు । నోపినయంతయుఁ దీర్పు నేర్పునన్. 47

చ. తన పొరిపోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రసూనుఁడు యశోభరితం బగుభారతాన్వయం
బున కొకనిందవచ్చు ననుబుద్ధి దురాత్మున కేల కల్గు నా
యనమెయిఁ బోయి హీనగతి । నైన ఘటించిన నెంత యొప్పనో. 48

వ: మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు వినుచుండ సుయోధనుతోడం గురుకులేశ్వరునాస్థానంబున నావచనంబులుగా నిట్లనుము. 49

తే. అన్నదమ్ములమైయుండి యకటమనల, నొరులుదలమెత్తిచూడ నొండొరులతోడఁ

జనఁగ నేటికి నీ నేల । పెద్దవారి, బుద్ధి విని పంచి కుడుచుట । పోలదొక్కొ. 50

క. అని యెవ్విధమున నైనను, వనజోదర సంధి సేయ । వలయుం దగ నే
మును వారును గలయుట భూ, జనులకు నెల్లను హితంబు । సౌఖ్యకరంబున్. 51

చ. అనుటయుఁ బిన్ననవ్వు నగి । యంబుజనాభుఁడు పల్కె నెన్నఁడున్
వినని వి భీముపాలఁ గడు । వింతలు వింటిమి మూట లగ్గి చ
ల్లనగుట భూరిభూధరము । లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ । బొందుట యింకిట చెప్ప నేటికిన్. 52

శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడియుద్ధమునకుఁ బురికొల్పుట.

తే. అని సహోదరు లాజి నా । యాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁ జంప । నొల్లమియును
గలుగు నెయ్యంబు పెంపునఁ । గరుణ నార్ద్రుఁ
డైనపవనజుఁ బురికొల్ప । నాత్మఁ దలఁచి. 53

వ. మురమర్దనుం డతనితో నిట్లనియె. 54

ఉ. యుద్ధముమీఁది వేడ్కయు సుకహోగ్రవిరోధుల నల్కఁ జేయుద
ర్పోద్ధతియున్ సుయోధనునియున్నతి సైఁపనియేపు రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ । జేయుతలంపును గల్గునీ వసం
బద్ధము లైనవాక్యములు । పల్కుట యొప్పునె కీచకాంతకా. 55

వ. అని యంత నిలువక. 56

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు, నెఱుఁగనినీయట్టివాని । కెవ్వరొకో యీ
పిఱికితన మింత యలవడఁ, గఱపినవా రనుచు శౌరి । కలకల నవ్వెన్. 57

వ. దానికి దరహాసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవసూనున కిట్లనియె. 58

ఉ. బంటుతనంబుమాటలకుఁ । బాఱకు పాండునృపాలుపాలు గై
కొంటయు చాలు నన్న నృపకుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే మును సుయోధనుచందముఁ జూపి యప్పు డే
మంటి యుపేంద్ర నన్ని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. 59

క. నాకొలఁది విచారింపక, నీ కిట్లనఁ దగునె మిన్ను । నేలయు నిమ్మైఁ
గాక తిరుగంగఁ బడినం, బో కే ముంజేతు లొడ్డి । పోవఁగఁ ద్రోతున్. 60

ఉ. నావుడు నవ్వుటాలకసికనం బవనాత్మజ యింత యేటికిం
గేవలయోధనే పకులకిల్బిషముల్ దలపోయ కిమ్మెయిన్
జావడ మైనఁ జూచి యిది । చందము గా దని యంటిఁ గాక నీ
చేవయు లావు నీవు మును । చేసినభంగులు నే నెఱుంగనే. 61

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 62

ఉ. పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ నను గోరి యెంతయుఁ
బ్రార్థన సేసె దాని కనురాగము వొందితి నేను గాన యు
ద్ధార్థుల మైనమాకు నిను నాసపడం దగదే యశంబు నా
నార్థములున్ విరోధివిజయంబునఁ దక్కఁగ నొంటఁ గల్గునే. 63

వ. అనవుడు. 64

శా. ఏమీ పార్థుఁడ నీవు దండిమగవై యీవచ్చు కౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం బెద్దమి ట్రెక్కి మి
మ్మే మెల్లన్ వెఱఁ గంది చూచెదము గా కీసారెకుం బోయి రా
భీముం డిత్తఱి చిత్తమాటలకుఁ గోపింపండు సూ పెం పఱన్. 65

వ. అని పలికి యివ్విధంబున గోపాలదేవు మేలంపుమెయివడి కార్యవచనంబులకుం
దగం దానును దోడ్తో సరసం బాడుటయు కా మఱుమాట లాడి యంతటఁ దని
వోవక బకమర్దనుం డతనితో ని ట్లనియె. 66

ఉ. కయ్యము గల్గిన ట్లయిన గంధగజప్రకరంబుకుంభముల్
వ్రయ్యఁ దురంగపంక్తులు ధరం బడఁ దేరిగముల్ బడల్పడన్
దయ్యమి కీవు వెక్కసపడన్ గదవందువు సేయఁ గోరునా
దయ్యము నెత్తికోలు దుది దాఁకుట గాదె భుజంగభంజనా. 67

చ. అన విని దేవకీతనయుఁ డాతని కిట్లను జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు గడిందిమగండవు నిన్నుఁ దప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయ మొందక దుఃఖవార్ధులీఁ
దినమము నెల్ల నిక్కుటిల దీర్చి సుఖాత్ములఁ జేయు పావనీ. 68

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ, బదపడి రాఁ బలికి సంధి వాటించెద నా
కది యొప్పదె కాని తుదిం, గుదు రింతకు నీవ కావె గుణరత్ననిధీ. 69

అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దనయభిప్రాయంబు చెప్పుట.

వ. అనిన వాసుదేవున కర్జునుం డి ట్లనియె. 70

తే. చెప్పఁ గలయంతయట్టును జెప్పి నీక, జాతశత్రుండు వింటి వీ వాతెఱంగు
మాకు నెల్లను బలుకంగ మాట లొండు, గలవె యైనను జెప్పెదఁ గన్నయంత.

మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ మీ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నంచున్ మున్న కై పెక్కన
ట్రితలం బచ్చ్యుత నీకుఁ గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జింతం బాప రాదో కదే. 72

ఉ. నీ వొనరింపఁ బూనినపనిం గమలోదర కీడు పుట్టునే
కా వనినట్ల యుండి యవుఁ గార్యము లట్లగుటం బ్రయత్నసం

భావన సేఁత పౌరుషము పద్ధతి తత్ఫలసిద్ధి పొందుచో
దైవము దోడ్పడన్ వలయుఁ దథ్యము రెండును నీవినోదముల్. 73

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్న ని
వ్వారికిఁ బోలదే సుజనవత్సల నీ విటు లంట వారు మ
మ్మీరస మెత్తి కీడ్పఱిచి యింతలు సేసినదాన నీమదిం
గూరిన నొవ్వుసొంపునను గోపము పెంపునఁ గాదె యూరయన్ 74

ఉ. ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నాసభ నట్లు సేసినన్
దానికి సైఁప లెస్స యని దైన్యముఁ బొందుట కోర్చి యమ్మెయిం
గాననభూమికిం జనుట కారుణికోత్తమ నీ వెఱుంగవే
శాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్పు నేర్పునన్. 75

తే. అలవియెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి, మమ్ముఁ బఱిచిన పాటులు మానసమునఁ
జవుటఁ బెట్టిన విత్తులచంద మొంది, యంకురింపక చెడి పోయె నంబుజాక్ష.

వ. అమ్మెఱకుల నెమ్మెయి నయినను. 77

క. ఒడఁబఱిచి మాకు వారికిఁ, బుడమి సగము గాఁగఁ జేసి పొంది పొసఁగ యుం
డెడునట్టి తెఱఁగు సేయుట, కడు మేలది గౌరవము సుఖంబును జేయున్. 78

క. నీకిట్టిది చిత్తమునకు, రా కుండిన నేని వలదు రం డిమ్మెయి మీ
రీకార్యము సేయుం డని, మా కానతి యిమ్ము కంసమర్దన తెలియన్. 79

మ. హిత మిబ్భంగిది మాకు ధర్మము తెఱం గిట్లుండు నం చేను నీ
మతి బోధింప వలంతినే హితము ధర్మంబుఁ విచారించి చూ
చి తగుం బొమ్మని యేది పంచి తది నిశ్చింతంబునం జేసి యు
న్నతిఁ బొందం గలవారమై యునికి కృష్ణా నేఁడుగా వచ్చెనే. 80

వ. అనిన విని కృష్ణుండు విజయున కిట్లనియె. 81

చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మేలొనర్చినన్
దొరకొను నే ఫలంబు దత్తఱితోఁ దగువర్షము లేక యున్న ని
ప్పురుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు టెల్ల నా
చరణమునం బ్రసన్నమగు దైవముచేఁతన చూవె ఫల్గునా. 82

ఉ. కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయున్
దైవముచేత యెట్లగునొ దాని నెఱుంగ సుయోధనుండు సం
భావన సేసి పాలొసఁగు పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే. 83

వ. అది యెల్ల నట్లుండె నిచ్చట విరాటుపసులం బెట్టింప నీవు పోయిన యప్పుడు
భీష్ముండు దుర్యోధనులతోఁ జెప్పిన తెఱంగు. 84

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికి నైన పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగఁ గుందగుం దొడరు పెల్లవిధంబుల కోర్చు టట్లు గా
కిచ్చఁ దలంచి యొక్కటియు నిత్తఱిఁ బొం దగుచేఁతయుం దగున్. 85

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 86

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు, నెట్లు పొందు గలుగు నేను రాజ్య
భాగ మీను సమరభంగిక విక్రమ, నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 87

వ. అని పలికె నది యంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమ కాదె యామాటల
ఫలం బప్పుడ కనియు నాకష్టాత్ముండు వెండియుఁ దెలియండు. 88

తే. అతనిగుణదోషములచంద మట్ల యుండె, నాకు ధర్మజుబుద్ధిన నడప వలయు
నిత్తెఱం గాచరింపంగ నేఁగి యచట, నెల్లతెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు

చ. అనిన ముకుందుతో నకులుఁ డల్లన యిట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పుట రిత్త గాదు మా
మనము లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్నయ
ద్దినములభంగి గాదు కృపఁ దీవ్రతఁ గుందినచంద మయ్యెడున్. 90

క. కడవఁగ నొకళ్లు పసరము, నడిచిన నొక్కళులుఁ జెయ్యు నడువ వలయునే
చెడుతెరు వాకౌరవ్యుల, కడ నిలుచుం గాక మనకుఁ గార్యం బేలా. 91

సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ, బడ కుండుదురె వారు పద్మనాభ
నీయనుగ్రహమున నెమ్మెయిఁ గూడిన, బలము లేడక్షౌహిణులను దొరల
పాంచాలయాదవపాండ్యకైకేయమా,త్స్యుల తెంపు తెలుఁగక యున్నవారె
భీమార్జునులలావు పెంపును నీసహా, యంబును గలుగుట కలుక రెట్లు

ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడును బుద్ధి, సెప్పి వారిఁ జక్కఁ జేయరెట్లు
కార్య మీవు సెప్పఁగా విదురుండు వి,నంగ నెట్లు గా దనంగ వచ్చు. 92

వ. అట్లుం గాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రు లాదరింప కుండ వెఱవరే
నీవోయినప్పుడ యీకార్యంబు చక్కనగు ననిన విని సహదేవుండు వాసుదేవున
కి ట్లనియె. 93

ఉ. రక్కసమాట లాడెదరు రాజును దమ్ములు వాసిలోన నీ
వొక్కటి యైనఁ గాదనక యూఁకొను చుండుట యంతకంటె మే
లక్కట యిట్లు వేఁడికొన నైనను బోయెదు వో సుయోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ దానవాంతకా. 94

మ. తలఁపం గూడునె యింత లేసి దొరలీదైన్యంబు చుట్టంబులుం
జెలులుం దిట్టరె లాఁతిరాజులకు మెచ్చే యివ్విధం బిట్టిదిం

గలదే వేఁడఁగ ధర్మజుం డడుగఁ బోఁగాఁ గృష్ణ ధార్తరా
ష్ట్రులు పాలికిఁ జలంబునం బెనఁగ నిట్లుం గూడదు దీ పయ్యెనే. 95

ఉ. వీరలు ధర్మమార్గము సవిస్తరతం దగ నాడిరేనియు
న్వారలు దాని కియ్యకొనిరేని వినుమ చ్యుత యట్టిసంధి పెం
పారఁగ నేర్చునే యుచిత మైనది కయ్యము వంకమాటలే
నేరఁ గురుప్రవీరసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ. 96

మ. తుది రాజ్యమ్మునసగమ్ము గొమ్మడవియుం గదుం బేరు వంచించియుం
బదుమూఁ డేఁడులు నీవునుం దిరిగి రాఁ గాబాలిక పో వచ్చునే
యది గాదేఁ దెగి బంట వై యడుము మాఁకయల్ వన్నునేర్పింకఁ జె
ల్లదు నూనీ కని యాసుయోధనునియుక్కల్లం బుచ్చి పో నాడుమీ. 97

మ. అనినన్ సాత్యకి ప్రీతుఁ డై యితఁడు లెస్సైన యుండఁ బల్కం బ్రయో
జనముం గల్గదు గౌరవంబుఁ జెడు దుశ్చారిత్రకుం డాసుయో
ధను బోధింపఁగఁ బోయినన్ సరభసోత్సాహంబుమై నున్నవీ
రనికాయంబున కెల్లనుం బ్రియము సంగ్రామంబు మే లెమ్మెయిన్. 98

వ. అనిన విని రథికవరు లందఱు సహదేవుం డింత యొప్పు నాడునే సాత్యకిపలుకు లి ట్లుండునే తక్కటివి యెక్కుడిమాటలు పగవారి నడిగికొనం బోవుట యుచితం బగు కయ్యంబు కర్జంబు గాదగు భంగంబు సేఁగికొనం దగదట యనునివి మొదలుగా ననేకు లనేకప్రకారంబుల వీరాలాపంబులం గొలువెల్ల నొక్కమ్రోఁత గాఁ జెలంగినయెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 99

ద్రౌపది కృష్ణునితోఁ దనమున్నుపడినభంగపాట్లు చెప్పుట.

తే. ధర్మనందనుపలుకులు కదనకుహృదయ, తాప మొనరింప మోమునఁ దైన్య మొంద
నున్నపాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ, గనలి శౌరితో గద్గదకంఠి యగుచు.

ఉ. అంతలు సేసి పో నడిచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె యిట్టియాటలు మదిం బ్రియ మంది యుధిష్ఠిరుండు దా
నంతన యూళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ యీ
కంతకృపావిహీనమతి నాతఁడు నేఁచునె యన్నదమ్ములన్. 101

చ. తనమునుపుడ్డబన్నములుఁ దమ్ముని పైఁ గలకూర్మిపేర్మి నీ
జనపతి సైఁప కున్నె యది సక్కన రాజ్యముపాలు లేక తీ
ఱున కొడఁబాటు గల్గిన నెకిఱుంగని వెట్టరె చాల రైరి పీ
రసరా కొనాన లేమి యని యాడరె లోకమువారు కేశవా. 102

శా. పెంపేదం దమ కిట్టితక్కువలు దూషింపంగ నేలా విచా
రింపక వారికి మేలు సంధి దమువా కరిం జూచినం దారు సా

ఢింపం జాలరొ కాక పోరఁ దగ మర్దింపం దలంచెని శం
కింపం బట్టొకొ వారు బ్రాహ్మణులె యోకీ డైన సైరింపఁగన్. 103

ఉ. ఓటమి యొకింత యేనియు సుయోధనుచిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే దురభిమానము యెక్కుడు పూనుఁ గాక య
చ్చోట ననంగరంబు లగుచొప్పులు పుట్టిన నైనఁ బాండవుల్
పోటున కిచ్చగింతురొకొ పోదురొ కానల నుండ నచ్యుతా. 104

ఉ. ఏ నిటు లంటి నావలవ దింకను నీవును రాజుఁ దమ్ములుం
బూనుచితంబు సూచి మనకార్యము మీసుజనత్వముం జెడం
బోనొకభంగి సేయక తగం గురువర్గముతోడిసంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు పేర్పడన్. 105

వ. అని మఱియు నిట్లనియె. 106

ఉ. ఆఱడిఁబోకయున్ ఫలము నందుటయుం గని నల్క నేరమిన్
మాఱటనోరిదాన నయి మాటలు చిత్తమునందు నిల్పఁ గేఁ
గాఱులు ప్రేలెదన్ వినుఁడు కర్జము నెగ్గును గాన నల్కమై
వీఱిఁడి నైనమానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే. 107

చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండుభూ
వరునకుఁ గోడ లైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరు లగుపుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్. 108

వ. అట్లుం గాక. 109

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టిననుఁ బంకజనాభ యొకండు రాజసూ
యావభృథంబునందు శుచి యై పెను పొందినవేణి పట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ గులాంగన నిట్లొనర్తురే. 110

ఉ. ఆసభ నేకవస్త్ర యగునట్టిననుం గొని వచ్చి నొంచు దు
శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రము లై తగుచేష్ట లేక నా
యాసలు మాని చిత్రములయాకృతి నున్నయెడన్ ముకుంద వి
శ్వాసముతోడ నిన్ గొలువ వచ్చె మనం బది యుం దలంపవే. 111

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషునిపాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె
చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో యటు గాక పాడిమై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ నిశ్చయింపుమా. 112

వ. అని యి ట్లుగ్గడించి. 113

ఉ. ద్రౌపది బంధురంబయిన । క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి వెండ్రుకల్
దా వలచేతఁ బూని యసి । తచ్ఛవిఁ బొల్చుమహాభుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మ । నంబునఁ బొంగువిషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు । గ్రమ్మఁగ డిగ్గన లేచి యార్తయై. 114

వ. గోవిందుముందటం బెట్టి యి ట్లనియె. 115

క. ఇవి దుస్ససేనువ్రేళ్లం, దవిలి సగము ద్రెవ్వి పోయి । దక్కినయవి కౌ
రవులకడఁ దీయుమాటల, యవసరమునఁ దలఁపవలయు । నచ్యుత వీనిన్. 116

సీ. ఈవెండ్రుకలు వట్టి । యీడ్చినయాచేయి, దొలుతగాఁ బోరిలో । దుస్ససేను
తను వింతలింతలు । తునియలై చెదరి రూ, పఱి యున్నఁ గని యుడు । కాఱుఁ గాక
యలుపాలఁ బొనుపడు । నట్టిచిచ్చే యిది, పెనుగద వట్టిన । భీమసేను
బాహుబలంబును । బాటించి గాండీవ, మనునొకవి ల్లెప్పుడును వహించు

ఆ. కఱ్ఱివిక్రమంబుఁ । గాల్పనే యిట్లు బ,న్నములు వడినధర్మ । నందనుండు
నేను రాజరాజు । పీనుంగుఁ గన్నారఁ, గానఁ బడయ మైతి । మేనిఁ గృష్ణ. 117

నెట్టన యట్టియల్క మది । నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చొడిం
గట్టినయట్లు పెద్దయును । గాలము దీనికి నాఱు చెన్నఁడుం
బుట్టదు దుష్టనిగ్రహము । పూని జగంబులు గాచునట్టితోఁ
బుట్టువు నీవు దేవమునఁ । బొల్చినభర్తలుఁ గల్గ నచ్యుతా. 118

శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట.

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపాయత్తచిత్తుం డయి నారాయణుం డూరార్చి కూర్చుండ నియమించి కన్నీరు దుడువను బెన్నెఱివేణి ముడువనుం దగువారి నియోగించి యమ్మానినితో ని ట్లనియె. 119

ఉ. మ్రుచ్చిర నేల యేఁ గలుగ । ముద్దియ నాకు వృకోదరుండు వి
వ్వచ్చుఁడు దోడు గాఁగ జన । వంద్యుఁడు ధర్మసుతుండు పంప నీ
మెచ్చుగ శత్రుసంక్షయము । మేకొని చేసెదఁగాక వేఱొకం
డచ్చుపడంగ నేర్చునె దు । రాత్ములు కౌరవు లుర్వి యిత్తురే. 120

క. లలనా యుడుగుము నీయే, డ్పులకోలఁదియె కురునృపాల । పుత్రకళత్రం
బుల యేడ్పు లింక వానిం, గలకల నవ్వుచు వినంగఁ । గాలం బయ్యెన్. 121

క. యమమహిషఘంటికానా, దము వినఁ గౌతూహలంబు । దళుకొ[illegible]చుచి
త్తములు గలకౌరవుల కి,ష్టము లగునే సంధికార్య । శాంతవచనముల్. 122

క. మొదల విధినియతియును న, ట్టిద యందురు పెద్ద లది ఘ । టింపక పో దే

మదిఁ జూచి చెప్పినను దప్పదు మేరువు దిరిగనేనిఁ । బాంచాలసుతా! 123

తే. పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ, జేసి యుజ్జ్వలపుణ్యలక్ష్మీసమేతు
లైన పాండుకుమారుల । యధికవిభవ, మీవు చూచెదు తప్పదు । దిది నిజంబు.

క. అని యూఱడిలఁగఁ బలికిన, విని యంకిలి దేఱుచిత్తవృత్తి గలుగునం
గన యేడ్పుడిగెం దగ ఫల్గునుఁ డిట్లని పలికె నపుడు । గోవిందునితోన్. 125

తే. పాండవులు ధార్తరాష్ట్రులుఁ । బుండరీక, నేత్ర చుట్టఱికంబున । నీకు నొక్క
రూపకావునఁ గోరి యే । రూపునందు, నుభయపక్షంబులకుఁ జేయు । ముచితహితము.

క. ధర్మార్థసంగతంబుగ, ధర్మతనయు చెప్పినట్లు । తగఁ బల్కఁగ నా
దుర్మతులు కౌరవులు స, త్కర్మమునకుఁ జొరక యున్న । దైవమ యెఱుఁగున్.

క. అన విని కౌరవులకు మీ, కును హితముఁ బ్రియంబుఁ జేయఁ । గోరియ కుంతీ
తనయాగ్రజుపని ధృతరాష్ట్రునికడకుం బోయెదను గడుం బ్రీతి మెయిన్. 128

క. అని పలికిన హరిధర్మవ, చనముల తెఱఁగున । జాతశత్రుఁడు చిత్తం
బునఁ బొంగి యట్ల చేయుము, మననిశ్చయ మిదియ దీని । మఱవకు మనఘా.

వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి "నారాయణునుం జూచి నేనక్షత్రం
బు రోహిణి గదా యెల్లి రేవతి సేయుఁ జంద్రతారాబలంబులు గలవు గమనంబు
నకు రేపకడయ మేలు పయనం బగుట లెస్స యని చెప్పిన నప్పలుకుల కతండు
సగౌరవంబుగా నియ్యకొనినం బాండవాగ్రజుండు గొలువుం గలయం గనుంగొని
యెల్లవారును విన నదియట్ల కాక యని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుఁ
బాంచాలియుఁ బరివారంబును నుచితప్రకారంబున నిజనివాసంబులకుం జనిమె
మఱునాఁ డరుణోదయంబునఁ గృష్ణుండు కాలోచితకృత్యంబులు నిర్వర్తించి సూ
ర్యోపాస్తి సేసి యగ్నిసమారాధనం బాచరించి ధరణీసురులం బ్రణామపూర్వకం
బుగాఁ బ్రయాణదానప్రముఖపూజావిశేషంబులం బ్రీతులం గావించి వారల
యిచ్చునాశీర్వాదంబులును సమంత్రాక్షతదూర్వాంకురాదులునుం గైకొని
యుచితప్రదేశంబున నుండి సాత్యకి రావించి. 130

క. మనప్రజలోఁ గరిపురికిం, జను దేరఁగ వలయువారి । నవరణతో రం
డని యేర్పడ నియమింపు పయనమై యేతెమ్ము నీవు । నని తగ మఱియున్.

వ. దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండు మన్నించుమానుసులునుం గుటిలబుద్ధులు
గావునఁ జక్రగదాద్యాయుధంబులు రథంబునం బెట్టింప వలయు నని చెప్పి పనిచి
సమయజ్ఞతం బొడసూపి నిలుచున్న దారుకుం జూచి తేరు పూన్ప నియోగించిన
నతండును మణిగణప్రభాపటలజటిలం బగు నరదంబు వన్ని శైబ్యసుగ్రీవమేఘపు
ష్పవలాహకంబు లనంబరఁగు తురంగంబులం బూన్చి గరుడధ్వజం బెత్తి తెచ్చినం
దానునుం బయనంపుఁజందంబునఁ గట్టాయితంబై జనంబులమూఁకలకుం బందు

వగుచుఁ బుండరీకాక్షుండు మంగళతూర్యంబులు సెలంగఁ జామరంబు లుల్లసిల్ల రథం బెక్కునయవసరంబున కోడవ సపరివారంబుగా నరుగుదెంచిన సాత్యకిం దన రథం బెక్కించుకొని యాంగికంబు లైనశుభసూచకంబులు గైకొనుచుఁ బూర్ణ కలశవృషభాదిభద్రపదార్థంబుల నవలోకించుచుఁ బుణ్యాంగనలు సేసలొలుకఁ జిత్తంబు ప్రసన్నతం బొంద వెడలునప్పుడు. 133

సీ. పాండవ యాదవ ॥ పాంచాల కైకేయ, పాండ్య మాత్స్యాదులు ॥ భద్రదంతి
హయరథంబులతోడ ॥ నతికుతూహలమున, వచ్చినఁ గనుఁగొని ॥ వారి నెల్ల
సంభావనంబుల ॥ సంభాషణంబుల, నాదరించుచుఁ దగ ॥ నల్ల నల్ల
విభవంబు మెఱయంగ ॥ విడిదలపట్టెల్లఁ, గడచినయత్తఱి ॥ గరము శుభము

ఆ. లైనశకునములకు ॥ నందఱుఁ బ్రియ మంద, నరుగు చున్నయట్టియవసరమున
రథము రథముఁ గదియ॥రా నిల్చి ధర్మనం,దనుఁడు నెమ్మి నిట్టు ॥ లనియె హరికి.

ఉ. వచ్చె జనార్దనుం డనిన॥వార్తకుఁ బ్రాణము మేని కంతకుఁ
వచ్చిన సేద దేఱెఁ గురు॥వంశపవిత్రచరిత్ర గొంతి నీ
వచ్చటి కేఁగి పాండవుల॥యందఱమా అని చెప్పి మొక్కుచుఁ
బ్రుచ్చియ కౌఁగిలించుకొని ॥ కుందినచిత్తమునొప్పి దీర్పుమీ. 134

చ. అడవికి నేఁగునాఁడు మము ॥ నంపఁగ నెంతయు దవ్వ వచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁ ॥ బొందెడునశ్రులుఁ జూచి చూచి య
ట్లొడఁబడి డించి పోవలసె ॥ నమ్మలికమ్మున గొంతి యింతకుఁ
బడు గయి పాలలోఁ బడిన॥బల్లివిధంబున నుండ కుండునే. 135

క. లక్కయిలు గాలినది మొద, లక్కట మాతల్లి మాకు ॥ నై నెవ్వగతోఁ
బెక్కిడుమలఁ బడు చున్నది, దిక్కెవ్వరు లేనియట్లు ॥ దీనత్వమునన్. 136

క. ఏ ననుట గాఁగ దుఃఖము, లైనవి నెగుసమయ మయ్యె ॥ నని చెప్పుము మీ
మేనత్త నూఱడింపుము, దా నెప్పుడు నీవు గలవు ॥ తన కను చుండున్. 137

వ. అని చెప్పి వెండియు. 138

ఆ. గురుఁడు బాహ్లికాది॥కురువృద్ధులును సుహృ,ద్బాంధవులు నశేష॥ధరణిపతులుఁ
బ్రీతిఁ బొంద నెవ్వ॥రికి నేది దగుఁ బ్రణా,మాదివిధుల నడపు॥ నాదుపలుకు. 139

క. పరమప్రియమున నాకై, పరిరంభణ సేసి గాఢ ॥ బాంధవసాంద్రా
దరమున సంభావింపు వి,దురుతో మధ్యస్థుఁ డగుహి॥తుం డతఁ డనఘా. 140

వ. అనియెం దదనంతరంబ, యర్జునుండు. 141

చ. జనులు వినంగ రాజ్యమున॥సామ్ము గొనం గలవార మన్నయీ
జనపతికార్యనిశ్చయము ॥ సమ్మతి గైకొని చేసినన్ సుయో
ధనుఁడును దమ్ములున్ సఖులు ॥ దానికి నేమును సెయ్యకొందు మొం

డనిన సపుత్త్రమిత్త్రముగ । నద్దిన నందఱ గ్రుచ్చి పోతుదున్. 142

మ. అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింతదెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ బేరెలుఁగు సొంపుం బొంద వక్త్రంబుఁ బో
ల్పున దర్పం బొలయంగ నంగములకుం । బొంగార నుద్బ్రంహిత
ధ్వనియై పొల్చుమహోగ్రసింధురముచందం బొంది యొప్పెం గడున్. 143

క. నకులసహదేవులును దా,నికి సంతస మంది యిట్లు । నెయ్యము కయ్యం
బొక తెఱఁగు సేసికొని తడ,యక రమ్మని పలికి రప్పు । డచ్యుతుతోడన్. 144

శ్రీకృష్ణుఁడు నారదాదిమహామునులం గని సంభావించుట.

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయుమాటలు సెప్పి యతనిఁ గౌఁగిలించికొని యథోచితప్రకారంబున వీడుకొని వలగొని మగిడిరి తక్కినవారలు నర్హంబు లగుతెఱంగుల నామంత్రితులై మరలిరి మాధవుండును ప్రయాణసర్వసంభారనిర్వాహకులఁ గలయంగనుంగొని తగినసల్లాపంబులు సేసి కరినగరంబు వెండెడువుగైకొని దారుకునిచతురత్వంబునఁ దురంగంబులపటుత్వంబున నత్యంతసమీచీనం బైనయానంబున మనం బలరం జనిచని యొక్కయెడ నారదజమదగ్నికణ్వాదు లగుమహామునులం గొందఱం గని రథంబుడిగ్గి నమస్కరించి సద్భక్తితాత్పర్యంబునఁ గుశలం బడిగి మీ రిక్కడకు విజయంచేయుటకుఁ గతం బేమి సేయం గలపని యెయ్యది నా కానతిం డనిన నారాయణునకు నారదుం డిట్లనియె. 145

సీ. అనఘ పుణ్యాత్ముఁడ । వగునిన్నుఁ గనుఁగొనఁ, గౌరవసభ నీవు । గారవమునఁ
బలికెడిపలుకుల । భంగు లాకర్ణింప, విదురభీష్మాదులు । వినుతెఱంగు
నుత్తరం బిచ్చుకార్యోక్తులు నెఱుఁగంగ, వేడ్క వచ్చిరి । వీర లెల్ల
నని చెప్ప విని యెన్న । యట్ల చేయుదురు గా, కని హరి వల్కిన । నమ్మునీంద్రు

తే. లతని దీవించి నీవు పో । మ్మచటి కేము, నరుగుదెంచెద మని ప్రీతి । ననుప సరిగి
యొక్కపుణ్యాశ్రమంబున । యొద్దియేట, విడిసి దివసప్రవర్తన । విధులు నడపి. 146

వ. కమలనాభుండు గదలి పోయి సూర్యాస్తమయసమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పు డందలివిప్రు లెదురు వచ్చి కాంచి నిజనివాసంబులకుం జనుదెం డని పిలిచినం బ్రసన్నవదనుం డగుచు సముద్రంబు వలవదని పలికి విశాలరమణీయం బైనబహిరంగణంబునం బటకుటీరప్రకరం బెత్తించి విడిసి తగువారును దానును వారలగృహంబుల కరిగి యభ్యాగతపూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని సమయసముచితవృత్తిం బ్రవర్తిల్లుచుండె నంత నక్కడ. 147

తే. వార్త విని యాక్షణము కౌరవక్షితీశ్వ

రుండు గాంగేయగురువిదురులను బుత్రు
సంజయునిఁ గర్ణు సైంధవు శకునిఁ బిలువఁ
బనిచి తా నిట్లు లనియె నంకదనునితోడ. 148

వ. కృష్ణుండు పాండవకార్యార్థంబుగా మనయొద్దకు వచ్చుచున్నవాఁడు నేఁడు కుశస్థలంబున నిడిసె రేపిందు వచ్చునని వింటి మిట్టిదియాశ్చర్యంబునుం గలదే సర్వలోకాభిగమ్యుం డగునమ్మహానుభావునకు మన మభిగమ్యుల మైతిమి మన కింతకంటెను బెం పెయ్యది యతం డెవ్వారివలన సంతుష్టుం డయ్యె వారికి శుభంబును నెవ్వారిచేత ననాదరంబు సేసె వారికి నశుభంబు నగుట దప్పదతనికి వలయుపూజ లాచరించుటకు సంవిధానంబు సేయుము గృహాలంకరణాదిమంగళప్రకారంబు లనుష్ఠింప నియమింపు మతనిచిత్తంబునకు నీవిభవంబునుదనమీఁది ప్రియంబునుం దోఁచునట్టి తెఱంగున సమస్తంబును సమకట్టుము. 149

క. అనిన ధృతరాష్ట్రుపలుకులు, గొనియాడిరి సంతసిల్లి గురుఁడును భీష్మం
డును నొగ్గా కని దుర్యోధనుఁడుం బరిచారకప్రతతిఁ బిలిపించెన్. 150

వ. ఇట్లుచితపరివారంబు రావించి యతండు. 151

క. అలుకుఁడు మృగమదమున ముగ్గులు వెట్టుఁడు గప్పురమునఁ గుంకుమమున గో
డలు పూయుఁడు మణిదామకములు గట్టుఁడు పెద్దకూటమున సొంపారన్.

వ. మఱియు నగళ్లెల్లను శోభిల్ల నలంకారంబు సేయుండు. 153

క. పెనుపుం జతురత మెఱయఁగ, మనయింటను దుస్ససేనుమందిరమున శో
భనశిల్పము లొనరింపుఁడు, చనుఁడు వృకస్థలమునందుఁ జప్పరము లిడన్. 154

వ. అది వీడుఁబట్టు గాఁ దగియెడుపట్టని పలికి వాసుదేవుండు రేపకడయ వచ్చునంతకు మున్న యింతయుం గావింప వలయు నని పనిచి పురంబున నుత్సవంబు సాటుం డని నియోగించి వివిధగంధసహితమాల్యంబులు సంపాదింపను మణిభూషణచిత్రాంబరంబులు సమకట్టను సరసాన్నస్వాదుపానద్రవ్యంబు లొడఁగూర్పను నేర్పరు లగుతజ్జ్ఞుల నియమించె నట్టియెడ నాంబికేయుండు విదురున కిట్లనియె.

ధృతరాష్ట్రుఁడు విదురుతో శ్రీకృష్ణునిరాక చెప్పి సంతోషించుట.

క. వివిధమణిమయరథంబులు, జవనాశ్వంబులును భద్రగజములు ర
త్నవిభూషణములు దాసీనివహంబులుఁ జాలఁ గృష్ణునకిచ్చెద నేను. 156

క. మనయింట సుయోధనుగృహమున దుశ్శాసనునికేళిమున నెయ్యెడ యా
తనిచూడ్కి కించు నది యెల్లను గౌరవ మొప్పఁ జవులయు మన కనఘా. 157

చ. అన విని యాతఁ డిట్లనియె నంబుజనాభునిఁ బ్రీతుఁ జేయఁగం

బెను హితమైనకృత్య మొకటిం గలదే యది మేలు పొందునం
దనులకు నైద యూళ్లు లుచితస్థితి నిచ్చుట కోప మన్నయు
న్నిటన యిటు లోపుకల్మి ధరణీవర యేమిట వచ్చెఁ జెప్పుమా. 158

ఉ. నీతలఁ పేను గంటి నొకనేర్పున శౌరికి లంచ మిచ్చి సం
ప్రీతునిఁ జేసి కార్యగతి భేదము సేయఁగఁ జూచె దింత బే
లైతిగదే సుమేరుసదృశాగ్రముఁ జూచియుఁ బొరుఁ బాయునే
యాతఁడు క్రీడిభక్తియును నచ్యుతుపెంపును నీ వెఱుంగవే. 159

తే. అర్జునుఁడు ప్రాణతుల్యుండు హరికి నట్లు, గాన జలపూర్ణమంగళకలశమునకుఁ
బాద్యమునకును గుశలసంప్రశ్నమునకు, మిగుల నొండు జనార్దనుమెచ్చు గాదు.

క. మనకడకు నేమికార్యం,బునకై యాతండు వచ్చెఁ బూనికి మెయి నా
పని వంచింపక చేయుట, విను మతనికిఁ బ్రియము తక్కువేయును నేలా. 161

వ. అనిన విని దుర్యోధనుండు దండ్రి కిట్లనియె. 162

క. అది విదురుచెప్పినట్టిద, తుదిఁ గృష్ణుఁడు పాండుసుతులతో వేఱగునే
పదనే యీగికి నిచ్చిన, బెదరి రనరే యొచ్చెమైనఁ బెమ్మట నగరే. 163

ఆ. అతఁడు పూజనీయుఁ డగు నే నెఱుంగుదు, నైన ధనము లీగి నదతనము
వచ్చుఁ బెచ్చు పెరిఁగి వైరులు గర్వింతు, రేల పగ యడంగు నిట్టులైన. 164

క. అనవుడు భీష్ముఁడు ధృతరా,ష్ట్రున కిట్లను నీవునుం గొడుకు నేమే ని
చ్చిన నొకటి యీగి లేకున్నను వే ఱొక్కటి దలంచునా కేశవుఁడున్. 165

క. విను మతఁడు సేయఁ బూనిన, పని దప్పింపంగ రాదు పాండవులందే
ర్పను గృష్ణుఁడు వెరవుగఁ జొ,చ్చిన మేలాపురుషపనువు సేయుము పుత్త్రా

క. నారాయణుండు ధర్మా,ర్థారూఢము గాఁగఁ బలుకునది నీవును నీ
వారును గైకొని యెంతయు, గారవమునఁ జేయ నెల్లకార్యంబు నగున్. 167

క. అనుటయు సుయోధనుఁడు భీ,ష్మున కిట్లనుఁ బాండురాజసుతులకు విష్మే
దిని హరి సగంబా లీఁ దగు, నమఁబో యే నీను గాని యది యట్లుండెన్. 168

వ. వే ఱొకకార్యంబు సేయం దలంచితి నది వినుము పాండవులకు నేడుగడయు
జనార్దనుం డతనిం బట్టి బంధించిన ఱెక్కలు విఱిగినపులుఁగులుం బోలె వారు
నాకు విధేయు లగుదురు పాంచాలయాదవాదులైన తదీయబంధుమిత్త్రులు నా
వశంబున వర్తిల్లుదురు సమస్తదేశంబులు నేన యేలుదు దీనికిం దగినయుపాయ
సహాయంబు లనువు సేసెద నీ వింక నేమి సెప్పెదవు చెప్పుమనిన విని యతిఘో
రం బగునవ్విచారంబునకు నమాత్యసహితంబుగా సంతప్తచిత్తుండై వైచిత్ర
వీర్యుండు గొడుకున కిట్లనియె. 169

క. ఓహో యిట్లనుట జగ,ద్ద్రోహం బిమ్మాట మఱవు దూతత్వంబున్

మాహాత్మ్యంబును ధర్మో,త్సాహంబును విను మబాధ్యశక్తికిఁ గారణముల్. 170

క. ఈకారణములు గల వను, నాకొలఁదియె వాసుదేవుఁ డది గాకయుఁ గీ
డే కురువంశమున కతని, రాక యతం డేమి సేసెరా పాపాత్మా. 171

వ. అని యదల్చి నప్పుడు గాంగేయుం డాంబికేయున కిట్లను నీకొడుకు ప్రాణగోష్ఠం బైనకార్యంబు సేయం దలంచె దామోదరు నిట్లు సేయం జూచెనేనిం దానును బ్రధానులును వినాశంబుఁ బొందు నింతియ యిది సేసి రేమి సేయరై రేమి యమ్మహాత్మునెడ నీయపకారంబు విచారించినదుష్టాత్ములు నష్టాత్ముల కాక యని పలికి యే నిట్టిదాని వినం జాల ననుచు మొగంబు గంటువెట్టుకొని దిగ్గన లేచి పోయె ధృతరాష్ట్రుండును దుర్యోధనునితో నిటువంటికొంటగాములు మనంబునం దలంచి నప్పుడు సేయం గలవాఁడవు గావున దీనం జేటు వచ్చు నుడుగు మయ్య యని చెప్పి యతనిం దక్కినవారినిం బోవం బనిచి తగినవర్తనంబుననుండె మఱునాఁడు.

సీ. కాలోచితము లగుకరణీయములు దీర్చి, కమలనాభుఁడు రేపకడయ కదలి
తనుఁ గుశస్థలవాసు లనుపరా నందఱి, నాదరంబున నిల్పి యరుగునపుడు
గజ్జంబులును బండ్లు గంధమాల్యంబులు, ధృతరాష్ట్రసుతుఁడు పుత్తెరఁ బ్రీతి
నెడ నెడఁ గొని వచ్చి యిచ్చిన వాని నెల్లను వేడ్క ననుభవించినవిధంబు

తే. సలిపి యనుభవ మొల్లక చనఁగ నెదురు, బాహ్లికద్రోణభీష్మాదిబంధుమిత్త్ర
గణముసర్వభూపాలలోకంబుఁ గురుకు,మారవర్గంబుఁ బుత్తెంచె మనుజవిభుఁడు.

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రునిమందిరంబునకుఁ బోవుట.

వ. ఇట్లు దుర్యోధనుం డొక్కరుండు దక్క నెల్లవారిం దూర్యాదిశోభనపదార్థంబులు సమకట్టి ధృతరాష్ట్రుండు పనుప నెదుర్కొనిన వాసుదేవుండు వారల నరిడ ఆ నర్హ్యోత్తెజంగుల సంభావించి కృతవర్మ దమవాఁడు గావున నతనికి సవిశేషస్నేహంబు సేసి యతండు సేరువరా సమస్తజనంబులుం బరివేష్టింపం జని తన రాకకు నలంకృతంబును బ్రమోదచాపలసుభగజనంబును నైనపురంబు సొచ్చి రాజమార్గంబున నరుగునవసరంబున మౌక్తికమిళితంబులు బహుగంధలులితంబులు నగునక్షతప్రకరంబులును బుష్పనికరంబులునుం జల్లుచు సంతసిల్లుచు మ్రొక్కుచుఁ జొక్కుచు నిరుగెలంకుల రమ్యహర్మ్యంబులపై నిలిచి పొలిచి కనుంగొనునంగనాజనంబులు దమలోన. 174

సీ. ప్రాణంబుతోఁ గూడ రక్కసిచన్నుల, పాలు ద్రావినపాపబాలుఁ డితఁడె
వ్రేల్మిడిఁ జాణూరు విఱిచి లోకముల మెచ్చించినయాజగజెట్టి యితఁడె
దుర్వృత్తుఁ డగుకంసుఁ దునిమి యాతనితండ్రిఁ, బట్టంబు గట్టినప్రభు వితండె
సత్యభామకుఁ బారిజాతంబుపైఁ గల, కోర్కి దీర్చినరసికుం డితండె

తే. వెన్నలును గోపికాచిత్తవృత్తములును

నరసి మ్రుచ్చిల నేర్చినశౌరి యితండె
శ్రుతిశిరోభాగములఁ దనరుసుభగచరణ
సరసిజామోదమును గూర్చుచతురుఁ డితఁడె. 175

వ. అనుచు నతికుతూహలంబున నవలోకింప నాబాలవృద్ధం బగుపౌరలోకం బాలోకనకౌతుకంబునఁ దనరథంబు గదిసిన సందడి జడియు వేత్రహస్తుల వారించుచు నారాయణుండు సమ్మర్దమందగమనంబునం జని మణితోరణసుందరం బగురాజమందిరద్వారంబు ప్రవేశించి కక్ష్యాంతరంబులు గడచి యేనుంగుమొగసాలఁ జొచ్చి యరదంబు డిగ్గి యల్లన నడచునప్పు డంతకు మున్న యరిగి భీష్మద్రోణప్రముఖు లగువారలు ధృతరాష్ట్రునిం బొదువ నతండుఁ బ్రత్యుత్థానంబు సేసి విదురసంజయసహితంబుగా నెదుర్కొనం జేరి. 176

ఆ. అతనిఁ గౌఁగిలించి యచ్చట గలవిదు,రాదిశిష్టజనుల నాదరార్ద్ర
బంధుదృష్టిఁ జూచి పరిరంభసంభావ,నము లొనర్చి శౌరి ప్రమద మెసఁగ.

వ. వార లందఱును సాత్యకిని దగినసమాచారంబులు నడపం బనిచె నట మున్న ధృతరాష్ట్రననుపునం దెచ్చి పెట్టిన నచ్చోటన యున్నయున్నతకనకాసనంబున నతండునుప నాసీనుం డయ్యె నవ్వాసుదేవునకు విహితానుష్ఠానపరాయణు లగునగరపురోహితులు రాజానుమతంబున నర్ఘ్యపాద్యమధుపర్కాద్యుపచారంబు లాచరించి యతనితమ్ముని నర్హపీఠంబున నునిచి యర్చించిరి నరనాథుండును దొరలును నిజోచితాసనంబుల నుండిరి కొలు వెల్లను సూర్యోదయసమయంబునఁ గమలాకరంబువిధంబున వికసించి యుండె నయ్యవసరంబునఁ గృష్ణుండు ధర్మనందను వచనంబులుగా నాంబికేయునకుం దగువారలకుం బ్రణామపరిరంభణప్రముఖ సముచితసంభావనంబులు వలికి సంభాషణంబులకుం జొచ్చె. 178

క. రాజునకుఁ దియ్య మెసఁగెడు, పూజావచనముల నెయ్యపుంబలుకులఁ బే
రోజ మెయి బంధుమిత్త్రస, మాజములకు మేలములఁ గుమారులకుఁ దగన్.

వ. ఇంపు పుట్టించుచుఁ గొండొకసేపు నిలిచి పుండరీకాక్షుండు విదురుసదనంబునకుం జని యెద మఱియుఁ బోవలయు నెడలకుం బోయి వచ్చెద నని పలికి యాంబికేయున నుమతి వడసి యరుగ విదురుండు ససంభ్రమంబునం గడచి చని మంగళోపచారసహితంబుగా నెదుర్కొని భయభక్తివినయస్నేహానందంబులం గండళితుం డగుచు గోవిందునకు దేవోపచారంబుల ననేకప్రకారంబుల నర్చన లిచ్చి కౌంతేయులకుశలం బడిగిన నతనికి వారలవృత్తాంతంబు సమస్తంబును సవిస్తరంబుగాఁ జెప్పిన యనంతరంబ. 18

క. ముదమునఁ గృష్ణుఁడు గుంతీ,సదనమునకుఁ జనియె నపుడు సమ్మదమున న
వ్విదురుం డోగిర మొనరిం,చెద నని తన్నడుగ నట్ల చేయుం డనుచున్. 18

వ. అని కాంచిన నద్దేవియు నతనితోడు నీడయుం బోని తనకొడుకులం దలంచి యడలు
పుట్టిన నప్పృథవుమెడ వట్టికొని యెలుంగెత్తి యేడ్చిన నతండు సంబోధించి
యయ్యార్త నెట్టకేలకు నుడిగి యాతనికి నాసనవిన్యాసనాద్యుపచారంబులు
సేయించి తత్సమీపంబున నుచితపీఠంబునం గూర్చుండి గద్గదకంఠంబుతో
నిట్లనియె. 182

సీ. సిరిఁ బెరుఁగుట । నీతిమంతులుఁ బుణ్యపరులు శూరులుగదా । పాండుసుతులు
సుఖవృత్తిఁ బెక్కండ్రు । సూరెలఁ గొలువ నుండెడువార లిడుమలఁ । బడుచు నిర్జ
నంబైన కానలో । నన యెట్లు నిలిచిరి, ననుఁ బెట్టి నాయెడఁ । గొనుచుఁ జనిరి
యేను వర్ధింపంగ । నింపారఁ గుడిచి మె, త్తనిశయ్య నిద్రించి । వినుతభద్ర

తే. గానకరిబృంహితముల మేల్కాంచునట్టి
వారు కందమూలంబు లాహారములుగఁ
బొదలఁ బుట్టలఁ బడి యుండి । పులుఁగు మెకము
లఱవ నోర్కొను చుండిరే । యక్కటకట. 183

ఆ. తండ్రి లేని ప్రజలు । దల్లిని బాసి పె, ద్దయును గాల మివ్విధమునఁ బడిరి
భంగపాటు దుఃఖ । పాటును సంకట, పాటుఁ గలిగె విరటు । పాలఁ బడవ. 184

వ. అని వెండియు. 185

ఉ. దానదయాపరుం డయిన । ధర్మతనూభవు సేమ మెట్లు పం
చాననవిక్రముం డగు బ । కారికి భద్రమె యస్త్రశస్త్రవి
ద్యానిపుణుండు క్రీడి సుఖ । యా వినయాభరణుల్ కవల్ సహా
ధానసమేతులే యకట । ద్రౌపది సాధ్వి సుఖంబె దానికిన్. 186

చ. కొడుకులకంటె నయ్యనుఁగుఁ । గోడలి. కెక్కుడు గూర్తుఁ గోడలుం
గొడుకులు సేయుభక్తి కట । కోటిమడుంగులు భక్తి నాకు నె
ప్పుడుఁ దగఁ జేయుచుండు నది । పుణ్యచరిత్ర కులాగ్రగణ్య క్రొ
త్తడి సకలంబుఁ జూడ సభ । దైన్యముఁ బొందుట సూచి పొక్కితిన్. 187

తే. నాఁడు ద్రౌపది వడిన బన్నములు సూడ
నోర్చినప్పుడ యెంతకు । నోర్వఁ జెపుమ
యంత గడచిన దుఃఖంబు । లనుభవింపఁ
గలవె లోకంబువారికిఁ । గమలనాభ. 188

వ. అట్టియెడ. 189

క. విదురుం డొక్కఁడు దక్కఁగ, సదస్యు లెవ్వారును ధర్మ । సంపథియు విందిగూ
డదు నార యతనిశీలము, కుదు రీలోకమున కింత । కుం దలఁపంగన్. 190

వ. అని యివ్విధంబునఁ గృష్ణుతోడఁ దనయుమ్మలికంబు లన్నియుఁ జెప్పికొని శోకం

బు వెల్లిగొనఁ గొండొక దిగం బాటెడుచిత్తంబుతో మఱియు నిట్లనియె. 191

క. ఇది యెల్లను నొకతల యీ, పదుమూఁడేఁడులును నాకు । బావకొడుకుచే
నదయు మగుకూడు గుడుచుట, యది యొకతల యయ్యె నేమి । యనఁగల దనఘా.

క. తన్నుఁ దనతమ్ములను నా, కన్నకొడుకులట్ల తలఁతుఁ । గాని విభేదం
బెన్నఁడు నామది లేమికి, వెన్నుఁడ దైవంబ సాక్షి । వినుము పలికెదన్. 193

క. ఇది నిక్కంబగు నేనియుఁ, దుది నీవుం బాండవులును । దురితరహితులై
పుదమందఁ జూడఁగనియెద, నది దీనికి మందు సువ్వె । యంబుజనాభా. 194

సీ. బావ యొప్పం డను । పలుకుల నే మగు, నాతనికొడుకుఁ గీ । డాడ నేల
కురువృద్ధుఁ డగుబాహ్లి । కుని దూఱ నేటికి, భీష్మునిపైఁ బ్రయి । వెట్ట నగునె
యిట్టిక్రూరులయింటి । కిచ్చినమనవారి, నందుఁ గా కట్లు దా । ననుట మేలె
యర్జునుపుట్టిన । యప్పుడు వీఁడు లోకము లెల్ల గెల్చుపో । గడ్త మొగులు
తే. ముట్టునట్టిద యగు రణ । మున జయించుఁ, గౌరవుల సోదరులఁ దాను । భూరిరాజ్య
గౌరవముఁ బొందు నని యశ । రీరవాణి, పలికె నది దిట్టువడఁగాక । వలయు నేని.

వ. ధర్మంబు గలుగు నే నది నిక్కంబయ్యెడు దాని కెల్లను నిర్వాహకుండవు నీవు
గలవు గాదె నీమన్నించు నెచ్చెలులకుం జెప్పెడుమాటలు గలవు వినుము యు
ధిష్ఠిరుతో నిట్లనుము. 196

క. వేఁడికొని కృపణులై కను, పోఁడిమి యది యేల రాజ । పుత్రులు దమమై
వాఁడిమి దప్పిన నిష్ఫలు, వేఁడిమి సెడినట్లు జనులు । విని యులుకుదురే. 197

వ. భీమార్జునుల కిట్లని చెప్పుము. 198

ఆ. కొడుకుఁ గాంచు రాచ । కూఁతు రెద్దానికి, నట్టిపనికి నుచిత । మైనసమయ
మొదవెఁ దడయు టింక । నొప్పదు జనములు, నట్లు గాని పురుషు । లనరు మిమ్ము.

క. భుజబలమున జీవించుట, నిజధర్మము మెత్తఁబడుట । నింద్యము మాద్రీ
ప్రజలకుఁ జెప్పుము ద్రుపదా, త్మజఁ గార్యం బడుగు మనుము । తగ నందఱతోన్

చ. అలిగిన భీమఫల్గునుల । కడ్డము లేమి యెఱుంగు దంతలం
తలు వడి వాని నీఁగ వల । దా విను మాపని కెల్లఁ బాండుపు
త్రులె కలవారు నీ కెటులు । దోఁచిన నట్టులు సేయువారు గా
కలఘువిచార నాయలఁత । యార్పుము నన్ గడతేర్పు మెమ్మెయిన్ 201

వ. అనినఁ గృష్ణుండు గొంతి ననునయించి యిట్లనియె. 202

శ్రీకృష్ణుఁడు గుంతీదేవి నూఱడించుట.

చ. సుగుణవు పుట్టినింటికిని । జొచ్చినయింటికిఁ దేజ మెక్కఁగాఁ
దగుచరితంబునన్ నడచు । ధన్యవు ధీరవు దేవి నీ వెడ
న్వగ లడఁగింప కున్న భువ । నంబుల నింకిట యెవ్వ రోర్చువా

రు గలఁక దక్కుమీ హృదయశోకము లన్నియుఁ బుచ్చివై చెదన్. 203

క. తనయులుఁ గోడలు సేమం,బున నున్నా రధికభక్తిపూర్వముగా దం డనమస్కారంబులు నీ, కొనరించిరి కౌఁగిలించి కుశలములఁ దగన్. 204

క. నీకొడుకు లొందుసుఖములు, నేకొన రవ్వీరసుఖము చిత్తములఁ గరం బాకాంక్షింతు రలంతులఁ, బోక గలుగు నెట్టు లల్పబుద్ధులె వారల్. 205

క. ఉత్సాహంబున శత్రుకు,లోత్సాదనవిధి యొనర్చి యున్నతసామ్రా జ్యోత్సవము నొందుపుత్రుల, నుత్సుకతం జూతు గాక యూఱడు మింకన్. 206

చ. అన విని మోము విచ్చుచు మురారికి నిట్లనుఁ గుంతి పాండునం దనులకుఁ దండ్రియుర్గ గురువు దైవము నారయ నీవ కావె నీ మనమున ధర్మమున్ హితము మంచిగఁ జూచి విధించినట్ల చే సి నెగడువారు గాక నినుఁ జేరిన నాపద లొంద నేర్చునే. 207

క. వారలకే యేల మాధవ, కౌరవులకు మఱియు నీజగంబుల కెల్లం జేరుగడ నీవ నీపలు, కారయ వేదంబ కాదె యఖిలంబునకున్. 208

వ. అనినం బ్రసన్నవదనుం డగుచు నద్దేవి గారవించి యామంత్రణంబు సేసి తదా వాసంబు వెలువడి తనరాకకు నలంకృతం బైనదుర్యోధనుమందిరంబునకుఁ గృత వర్మసాత్యకిసమేతుం డయి పోవుగోవిందునిం గని తదీయద్వారపాలకులు సం భ్రమంబునం బఱచి యతని కెఱింగించి తదనుమతంబునం బఱతెంచి యెదు ర్కొని కక్ష్యాంతరంబులసందడి నెడ గలుగ జడియుచు వినయంబునం దోడ్కొని చన నమ్మనుజవిభుండు కైలాసశిఖరాకారం బగుసౌధంబున బాహ్లికభీష్మద్రోణ ప్రభృతులును కర్ణశకునిసైంధవాదులును దుశ్శాసనవికర్ణదుర్ముఖప్రముఖులును మఱియు ననేకదేశాధీశులుఁను బరివేష్టింపఁ బేరోలగంబున సింహాసనాసీనుం డై యున్నయెడకుం జనునప్పు డాసుయోధనుండు సపరివారంబుగాఁ బ్రత్యుత్థానంబు సేయం జేర నరిగి యతనికిం దగువారలకు నాలింగనాద్యుపచారంబులు దానుం దమ్ముండును నాచరించి. 209

క. అతఁ డునుపఁగఁ గనకమయో, న్నతపర్యంకంబునందు నారాయణుఁ డూ ర్జితమహిమ నుండి యభ్య, ర్చితుఁ డయ్యెఁ దగంగ నతనిచే సత్కృతులన్. 210

శ్రీకృష్ణుఁడు దుర్యోధనునితో సంభాషించుట.

వ. సాత్యకియును సముచితప్రకారంబునం బూజితుం డయ్యెఁ దదనంతరంబ నిజాస నాసీను లయి తనమొగంబునం జూడ్కి నిలిపి యున్నదుర్యోధనాదులతో మాధవుఁ డిడు మధురసంభాషణంబులు సేయుచుండె నట్టియెడ. 211

తే. సముచితంబుగఁ గూరలు చండ ముగ్గ,డించి కుడువు తెఱంగు పుట్టించి పలుకు నాసుయోధనులోఁ గృష్ణుఁ డచటఁ దాను, గుడువనొల్లకయునికి యేర్పడఁగఁ జెప్పె.

వ. చెప్పిన విని దుర్యోధనుండు సూర్యసూనువదనం బవలోకించి యల్లన యిట్లనియె.

క. వారి పలికినవిధ మెంతయు, నెఱ వైయున్నయది వింటె యిమ్మాట తెలియం
గరయుదము తొలుత నీపెను, పరిచందం బెల్ల నెఱుకపడియెడుఁ బిదపన్. 214

వ. అని యచ్యుతున కిట్లనియె. 215

తే. వలయునన్నపానంబులు పలుదెఱఁగుల, నేర్చువిధముల నేమొడఁగూర్చి వేడ్క
నున్న నీ వుపయోగింప నొల్లకునికి, బాంధవమునకు నీతికి బాహిరంబు. 216

క. కౌరవులకుఁ బాండవులకు, నారయ నీ వొక్కరూప యనుసద్భావధర్మా
చారుండవు రాజనకుం, గూరుతు గత మేమి యిట్లు కగుటకుం జెపుమా. 217

క. అనుడు నుపేంద్రుఁడు మనుజేంద్రున కిట్లను దూతలెందుఁ దొలితొలి గుడువం
గొనఁ గట్టఁ దొడఁగుదురె వచ్చినకార్యము దీర్చి పిదపఁ జేయుం డెల్లన్

వ. అనిన గాంధారీనందనుండు దేవకీనందనున కిట్లనియె. 219

ఆ. వేగపడుట మేలె వినుము కార్యము దీఱుఁ, దీఱకుండు దాని దెలియఁగు దగిన
యప్పు డాడ రాదె యిప్పుడు ముకుఁ ద్రాటఁ, గాలు గుప్ప నేల కమలనాభ.

వ. నీవు వచ్చినవాఁడవు మాయింటఁ గుడిచి కూర్చుండి యెల్లపనులుం జెప్పుట యొప్పుఁగాక కుడువనొల్ల ననంగ నగునె దీనికిం గారణంబు నాయెఱింగినయది లేదు విచారింపక పలికితి నని సంకరధరుండు మందస్మితంబుతో నందఱం గలయం గనుంగొని ధార్తరాష్ట్రకరంబు నిజంబు పల్లవం బల్లన లేమల్పులీలం గేల నమర్చి యిట్టిమాటలు లేటపఱుప వలయునె వినుము సుని యుతని కిట్లనియె. 221

చ. ప్రియ మొసఁగం దగం బిలిచి పెట్టుటకూ డద పెన్నకూడు ద
క్కయునయహీనతం బడుకు నాపద యైనెడ నిట్టు నట్టు నే
మియు నన లేనికూడ డదియు మీవడి యైచను నీవు మాదెసం
బ్రియుఁడవు గావు మాకు ధృతిపెం పఱ నాపద లేదొకింతయున్. 222

వ. అట్లుం గాక. 223

క. పగవారియింటఁ గుడిచిన, నగుఁ దమ కనుమాన మమ్మతి మైనను దారుం
బగతురకుఁ గుడువఁ బెట్టఁగఁ, దగ దొడఁబుల కెప్పు డెవ్విధము వాటిలునో.

వ. నేను బగతుండనె యంటేని. 225

క. అలుగుదు పాండవులకు వా, రలు నాకుం బ్రాణములు ధరావల్లభ యి
ట్టులముగఁ దమప్రాణములకు, నలుగుజనులు పగతు రగుట యనుమానంబే.

ఆ. కారణంబు లేక కౌంతేయులకు బాల్య, మాది గాఁగఁ గీడె యాచరింతు
పుణ్యపరులు దోడఁబుట్టువు లార్యులు, వైర మెత్తఁ దగునె వారితోడ. 227

వ. ఇట్లున్న మీయందఱియన్నంబులు దుష్టాన్నంబులు విదురుం డొక్కనియన్నంబు భోక్తవ్యం బని నిశ్చయించితిఁ గావున నందుఁ బోయెద నని చెప్పి యజ్ఞనపతి యను

మఱి నీయం జనునప్పుడు తోడన బాహ్లీకభీష్మాదికౌరవులును గుంభసంభవప్రముఖులైన సమాన్యులును జని మాధవుతోడ మాయిండ్ల నెల్లను గానిక లాయితంబులు సేసికొని నీవు విజయంచేయుటకు నెదుళ్లు సూచుచున్నవార మని పల్కి ప్రార్థించిన నే నన్నిచోట్లకు వచ్చినవాఁడన యందఱయర్చనలుం గైకొంటిన మీరు నిలువుం డని వారల నిలిపి విదురుగృహంబునకుం బోయిన. 228

సీ. సంభ్రమస్నేహనిశ్చలభక్తియుక్తిఁ | బవిత్రమజ్జనము గావించి విదురుఁ
డెల్లవంటకములు | నేర్పడ బోనాలు, వెర్పింప నెంతయుఁ | బ్రీతి ముంద
రోజమై బ్రాహ్మణ|భోజనం బొనరించి, సపరివారముగ విశ|శాలరమ్య
పూతస్థలంబునఁ | బుండరీకాక్షుండు, దమ్ముండుఁ దాను సుశోత్సవ మెలర్ప
తే. సరసరంజకమహనీయ|సంప్రయోగ, మగుచతుర్విధహృద్యాన్న | మారగించె
లలితసంభావనామంజు|లంబు లైన, పలుకు లెడనెడ విదురున | కెలమి యొసఁగ.

వ. అతండును. 230

క. గోవింద సంభ్రమము సం, భావింపుము మాకు నిదియ | పరమధనం బొం
డేవిధమున నీ కర్చన, గావింపం జాలువాఁడు | గలఁడే యెందున్. 231

వ. అని మఱియు నత్యంతవినయవాక్యముల నారాధించు చుండె నిట్లు కృతాహారుండైన హరికిఁ జందనచర్చాద్యర్చనంబు లాచరించి యవ్విదురుండు కృతార్థుం డై యుండెఁ గవిగణకప్రముఖనిఖిలవిద్వజ్జనంబులు గాయకపాఠకవాంశికవైణికాది వినోదపాత్రంబులు నప్పరమేశ్వరుం గాన వచ్చి ప్రొద్దు పుచ్చి యభిమతార్థంబులు వడసి చనిరి రాత్రి యగుటయుఁ దగినయభ్యంతరమందిరంబున హంసతూలికాతల్పంబున భుజంగతల్పు నునిచి యతనికడ నుచితాసనంబున నుండి.

ఆ. విదురుఁ డిట్టు లనియె | నిది యొకకార్యంబు, గాఁగఁ బూనియుందు|రాఁగఁ దగునె
దుష్టబుద్ధి నీచు | దుర్యోధనుండు నీ, మాట వినునె దురభి|మానఘనుఁడు. 232

క. వచ్చినసైన్యంబులఁ గని, పెచ్చుపెరిఁగినాఁడు ద్రోణ|భీష్ములలావుల్
నచ్చియుఁ గర్ణుం డొక్కఁడ, యిచ్చుఁ దనకు విజయ మనియు | నెంతయుఁ బొంగున్.

వ. నీ విట వచ్చుట వినినయప్పుడు ధార్తరాష్ట్రు లందఱుం గూడం బాఱి తమలో నిశ్చయించిన తెఱంగు నీశాసనం బుల్లంఘింపం గలవారు పాండునందనులకు నేమియు నీ కుండువారు దార యీధాత్రి యంతయు బీఱు వోవ కుండ నేలువారు వారిం గూడినరాజు లెల్లను దిగ్విజయంబునాఁడు పాండవులచేత భంగపడినవారు గావునఁ గర్ణుతో నేకార్థుల మై చత్తుము గెలుతు మింతియ కాని యొండు లేదని నిశ్చయించుకొని యున్నవార ట్లగుటం జేసి దుర్యోధనుండు గండు మిగిలి యున్నవాఁడు సంధి గానేరదు వారల కందఱకు నిది ప్రాప్తకాలం బై యున్నయది యెట్లును నుడుగ నేర్చినవారు గా రిట్లు దమ్మెఱుంగనిదుష్టాత్ముల

నడుమం గూర్చుండుటయు నవ్వెంగలివిత్తు లఱచుచీఱేడియు ఱెప్పలకు వంకలొత్తి
మాఱు సెప్పుటయు నొప్పకయుండు వెడంగులగుటం గార్యవచనంబు లెఱుంగరు
మొఱకులగుటం బ్రతాపభాషణంబులకు వెఱవరు వారలతలంపులు గీడు. నీ
మహనీయప్రభావబుద్ధిపౌరుషంబులు తెలియంగుదు నయినను పాండవేయులపై
స్నేహంబునను. నీమీఁది భక్తినిం జెప్పెద నందుఁ బోవలన దనిన, వాసుదేవుం
డతని కిట్లనియె. 236

తే. నీ వివేకంబు నా ప్రియు లెఱపి తీవ్ర, తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి
తేను నారాక తెఱఁ గెల్ల నేర్పడంగఁ, జెప్ప విని యేమి సెప్పినఁ జేయువాఁడ.

శ్రీకృష్ణుఁడు విదురుతో సంభాషించుట.

క. ఎఱుఁగుదు నేను సుయోధను, కొలఁదిగామియు నతనితోడఁ గూడిన నృపు లం
దఱు బగ మానమున నిడికొని, యెఱుములయును సంధిసేయఁగ దనియు సహాత్మా
ఆ. పుడమియెల్ల నొడ్డగెడవయి గజవాజి, యుతముగాఁ గడంగ రయుగ్రమృత్యు
ముఖము సొరఁగఁ దివురు కమూర్ఖత మాన్చుట, యధికమైన పుణ్యకమనఘచరిత.
వ. మానుప వచ్చునే యంటేని. 239

క. దొరఁకొని పుణ్యముఁ బాపము, నరుఁ డర్థిం జేయుచుండ నడుమ నొకటి న
వ్వెర వెడలి తప్పినను ద, త్పరితఫల మొందు నందు ధర్మవిధిజ్ఞా. 240

వ. అట్లుం గాక. 241

తే. చుట్టములలోన నొప్పమి పుట్టినప్పు
డడ్డపడి వారితోడఁ గోట్లాడియైనఁ
దాన యుడుపంగఁ జొరకున్నవానిఁ గ్రూర
కర్ముఁ డని చెప్పుదురు కర్మకాండవిదులు. 242

వ. కావున నీరెండు దెఱంగులవారికి శాంతి గావింపం బ్రయత్నంబు సేసెద. ధర్మార్థ
సహితంబైన తెఱంగుమాటలు మంత్రిజనసహితుండైన సుయోధనునకుం జెప్పె
దఁ దనకుం బాండునందనులకు లోకంబులకు హితంబయినవిధంబు వంచన లేక
చెప్పెదు నన్నుఁ బాండవులవాఁ డని శంకించి యతండు నామాట వినం డయ్యె
నేనియు మేల కాక యిట్లు సొచ్చి చెప్ప కున్న నన్నదమ్ములు దమలోనం బోరఁ
గృష్ణుండు వారింపక యుపేక్షించెఁ దనచేతఁ జక్కంబడదా యని యజ్ఞులైన
జను లాడుదు రెల్లభంగులం గార్యం బార్యులియ్యకోనం జెప్పుదు ధార్తరా
ష్ట్రులుం దమకు బ్రదుకుతెరువైన నాపలుకులు వట్టుదురు పట్టకి నీతలంచినచండ
మునం దులువలై కలఁగంబాఱిన వారు నాముందఱ నిలువం జాలుదురే యని
పలికిన విదురుం డట్లకాక యని సమ్మతించి యామంత్రణంబు సేసి నిజనిలయన
స్థానంబునకుం జనియె నంతరంబ. 243

గీ. అతనివచనరచనక్రియాసక్తిఁ దలఁపోసి, యిట్టివాఁడు గలఁడె క్రియ యెందు ననుచుఁ
బాలకడలి కడలిక పాటి యై యొప్పఁ, బాన్పునందు శౌరి కవ్వడించె. 244
వ. ఇట్లు సుఖనిద్ర సేసి వేగుంబోకట మాగధమంగళగానంబుల మేలుకాంచి సమయ
కర్తవ్యంబులు సలిపి నట్టియెడఁ గృతవర్మయు సాత్యకియు వచ్చి పొడసూపినం
బురుషోత్తముండు వారలు మొదలుగాఁ గలయిష్టజనంబులు పరివేష్టింప నుచిత
ప్రదేశంబున నున్నంత. 245
క. ఇనతనయశకునిదుశ్శా, సనసహితము గాఁగ నెలమిఁ జనుదెంచి సుయో
ధనుఁడు ప్రియోక్తులఁ దగువా, రును దానును వారిఁ జేరి దంకరుం గొనియాడెన్.
వ. అతండును మధురసంభాషణంబులు సేయ వార లతనికి ధృతరాష్ట్రుండు బంధు
మిత్త్రాదిసమస్తపరిజనసమన్వితుం డయి పేరోలగంబున నునికి యెఱింగించినఁ
బ్రియంబునఁ గట్టాయితం బైన తేరెక్కి భేరీశంఖచామరప్రముఖభద్రచిహ్నం
బులతో వెడలి గరుడధ్వజంబు గ్రాలఁ గృతవర్మసాత్యకు లొక్కరథంబు
నను దుర్యోధనాదిచతుష్టయం బొక్కరథంబునను బార్శ్వంబుల రాఁ బౌరు
లకుఁ గన్నులపండు వగుచు రాజమందిరద్వారంబు సేర నరుగునప్పటియులివ్వ
నకుఁ గొలువువా రెల్ల నత్యుత్సుకు లై యెదురుచూడ రథోత్తమంబు నవత
రించి యరవిందనాభుండు. 247
తే. ఎదురువచ్చినవిదురునికయిచ్చు కరముఁ, దమ్ముచేయును రెండుహస్తములఁ బట్టి
నడచె ముందటఁ గదియుసంకదడిఁ గడంగి, కర్ణదుర్యోధనులు దోలఁకగంగ జడియ.
వ. కృతవర్మాదియాదవులు లోనుగాఁ గలయభ్యంతరు లైనబలుమానుసులు పొదివి
కొని పోవఁ దనసమీపంబునఁ గౌరవులు రవిసన్నిధిఁ దారాగ్రహంబులచందం
బగుచుండం దేజోరాశి యగు రాజీవాక్షుండు సని తనకుం బ్రత్యుత్థానంబు సేసిన
కురురాజును దొరలను నభినందించుచు. 249
క. తన కని పెట్టినమణిమయ, కనకోన్నతపీఠమునఁ బ్రకాశంబున ని
ల్చినయెడఁ దోఁచిరి నారద, మునిప్రముఖు లంతరిక్షమున నుజ్జ్వలు లై. 250
వ. ఇవ్విధంబున సన్నిహితు లయినయమ్మహామునులం గురుపితామహునకుం జూపి
నారాయణుం డి ట్లనియె. 251
ఆ. మనలఁ జూచువేడ్కఁ జనుదెంచినారు మ, హాత్ము లైననారదాదిమునులు
వీరి కర్ఘ్యపాద్యవిధు లొనరింపు మా, సనము లిడఁగఁ బనుపు సత్వరముగ.
వ. వీరలు సముచితాసనంబుల నుండక మనకుఁ గూర్చుండుట దగవు గా దనినం
గొలువువారెల్ల సంభ్రమాశ్చర్యంబులతో మునులవలన చూచుచుండ భీష్ముండు
పరిచారకులం బనిచి కనకమణిమయాసనంబు లనేకంబులు దెప్పింప వార
లరుగుదెంచిన వారలకు నమస్కరించి యాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజలు

సేయించి కృష్ణుఁడు గూర్చున్నయనంతరంబ ధృతరాష్ట్రుండునుం దక్కటివారును నుచితప్రకారంబుల నమ్మునీంద్రులకు నభివందనంబులు సేసి నిజాసనాసీను లైరి దుశ్శాసనుండును వివింశతియును గద్దియ లిడ సాత్యకియుఁ గృతవర్మయుఁ గృష్ణుం గదిసి యిరువంకలం గూర్చుండిరి కర్ణదుర్యోధనులుం జేరువ నొక్కగద్దియ నుండిరి విదురుండును మణిపీఠంబునఁ గృష్ణునివెనుకదెసఁ దదీయోన్నతపీఠంబునఁ గరం బు త్తమిల్లి యుండె గాంధారరాజు నిజపుత్రపరివృతుం డై యొక్కదిక్కున నుచిత పీఠాసీనుం డయ్యె నట్టిసమయంబున. 253

క. అంబుదశుభగాత్రుం బీ,తాంబరధరుఁ గమలదళవి । భాక్షుఁ హరిఁ జూ
డం బడసి లోచనము లమ్మ,తం బానినమాడ్కి సమ్మదంబునఁ దేలన్. 254

క. ఆకొలువువారు గర మచ,లాకృతి నొకపలుకు లేక । యందఱు వింజం
బాఁ కిడినకరణి నవశము,దాకారితచిత్రవృత్తు । లై యుండంగన్. 255

శ్రీకృష్ణుఁడు ధృతరాష్ట్రుతో సంభాషించుట.

క. జలదస్వనగంభీరత, నెలుఁ గొప్పఁగ దంతదీప్తు । లెసఁగ ముకుందుం
డలరుచెవుల నఖిలజనం,బులు విన ధృతరాష్ట్రభూవిభున కి ట్లనియెన్. 256

క. జననాథ నీయెఱుంగని,పనులు గలవె యైనఁ దగవుఁ । బరమహితంబుం
దనవారికిఁ జెప్పన తగు, నని వచ్చితి భారతాన్వయము ప్రియ మొందన్. 257

క. క్షీరోదకగతిఁ బాండవ,కౌరవు లొడఁగూడి మనికి । కార్యం బది నీ
వారసి నడపుము వా రన, వీ రనఁ గురుముఖ్య నీకు । వేఱుం గలదే. 258

చ. భరతకులంబు ధర్మమును । బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గి యుండు ననఁ । గా నుతిఁ గన్నది యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁదమ్ముఁడు నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు రీసుచరితక్రమ మిప్పుడు దప్ప నేటికిన్. 259

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు రిం । దెవ్వారిచందంబు లె
ట్లైన వర్తిల్లినఁ గీడు మేలుఁ దుది నీయందుం దొందెడుం గాన స
ద్భావం బారసి లోనిపొత్తు వెలిపృత్తంబుగ్ జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం । గౌరవ్యవంశాగ్రణీ. 260

చ. వినుము సుయోధనాదు లగుదీరు సధర్ములు గాక కార్యము
ల్గొనక మహార్థసిద్ధి యెడలుం దమ కి ట్లన కన్వయంబువ
ర్తన మిది గాదు నాక బెడిదంపుఁదనంబున బంధుకోటికి
న్మనసులు నొవ్వఁగా నవగుణంబులకుం బయిలొడ రేమియున్. 261

కౌరవపాండవుల్ తెఱఁగు । గైకొని శాంతతఁ బొంది యున్కి మే
లారయ నాకు నీకుఁ గుల । మంతకు నీనృపకోటి కుర్వికిం
బోరిన మైన నింతకును । బుట్టు మహాపద గావునన్ ధరి

శ్రీరమణాగ్రగణ్య గణుతించి యుపశమ్యముఁ బొం దొనర్పవే. 262

తే. నీకు వీరలఁ దీర్పంగ నేర వచ్చు, నధిప తెలుఁగు నీవశమునయుదియు కాన
నీకు వీరలఁ దేర్చుట నెఱియ కాదె, సిద్ధ మెవ్వారిఁ బెలి వొందఁ జేయ నేర్తు.

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నుమా యిచట నీగురుభీష్ములఁ గ్రేశి సేయువా
రెందఱొ వారు వీరు నని యిల్లుటకంటె భవద్బలంబులై
యుందఱుఁ గూడు టొప్పదె జనాధిప శాంతి యొనర్పు మెమ్మెయిన్. 264

తే. జగతిఁ గలజనపతులు నీకచరణపీఠ, మర్థిఁ గొలువ సముద్రవేలావృతోర్వి
యెల్ల నేలుట యొప్పదే తల్లి ప్రజల, యెడ విరోధంబు వాటించు టెంత మేలు.

క. నరనాథ నీ కృపేమో, పరుఁడ వయినఁ గౌరవులకు పాండవులకు గా
దరయుఁగ భూప్రజ లెల్లను, దురితం బొనరించినట్లు తుదిఁ గీడు సుమీ. 266

క. కౌరవపాండవులం దెవ్వారలకుం జావు నొవ్వ వచ్చిన మేలు
ర్వీరమణ చిత్తమున ని, ట్లారయుమా నీక దుఃఖ మగు నెట్లయినన్. 267

ఉ. వీరును వారుఁ బండితులు విక్రమవంతులు బాహుగర్వసా
ర్వారులు లోనిరి త్త్రబవకరంబున నాఱడిఁ జావఁ జొవ నె
ట్లూరక యుండ వచ్చుఁ గడుఁ గొన్నిపుడు మేసులు వాఁడికైదువుల్
దూరఁగ నాటిసం బుడమిఁ గూలుట కక్కట యోర్వవచ్చునే. 268

ఆ. ఇట్లు గాక యుండ నీరెండుదెఱఁగుల, వారిఁ గాచికొనుము వసుమతీశ
నీదుప్రాభవంబు నీతియు శాంతియు, సకలజనులుఁ బొగడునట్లు గాఁగ. 269

వ. అని చెప్పి వెండియు. 270

శ్రీకృష్ణుఁడు పాండవులు చెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట.

తే. పాండవులు దండ్రి సచ్చినఁ బ్రజలు వారి, నరసి ప్రోచితి వైభవ పూది గాఁగ
నడుమ నిష్కారణము దిగవిడువఁ దగునె, పోర యెుండంగ రక్షింపు గౌరవమున.

వ. పాండుకుమారులు నీకుం బరమభక్తిం బ్రణామిల్లి యుండఱు నొక్కమాటగా నీతోఁ జెప్పు మని నాకుం జెప్పినవిధంబు వినుము తమయుపసం బండ్రెండువత్సరంబులు వనంబున వసియించితిమి పదుమూఁడగునేఁడు జనపదంబున నజ్ఞాతవాసంబునుం జరిపితిమి మాతండ్రిసమయంబు పరిపాలించి యేమర్ధరాజ్యం బెల్లునుం బడయుదుమని కృతనిశ్చయుల మై పడితిమి తల్లియుఁ దండ్రియు నెల్లచుట్టంబులు నేడుగడయును మాకుఁ దాన మావలన నేరమి గల్గినం గినిసి యిట్లు గాదట్లని చక్కంబెట్టునది తనగలుబది వేలేండ్లకుం దన్నుగాని మఱి యెఱుంగ మెట్టివారమైనను మమ్మును [illegible] దెఱంగు గలిగిన నెవ్వరు గొఱ గాదన్నను గులంబుపాడి సెడక చెల్లు నని రని పలికి మఱియు నిట్లనియె.

చ. అని మది నిశ్చయించి తగ ॥ నందఱుఁ బిల్వఁగఁ బంచి వారితో
ననిపని మాటలాడి వినయంబునఁ బ్రార్థన సేసి మీర లీ
రొనరిన సైన్యముల్ పదునొకొంటికిఁ బ్రాభవ మాచరింపఁ జొ
చ్చిన సకలంబు నొప్పు నభిషేకము గైకొనుఁ డుత్సవంబుగన్. 140

క. అనవుడు నందఱు నొఁగా, కని సంతస మంద నధిపుఁ ॥ డభిషేకించెన్
జను లెల్ల సంప్రమోదం,బునఁ బొందఁగ నప్పు డతివిభూతిం బ్రభులన్. 141

వ. ఇట్లు మహామహిమ వెలయ నక్షౌహిణీనాయకుల సమకట్టి రారాజు పితామహు
పాలికి వారిం దోడ్కొని చని సవినయంబుగా నతనికిఁ బ్రణామంబు సేసి వారలం
జూపి వీరల మనయక్షౌహిణులు పదునొకొంటికిం బతులఁ గావించితి నిన్ని
సైన్యంబులు నొక్కలావున వర్తించుచందంబు సూచికొనవలయు నని చెప్పుచుఁ
జేతులు మొగిచి యి ట్లనియె. 142

చ. నెఱిఁ బడి యాజి నీమొనలు ॥ నేరవు గూడి తగం జరింప నిం
దఱమన పొక్కఁడై చనక ॥ తప్పఁగ దా బహుదేశవాసు లం
ద ఱొకటి సేయుచో వెరవు ॥ దప్పక చెల్లుట యెట్లు గల్గు ని
త్తెఱఁ గొకచాలువానిబలు ॥ తీర్పునఁ గాక పొసంగ నేర్చునే. 143

ఆ. అమరసేనలును ద ॥ మంతన వర్తింప, నేర కునికి నాకు ॥ మారుమొగము
గా నొసర్ప వలసెఁ ॥ గాదె సమస్తసే, నలను నీవ యరసి ॥ నడప వలయు. 144

క. తారలకుం జంద్రునిగతిఁ, గౌరవులకు మేటి వీవ ॥ కావున నీ వీ
భారంబు పూని మముఁ గడ, చేరుపఁ దగు నెమ్మెయిం బ్రసిద్ధచరిత్రా. 145

తే. సర్వసేనాధిపత్యంబు ॥ నిర్వహింప, నీవు దక్క నిం దొక్కరు ॥ నీవ యరసి
చెప్పుమా కలఁడేని రక్షింపు మముఁ,బూనిపట్టంబు దాల్పుము ॥ పొడిచి గెలుము.

వ. అనిన విని గాంగేయుండు గాంధారేయున కి ట్లనియె. 147

ఆ. మీరుఁ బాండుసుతులు ॥ నారయ నా కొక్క,రూప కార్య మున్న ॥ రూపు వలుక
వలయుఁ గయ్యమైన ॥ వత్తు మీలోన నా,యునికి చందమునకు ॥ ననుచిత్త మిదియ.

క. సేనాధిపత్యమును దగఁ, బూనెద నను మార్కొనంగఁ ॥ బురుషుల నుర్విం
గానఁ గిరీటికి నొక్కని, కే నోర్వ నతండు శరము ॥ లెక్కు డెఱుంగున్. 149

క. పెఱవారి నెల్లఁ దర మిడి, నఱకుదుఁ బాండుక్షితీశ ॥ నందనులను రూ
పఱ నేయం జే యాడదు, దఱుమరు నామీఁద నత్యుదగ్రత వారున్. 150

వ. అప్పటికిఁ దగినభంగి యయ్యెడు నది యట్లుండె నని పలికి మఱియు ని ట్లనియె.

ఆ. మున్ను కర్ణుఁ డొండె ॥ నన్నొండెఁ గయ్యంబు, సేయఁ బనుపు మిట్లు ॥ సేయువాఁడ
నైనఁ గాని సకల ॥ సేనాధిపత్యంబుఁ, బూన నేరఁ జుమ్ము ॥ భూపతనయ. 152

వ. అనినం గర్ణుండు కౌరవపతితో ని ట్లనియె. 153

క. ఇప్పుడు క్రొత్తగ వీనిం, జెప్పంగా నేల మున్న చెప్పితిఁ గాదే
యెప్పుడు భీష్ముఁడు పడు నే, నప్పుడ యనికి నచ్చువాఁడ నని సభలోనన్. 154

ఆ. అనిన నట్ల కాక యని సర్వసేనాధి
పత్యభారపట్టబంధమునకు
నియ్యకొనియె భీష్ముఁ డయ్యగ్గలికఁ గాని
యాఁడె విభుఁడు ప్రముదితాత్ముఁ డగుచు. 155

క. భేరీమృదంగశంఖకు,లారవములు సెలఁగఁ జేయుఁ డని పనిచి మహో
దారపతాకాద్యుత్సవ,గౌరవములు నడపె నెల్లకడలం బురిలోన్. 156

వ. ఇట్లు పట్టణాలంకారంబు సంఘటించి రత్నకాంచనకలధౌతమయంబు లగుకలశంబులఁ దీర్థజలంబులు దెప్పించి మణిప్రకరంబునఁ గుసుమనికరంబున మంగళతరుత్వక్ఛ్రీచయంబున మహౌషధిచయంబున విహితమంత్రంబుల నుచితతంత్రంబుల ఋత్విక్పురోహితసహితుం డై తత్సంస్కారప్రకారం బాచరించి. 157

క. గురుఁడును గృపుఁడును లోనగు, గురు లనుమోదింప బాహ్లికుండు మొదలుగాఁ
గురుజాతి యెలర్పఁగ న,న్నరపతి భీష్మాభిషేచనం బొనరించెన్. 158

తే. ఇవ్విధంబున నభిషేక మెలమిఁ జేసి, పరమభక్తి నక్షౌహిణీపతులఁ జూపి
వీరికిని సైన్యములకును వీర యొడయ,లను సుబట్టంబుగఁ బెట్టె శంతనుతనూజు.

క. అత్తఱిఁ బాషాణంబులు, నెత్తురు నెమ్ములును గురిసె నిష్ఠురనినదా
యత్తమయి నభము పిడుగుల, మొత్తంబులు పడియె నగరమున నెల్లెడలన్.

క. దానికి జను లుత్పాతవి,హీనతఁ బొందంగఁ గౌరవేంద్రుఁడు నానా
దానాదు లయినశాంతివి,ధానము లొనరించి యానతత్పరమతి యై. 161

క. తల్లియుఁ దండ్రియు నెఱుఁగున, బుల్లవడక్ పారికడకుఁ బోయి తడయఁగా
నొల్లక పయనపువీడ్కో,లెల్లం దనయిచ్చ నడపి యేత్తెఱ వెడలెన్. 162

ఆ. వెడలి తమ్ములుఁ దగువారు వివిధభృత్య
గణముఁ దానును నేల గ్రక్కదలఁ గదలి
రాజరాజు గాంగేయుఁ బురస్కరించి
కొని సముద్ధతి నడచె దిక్కులు వడంక. 163

వ. నడచి కురుక్షేత్రంబు దఱియం జొచ్చి యం దొక్కరమణీయప్రదేశంబు విడిదలగా నిరూపించి నిలిచి భానుసూనుండును దానును మెలంగ నెల్లవారిని విడియించి నడుమ నిజనివాసంబు గావించినఁ గౌరవేశ్వరుస్కంధావారంబు వారణపురంబున నెవ్వ రెయ్యెడ వసియింతు రాచందంబున నందం బై యొప్పె నిట్లు రెండువీళ్లును సన్నద్ధంబు లైనసమయంబున. 164

ఉ. సంధికి నేఁగి కార్యము పొసంగక కృష్ణుఁడు రాకయున్ సుహృ

ద్బాంధవసంఘయుక్తముగఁ బాండవకౌరవవీరు లప్పుడి
క్సింధురకంధరంబు లడఁగించుబలంబుల పెల్లుతోడఁ గ
ర్వాంధత నాజి కెత్తుటయు నాబలభద్రుఁడు విన్కి నార్తుఁడై. 165

బలరాముఁడు పాండవుల వీడ్కొని తీర్థయాత్ర వోవుట.

వ. కతిపయపరివారంబు పరివేష్టింప రయంబునం జనుదెంచి సముచితప్రకారంబున ధర్మనందనుం బేరోలగంబునం గని సంభ్రమాలింగనాసనార్ఘ్యపాద్యంబుల నతని చేత సంభావితుం డయి దామోదరభీమార్జుననకులసహదేవులయభివాదనంబు లాదరించి పాంచాలవిరాటప్రముఖు లగుతగువారలవిసయంబుల నభినందించి యాదొరలతోఁ దత్కాలయోగ్యమితసంభాషణంబులు సేసి యనంతరంబ వార లకి ట్లనియె. 165

క. కౌరవపాండవు లెంతయుఁ, గ్రూరత నాటించి బంధుకోటికి నిఖిలో
ర్వీరమణులకుం జేటుగఁ, బోరికిఁ దగి రెట్టిఘోరకృపుంబని యగునే. 167

తే. ఇట్టిదానికి నోర్వక యెన్నఁడేనిఁ, గృష్ణుతోడ నేఁ జెప్పితిఁ గినిసి యితఁడె
అంగువారికిఁ దగఁ జెప్పి సంగతంబు, సేయు మ్మని యెంత సెప్పినఁ జేయఁ డయ్యె.

క. పలుకులపొం దెఱుఁగని వా,రలఁ బూజావాక్యములఁ దిరం బై తనకుం
దెలుపం దగదే మే మని, యలుక మెయిన్ సంధి చెఱచి హరి సేసెం జెన్.

తే. వీరు వారును సంబంధవిషయబంధు, లగుట సరి గాదె హరికిఁ దా నర్జునునకుఁ
బక్షపాతంబు సేయుటఁ బాండవులను, బెట్టుచోటులు గానక పట్టి కొలు.

ఉ. కావున వీరికిన్ జయము గల్గుట నిశ్చయ మెల్లభంగులం
జావు నిజంబు వారికి నసంశయ మై యిటు లుండ దీని న
శ్లే విన జూడ నేర్తుఁ దగ నింతప్రవీణుల నేన చేసితిం
జూవె సుయోధనుం బవనసూనుని నొండొరుఁ జంపఁ జూతునే. 171

క. హరి యెఱుఁగని చక్కటియుం, బురుషార్థము నా కెఱుంగఁ బోలునె యీ ని
ష్ఠురత వినఁ జూడఁ జాలక, సరస్వతీతీర్థమునకుఁ జనియెదుబుద్ధిన్. 172

వ. మీకుం జెప్పి పో వచ్చితిఁ బోయి వచ్చెద నని పలికి బలదేవుండు వాసుదేవధర్మ పుత్త్రు లొడంబడి యనుపఁ దీర్థయాత్ర వోయెఁ దదనంతరంబ. 173

రుక్మివృత్తాంతము.

సీ. కృష్ణుని దేవి రుక్మిణిసోదరుఁడు రుక్మి, యనువాఁడు బలవిక్రమాన్వితుండు
శార్ఙ్గగాండీవవిజయములు నాఁ గల, దివ్యచాపములఁ దృతీయ మైన
చాపంబు గలవాఁడు సైన్యసమేతుఁ డై, చనుదెంచి ధర్మజుఁ గని నతండు
సత్కారములుగాంచి సముచితాసనమున, నుండి యక్కాలుపున నున్నవీరు

ఆ. లెల్ల వినఁ గిరీటి కిట్లను సముదంబు, సేయ వెఱచి తేనిఁ జెప్పు నాకు

విడుగు లేరు జగతిలో నెవ్వరు నీకుం దో, డ్పడి జయింతు నెట్టిరిపుగణం బైన. 174

అని తన్ను నాక్రమించి తనతోం బుట్టువు దుర్నిశిం గొనివచ్చినయాకృష్ణునిసన్నిధిన సిగ్గు లేక యాడినమాటలు విని చిఱునవ్వు నవ్వుచుం గవ్వడి యతనియాననం బాలోకించి. 175

చెనసి గంధర్వసేన నిర్జించునపుడు, మత్స్యనాథుగోవర్గంబుల మరలం దెచ్చు
నెడను దప్పె నీకందువ యెఱుంగనైతి, నింక నేంగాని తోడు గల్మె నెచటికైన

అని యతని కుత్తరమునకుం దగినయట్లు పలికి మఱియును. 177

మున్నే నసహాయుండ నై, చన్నకడం జనంగ నైనరిపుచయం బద్యుర్
వెన్నండు దోడు గలండు వెఱ, వెన్నండును వలవ దింక నేమిటి కైనన్. 178

. వెఱచితి రాం గదే యనిన వెండి కదా పగం దీర్తు నీవు నా
వెఱ పెటు లున్న నీరథికరపీఠులు వాపెద రొల్ల నిన్ను నీ
యుఱుకడ కేగి తోడుపడు మొల్లకు నెవ్వరికేని నన్న నే
త్తెఱ నతం డేగి కౌరవపక్షము గని యట్టుల బెట్టు పల్కెనన్. 179

. అతం డివి యేటి మాటలు, నీతో డగు టొల్లం బొమ్మనిన దుర్నీతి వృథా
యాతాయాసవిషణ్ణుం డై తనపురమునకు మగుడ నరిగెం బెలుచన్. 180

తే. ఇట్లు బలదేవరుక్ములకిద్దఱకును, గయ్యమునకు సన్నాహంబు గలుగ దయ్యెం
గాని తక్కలోకమ్మునం గలుగునృపతికోటి యిరువాఁగునందును గూడె ననికి.

వ. అట్టియెడ నిశాసమయంబున ధృతరాష్ట్రుండు సంజయు రావించి యిట్లనియె. 182

క. బవరము గీడని యెఱుంగుదు, నవినీతుం డైనకొడుకు నదలిచి యుడుపం
దివిరియు నోరాడమి దై,వవశం బప్పనికి మనసు నగ పిం కేలా. 183

క. ఎయ్యది గా నున్నది యది, యయ్యెడుం జేయునది గలదె యపనిశులకుం
గయ్యానం జచ్చుటయు మే, లయ్యెప్పాటెఱ్ఱ గాక యది యట్లుండెన్.

వ. రెండువీళ్లను గురుక్షేత్రంబున విడిసినపిదపం బుట్టినవిశేషంబులు గలవేని నెఱింగింపుము. 185

సంజయుండు ధృతరాష్ట్రుని కులూకుండు పాండవుల నాడినమాటలు సెప్పుట.

తే. అనిన సంజయుం డిట్లనుం గటకటా కొడుకు, మీందం దప్పు పెట్టెదవు నీకమీందికొలంత
నీకుం గానంగవచ్చునె కాని వెఱుంగ, కుండం బలిచెనె యాతండు పాండుసుతుల.

వ. ఆపని గడవంబడినవార్తలు వినియెద వేని వినుము దుర్యోధనుండు దుశ్శాసన శకునికర్ణులతో విచారించి యులూకుం బిలిచి నీవు వోయి పాండవులం గని వాసుదేవుసన్నిధిని బాంచాలవిరాటప్రముఖులు వినం బలుకు మని పరుసని మాటలు గఱపి పుచ్చిన నతండును. 187

క. చని కొలువున ధర్మసుతుం, గని దుర్యోధనుండు సెప్పం గగా నను నియమిం

చివమాటలు గొన్ని గలవు, విను మలుగక యనిన నతఁడు । విని యిట్లనియెన్

ఆ. నీకు వెఱవ నేల । నిన్ను నాబుద్ధిమం, తుండు సెప్పు మనిన । తులువమాట
లెన్ని గలవు వాని । నన్నింటి ననుమాన, మింత లేక యాఁడు । మెల్ల వినఁగ

వ. అనిన నులూకుం డిట్లనియె. 190

సీ. కయ్యంబునకుఁ బెద్ద । కాల మేనియుఁ బూఁచి. పట్టి వచ్చితి కడు । బరవసమున
సంజయుతో మీరు । శంక లే కాడిన, యెక్కుడుమాటలు । పెక్కు గలవు
భూమిభాగము గోలు । పోయినయలుకకు, ద్రౌపదిఁ బఱచిన । దైన్యమునకుఁ
దగ మంచిబంట పై । తఱి యిది బాహుబ, లాస్త్రవిద్యలు సూప । నని తలంచి

ఆ. నిలువ వలయు నీకుఁ । గలవారి నెల్లను, గూర్చి మోహరించి । కొని కడంగి
నడవు సమరమునకు । వెడజంకఁ బో దింకఁ, దప్పఁ ద్రుంక లేదు । తఱికిఁ జొరుము.

క. ఆతతబలుఁ డగుభీష్ముని, చేతి బలువు ద్రోణునంప । సెల లవియుటయుం
జాతు రతు రందు కృష్ణుని, చేతన సకలంబుఁ జక్కఁ । జేసికొనుండీ. 192

క. వారిద్దఱవాలమ్ముల, బారిం బడి యర్జునునకు । బ్రదుక వశమె మీ
నా రెల్ల నెఱుంగరె యు, ర్వీరులదివ్యాస్త్రశస్త్ర । విభవసమృద్ధుల్. 193

వ. అని భీమసేనుం జూచి. 194

క. ఈవాయుపుత్త్రుఁ డాజిం, ద్రావుదు నే దుస్ససేను । రక్తం బనియెం
ద్రావఁగ శక్యం బేనిం, ద్రావు మనక రాదె యింకఁ । దడ వేమిటికిన్. 195

క. విను నూతికప్పవిధమున, నిను నీవ యెఱుంగు దెఱుఁగ । నేరవు గర్వం
బున నావలికోలఁది రణం, బున నొకమరి పెట్టువడక । పో నేర్చెద వే. 196

వ. అని పలికి సవ్యసాచిం జూచి. 197

తే. వినుము గాండీవ మనునొక । విల్లు దాటి
పొడవు గలిగియుఁ గృష్ణుండు । పూని తోడు
గూడుకొని వచ్చుటయు నెఱుం । గుదుము వీని
కెల్ల శంకించి భూమి పా । లీము గాని. 198

క. పవనజుగదయును నీగాం, డివమును నెట వోయె నంగ । డికిఁ బాంచాలిం
దివిచికొని వచ్చు నెడఁ బరి, భవ మెఱుఁగవె బీర మేల । పలుకుదు తోడ్తోన్.

చ. వలలుఁ డనఁగ విరాటుకడ । వంటలవాఁ డయి భీముఁ డుఁగ బృహ
న్నల యన నాఁడు పేడి వయి । నాన యొకింతయు లేక నీవు న
గ్గల మగుదైన్య మొంది కడుఁ । గాఱియ పొందితి గుర్వి యేలునా
సలఁ బడి సవ్యసాచి యిది । శౌర్యమొ బాహుబలంబొ చెప్పుమా. 200

ఉ. మాయలు నింద్రజాలములు । మాధవుఁ డిందును గొన్ని వన్నినన్
వాయుపురజ్జు లెప్పుడు న । వారణ నీ వెటు లాడి తేనియున్

వేయును నేల పార్థులును । విష్ణులు నేఁబదివేలు వచ్చినం
జేయుదు మేము గయ్య మొక । చీరియు సంపదఁ బంచి యుత్తుమే. 201

వ. అనిన భీమార్జుననకులసహదేవు లొండొరులం జూచుచు నాననంబులు చలింప మొగంబులు జేవుఱింపఁ గ్రోధాయత్తచిత్తులై యున్నం గనుంగొని నవ్వుచు నారాయణుం డులూకున కిట్లనియె సెప్పు వోయి సుయోధనుతో నెల్లవారును విన నిట్లనుము. 202

తే. బవర మెల్లియ బిరుదవై । బరవసంబు, గలిగి చావుము చావక తొలఁగరాదు
కృష్ణసారథికం బగు । జిష్ణురథము, దొడరి స్థి వెండుఁ జొచ్చినఁ । దోన చొచ్చు.

క. రిత్తలు రజ్జెడువాఁడే, మత్తగజాయుతబలుండు । మారుతి యని ను
ద్వృత్తుఁ డగు దుస్ససేనుని, నెత్తు రురము వ్రచ్చి త్రావు । నీవుం జూడన్. 204

వ. అని యిట్లు హరి పలికినయనంతరంబ యర్జునుం డులూకున కిట్లనియె. 205

క. వారు గలరు వీరు గలరు, పోరికి నని చెప్ప దీవు । పొం గారుచు మీ
వారిని మిమ్మును రేపు గ,దా రూ పేర్పడఁగఁ జూచెదం గితవసుతా. 206

చ. తనభుజశక్తి లేక యొరు । దర్పము యాఁది పరాక్రమింప వ
చ్చిన నది సెల్లునే కులవి । శిష్టుని సువ్రతు వృద్ధు నార్య భీ
ష్ముని నెసకొల్పి సేనలకు । ముఖ్యుఁడ వీవని యుబ్బఁ జేసి యీ
సునఁ దలపెట్టి చంపికొనఁ । జూచె సుయోధనుఁ డింత నే మగున్. 207

చ. తనతలఁ బెట్టు భీష్మభుజదర్పము లోకముకంటె నెక్కుడే
తని నొకభంగి నండ గొని । తప్పదు చావున కంచు నున్నవాఁ
డనిఁ దొలుముద్ద గొందుము ర । యంబున నాతని వెండి ద్రోణులం
దునుముదు మప్డు సూతసుతుఁ । దోలుదు మంతట నాస మాలెడున్. 208

క. అనుజులతనుజులచావులు, గనుఁగొని మఱి తాను భీము । గదచే నిలఁ గూ
లినయప్పుడైన దుర్యో,ధనుఁడు మదిం దలఁచుఁ గాక । తనదుష్కృతముల్. 209

వ. అది యట్లుండె నీవు వేగ పోయి రేపకడయ మీరాజుం గలనికి నడపింపు మనియె నప్పుడు ధర్మనందనుం డులూకునకుం దాంబూలాభరణంబు లిచ్చి వీడుకొలిపి ధృష్టద్యుమ్ను నవలోకించి యెల్లి గయ్యం బని మనసైన్యంబుల కెఱింగించి సర్వసన్నాహంబులు సమకట్టు మని పనిచి కొలువు విరిసి చనియె ధృష్టద్యుమ్నుం డును ద్రోణులం దొడరం బడసితి నని యుబ్బుచు వెడలి భీష్ముం దలపడఁ గంటె నని పొంగుశిఖండి దోడుగా రాజశాసనంబు నిర్వర్తించె నిట యులూకుండు వచ్చి దుర్యోధనుం బేరోలగంబునం గని యతనికిఁ గృష్ణార్జునులపలుకు లున్న రూపు విన్నవించిన నతండు కర్ణుదెసఁ గనుంగొని సమస్తసేనలకు రేపు బవరం బని చెప్పి పుచ్చుము సకలసాధనంబులు నాయితంబులు సేయు మ్మని పనిచిన నతండు

నట్లు చేసె నిట్లుభయకటకంబులు రణంబునకు నుత్సహించి విజృంభించి యుల్ల
సిల్లె ననిన ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె. 210

క. వినుము హరితోడు గలయర్జును గెలువ నదీసుతునకుఁ । జొప్పడునే యా
పని నిలుపు ముల్లోకుని చెప్పినమాటల కేమి యనిరి । పిదపఁ గొలువునన్. 211

వ. అనిన విని యంబికానందనునకు సూతనందనుం డిట్లనియె. 21

ఆ. అయ్యలోకుపలుకు । లన్నియు విని భవ, త్తనయుతోడ నిట్లు । లనియె భీష్ము
డేను గలుగ నెఱవ । నేటికి సేనలఁ, గాతు నీవు మెచ్చఁ । గౌరవేంద్ర. 21

క. నడిపింపఁగఁ బోడిపింపఁగ, నెడమడు నై కలఁగినప్డు । దేర్పఁబుపఁగ నేఁ
గడు నేర్తుఁ బెగ్గునాదగు, కడిమియు నీసైన్యమునకు । గాసెన గాదే. 21

క. అనినం గురురాజిట్లను, వినుము పితామహ మహాస్త్రకవిత్తము లనఁగాఁ
జను నీవును నాచార్యుం, డును గలుగఁగ నాకు నన్నఁ । డును వెఱపేలా. 21

తే. ఏను గంధర్వకిన్నర । దానవాది
దివ్యభూతంబులకును భీతిల్ల ననినఁ
బాండుపుత్రులమాత్రకు । భయము నాకు
నెక్కడిది వేల్పులిడిన వారికయుక్కుమడఁతు. 21

భీష్ముఁడు కౌరవసేనలో నతిరథమహారథాదుల నిరూపణంబు సేయుట.

వ. అని పలికి మఱియు నిట్లనియె. 21

క. నీయందు వారియందుం, జేయం గలమానునులవి । శేషంబులఁ జి
త్తాయత్తంబుగఁ జెప్పుము, నీయెఱుఁగనియవియు లేవు । నిక్కపుఁజరముల్. 21

క. అనవుడు నీ విట్లడిగిన, విని యూరక యుండఁ దగదు । విను మేర్పడ నె
ల్లను నున్నరూపు సెప్పెద, మనవారల వారివారి । మానము లధిపా. 21

వ. అనిన గాంగేయుం డిట్లనియె. 22

సీ. నీ వతిరథుఁడవు । నీ తమ్ము లందఱు, సమరథశ్రేష్ఠులు । సమరమునకుఁ
బరుసనివీరులు । పాంచాలసేన ని, ర్జింతురు నను సేన । చెప్పికొనఁగ
నేర నాయేత్తైఱ । మీ రెఱుంగుదురు భో, జాగ్రణి కృతవర్మ । యతిరథుండు
దృఢవేధి యాతండు । దీప్తి నెంతటిపని, నైనఁ గైకొని శల్యుఁ । డతిరథుం

ఆ. వాసుదేవుతోడి । యీసువాఁ డల్లుర, విడిచె నిన్నుఁ గూడి । విక్రమమునఁ
బేరుకొనఁగఁ జాలు । భూరిశ్రవుం డతి, రథులమొదలియునికి । రక్కసుండు. 22

క. విను సైంధవుఁడు మహారథుఁ, డనిఁ బోర పెనంగు నతని । నాద్రౌపదికై
పసు పఱిఁ బఱచిరి కుంతీ, తనయులు వారల కెదుర్పఁ । దపముం జేసెన్. 22

వ. కాంభోజరాజగుసుదక్షిణుండు సమరథుం డితనిపాల రథబృందంబులు మేఁ
గలుగుఁ బాండవబలంబులం గలంచు మాహిష్మతీపతి యగునీలుం డతిరథుం డి

నికి సహదేవునకుఁ దెగనివగ యై యుండు దానం జేసి యాలంబున నోల మాస
గొనం డవంతి దేశాధీశు లగువిందానువిందు లర్ధరథులు పరస్పరస్నేహంబున సా
హసికు లై యొకళ్ళొకళ్ళం బెట్టిపోవక పోరుదురు త్రిగర్తపతులు దోడంబుట్టువు
లేవురును మహారథులు గోగ్రహణంబునం బడినబన్నంబుఁ బాపికొనంగడంగుదురు
వీరికి భుజబలం బగ్గలం బై యుండు. 223

క. సమరథుఁడు బిరుదు లక్ష్మణ, కుమారకుం డేచి మొనలఁ । గోల్తల సేయుం
మిము నెల్ల మిగులుభుజగ,ర్వము మనము గలఁడు కొనఁ డ। రాతుల నధిపా.

వ. బృహద్బలుండు సమరథుండు కోసలబలంబులతోడం గడంగి చిచ్చునుం గరువలి
యునుం గొని తాఁకు దండధారుఁడు సమరథుండు సేనసఱవు గలండు బెట్టిదంబు
గాఁ గయ్యంబు సేయు. 225

తే. అతిరథోత్తముఁ డిప్పటి। యుండు మేటి, కృపుఁడు తన పెంపు వాటించి। గెలుచుఁ జచ్చు
గాని నాలుగుదెఱంగుల। సేనలకును, దివియఁ డించుకయును నర। దేవముఖ్య. 226

క. శకుని విను సమరథుఁడు పాం, డుకుమారులతోడ నెప్పు।డుం బగ గొని వా
రికిఁ గీడ రోయు భృత్యులు, ప్రకటబలులు గలరు నేర్పు। బవరంబునకున్. 227

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుపటుఁ డ।శ్వత్థామ గాంఢీవితోఁ
బురుడింపం దగువాఁడు వీని కెన యు।ర్వీభూలోకసంచారు లె
వ్వరు లేరీతఁడు బ్రాహ్మణుం డనవిభా।వం బూనఁగా నోర్వమిం
దర మూహింపఁగ లేద కాని జముచం।దం బయ్యెడుం బోరులన్. 228

సీ. అతిరథోత్తముఁడు ద్రో।ణాచార్యుఁ డంతటి, యుండ విలువిలుకాండ్ర। కెల్ల గురుఁడు
హితుఁడు నీ కెంతయు। నేర్చినమొన లితం, డదరినఁ జమరిన।యట్లు ముందు
వృద్ధుని యితని భా।వింప రా దనిలోన, నంగవిస్ఫురణంబు।భంగి సూడ
నర్జునుపైఁ గూర్మి। యతని నోసేయుఁడు, సచరాచరం బైన।జగము లెల్ల

తే. నొక్కమొగ మై కడంగినఁ। జిక్కువఱుచు, దివ్యబాణజాలంబుల। దీటుకొలిపి
ప్రాణములు డాఁపఁ డీతని। పాటి దొరలఁ, గాన మే రాజ్యములయందుఁ। గౌరవేంద్ర.

క. అతిరథుఁడు బాహ్లికుఁడు విను, మతులితబలుఁ డితనియట్లు। యాత్మజుఁడును వి
స్రుతశక్తి సోమదత్తుం, డితనికి సితనికి సమర। మొన పెండిలికిన్. 230

క. అసురవరుఁ డీహాలాయుధుఁ, డసమానబలుండు సమర।ధౌగ్రణి విను పాం
డుసుతులయెడ రోషము గలఁ, డసంఖ్యమాయాబలమున। నరులఁ గలంచున్.

తే. వినుము ప్రాగ్జ్యోతిషాధీశుఁ। డనుపమాన, శక్తియో భగదత్తుండు। సమరథుండు
గజము నెక్కి తా నేనిక। కయ్యమైన, నేర్చునై రావణముమీఁది। యింద్రుఁ బోలి.

భీష్ముఁడు కర్ణుని నర్ధరథుం డని చెప్పుట.

వ. గాంధారరాజు లగువృషకుండును నచలుండును సమరథులు మానిసితనంబును మానుసులుం గలవారు వీరిసమరోపాయం బజేయం బై యుండు. 233

సీ. నీకుఁ బ్రెగ్గడయును । నెయ్యంపుఁజెలియు నై, కయ్యంబునకు నెప్డు । గాలుద్రవ్వఁ
బాండుపుత్త్రులతోడి । పగకు ని న్నెనకొల్పుఁ, గొలువున రజ్జులు । వలుకు నట్టి
రాధాసుతుం డర్ధ । రథుఁడు గుండలములుఁ, గవచంబుఁ బోవుట । కారణముగ
బీఱువాఱినవాఁడు । వీఱిఁడి కృపఁ బెద్ద, పరశురాముండు శా । పమున వీని

తే. యస్త్రవీర్యంబుఁ జెఱిచె న । ట్లగుట వీఁడు
పార్థు మార్కొని మానంబుఁ । బ్రాణములును
దనకు సొమ్ముగఁ దక్కించు । కొనఁగ లేమి
యెల్లవారికి నెంతయుఁ । దెల్ల మధిప. 234

క. అనవుడు గురుఁ డిట్లనుఁ గ, ర్ణునిచందము మున్న గడఁగు । రోయఁడు పాఱుఁ
విను మేమఱి యుండుం గా, వున నితం డర్ధరథుఁ డగువుం దలపోయన్. 235

వ. అనిన విని రాధేయుండు క్రోధతామ్రాక్షుం డగుచు గాంగేయున కి ట్లనియె.

క. ఒంటమిని లేనియొంటర, మింటరములు వలుకు టుచిత । మే యర్ధరథుం
డంటి నను నేమితక్కువ, గంటి చెపుము దీన నీవు । గన్నది గలదే. 237

తే. నొవ్వఁ బలుకుదు సభలోనఁ । జివ్వకొల్ల, కేను గురుపతిఁ జూచి స । హించి పోదు.
సురనదీపుత్త్ర విను నాకుఁ । జూడ నర్ధ, రథుఁడ వగు దీవు లావు బీ । రంబు నరయ.

వ. అని పలికి కొలువుఁ గలయం గనుంగొని, 239

చ. హితుఁ డని నమ్మఁగాఁ దగునె । యీతనిఁ గార్యపుమాట లిట్టివే
పతిదెసకూర్మి వాపుటకుఁ । బట్టుగ నెక్కువ తక్కు వంచు ను
న్నతు లగుమేదినీశులకు । నాసగఁ బల్కుట గాక యిట్టివా
రితవులు తండ్రికిన్ సుతుల । కేమన నేర్తుము పెద్దరాజులన్. 240

వ. అని దుర్యోధనుం జూచి యి ట్లనియె. 241

ఉ. కర్జము దప్పె నీయెదురఁ । గష్టపుమాటల కేల యోర్తు రీ
దుర్జనుఁ డైనశాంతనవు । దోర్బల మేటిది యీతఁ డొక్కఁడుర్
వర్జితుఁ డైన నేమి నృప । వర్గము గుందుట యొంటఁ బాయునే
యర్జునపక్షపాతి యితఁ । డాలము మేకొని చేయఁడుం జుమీ. 242

తే. చాలఁ గాలంబు పోవక । చతురు లైన, వృద్ధజనములబుద్ధులు । విందు గాక
ముదియ మతి దప్పి నోరికి । నొదవినట్లు, పలుకు వెడఁగులమాటలు । పాటియగునె.

క. నేవమొగ మీతఁ డైనం, బూని మహీశ్వరులు నీకుఁ । బొడిచెద రేదు
ర్మాని యని కాదె యీతని, తో నడచుట కొల్ల నైతి । దురమున కధిపా. 244

వ. అనిన భీష్ముండు సూతసూనున కిట్లనియె. 245

చ. ముదుకఁడ నైననాదుబలశౌర్యముఁ జలముఁ వివిధాస్త్రశస్త్రసం
పదయును బోయి నీగురుఁడు భార్గవుచే విను మాజిభూమి నా
కెదిరినవారు పెక్కండ్ర నేమయిరో యెఱుఁగుఁ జగంబు నా
ముదిమియు నీకుమారుతనముల్ పరుసల్ విజయుం డెఱింగెడున్. 246

క. అనుమానింపక సభలోఁ, నను నేఁ జెప్పికొన వలసె నాకిమ్మెయి దు
ర్జనితుఁడ వగునీయెడ నీ,సున నాకిటు పలుకవలసె సూతతనూజా. 247

తే. కార్యమును ఖడ్గమును నింత గలుగునీవుఁ గలుగఁ జేటువాటిల్లె నిక్కౌరవులకు
దీని మును బోటు లెల్లను దీర్ప నెట్లు, సాలెదను మంచిబంటవు సక్కనగుము.

చ. నెప మిడి యోహటించి యిటు నీవు తొలంగినఁ బోవ వచ్చునే
కుపితమనస్కుఁడై నరుఁడు గూల్పఁ గ్రమంబున దొడ్డ లెల్లఁ బ
న్నిపడవ నెట్లుఁ జచ్చెదు రణంబున నప్పుడు నావ కున్నవై
న్యపుఁబరివారముం బతియు నైన నెఱింగెద రెల్లచందముల్. 249

వ. అని పలికి దుర్యోధను నుపలక్షించి కర్ణుతో వెండియు. 250

ఆ. సూతపుత్త్ర యితఁడు నాతలఁ బెద్దనో, పెత్తి నమ్మి యున్న యిట్టిచోటఁ
గ్రందు సేయ నోపఁ గా దని సైరించి, యున్న బ్రదికె నింక నూరకుండు.

వ. అని యాడి మొగంబు గంటు వెట్టుకొని యున్నసురనదీసూనుదిక్కు మొగంబై సుయోధనుండు నీకుం గోపింప నగునె నన్నును గార్యభారంబునుం జూచి నా బ్రదుకునకై సర్వంబును సహింప వలయు నని తేర్చి యంగరాజుం గనుంగొని మీ రిద్దఱు నొక్కటియై భరంపడి యిప్పని సక్కం జేసి కాక మీలోన నిట్టి యెరవుమాట లేల యని ప్రోదిచి పలికి తదనంతరంబ పాండవపక్షంబువారల తారతమ్యంబులు వినువాఁడై యమ్మాట పుట్టించిన నతనికి భీష్ముం డిట్లనియె.

తే. పాండుపుత్త్రుల యద్దెస దండిమగల, కలనిజం బేను జెప్పినఁ గర్ణమనసు
నొచ్చు నీచిత్త మెట్లగునో యెఱుంగ, నాకు నిది యేమి పని రిత్తనడుమనుండి.

వ. అనిన మఱియు దుర్యోధనుండు దఱిమి యడుగుటయు ని ట్లనియె. 254

భీష్ముఁడు పాండవవీరులం దతిరథమహారథాదుల నిరూపించి చెప్పుట.

తే. అతిరథుండు యుధిష్ఠిరుం డగ్నికల్పుఁ, డాహవంబున నప్రతిమానుఁడు భీముఁ
డతిరథశ్రేష్ఠుఁ డతనిమహాబలంబు, మానుషము విక్రమం బసమాన మధిప,

క. సమరథులు గవలు భుజగ,ర్వము పటువిక్రమము దుర్నివారంబులు వా
రిమసంబులు నిర్భయములు, దమమొనలకు మించి పెట్టు దాఁకుదు రధిపా.

సీ. వా రందఱును ధర్మవైభవంబునఁ దప,స్సంపద నెక్కుడు జనుల కెల్ల
ధనువునాఱంగంబులను బరిణతులు దాఁ, కోరుదు పరులకు నోర్వరాని

కోట్లుల గలరు పెక్కులు పరాక్రమములు, వేర్వేఱ చేసిన । వీరు లొక్క-
మొగ మయి తాఁకిన । వెగడంద కుండునే, మనసేన మున్నవ।మానపాటు

ఆ. దుఃఖపాటు గలిగి । తోడరంగ నచ్చిన, వారు గాన యలఁతిఁ । బోరు ప్రాణ
మానపడక యోపి।సంతయుఁ బెనఁగుదు, రది సహించి నిలుచు । టరిది మఱియు

మ. నరుఁ డీమానమువాఁ డనంగ నతఁడే । నా కంతవా రెందు నె
వ్వరు లే రింకను బుట్ట రావులికి దుః।వ్యారోద్యముం డైనయా
హరియుం దోడటె యేమి చెప్పుదు నతం । డాసేనలం గాచు నొ
క్క-రుఁడుం గీటడఁగించు నీబలముల౯ । గాండీవదుర్దాంతుఁ డై. 258

వ. అనిన విని యక్కు-లువున నున్నరాజులమనంబు లెల్లను జేవ సెడియె భీష్ముండు
వెండియు ని ట్లనియె. 259

సీ. ద్రౌపదేయులు మహా।రథు లేవురును వారి, తరమ యుత్తరుఁడును । ధరణినాథ
యతిరథవర్యుఁ డ।య్యభిమన్యుఁ డర్జున, వాసుదేవుల కెన । వచ్చువాఁడు
లఘుచిత్రములు నేర్పు।లావును దాల్చియుఁ, గలఁడుతండ్రులపాటు।దలఁచుచుండుఁ
గావున బెడిదంబు।గాఁ బోరు సాత్యకి, యతిరథోత్తముఁడు శౌ।ర్యాన్వితుండు

తే. పాండవస్నేహసక్తుఁ డై ।యుండుఁ గాన, యలుకమనమిాఁదఁ బెద్దయుఁ। గలిగి పెనఁగు
వీర లిరువురుఁ బరుసని।వారు సమర, మరుల నొప్పింతు రీయోధ।వరుల నెల్ల.

మ. అలఁతిం బోరు మహారథుల్ ద్రుపదమ।త్స్యాధీశు లుగ్యాన్యజా
బలశౌర్యాఢ్యులు పాండురాజసుతసం।బంధప్రియస్నేహముల్
గలిమిం జేసి తదీయ సైన్యమునకుం । గా నొచ్చియుం జచ్చియు౯
గెలిపింపం దమకించి పోతు రని కే।కీభూతచేతస్కు-లై. 261

ఆ. వీరగుణము బలము । వీఁకయుఁ గలఁడు మ, హారథుఁడు శిఖండి । యతనితమ్ముఁ
డతిరథుండు దర్ప।యుతుఁడు ధృష్టద్యుమ్నుఁ, డుగ్రతేజుఁ డనికి । నుగ్రునట్ల 262

క. అతనిసుతుఁ డర్ధరథుఁ డా, ధృతవర్ముఁడు పిన్నవాఁడు । త్రిమ్మటకాఁ డై
మతిహీనత శస్త్రాస్త్ర, ప్రతతిపరిశ్రమము లేక । పాలసుఁ డగుటన్. 263

ఆ. చేదిభూవిభుండు । శిశుపాలతనయుండు, ధృష్టకేతుఁ డధిక।ధీరమతి మ
హారథుండు భోజుఁ । డజుఁ డనురాజులు, నట్టివార తెంపు । నలవుఁ గలరు. 264

వ. ఉత్తమౌజుండును యుధామన్యుండును క్షత్త్రదేవుండును జయంతుండును నమి
తౌజుండును విరాటుండును సత్యజితుండును ననం బరఁగుపాంచాలకులప్రదీపకులు
మహారథులు మత్తమాతంగబృందంబుచందంబునం బ్రతిబలంబుపయిం గవిసి
కోలాహలబహుళంబుగాఁ గలంపం జాలుదురు కేకయపతు లేవురు సహోదరు
లు మహారథులు గడిందిమగలు గెంపురథంబులమొత్తంబులతోఁ గార్చిచ్చు
పగిదిం బొదువుదురు కాశీశుండు నీలుండు సూర్యదత్తుండు మదిరాశ్వుండు

శంఖుండు విరాటజ్ఞాతులు మహారథులు వివిధాయుధవిద్యావిశారదులు వారి పోరు భరం బై యుండు. 265

సీ. చిత్రాయుధుండును • జేకితానుండు మ,హారథు లిద్దఱు • నర్జునునకుఁ
గూర్తురు కయ్యాన • గ్రోర్తురు నేర్తు రా,యుధముల కెల్ల నత్యుగ్రు లవ్వి
ధమువార చంద్రదత్త • త్రవ్యాఘ్రదత్తులు, వినుము సేనాబిందుఁ • డనునృపాలుఁ
డతిరథో త్తముఁడు మా • రుతవృష్టు నెనయ తం,డొక్కరుండును వారి • యుఱిదిలావు
ఆ. పాండ్యుఁ డతిరథుండు • బలఁగంబు గ్గలవాఁడు, సమరథుండు గాశ్యు • డమితబలుఁడు
కుంతిభోజుఁ డాజి • కోవిదుఁ డతిరథుం, డతనియొద్దిబోదు • లధికబలులు. 266

వ. రోచమానుండు మహారథుండు దేవసహానుండు. 267

తే. అతిరథుల కెల్లఁ దల దండ్రి • యట్టివాఁడ
యసురవిభుఁడు ఘటోత్కచుం • డాహిడింబ
కొడుకు మాయాబలంబున • నొడుచుఁ బగఱ
నతనికడ దానవానీక • మగ్గలంబు. 268

వ. తోఁచినవారిం బేరుకొంటి నింతియకాని రెండువీళ్లను మంచిమగలు పెక్కండ్రు గల రని చెప్పి గాంగేయుండు. 269

శా. పాండవులదిక్కువీరు ల,ఖండితబలు లైన నామొ • గంబునఁ బడి యు
ద్దండత చూపఁగ లేరు శి,ఖండిని, నొక్కరునిఁ జంపఁ • గాని కుమారా. 270

క. అనవుడు దుర్యోధనుఁ డా,తని మీరు వధింపమికిఁ గ • తం బేమి యొకో
వినఁ దగునేనిం జెపుఁడా, యనుటయు నిట్లనియె భీష్ముఁ • డతనికి నెమ్మిన్. 271

వ. ఏ నాశిఖండిని జంపమికి మూలంబు సాలం గలదు తత్ప్రపంచం బంతయు వివరించెద నాకర్ణింపుము. 272

భీష్ముఁడు దుర్యోధనున కంబోపాఖ్యానంబు సెప్పుట.

సీ. శంతనుపిమ్మట • సత్యవతీదేవి, యనుమతితోడఁ జి • త్రాంగదునకు
సామ్రాజ్యపట్టంబు • సమ్మతిఁ గట్టితి, నల్పకాలంబున • నతఁడు దీఱ
దత్పరోక్షావస్థఁ • దదనుసంభవుని వి,చిత్రవీర్యుని రాజుఁ • జేసి పెండ్లి
సేయంగఁ దివిరి కా • శీపతికూఁతులు, కన్యలు మువ్వురు • గలుగుటయును
తే. నాతఁ డక్షితి దదీయస్వ • యంవరమున, కఖిలనృపతులఁ బిలిపించె • ననియు నెఱిఁగి
తల్లి కెఱిఁగించి యొంటిమైఁ • దత్పురమున, కాయితం బయి పోయితి • సరద మెక్కి.

వ. ఇవ్విధంబునం జని యమ్మహోత్సవంబున నలంకృత లై యున్నయంబయు నంబికయు నంబాలికయు ననుముద్దియల మువ్వురం బట్టి రథంబుపయిఁ బెట్టికొని రా నచ్చటిరాజు లెల్లను జతురంగబలంబులతో వచ్చి నన్నుం బొదివినఁ బటువిశిఖావల శిఖాకలాపంబున వేఁడిమిసూపి వారి నిలువరించియరుగు దెంచి సత్యవతికిసప్పాలం

తుల నొప్పించిన నద్దేవి విచిత్రవీర్యునకు వారలవివాహంబు సేయ నుద్యోగించె నట్టి యెడ నమ్మువ్వురయందుం బెద్దయది యైనయంబ యనుకన్యక వానితో ని ట్లనియె.

తే. సౌభపురవల్లభుం డైన సాళ్వుమీఁదఁ, దలఁపు గలదు నాకతఁడును దగులు గలిగి
యుండు నాదెస నీవు ధర్మోత్తరుండ, వతనిపాలికిఁ దగ నన్ను ననుపవయ్య. 275

క. అన విని సత్యవతికిఁ జె, ప్పిన నాయమ ననుప నంబఁ బెంపుగ వృద్ధాం
గనలం దోడుగ నప్పుడ, పనిచి యనిచితిని జనంబు ప్రస్తుతి సేయన్. 276

వ. ఇట్లు పనిచి తక్కినకన్నెల నిరువురం బాణిగ్రహణంబు సేయించితి. 277

క. అంబయు నట సాళ్వునికడ, కుం బోయిన నతఁడు భీష్ముకొనిపోయిన దా
నిం బరచుం గైకొన ధ, ర్మం బే కన్యాత్వ మెడలె మగువా నీకున్. 278

వ. ఇంక నిన్ను భార్యఁ గా వరియింపం దగునె యనినఁ గామశరపీడిత యగుచు నక్కామిని యతని కి ట్లనియె. 279

తే. తమ్మునికిఁ గాఁగ భీష్ముఁ డుగ్రవృత్తిఁ, గన్నియలఁ గొనిపోయెడుఁ గాన బలిమి
నన్నుఁ గొనిపోయె నాచేత నిన్ను వినిన, యపుడె పుత్తెంచె దూషింప ననఘ తగునె.

వ. మాతండ్రి యెఱుంగక స్వయంవరాలంకారంబు నాకుం జేయించినకతంబున నింత పుట్టె భీష్ముండు నాచెలియండ్రం దనతమ్మున కిచ్చి నన్ను నీకడకుం దగ ననిచె దీన నేమి తప్పని మఱియు ననేకప్రకారంబులం బలికిన వినక తన్నుం జేకొనక సాళ్వుండు. 281

క. కరుణంబుగ నేడ్చుతలో, దరిఁ బో పొమ్మిచట నింకఁ దడయకు మని మం
దిరము వెడలంగ నడిచిన, నరిగె నదియు నార్తచిత్తయై వికలగతిన్. 232

వ. చని చని యవ్వాలంది యి ట్లని వితర్కించు. 283

తే. సాళ్వునకుఁ గాని యపుడ సంసారమునకుఁ, బాసితిని యింక భీష్మునిపాలి కేల
యరుగ నాతండు మూల మీహానికెల్లఁ, గాన యాతని సాధింతుఁ గాక యేను.

క. గాంగేయు గెల్వ నెవ్వరి, కిం గోలఁదియె తపముపేర్మి గెలిచెదఁ గా కం
చుం గాంత సనియె సంయమి, పుంగవు లొకకొంద ఱున్న పుణ్యస్థలికిన్. 285

వ. చని వారలకుం దనవృత్తాంతం బెఱింగించిన వా రిది రాజులు సేసినపని సాధుల చేతఁ జక్కంబడునే యనిన నవ్వనిత దపశ్చరణంబునకు వచ్చితి ననుటయు నీవు సుకుమారవు నీ కిది సొప్పడునే తండ్రిపాలికిం బొమ్మిదియ పరమధర్మం బని పలికిన వారి కన్నారీరత్నం బి ట్లనియె. 286

క. ఎవ్వరు నెఱుఁగక యుండఁగ, నివ్వనమునఁ దపము సేఁత యిది నిర్ణయ మే
నెవ్వారికడకు నే మని, యెవ్వధిఁ బో నేర్చుదాన నేటికి బంధుల్ 287

వ. అని చెప్పునవసరంబున నయ్యాశ్రమంబునకు హోత్రవాహనుం డనురా
చ్చిన నమ్మునులభ్యాగతపూజలు సేసినయనంతరంబ యంబం గనుంగొని యి

కన్నియ యెక్కడిది దీనివిషాదంబునకుం గారణం బే మని యడిగి వారివలన
వానిజన్మప్రకారంబును దద్వృత్తాంతంబును విని తనకూఁతుకూఁతు రగుట
యెఱింగి యయ్యంగన వినం దపస్విజనంబులకుం జెప్పి యప్పొలంతిం దనయంక
తలంబున నునిచికొని వెండియు నడుగ సవిస్తరంబుగా నచ్చేడియ సెప్పిన విని
శోకించి యవ్విషమప్రకారంబునకు నిస్తారంబుఁ జింతించి. 288

ఉ. నీ కిది యేటికిం దప మనింద్యచరిత్రవు నీవు నిన్ను నేఁ
జేకొని కాతు నొక్కగతిఁ జెప్పెద భార్గవరాము నాశ్రిత
శ్రీకరుఁ గాన్పు మాపదలు సెందఁగ నీఁ డతఁ డాశ్రయించినన్
శోకము దక్కు మన్న విని సుందరి యల్లన యత్తపస్వితోన్. 289

ఆ. పరశురాముఁ గానఁ బడయుట యెక్కడఁ, గలుగు నాతఁ డెట్లు కరుణసేయు
ననఁ దపస్వి యిట్టులను మహేంద్రం బను, పర్వతమునఁ జేయుఁ బరమతపము.

వ. నన్ను మన్నించుం గావున మదీయదౌహిత్రి వగుట యెఱింగిన నిన్ను రక్షించు
నందుఁ బొమ్మనుసమయంబునం బరశురామశిష్యుం డగునకృతవ్రణుం డనుముని
వచ్చి యతిథిసత్కారంబులం బూజితుం డై యున్నఁ బ్రియపూర్వకంబుగా నా
హోత్రవాహనుండు భార్గవుం డెయ్యెడ నున్నవాఁడని యడిగిన నతం డి ట్లనియె.

క. తనప్రియసఖుఁడవు నీ వని, మునిజనులకుఁ జెప్పుచుండు ముదమున నిన్నుం
గనుఁగొనఁగ నెల్లి యిచటికిఁ, జనుదెంచు ననేకశిష్యసంఘముతోడన్. 292

తే. అనిన విని యెల్లవారును నధికహర్ష
మెసఁగ నున్నంత మఱునాఁడ యేఁగుదెంచె
భార్గవుం డమ్మునీంద్రులు పరమభక్తి
నర్చ లిచ్చిరి హోత్రవాహనుఁడుఁ గనియె. 293

వ. కని పరశురామునిసంభావనంబును సంభాషణంబును బడసి కాశిరాజుకన్యకం
జూపి యిది నాదౌహిత్రి దీనివృత్తాంతం బంతయు విను మని యమ్మానినిం గాని
పించిన నదియును. 294

చ. కనుఁగవ నశ్రుధార లొలుకం జరణానత యైన రాముఁ డి
ట్లను విను హోత్రవాహనునియట్టుల యేనును నీకు నీమనం
బునఁ గలచింత యంతయును బుచ్చెద నాకడఁ జేరి తింక నీ
వనటఁ దొలంగఁ బెట్టి గరువంబుగఁ జెప్పుము దీనిమూలమున్. 295

వ. అనిన విని యమ్మహాత్మునకు నంబ దనవృత్తాంతం బంతయు సవిస్తరంబుగాఁ జెప్పి
నీ వార్తశరణ్యుండవు నాపరిభవంబుదీర్చి నన్నురక్షింపు మనవుడు నతం డిట్లనియె.

క. పరిభవము రెండుతెఱఁగులఁ, దరుణీ తోఁచినది సాళ్వుఁ దగఁ దేర్తునో యు
ద్ధురుఁ డగుభీష్మునిఁ దేర్తునో, కరము ప్రియంబెద్ది హృదయగతముం జెపుమా

చ. అనవుడు నింతి యి ట్లను మహాపురుషా నను సాళ్వుఁ డింకఁ గై

కొనఁ దడి సాలు భీష్ముఁ డెసఁ గోపము నామదిఁ గల్గి యుండు నా
తని వధియింపఁ బూని యిటు తాపసవృత్తికి వచ్చి యిచ్చటన్
నినుఁ గని యీయపరాభవము నీఁగఁగ నీశరణంబుఁ జొచ్చితిన్. 298

తే. అనిన నాచెప్పినట్లు గాంగాత్మజుండు, సేయుఁ జేయక తక్కిన శితశరముల
నతనిఁ బడవైతు నూఱడుమబల నీకుఁ, దపము సేయంగ నేటికిఁ దనువు డయ్యు.

పరశురాముఁ డంబం దోడుకొని భీష్మునియొద్దకు వచ్చుట.

క. అని పలికి పరశురాముఁడు, సనుదెంచెను మునిజనంబు సమ్మదమునఁ దోఁ
జనుదేరఁ గురుక్షేత్రం, బున కుద్ధతిఁ గాశిరాజపుత్త్రిం గొనుచున్. 300

వ. వచ్చి సరస్వతీతీరంబున విడిసి తనరాక నా కెఱింగించిన నేను ఋత్విక్పురోహిత
ప్రభృతివిశిష్టబ్రాహ్మణసమేతంబుగాఁ బూజాద్రవ్యంబులు గొని తత్ప్రదేశంబున
కరిగిన నమ్మహాత్ముండును మదీయభక్తివినయసంభ్రమంబులు సంప్రీతి నభినం
దించి యర్చనలు గైకొని కాశిరాజకన్యకం జూపి నాతో ని ట్లనియె. 301

తే. బలిమి ము న్నీల దెచ్చి తిప్పుడఁతి మగుడఁ
ద్రోచి పుచ్చంగఁ దగునయ్య నీచవృత్తి
వచ్చె దీనిఁ దమ్మునికి వివాహ మింక
నైనఁ జేయుము చెలుచుట యనుచితంబు. 302

క. అనుటయు ననఘా తెలియుము,విను మిది నాతోడ సాల్వవిభునకు నేఁ గూ
ర్చినదాన నతనిపాలికి, ననుపుము స న్నినిఁ గాదె యనిచితి మగుడన్. 303

తే. ఇంక నాతమ్మునికి దీని నెట్లు పెండ్లి, సేయ నేరుతు ననుడు నాకు చెప్పినట్లు
సేయవై తేని నిన్ను నీచెలులఁ జుట్టములను జంపుదు ననియె నమ్మునివరుండు.

వ. ఏను వినయంబు వదలక వినతుండ నగుచు వివిధవాక్యంబులం దెలుప నంతకంత
కు నతనికిఁ గోపం బగ్గలం బైన నెండియు. 305

ఉ. గురుఁడవై సమగ్రకోదండవిద్యామహత్త్వ మిచ్చినాఁడ వలుగఁ దగునె
కారణంబు లేక యీర్ష్య మెత్తి యి, ట్లనినఁ బరశురాముఁ డాగ్రహమున.

చ. గురుఁ డని న న్నెఱుంగు దనఘుండవు నావచనంబునం దనా
దరణము సేసి తెన్నియొవిధంబులఁ బల్కెదు భక్తితోడ నీ
వెరవులు దక్కి మాయబల వేగమ పెండిలి సేయు మంతతో
మరలు మదీయకోపశిఖ మానదు వేఱొక వేయుఁ జేసినన్ 307

వ. అనిన నిని ధర్మాచరణంబున కింత పట్టి పెనంగ నగునె పరానురక్తచిత్త యగుమ
గువ నిల్లాలిం జేయువారుం గలరె యిట్టియకృత్యం బాచరించుటకంటె నీచేత ని
ట్లయినను లెస్స తొల్లి పెద్దలు సెప్పినచో ప్పవధరింపు మని యి ట్లంటి 308

తే. గర్విమై కార్య మిట్టి దకార్య మిట్టి, దని యెఱుంగక లోకంబు చనుపథమునఁ

దిరుగ కంస్వదవృత్తి వర్తించునట్టి వాని గురు నైన దండింపవలయు నండ్రు.

క. అనుమాటకుఁ గాలానల, ఘనుఁబోలెను మండి కయ్యమున కాయిత మై
మొన లేర్చి వేగ యిచటికిఁ, జనుదె మ్మని భార్గవుండు । సంరంభమునన్. 310

వ. పలికిన నేనును. 311

క. అలుకఁదనంబున విప్రున, కలుగంగాఁ దగదు గురుఁడు । వై యున్నాఁ డం
చలయక తలఁచితిఁ గా కిటు, నిలుపుమా నీరణము సేఁత । నిజ మని నేనిన్. 312

క. క్షత్రియులఁ దొల్లి యలుకకుఁ, బాత్రము సేసి తటె నాఁడు । బలియుఁడు గంగా
పుత్త్రుఁడు పుట్టమిఁ గా కిది, యాత్రయి నిం కేల చెల్లు । నెఱుఁగవె నన్నున్. 313

క. ఏ నొకరుండన నచ్చెదఁ, గాని బలము దేను నీవు । గఱపినశస్త్రా
స్త్రానేకవిధవిలాసము, దాన వలయుసేన గాదె । తథ్యం బరయన్. 314

వ. అని పలికి యతనికిం బ్రణమిల్లి చనుదెంచి సత్యవతి కింతయు విన్నవించి యద్దేవి యనుమతి వడసి సర్వసన్నాహసమేతం బగురథం బెక్కి విప్రాశీర్వాదంబులు సెలంగ వెడలి వచ్చి కురుక్షేత్రంబుఁ దఱియం జను నెడ భాగీరథి భామినీరూపంబున నరుగుదెంచి తన్నాలింగించి మదీయభక్తి నభినందించి యే నాయితం బై పోవుటకుఁ గారణం బడిగి నాచేత నత్తెఱం గెఱింగినది యై నన్నుం గినిసి భార్గవుపాలికిం జని నీశిష్యుండు నిరపరాధుండు నాకొడుకున కలుగందగునే యని చెప్పి యతనియందుఁ బిక్కు గానక మగుడ నేతెంచి నావలనను మెత్తంబాటు లే కున్నం జనియె నప్పుడు సిద్ధవిద్యాధరమునిగణంబులు గౌతుకంబునం గనుంగొనుచుండ నేను జమదగ్నితనయున కనతిదూరంబునం దేరు డిగి వినతుండ నై నిలిచి నీవు భూచారి వై యున్నవాఁడవు రథికుండ నైననాకు నీతోడ సమరంబు సేయ నగునే యనిన యనంతరంబ యతండు దివ్యంబు లగురథరథ్యంబులు శస్త్రాస్త్రంబులునుం గలిగి యకృతవ్రణుండు సారథిగా సమరసన్నద్ధుం డై తోఁచినం జూచి రథారోహణంబు సేసి శంఖంబు పూరించి గుణంబు సారించి సూతు నగ్గించి తనకు నమస్కరించి కడంగిన నప్పరశురామదేవుండు. 315

భీష్ముండు పరశురామునితో యుద్ధంబు సేయుట.

క. శరవర్షము నామీఁదం, గురిసిన నే నాకసమునఁ । గుదియించితి నా
యరదంబుపొంతకును న, చ్చెరువుగ నొకబాణ మైనఁ । జేరక యుండన్. 316

క. ఒకమొగి నఱువదియమ్ములఁ, బ్రకటబలుం డై నపరశు । రాముఁడు నాయుఁ
గకములు దాఁకఁగ నవ్వే, ప్రకరము నో నాట సూతు । పైఁ బడ నేసెన్. 317

క. దానికి నవ్వుచు వేగం, బే నొకభల్లంబు దొడిగి । యేసితి సాంద్ర
జ్యానాదభరితరోదసి, యైనత దీయోగ్రచాప । మఱిముఱిఁ దునియన్. 31

ఉ. ఒండొకవిల్లు పుచ్చికొని । యుజ్జ్వలరోషమహానలార్చు లొం

దొండ మొగంబుపై నగయ నుర్వి చలింప గుణధ్వని సము
ద్దండతఁ దీవ్రమార్గణశతంబున నాయరదంబు ముంచె నా
ముందు వియచ్చరప్రకరముల్ వెఱఁ గందుచుఁ బ్రస్తుతింపఁగన్. 319

క. ఉఱక మదీయాంగంబులు, గిఱికొన నట్లొయుటయును గిముక గదిరినన్
మెఱుఁ గారునారసమ్ములు, దఱచుగ నించితిఁ గడంగి తద్గాత్రమునన్. 320

తే. ఉచ్చిపోయిన యేటుల నొలుకుశోణి,తమున సర్వాంగకంబులుఁ దడిసి యొప్పెఁ
జిగురుఁ దఱచునఁ గెంజాయ మిగిలి చెలువు, వడయు గ్రొమ్మావిచాడ్పున భార్గవుండు.

క. నెత్తురు వడిసిన మూర్ఛా,యత్తుండై సొగయుటయును నాతనిఁ గని యు
ద్వృత్తక్షత్రియధర్మో,పాత్తం బగు జేజ మొల్లఁ బాసై తోఁచెన్. 322

వ. అప్పుడు మనంబున నన్ను నేన గర్హించుకొను చుండితి. 323

ఆ. అంతఁ దెలిసి రాముఁ డతికుపితాత్ముఁ డై, యేఱు వాఱు తెంచు నెనక మెఱుఁగ
నప్రమేయశరము లడరించె నవి సత్వ,రముగ నేను బ్రతిహతములు సేసి. 324

క. మరుదస్త్ర మేయ గుహ్యక,శరమున వారించె నతఁడు సరభసముగ ను
ద్ధురశిఖ బాణం బేసిన, గురుఁడు వరుణవిశిఖనిహతిఁ గుదియం జేసెన్. 325

క. ఇమ్మెయి నతఁడును దివ్యా,స్త్రమ్ములు నామీఁద నేయ రయమునఁ బ్రతిఘా
త మ్మొనరించితి దివిజగ,ణ మ్మంబరవీథిఁ గీర్తన మ్మొనరింపన్. 326

తే. రాముఁ డంత్యకాలానలోద్దామలీల
మండి నాయురస్స్థలి యొక్క మార్గణమున
నేసె నంతంత నున్నమునీశ్వరులును
గాశిరాజుకన్యకయును గడఁగి యార్వ. 327

క. అనిశితాస్త్రం బెయ్యది,యో నాకుం దెలియ దధి మహోగ్రత నాటం
గా నొచ్చి పడితి నరదము,పై నప్పుడు సూతుఁ డచటు వాపె రథంబున్. 328

తే. చేతనుఁడ నయి యేను మత్సూతుఁ గినిసి, రాముఁ డున్నెడ కప్పుడు గ్రమ్మఱంగ
రథముఁ దోలించి బాణపరంపరాని,మగ్నుఁ జేసితి నంబ నెమ్మనము దలఁక.

వ. ఇట్లు బహుప్రకారంబులం బోరుచుఁ బ్రొద్దు గ్రుంకినప్పుడు రణం బుపసంహరించుచు రేపకడ దొడంగుచుం బెనంగ నిరువదిరెండుదివసంబులు చెల్లిన మఱునాఁటికయ్యంబున నేనునుం గడంగి. 330

క. కడు బెట్టిదముగఁ గదియం,బడి హయములు నొవ్వ ధనువు భగ్నంబుగఁ జే
డ్పడి సారథి దెరలఁగఁ దన,కొమ్మడలు సిరుఁగ నేసినను మహోద్ధతి గురుఁడున్

క. ఒకశక్తి వైవ నఱికితి, నకుటిలముగ శక్తిదళక మడరించిన స్రు
క్కక ద్రుంచితి బహుశక్తుల,నికరము పరఁగించినం దునిమితిం బెలుచన్. 332

క. విస్మయము నొందు భార్గవు,నస్మత్కార మపుడు లాఘవారూఢముగా

336

నస్త్రతుఁ డగుచుం బటుదీ, ప్తిస్ఫూర్తాస్త్రముల సేసెఁ దిం బరవశుఁగాన్. 333
వ. ఇట్లతండు మూర్ఛిల్లిన మునిజనంబులును నంబయు నధికశోకసమాకులత్వంబు నొంది హాహాకారంబులు సెలంగఁ బొదివి రంత. 334
ఆ. తెలిసి భార్గవుండు దృఢతీవ్రనారాచ,పంక్తి గురిసి నన్నుఁ బారవశ్య మంది నేల కొఱగునట్లుగాఁ జేసి మ, త్సూతుమస్తకంబుఁ దునియ సేసె. 335
వ. అట్టియెడ నెనమండ్రువిప్రులు సమానవయోరూపంబుల నొప్పువారలు నన్నెత్తి సేనదెచ్చి రథంబుపయిం బెట్టి గగనగమనంబునం బోయి రంతకు మున్న మందాకిని మున్ను నాకన్నచందంబున నొగలపయి నుండి మదీయరథ్యంబులపగ్గంబులు ధరియించి యున్నయది యేనునుం గనుంగొని నమస్కరించిన దీవించి చనియె వెండియు. 336
క. సారథ్యంబును జేయుచు, ధీరత వాటించి రాముఁ దేవునితోడం గూరిరాస్త్రంబులఁ జతురవి,హారం బొసరించితిని సుశరావలి వొగడన్. 337

భీష్మునకు వసువులు స్వప్నసాక్షాత్కారంబున మోహనాస్త్రం బిచ్చుట.

వ. ఇవ్విధంబునం బోరి సూర్యాస్తమయం బగుటయు నెప్పటియట్ల చని యే నారాత్రి యేకాంతంబున దర్భశయనంబున నుండి సురభూసురవర్గంబులం దలంచి భక్తిం బ్రణామంబులు సేసి పరశురాముని జయింప రాదయ్యెడు దినంబులు పెక్కులు సనియె నతని నాజి జయించుట గలుగునేని మీరు నాకుం దోఁచి యూఱడింపవలయు నని ప్రార్థించి నిద్రించు చుండం బవలు నన్నెత్తి రథంబుపయిం బెట్టినయెనమండ్రునుం బ్రభాతసమయంబునం గలలోన వచ్చి. 338
తే. నీవు నేమును నొక్కటి నీకు వెఱవ, నేల గాంగేయ రాము జయించువట్టి శరము సుష్మని మోహనాస్త్రంబు నాకు, నిచ్చి పోయిరి క్రమ్మఱ నెక్కడేని.
వ. ఏను మేలుకాంచి సంతోషించి తన్మంత్రస్వరూపంబును బ్రయోగోపసంహారప్రకారంబులును జిత్తంబున నిలిపికొనుచుఁ గాలోచితకృత్యంబు లాచరించి యెక్క సారథి నంగీకరించి యరదంబు పూన్పించి సన్నద్ధుండనై సత్వరంబుగా సమరంబునకు కరిగినం బరశురామదేవుండు. 340
క. నిన్న యఱ సచ్చి పోయితి, వున్నయఱయు నేఁడు దీర్చి యుడిపెద నీగ ర్వోన్నతి యిం కెట వోయెదు, నన్ను నెఱుఁగ వెట్టు లనుచు నాపైఁ గవిసెన్
క. కవిసినఁ గడంగి యేనును, గవియించితి నంపవెల్లిఁ గడుఁ గ్రూరత భా ర్గవుఁడును మద్గాత్రంబున, వివిధాస్త్రప్రతతి నించి వెగడొందించెన్ 342
వ. ఏనుం గోపించి. 343
తే. రయము మెఱయంగ నొక్కనాశరసము ఫాల దేశమునయందు నాటించి తీవ్రశక్తి

నురము వ్రైచినఁ దూఁగాడి । యొఱగ నూఁది
పట్టి యకృతవ్రణుఁడు దేర్చెఁ । బరశురాము. 344

క. అప్పుడు దెప్పిఱి కన్నుల, నిప్పులు రాలంగ నన్ను । నిశ్చలదృష్టిం
దప్పక చూచి యులఁతిన, వ్వొప్పఁగ బ్రహ్మాస్త్ర మాతఁ । డుగ్రత నేసెన్.

క. తెగ గొని బ్రహ్మాస్త్రము నేఁ, దగ నేసిన నొకటి నొకటి । దార్కొని రెండుం
గగనం బంతయుఁ దేజ, స్స్థగితముగాఁ జేసె సురలు । దైత్యులుఁ దలఁకన్.

తే. సకలభూత సంక్షోభసంజనక మైన, యట్టియెడఁ గని యిది దఱి । యని తలంచి
మోహనాస్త్రంబుసంచితోత్సాహనంబు, సేయుటయును జరాచర । శ్రేణిమెచ్చె.

వ. తదవసరంబున. 348

క. ఉడు గుడుగు మోహనాస్త్రము, విడువకు మను నెలుఁగుతోడ । వేగంబున న
య్యెడ కేఁగుదెంచి నారదుఁ, డెడపడు టించుకయు లేక । యి ట్లను నాతోన్.

క. గురునకు నవమానము ని, ష్ఠురవృత్తిం జేసె దీవు । సూచితిమే యి
ప్పురుసునఁ బరుసపునడవడిఁ, గురువంశప్రవర యిట్లు । గూడునె చేయన్. 350

వ. అని సువ్యక్తంబుగాఁ జెప్పి. 351

క. వీరె వసువు లాకసమున, గారవమున బుద్ధి సెప్పఁ । గా నీకడకుం
దా రేఁగుదెంచి రని క, న్నారంగాఁ జూపె నాకు । నయ్యెనమండ్రన్. 352

వ. ఇవ్విధంబున నెప్పటివిప్రవరులు సన్నిధి సేసి నన్నుం జూచి నగుమొగంబులతో
నెఱుఁగనివారపోలె ని ట్లనిరి. 353

క. నారదముని త్రైలోక్యస, మారాధ్యుం డితనిపలుకు । లాగమవాక్యో
దారములు వినుము వీనిం, గ్రూరత వాటింపఁ దగదు । గురువిషయమునన్.

వ. అనిన విని యేను సమ్మోహనాస్త్రంబేయుట యుడిగి బ్రహ్మాస్త్రంబు దీపింపం జేసితి
నప్పుడు జామదగ్న్యుం డది యెల్ల నెఱింగి యోటమి యెక్కించుకొని చలంబు
మిగిలి యున్నం దజ్జనకుండు జమదగ్నియుఁ దదీయపితృవర్గంబును నతనికి సన్నిధి
సేసి వేఁడికొని శాంతవచనంబులం దేర్చి యి ట్లనిరి. 355

క. వినుము వసుమూర్తి యీతం, డనన్యసామాన్యతేజుఁ । డాహవభూమిన్
మనకు జయింప వశమె భీష్ముని విప్రున కగునె రోషంబును మత్సరమున్. 356

తే. సమర ముదుగు నారాయణసఖుఁడు నరుఁడు
సవ్యసాచి నా నిం గొకజన్మ మొంది
యితని వధియించుఁ గాని తక్కితరజనము
లకు నసాధ్యుండు భీష్ముఁ డాకలంబులోన. 357

వ. అనిన నతండు వోక పెనంగిన వెండియు ననేకప్రకారంబులం జెప్పి యమ్మునులు
నాకడకుం జనుదెంచి యుపశమనవాక్యంబులు వలికి జామదగ్న్యుతోడం దమ

యాడినమాటలు చేటపఱచి యప్పుడు పొడసూపినజాహ్నవియుం దారు బహు విధంబుల నన్ను ననునయించి భార్గవుపాలికి నమ్మహాదేవిం దోడ్కొని యరిగియుం గ్రమ్మఱ మత్స్యనిపాలంబునకు వచ్చియు నెట్టకేలకుం జలం బుడిపిన నే మిరువుర మును దివ్యాస్త్రంబు లుపసంహరించి సమరం బుడిగితి మట్టియెడ సమ్యోన మంద్రు విప్రులుం జేరి నాతో ని ట్లనిరి. 358

ఆ. గురుఁడు బ్రహ్మవిదుఁ డకుంఠితతేజుండు, పరశురాముఁ డతనిపాలి కీవు
భక్తిమెఱయ నేఁగి ప్రణమిల్లి తదనుగ్రహంబు పడయవలయు ననఘ యిప్పుడు

వ. అని చెప్పి యతనికడకుం దారును నారదమునీశ్వరుండును జమదగ్నిప్రముఖులును భాగీరథియును జని నీశిష్యుండు దేవవ్రతుండు వానియెడ నలుగం దగునె వాఁడు దగవు మాలినపనిఁ జేయం జాలక పెనంగె నింతియ కాని విరోధి గాఁడు వానిం గరుణింపు మని తెలిపి నన్నుం బిలిచినం బోయి యే నమ్మహాత్మునకు సాష్టాంగదండప్రణామంబు సేసిన నతండు దీవనతో గ్రుచ్చి యెత్తి కౌఁగిలించి కొని గాంగేయా నీశక్తికి భక్తికిం బ్రీతుండ నైతి నని సస్నేహంబుగా సంభావించి యంబ నవలోకించి నన్ను భీష్ముండు గెలిచె నావలన నయ్యెడుపని యింతియ నీవింక నీకుం జూడం బోలినగతిం బొ మ్మనిన నమ్మానిని దేవా యిది యిట్టిద నీయోపి నంతయుం జేసితి నీచేతం బోకున్న నేమి సేయుదు నేను దపంబు పెంపున భీష్ముని వధించెద జన్మాంతరంబున నైనను జలంబు సాధ్యంబు సేయుదు నటు సూడు మని పలికి పోయెఁ దదనంతరంబ యమ్మునిజనపితృదేవతాసమూహంబును భృగునందను నన్ను నామంత్రణంబు సేసి యంతర్ధానంబు నేసె భార్గవుండును నన్ను వీడ్కొలిపి మున్ను దనతో వచ్చినతపోధనవర్గముం దానును మహేంద్రశైలంబునకుం జనియె నేను మగిడి యెడ నెడ నుర్వీసురులయాశీర్వాదంబులు సంభావనవచనంబులుఁ బ్రస్తుతివాక్యంబులుఁ గర్ణంబుల కింపు సేయ నిట వచ్చి సత్యవతికి నమస్కార పూర్వకంబుగా నంతయు నెఱింగించిన నద్దేవి యభినందించె. 360

నారదుఁడు భీష్మున కంబవృత్తాంతం బంతయుం జెప్పుట.

తే. అంబవృత్తాంత మరయంగ నను దినంబుఁ
దగినవారలఁ బుచ్చుచుఁ దలఁకుచుండ
నేను నది యాదిగాఁ జింత నేపు దక్కి
స్రుక్కి యుండియు రాజుల నుక్కు మడఁతు. 361

వ. ఒకనాఁడు పారాశర్యనారదులం గని యక్కార్యంబు భయంబు దోఁప విన్నవించిన వారలు దైవాధీనం బగుదాని మానుషంబున మానిపింప వశంబు గా దాచింత విడువు మని రందు నారదుం డక్కాశీశ్వరకన్యక తెఱంగు విను మని యి ట్లనియె. 362

సీ. అతివ యమునానదీతీరమున కేఁగి, యత్యుగ్ర మగుతప మాచరించి
యందుండి కౌశికునావాస మాదిగాఁ, గలుగుసిద్ధాశ్రమంబులకు నెల్లఁ
జని చని తత్ప్రదేశంబుల నిష్ఠుర, వ్రతములు సలుపంగ వచ్చి నీదు
జనని జాహ్నవి యిట్లు వనితల కతిదుష్కరము లగుబహునియమములు నీకు
తే. నడపఁ గత మేమి యనుడు నన్నాతి పలుకుఁ
దద్ద యవమానపడితి శాంతనవుచేత
నపరజన్మంబునం దైన నతనిఁ జంప
నేను జాలుట కై యిట్టిదాన నైతి. 363

వ. అనిన విని భాగీరథి కుటిలప్రచార వగుట నీ వీతనువు విడిచి యే నయి పాఱంగలదాన వింతియ కాని యొండు గా నేర నని న వ్వేలంది నవ్వుచు సరకుసేయక తిరిగి తొంటికంటెను దీవ్రం బగుతపశ్చరణంబునం బ్రవర్తిల్లుచు మత్స్యదేశవాసిని యై యుండి యొక్కనాఁడు నిజవ్రతఫలంబులో సగంబున నంబ యను పేర నది యై యమ్మండలంబునం బరఁగి యున్నసగంబునను దనరూపు సెడకుండ వహించికొని జాహ్నవీప్రభావంబు నాత్మీయప్రభావంబున గెలిచి వెండియు.

క. పుణ్యాశ్రమదేశముల నగణ్యం బగుతపము సేయఁ గా రుద్రుఁడు గా
రుణ్యము వాత్సల్యము దాక్షిణ్యము మెఱయంగ నింతికిం బొడసూపెన్.
క. మును లచ్చెరు వంది కనుంగొన శంభుఁడు నిల్చి వరముఁ గోరు మనుడు భీ
ష్ముని నాకుఁ జంపఁగా దొరకొనునట్లుగ నొసఁగు మనియెఁ గోమలి యెలమిన్.
వ. అనవుడు నద్దేవుఁ డట్ల కాక యని యనుగ్రహించిన నంబ యెత్తెఱంగున నది యయ్యెడు నని యడిగిన. 367

సీ. ఈమేను విడిచి నీ వేఁగినయప్పుడు, ద్రుపదభూవిభునకుఁ దొల్త పుత్త్రి
వై పుట్టి పిదపఁ బురుషాకృతిఁ గాంచి శి, ఖండినామమున నుద్దండబాహు
బలమునఁ గోదండపాండిత్యమును బటు, శౌర్యంబు నొప్పఁ బ్రశస్తికెక్కి
యనిఁ జంపఁగలదాన వాతని నామాట, దప్ప దూఱఁడు మని చెప్పి హరుఁడు
తే. సనియె నాపొల్తి దుస్సమిధల్లు సాలఁ గూడ, వైచి యనలంబు గూర్చి యవ్వనిత క్రోధ
దీప్తమూర్తి యై భీష్మువధించుదాన, ననుచు సొదసొచ్చె మునులకు నద్భుతముగ.
వ. అట్టియెడ ద్రుపదుం డనపత్యుం డగుట నమహిషివిషాదంబు దీర్పం దివురుటను గాంగేయుతోడిరోషంబునను శివుని నుద్దేశించి తపంబు సేసిన నద్దేవుండు ప్రత్యక్షం బయి వరంబు వేఁడు మనిన భీష్ము వధియించునట్టివాని నొక్కపుత్త్రుని నొసంగ వలయు ననుడు. 369

తే. కూఁతు రై పుట్టి పదపడిఁ గొడుకుఁ డగుచు, గాంచి భీష్ముని నాజిరంగమునఁ జంపు
నట్టియుజ్జ్వలాపత్యంబు పుట్టు నీకుఁ, దప్ప దిది యని రుద్రుండు సెప్పి చనియె.

వ. ద్రుపదుండును బ్రీతుం డయి నిజప్రియకు నవ్విధం బెఱింగించె నదనంతరంబ కాశీశ్వరకన్యాచైతన్యం బుదరంబు ప్రవేశించిన. 371

క. పాంచాలరాజభార్య స,మంచితగర్భంబు దాల్చి మఱువడఁ గూఁతుం
గాంచి నిజపతియుఁ దాను,మ, వంచనఁ గొడుకనిరి యెల్లవారును వినఁగన్

వ. ఇట్లు పుట్టినబిడ్డకుం బుత్రప్రకారంబున జాతకర్మాదికృత్యంబులు నిర్వర్తించి శిఖండి యనుపేరు పెట్టి యతిప్రచ్ఛన్నంబుగాఁ బెనిచి రహస్యంబు తెలియం గాకన్నియకుం జెప్పి యక్షరశిక్షాదు లాచరించి ద్రోణాచార్యుకడ శస్త్రాస్త్రపరిశ్రమంబు సేయించుచుండ జవ్వనంబు చొరవకుం దత్తయగుటయు నమ్మగువం జూచి వగచి తల్లిదండ్రులు దమలో విచారించి వేగంబ వివాహంబు సేయవలయుఁ బరమేశ్వరు వరంబుకొలంత దన నెఱసినప్పుడ నెఱయుంగాక యని నిశ్చయించి దశార్ణదేశాధీశుం డగు హేమవర్మ యనురాజుకన్యకం దగిన తెఱంగునఁ బాణిగ్రహణంబు సేయించి తెచ్చి యున్నంత. 373

ఆ. అక్కుమారి చతుర యగుట శిఖండివర్తనము నెడఁ బ్రమాదకమున నెఱింగి
యుగ్గడింప నొల్లకూరక యెఱుఁగసి,యదియపోలె నుండె నాత్మ నొచ్చి. 374

వ. ఇట్లు దశార్ణవిభుపుత్త్రి యెఱింగ శిఖండి పురుషుండు గామి దనదాసికిం జెప్పిన నదియు నప్పు డన్నరనాథున కెఱింగించి పుచ్చిన నతండు విషాదరోషంబుల నొంది దూతం బుత్తెంచిన వాఁడు వచ్చి పాంచాలపతిం గాంచి యిట్లనియె. 375

చ. కొడుకని తెచ్చి యిట్లగునె కూఁతు వివాహము సేయ దీన నీ
పడసినలాభ మేమి నగుఁబాటగు నింతియ కాక యెల్ల నే
ర్పడ నెఱుఁగంగ వచ్చితి నరాతిభయంకరు హేమవర్మ నా
గడమున గాసిచేసితి మఱిగంటిమి నీదెస నైనఁ జూపుమా. 376

ఆ. అనిన నగుచు వానికనుద్రుపదుం డివి, యేటిమాట లిట్టు లేల చేయ
వచ్చు నింత వెఱ్ఱివారును గలరె యి,త్తెఱఁగు వోసఁగ కునికి యెఱుఁగరాదె.

వ. అని వెండియు నేర్పునం దీర్పుమాట లనేకంబు లాడి నిక్కం బరయం జూచిన వానికిం జోరవ యీక త్రోపుసేసి వీడ్కొల్పి పుచ్చినం బోయి వాఁడును నిజనాథున కవ్విధంబు విన్నవించిన. 378

క. కోపోద్రేకంబున నతఁ,డాపాంచాలపతిమీఁద నతులితసైన్యా
టోపమున వచ్చి పురిపరి,ఖాపరిసరతలముచుట్టుఁ గైకొని విడిసెన్. 379

వ. ఇట్లు విడిసిన. 380

ఆ. పట్టు వడ్డముచ్చుపగిదిఁ బాంచాలభూ,నాయకుండు దనకు నానచేటు
రాక కుమ్మలించి యేకాంతమునఁ బత్ని,యొక్కలియును గొల్వ నూరకుండె.

వ. తదీయదండనాథులు సమరోత్సాహంబునం బ్రవర్తిల్లి రంత సూర్యాస్తమయ

సమయం బగుటయు రెండుపిల్లను భండనంబుతోడి వేడుకం జేసి వేగుటయు వేచి యుండె. 382

క. అప్పుడు శిఖండి మరణము, దప్పఁగ నడి కొండు ప్రతివిధానము సేయం
జొప్పడమిఁ దలఁచి యొరులకుఁ, జెప్పక వెస నరిగెఁ బురముఁ జెంతయడవికిన్.

శిఖండి యక్షునివలనఁ బురుషత్వంబు నొందినవృత్తాంతము.

వ. అవ్విపినంబు స్థూలకర్ణుం డనునొక్క యక్షునికి నివాసం బై యునికిం జేసి నిర్జనం బై యుండు శిఖండియు నత్తెఱం గెఱుంగుం గావున నతని నుద్దేశించి యందుఁ జొచ్చి తత్ప్రదేశంబున మహనీయసుందరం బగుతదీయమందిరంబున కరిగి యచ్చటఁ బ్రాణవియోగం బగువిధం బాచరింపం బూనిన. 384

ఉ. యక్షుఁ డెఱింగి వచ్చి యిటు లాఁడది చావఁగ నేల చెప్పు మ
జ్ఞాక్షి భవన్మనోరుజకు నౌషధ మే నొనరింతు నన్న ఫా
లాక్షుఁడు దక్క నొడ్లకును నాపని సేయఁగ రాదు నాదుచి
త్తక్షతి పుంస్త్వ మేను దగఁ దాల్పక మానదు గుహ్యకోత్తమా. 385

క. అని తనవృత్తాంతం బాతని కెఱిఁగించుటయు నతఁడుఁ దన దగుచిత్తం
బునఁ గరుణ పుట్టి యెంతటిపని యిది యే నిత్తు సమయపరిపాలనతోన్. 386

క. నాపురుషత్వము గైకొని, నే పోయి దశార్ణపతికి నెలయించిన మీ
యాపదలు దొలఁగి చనఁ బొడ, సూపుము పదినాళ్లయంత నూన్నత మొప్పన్.

క. అంతవునంతకు నీ దగు, కాంతారూపంబు నేను గైకొనియెద ని
శ్చింతమున మగుడఁ జను మని, యింతికిఁ బురుషత్వ మిచ్చె నెంతయు వేడ్కన్.

తే. ఇచ్చి తాను భామాకృతి నెలమిఁ దాల్చి
వీడుకొల్ప శిఖండియు వీటి కేఁగు
దెంచి నిజమందిరంబు సొత్తెంచి తల్లి
దండ్రులకు మ్రొక్కి నిలిచి ముదం బెలర్ప. 389

క. తన తెఱఁ గంతయు నెఱిఁగిం, చిన నద్భుతహర్షమగ్నచేతను లై త
జ్జననీజనకులు బహువిధ, వినుతులఁ గొనియాడి రంత వేకువ యయ్యెన్. 390

వ. తదనంతరంబ సూర్యోదయం బగుటయుఁ గాలోచితకరణీయంబులు నిర్వర్తించి పాంచాలవిభుండు సంబంధితో వలయుమాట లాడం దగువారలం బనిచి రావించి సంభ్రమంబు లేక వేగిరపడక నాగరికప్రకారంబున శిఖండిపురుషత్వంబు చేట పఱిచి యతనిమాట గీడ్పఱచి సపరివారంబుగా నద్దశార్ణపతికి విందుపెట్టి కట్నంబు లిచ్చి యతనియనునయాలాపంబులు గైకొని యనిచిపుచ్చిన నతండు తన్నుం దాన నిందించుకొనుచు నిజపురంబునకుం బోయె నట్టియెడ నయ్యక్షవరుమందిరంబుచక్కటికిం గ్రీడార్థంబు గిన్నరవిభుండు విమానారూఢుం డయి చని దాని

యొప్పుఁ గనుంగొని యగ్గించుచు నిల్చి యొక్కింత సంభ్రమంబున జుట్ల నున్న గుహ్యకులతోఁ ని ట్లనియె. 391

క. మన మిచట నిలిచి యుండఁగ, మనమున శంకింప కిట్లు మసలినవాఁ డీ
శనిగర్వ మేల యిక్కడఁ, జను దేరఁగ నిచ్చు నెట్లు సైఁపఁగ వచ్చున్. 392

వ. అని పలికి యలుక మొగంబున ముడివడ నున్నంతఁ గిన్నరు లాగుహ్యకు నరసి తద్వృత్తాంతం బంతయు నెఱిఁగించి దేవా సిగ్గుపెంపున రా నేర కున్నవాఁ డని విన్నవించిన. 393

ఆ. అయిన నేమి పిలువుఁ డని పిలిపించిన, వచ్చి మ్రొక్కుటయును వనిత యైన
యతనిఁ జూచి యింక నవ్విధాని కిట్టుల, యుండుఁ గాక యని విభుండు వలికె.

స్థూలకర్ణునకుఁ గుబేరునివలన స్త్రీత్వము గలుగుట.

వ. స్థూలకర్ణుండును దలరి దండప్రణామంబు సేసి యుండె నప్పుడు గొలిచియున్న వారలు ధనదునకుం గృప పుట్ట నల్లన తెలిపిన నట్లని వీఁడు శిఖండి యాయువు గలంతకాలంబును గాంతాకృతి యై యుండి పదంపడి నిజరూపంబు దాల్చుం గాక యని యనుగ్రహించి యరిగిన. 395

తే. గుహ్యకుండు విషాదంబు గూరి యుండ
నచ్చటికిఁ గొన్నిదినముల కరుగుదెంచెఁ
దల్లిదండ్రుల కెఱిఁగించి తగవు మెఱయ
సమయనిష్ఠ వాటించి పాంచాలసుతుఁడు. 396

క. వచ్చినఁ గనుఁగొని నీవెసఁ, బొచ్చెము లే దిట్లు మగఁడి పొమ్మిది విధి నీ
కిచ్చినరూ పని గుహ్యకుఁ, డచ్చుపడం బలికి యెల్ల నతనికిఁ జెప్పెన్. 397

వ. చెప్పి వీడుకొలిపిన శిఖండి యత్యంతప్రమోదంబునం దండ్రికడకు వచ్చి యత్తెఱం గెఱింగించిన నాతండు ప్రీతుం డయి దేవగురుద్విజపూజనంబు లాచరించి ద్రోణాచార్యుపాల సవిశేషంబుగా శిష్యభావంబు ప్రతిష్ఠించె. 398

క. అని చెప్పి నారదుఁడు దా,నును సత్యవతీసుతుండు నను దమయిచ్చం
జనిరి శిఖండిచరిత్రము, జనకర్ణపరంపరం బ్రకాశ స్థం బయ్యెన్. 399

వ. ఇవ్విధంబునఁ గాశీపతికన్యక సిద్ధమూర్తి యయి నెగడె నేను నంగనల నంగనాపూర్వుల నంగనాభిధానుల నంగనాకారులను వధియింప కుండ వ్రతంబు పూనినవాఁడం గావున నంగనాపూర్వుం డగుశిఖండి నాకు భండనంబునం గోదండపాండిత్యంబు మెఱసినను జంపను నొంపనుఁ గడంగితినయేని నింతకంటెను దుర్యశంబు గలదె యె ట్లయిన నగుదుం గాని భగ్నవ్రతుండ నగుట కొర్వ నిది నా తెఱంగు. 400

క. అని చెప్పిన దేవవ్రతు.వినుతవచనములు విభుండు విని తనచిత్తం

బున నొక్కరిత వగచి యీ,తనికి మగతనంబుపూన్కి । దగు నని పలికెన్.

వ. తదనంతరంబ కొలువునం గలయ సమరవిషయంబు లయినసల్లాపంబులు సెల్లు చుండఁ గొండొకసేపు విను చుండి సుయోధనుండు సురనదీసూనున కిట్లనియె.

ఆ. పాండవులకుఁ గలుగు । బలము లన్నియు సమ,యింప నీకు దినము । లెన్ని పట్టు
గురుఁడుఁ గృపుఁడు గురుని । కొడుకుఁ గర్ణుండు నెం,తెంతమానమున వ । ధింతు రనఘ.

వ. అనిన విని గాంగేయుం డతని కిట్లనియె. 404

క. అనిఁ బాండవసేనలఁ జం,పను జెఱుపను నేమి చాలు । భంగుల నీ కి
ట్లనుమానము వాయఁగ నడు,గన తగుఁ గడు లెస్స విందు । గాక నరేంద్రా.

వ. ఏను నాచాలెడుకొలంది సెప్పెదఁ దక్కటివారుఁ దమతమచాలుటలు దార చెప్పెద రది యెల్లను బిదప విందు గాని మున్ను నీ కొక్కబాస యిచ్చెద నాకర్ణింపుము. 406

క. మీఁటు గలరాజరథికుల, నాఁటికి వేవుర వధింతు । నరుశరములు నో
నాఁటి పడ నైచునంతకు, వేఁటాడెదఁ బ్రతిబలంబు । వీరుల నెల్లన్. 407

వ. అట్లుగా నాకయ్యంబు సేయుదివసంబులలోన. 408

క. పదివేలఁ జంపఁగా నో,పుదు నే ననునెత్తికోలు । పుట్టినయది సె
పదునొకఁడక్షౌహిణులను, జదురున నడపింతు నెదిరి । సైన్యము గలఁతున్. 409

వ. అని పలికి వెండియు. 410

క. నీ వడిగినపని యేర్పడఁ, గా విను మే నొక్కనెలఁ ద్రోగం జేయుదు నా
నావిధదివ్యాస్త్రంబుల, లావున నప్పాండవులబ । లంబుల నెల్లన్. 411

వ. అనవుడు గురుకృపాశ్వత్థామకర్ణులం గనుంగొని గాంధారీనందనుండు మీమీ చందంబు లెట్లనిన నాచార్యుండు మందస్మితాననుం డగుచు నిట్లనియె. 412

తే. ఏను ముదిసినవాఁడ మ । హీశ యెట్టు, లయిన నోపినభంగి నీ । యనుఁగుఁ దాత
సాలినన్నిదినంబులఁ । జాల వచ్చు, నబ్బలంబుల నని సమ । యంగఁ జేయ. 413

క. అనినఁ గృపాచార్యుం డీ, యినుమడిదివసములఁ దీర్చ । నే నోపుదు నా
విని గురుతనూభవుఁడు పది, దినములఁ గడతేర్తు ననియె । ధీరవిచారా. 414

వ. అందఱపలుకు లాకర్ణించి కర్ణుండు. 415

క. నానాస్త్రశస్త్రచయపటు,బాలనముం గవియఁ జేసి । యత్యుగ్రత నే
నేనాళ్లన యప్పాండవ,సేనాసాగరము నివురఁ । జేయుదు నధిపా. 416

వ. అని ప్రతిన సేసినఁ గలకల నవ్వి గాంగేయుండు. 417

చ. పలికిన నేమి యన్నియును । బల్కఁ దగున్ మనరాజునొద్ద మా
ర్వలికెడువారు లేరు విను । పాండవమధ్యముగాండివంబు దీ

ష్ఫుల మిఱుమిట్లు గొన్నకనుఁదోయి గుణధ్వని వ్రయ్యలైన వీ
నులు నయినన్ బలే పలుకు నాలుకకుండుదు సూతనందనా. 418

వ. అనియె నివ్విధంబున నీకొడుకుకడం బుట్టినవిశేషంబులు ధర్మతనయుండు చారుల
వలన విని తమ్ములఁ రాఁ బనిచి వారలతో ని ట్లనియె. 419

సీ. మనచారు లిప్పుడు చనుదెంచి రా వీట,నుండి దుర్బుద్ధి సుయోధనుండు
గొలువున గాంగేయకుంభసంభవకృపా,శ్వత్థామకర్ణులఁ వలను సూచి
యనిఁ బాండవులబల మంతయు సమయింపఁ, జాలుదు రెంతేసికాలమాన
మున నన్న భీష్ముండు దన కొక్క నెల నట్టు, నని యాడె ద్రోణుండు నట్లపలికెఁ

ఆ. గృపుఁడు రెట్టి సెప్పెఁ గృపికొడుకొ పుదుఁ, బదిదినముల ననియె బాహువీర్య
ఘనుఁడు గాన సూతతనయుఁ డేనాళ్లన, తీర్ప నేర్తు నని ప్రతిజ్ఞ సేసె. 420

వ అని చెప్పి యర్జునుం గనుంగొని వారు దమతమయోపినచందంబులు సెప్పిరి నీచే
తం గౌరవబలంబు లెంత దడవునకుం దెగు నాకుం జెప్పు మనిన నతం డి ట్లనియె.

తే. వార లంతకుఁ జాలని వారె నీబ,లముల సమయింపఁ జాలెదు లావు వెరవుఁ
గలర కాక యారాజుతో బలికి బాస, దప్పవచ్చునె వారికి ధరణినాథ. 422

అని దరహాసోల్లాసభాసితవదనుం డై. 423

మ. అనుమానం బది యేల నీమది మదీయస్ఫారబాహాబలం
బు నిరూపింపఁ దలంచితేని విను మీఁదుం జేవయుం జూపి కృ
ష్ణునితోడ్పాటునఁ బేర్చి యేఁ గడఁగినం జూర్ణంబు గావింతు నొ
క్కనిమేషంబున దేవదానవులతోఁ గూడం ద్రిలోకంబునున్. 424

వ. అది యె ట్లం టేనిఁ గృత్రిమకిరాతుం డైనపశుపతి మెచ్చి జగత్సంహారసమయం
బునం దాను బ్రయోగించునట్టిపాశుపతమహాస్త్రంబు నా కిచ్చె నది నాయందు
సన్నిహితం బయి యున్నయది గావున శత్రునిరాసం బనాయాసం బై యుండు
నప్పాశుపతంబుమహనీయప్రభావంబు భీష్ముం డున్నరూ పెఱుంగఁడు ద్రోణకృ
పాశ్వత్థామలు నెఱుంగరు కర్ణున కెఱుంగ నెంతద వ్వట్టిఘోరసాధనంబున సమ
స్తంబును సమయించుట యుక్తంబు గాదు తక్కినయాయుధంబులం బోరి వై
రులం బరిమార్చినం బౌరుషంబు దీపించు నని తలంచెద నప్పటికి వలయువిధం
బయ్యెడు నది య ట్లుండె నీవా రక్కడివారికిం దక్కువవారె భీమసేనుండు నక
లభిమన్యుండు ద్రౌపదేయులు సాత్యకి విరాటద్రుపదులు ధృష్టద్యుమ్నుండు శిఖండి
యుత్తమౌజుండు యుధామన్యుండు ఘటోత్కచుండు నెట్టివా రె ట్లున్నవారు
మఱియు ననేకులు వీరలయట్టివార యం దఱం జెప్ప నేల యేనుంగునకొలె నీ
లావు నీ వెఱుంగవు దివిజులకు నజేయుండవు నీయొక్కనికిఁ ద్రిభువనంబు నెదురె
నీవు నిక్కంబు బలుగవు గాక నీ వలిగిన నెవ్వ రె ట్లయ్యెదరో యటు సూడుము

నీసైన్యంబుల నన్వారికి నేమి సేయ వచ్చు నునకు విజయానందంబు సులభంబు యని పలికె నని సంజయుండు ధృతరాష్ట్రున కెఱింగించె నని వైశంపాయనుండు జనమేజయునకుం జెప్పుటయు. 425

చ. కమలభవాదిదైవతముఖస్ఫుటనిర్గళితప్రశస్తవా
గమృతరసప్రసారకలితాంచితసేకవివృద్ధకల్పసం
గమసముదీరితోల్లసనకందళితప్రసవప్రియాలతా
సుమహదుపాశ్రయప్రమదశోభితవిశ్వజగత్సుధువ్రతా. 426

క. సమయబహుత్వారణ్య, భ్రమణపరిశ్రాంతదంతకరంగనితాంతో
త్తమసరళమార్గదర్శన, సమర్థపుణ్యాభిధానసకృదుచ్చరణా. 427

మాలిని. అవగమితరహస్యాష్టాంగసమ్యక్ప్రకారో
త్సవగురుకరుణావిస్తారగాఢప్రకాశా
ప్రవణహృదయపద్మోద్భాసివిజ్ఞానసారా
వ్యవహితపరమానందానుభూత్యేకసారా. 428

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబున నుద్యోగపర్వంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము. 429

శ్రీ మ దాం ధ్ర మ హా భా ర త ము నం ద లి

ఉద్యోగపర్వము సమాప్తము.

ఆ ది పం చ క ము

సం పూ ర్ణ ము.

Tel. 1156